# చారు చంద్రోదయము

రచన

చెన్నమరాజు


పరిశోధన పరిష్కరణ

డాక్టర్ పొట్లూరి భారతీకుమారి

ఎం ఎ, పిహెచ్ డి.

తెలుగు లెక్చరర్, విశాఖ మహిళా కళాశాల

విశాఖపట్టణము

పర్యవేక్షణ

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

ఎం ఎ, పిహెచ్‌డి, డి లిట్

తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వకళా పరిషత్,

వాల్తేరు



ప్రచురణ

వి. కె. పబ్లికేషన్స్

3/19 సిరిపురం క్వార్టర్స్

ఎ. యు. వాల్తేరు

# అంకితము

సీ॥ శ్రీనాథసాహితీ శీలసంపద లెల్ల
చూరలిచ్చిన పరిశోదకునకు
ఆంధ్రసాహితి చరిత్రాంశ మర్మములెల్ల
విప్పి చెప్పిన పర్యవేక్షకునకు
చారుచంద్రోదయ సత్కావ్యసుదలెల్ల
గ్రోలజేసిన వరకోవిదునకు
చదువుల తల్లితో ఛాత్రసంతతి కెల్ల
చనువేర్పరచెడి ఆచార్యునకును
ప్రదిత శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి
బుధవరేణ్యునకు హృదయపూర్వకముగ
అంకితమొనర్తు ప్రణమిల్లి అస్మదీయ
చారుచంద్రోదయ కిరణ సారకృతిని

—పొట్లూరి భారతీకుమారి

# స్వీకారము

అలతి పర్యవేక్షణ విధి నాచరింప
నది గురుప్రసాదమ్ముగ నాత్మఁదలఁచి
కోరి యొసఁగిన పరిశోధనోరుకృతిని
స్వీకరింతును భారతీశ్రీకరముగ.

—కొర్లపాటి శ్రీరామమూర్తి

రాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రి
విశాఖపట్టణము
26-4-1987

# అభినందనము

మృదుమధుర కవితా సముంచిత కావ్యరత్నములపై బహుధా శ్రమించి గావించిన పరిశోధనము ప్రాజ్ఞమనోరంజనముగాక మఱియొకటి యెట్లగును? దానిపై నభిప్రాయములను వ్రాయుట యకించిత్కరముగాక మఱియొకటియగునా?

అయినను రచయిత్రి గావించిన కృషిని ప్రశంసింపక తప్పదు ఆమె బహుముఖ ప్రజ్ఞాపాటవమును శ్లాఘింపక తప్పదు ఎక్కడో మారుమూలలో పడిన 'చారుచంద్రోదయ' కావ్యమును వెలికితీసి, పఠించి, సరిదిద్ది, వివరించి, విమర్శించి, పాఠకలోకమున కందించిన ఆమె కృషి విద్వజ్జన శ్లాఘాపాత్రమనక తప్పదు ఇది బహుధా ప్రశంసనీయము

ఇట్టి యనన్య సామాన్యమైన పరిశోధన గ్రంథమును రచించిన శ్రీమతి పొట్లూరి భారతీకుమారిని ఆ భారతీదేవి యితోధికముగ శక్తి సామర్థ్యముల నొసంగి సంరక్షించుగాక

ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు
ఆంధ్రభారతి
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము
అనంతపురము

# అనుశీలనము

డా॥ కొర్లి పాటి శ్రీరామమూర్తిగారి పర్యవేక్షణలో శ్రీమతి పొట్లూరి భారతీ కుమారి ఎం ఎ, బి యల్ యస్ సి పరిశోధించి వెలికి తెచ్చిన ఈ గ్రంథం ఆమూలాగ్రం చదివాను

ఈ పరిశోధన గ్రంథం ఆంధ్ర సాహిత్య పరిశోధనలో ఒక అపూర్వ సన్నివేశం మరుగున పడిపోయిన ఒక దివ్యమణిని- ఒక మహా కావ్యాన్ని వెలుగులోకి తీసుకురావటంవల్ల పర్యవేక్షకులు, పరిశోధకులు ఒక మహాకావ్యాన్ని సాధించిన వాళ్ళయినారు ఇది తెలుగు సారస్వత లోకానికి వాళ్లు చేసిన గొప్ప సేవ

ఈ సిద్ధాంత గ్రంథం రెండు భాగాలుగా వ్రాయబడ్డది మొదటి భాగంలో 3 ప్రకరణ లు

1 కవి జీవిత చరిత్ర, కాలాదులు, 2 కావ్యగత ఛందోలంకారాదుల పరిశీలన, 3 శైలి విశేషాలు

ఈ కావ్యం ఇంతవరకు అముద్రితావస్థలోనే ఉంది కనుక అస్మదాదులకు- సాహితీ తపస్వులకూ తెలియనిది కనుక- కవి జీవిత కాలాదుల చర్చ ప్రథమంగా చేయటం అవసరం అందుకనే ఈ ప్రణాళిక బాగున్నది కవికాలం 1600-75 అని పరిశోధకుల చేసిన నిర్ణయం సమంజసమే తర్వాత కథాసంగ్రహం చెప్పబడినది ఇది చెప్పటంవల్ల కావ్య వివరణకు ఆనుకూల్యం ఏర్పడుతున్నది ఇది తెలియకపోతే తర్వాత విషయానుసరణం కష్టమవుతుంది ఆ పిదప కథామూల విచారణ జరిగినది దానికోసం వారు చాలా పురాణాలు పరిశీలించినట్లు సాక్ష్యం చూపటంవల్ల వారి శ్రమ మెచ్చుకోతగ్గది

ద్వితీయ, తృతీయ ప్రకరణాల్లో ఛందోవ్యాకరణాలంకార విశేషాలు- వర్ణనలు-శైలీ విశేషాలు- రసపోషణ- సమకాలిక సమాచార - విచారణ ఇదంతా

ఒక కావ్యాన్ని సమగ్రంగా చూచే దృక్పథం అందులో ఇది అముద్రిత కావ్యం కనుక ఈ విచారణవల్ల ఆ కావ్య మహిమ పండిత లోకానికి వెల్లడించటమే ముఖ్య ప్రయోజనం పరిష్కర్తలు త్రొక్కిన క్షుణ్ణమార్గమిదే ఆ మార్గానవే పరిశోధకులు ప్రయాణించటం ప్రస్తుతమౌతున్నది

ద్వితీయ భాగములో కావ్య పరిష్కరణ కావ్య శుద్ధ ప్రతి నిర్ణయాని కామె పడిన శ్రమను ప్రకటిస్తున్న అధ్యాయ మిదే దీనికోసం వారు ఆరు ప్రతులు చూచినట్లు తెలుస్తున్నది వీటిలో శుద్ధ ప్రతిని నిర్ణయిస్తూ- పాఠాంతరాలను అధోజ్ఞాపికలో ఇవ్వటం ప్రాచీన పరిష్కర్తలు చేయనిపని ఆధునిక పరిశోధనలో ఇదే చక్కని మార్గం ఈ పాఠాంతరనిర్ణయంలో ఏది శుద్ధ పాఠమో పరిష్కరించటం చాలా కష్టం దీనికి ఛందోవ్యాకరణ శయ్యాశైలి విశేషజ్ఞత వుండాలి అన్నిటికంటె ముఖ్యం శైలీ శయ్యా పాకాదులు శ్రవస్సంబంధాలు హార్దికములున్నూ, హృదయంతో చూడదగ్గవి ఈ విషయంలో ఈమె చేసిన ప్రయత్నం చాలా మెచ్చుకోదగ్గది ఛందో వ్యాకరణాది పరిజ్ఞానం ఆమెకున్నట్లు ఋజువుచేస్తున్న అధ్యాయ మిది

ఈ విధంగా ఈ గ్రంధం చాలా బాగుంది ఇది విమర్శ వ్యాసం చదివినట్లు లేదు ఒక కావ్యాన్ని చదివినట్లే చదివిస్తున్నందువల్ల పరిశోధకుల రచన శైలి- విషయ విశ్లేషణ-సుకుమారమూ- సులభతరమూనని చెప్పాలి

కావ్య పరిష్కరణ మార్గం తెలుగు సాహిత్యంలో చాలా వరకు లుప్తమై పోయిన విద్య కీ శే వేటూరి ప్రభృతులతో అది పోయినా- ఆ మార్గంలో గ్రంధ విమర్శ చేయగలవారు పర్యవేక్షకులు కావటంవల్ల వారి పర్యవేక్షణలో ఇలాంటి గ్రంధం రావటం తెలుగు సారస్వత పరిస్థానంలో అపూర్వ విషయం

గ్రంధ విచారణలో వారు అవలంబించిన పరిణాశిక-అధ్యాయ విభజనలో ఒక క్రమమున్నది అది గ్రంధానికి సురూపకల్పన చేస్తున్నది సామాన్యంగా ఇది చాలా పరిశోధన గ్రంథాల్లో కన్పించనిది

# ఉపక్రమణిక

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు గ్రంథాలయమునందుకల అముద్రితగ్రంథములను వెలుగులోనికి తీసికొనిరావలయునని గురువర్యులు ఆచార్య శ్రీ కొర్లపాటి శ్రీరామ మూర్తిగారి అభిలాష. వారి ప్రోద్బలమువలన వెన్నమరాజుచేత రచింపబడిన 'చారు చంద్రోదయము' అను అముద్రిత ప్రబంధమునకు వివరణము-పరిష్కరణము పరిశోధన విషయముగ స్వీకరించితిని ఈ అముద్రిత ప్రబంధమును పరిష్క రించి, స్థూలముగ పరిశీలించుట ఈ సిద్ధాంత గ్రంథము ప్రధానోద్దేశము

అముద్రితగ్రంథములను గురించి విషయపరిజ్ఞానములేని నాకు ఈ పరిశోధన మొదట చాల క్లిష్టముగ తోచినది చారుచంద్రోదయ గ్రంథముయొక్క ప్రతులు ఒక్కచోట దొరకకపోయినందున ప్రతుల సేకరణకొరకు అనేక ప్రాంతములందు సంచరించి కాలమును ధనమును వెచ్చించి లభించిన సమస్తప్రతులను ఎరిశీలించి సాధు-అసాధు పాఠములను నిర్ణయించుట చాల కష్టతర మనిపించినది లభించిన ప్రతులతో సమగ్రముగ కాకున్న, సంతృప్తికరముగ పరిష్కరణ చెయగలనను ధైర్యము నాకు లేకపోయినది అదే సమయమున కళాశాల అధ్యాపక పదవిలో ప్రవేశించుటకూడ జరిగినది అందువలన పరిశోధనకు న్యాయము చేకూర్చలేనేమో యని సందేహించు సమయమున మా గురువుగారు ప్రోత్సాహమిచ్చి పరిశోధనా కార్య క్రమమునందు నాకు శ్రద్ధను కలిగించినారు

ఈ అముద్రితగ్రంథము ఒక మహా ప్రబంధము ఇంత చక్కటి ప్రబంధము నకు ఆరు ప్రతులు లభించినప్పటికిని ఇంతవరకు సహృదయులెవ్వరు దాని పరిష్క రణమునకు పూనుకొనలేదు ఇటువంటి సదవకాశము నాకు లభించుట నా అదృష్ట ముగ భావించుచున్నాను

ఈ సిద్ధాంత గ్రంథమును రెండు ప్రధాన భాగములుగ విభజించితిని 1 కావ్యవివరణము 2 కావ్యపరిష్కరణము మొదటి భాగమునందు కావ్యము నకు విపులమైన ఉపోద్ఘాతమును వ్రాసితిని రెండవభాగమునందు కావ్యమును పరిష్కరించి చారుచంద్రోదయ ప్రబంధమును ఆవిష్కరించితిని

మొదటి భాగమును మూడు ప్రకరణములుగ విభజించితిని అందు మొదటి ప్రకరణమున కవిచరిత్ర, కాలము, కావ్యావతారికా విశేషములు, ఇతివృత్తము, తన్మూలము, కథాసంవిధానమును పేర్కొంటిని కథా సంవిధానమునకు మూల కారణమైన చిలుక రాయబారమును పూర్వ ప్రబంధములందలి చిలుకరాయబారము లతో పోల్చి ఈ భాగమునందే తెలిపితిని

కావ్యమునందలి ఛందోవ్యాకరణ విశేషములు, అలంకారములు రెండవ ప్రకరణమునందు చెప్పితిని మూడవప్రకరణమున కవితారీతులకు సంబంధించిన శైలి, వర్ణనలు, రసపోషణవిధానము మరియు సమకాలిక సమాచారము సమగ్ర ముగ సమీక్షించితిని

ద్వితీయభాగము ప్రధానముగి కావ్యపరిష్కరణము ఈ పరిష్కరణమునకు మొత్తము ఆరు ప్రతులను పరిశీలించితిని అవి—

1 ఆంధ్ర విశ్వకళాపరిషత్ గ్రంథాలయ తాళపత్రప్రతి—క

2 ఆంధ్రసాహిత్య పరిషత్ గ్రంధాలయ తాళపత్రప్రతి—చ

3 మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార తాళపత్రప్రతి —ట

4 మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార కాగితపుప్రతి—త

5 మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార కాగితపు ప్రతి—వ

6 ఆంధ్రప్రదేశ్ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార తాళపత్రప్రతి—గ

ఈ ప్రతుల వివరణ పరిష్కృత గ్రంథమునకు ముందు చూపబడినది ఈ ఆరుప్రతులను పరిష్కరణ సౌలభ్యమునకై వరుసగ క,చ,ట,త,వ,గ అను సంకేతములతో అధసూచికలందు తెల్పితిని

గ్రంథ పరిష్కరణ సమయమున తాళపత్రప్రతులలో లిఖింపబడిన లేఖన పద్ధతిని నవీన లేఖన పద్ధతిలోనికి మార్చితిని నేను సేకరించిన ప్రతులయందు లచ్చోట్ల విభిన్నపాఠములు కన్పించినవి వానిని పరిశీలించి అందు అర్థవంతములు,

సరసములు, సముచితములు అని నాకు తోచినవానిని ప్రధాన పాఠములుగ స్వీకరించి మిగిలినవెల్ల పాఠాంతరములుగ క్రిందనిచ్చితిని ఏవచనమునందు కొన్ని ప్రతులలో కనిపింపక మరికొన్ని ప్రతులయందు దొరికిన వాక్యములను సముచితమైన స్థానము లందు ఉంచితిని సా - స్య దోషములను లేఖక దోషములను, అస్తవ్యస్తముగ నున్న పదములను అనవసరమనిపించిన పాఠాంతరములను అధస్సూచికయందు చేర్చలేదు

చెన్నమరాజు ఈ ప్రబంధమునందు శ్రీకృష్ణుని పుత్త్రుడైన చారుచంద్రుని అభ్యుదయమును శృంగారరసప్రధానమైన చక్కని గ్రంథముగ నిర్మించినాడు కవి కథకన్నను, పాత్రపోషణకన్నను వర్ణనలకు అధికప్రాధాన్యమునిచ్చి విస్తృత ముగ వర్ణించినాడు అవి సంప్రదాయానుసారముగను, కథాగతికి, రసనిష్పత్తికి, పాత్రపోషణకు అనుకూలముగ నున్నవి

శబ్దార్థాలంకారములతో ఓజః ప్రసాదమాధుర్య గుణములతో కావ్యమునందు వైదర్భిరీతిని పాటించినాడు రచన పెక్కుస్థలములందు ద్రాక్షాపాకములోనే సాగి నది వర్ణనలు, శ్లేష కలచోట నారికేళ పాకములోను అచటచట కదళీపాకములోను చేయబడినవి అచ్చతెలుగు పదములు, పద్యములు పెక్కు, కావ్యమునందు కలవు సామెతలు, జాతీయములు విరివిగనున్నవి సమకాలీన సమాచారము ప్రతిఫలించు సందర్భములు పెక్కుచోట్ల కనిపించుచున్నవి మొత్తముమీద "చారుచంద్రో దయము" ప్రశంసనీయమైన చక్కని స్వతంత్ర కావ్యము

ఇటువంటి కావ్యమునుగురించి ఇంతవరకు పెట్టి విమర్శనముగాని, సమీక్ష గాని సాగలేదు అసలు ముద్రణమే కానపుడు అనుశీలనము లేకపోవుట అంత విచిత్రముకాదు ముద్రణకు వీలుగ పరిష్కృత గ్రంథమును రూపొందించి, స్థూల ముగ కావ్యానుశీలనము గావించితిని

డా. పొట్లూరి భారతీకుమారి

# కృతజ్ఞతలు

నాకు పరిశోధనయందు అవకాశమును కల్పించి, పరిశోధనాంశమును సూచించి, పరిష్కరణకు తోడ్పడి, నా సిద్ధాంత గ్రంథమును ఆమూలాగ్రము పరిశీలించి సలహాల నొసంగిన మా గురువర్యులు, పర్యవేక్షకులు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారికి నా హృదయపూర్వక నమస్సుమాంజలులు

పరిశోధనకు వీలు కల్పించిన ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులకు నా కృతజ్ఞతాభివందనములు.

తాళపత్రప్రతులను, కాగితపు ప్రతులను పరిశీలించి వ్రాసికొనుటకు అనుమతి నొసంగిన ఆంధ్ర విశ్వకళాపరిషత్ గ్రంథాలయాధికారులకు, కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్ కార్యాలయకర్తలకు, మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార నేతలకు, హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ ప్రాచ్యలిఖిత గ్రంథాలయాధిపతికి, అచటి సిబ్బందికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు

అడిగినవెంటనే అమూల్యమైన అభిప్రాయము లొసగిన బ్రాహ్మీభూషణ శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారికి, ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారికి నా హార్దిక కృతజ్ఞతాభివందనములు

నన్ను పెంచి పెద్దచేసి విద్యాభివృద్ధికి కారకులైన పెదతండ్రి కీ॥శే॥ కొమ్మరాజు వెంకట కృష్ణయ్యగారికి నా నమస్సుమాంజలులు

నా పై చదువులకు ప్రోత్సహించి, పరిశోధనయందు అండగనిల్చి, నా అభ్యుదయకారకులైన మా శ్రీవారికి నా మనఃపూర్వక ధన్యవాదములు

శుద్ధ వ్రాతప్రతిని తయారుచేయుటయందు సహాయ సహకారము లందించిన శ్రేయోభిలాషులకు, ముఖ్యముగ డా॥ శ్రీమతి టి సత్యవతికి, నా ధన్యవాదములు

గ్రంథ ముద్రణకు ఆర్థికసహాయము— అయిదువేల రూపాయలు ఒసగిన తెలుగు విశ్వవిద్యాలయము అధికారులకు—

ముఖచిత్రమును ముచ్చటగా రూపొందించిన శ్రీ మనోహర్‌గారికి—

ముద్రణభారము వహించిన విజయవాడ నాగార్జున ఎంటర్ ప్రైజెస్ వారికి, ప్రధానముగా శ్రీ కె రాజేశ్వరరావుగారికి, శ్రీ చంద్ర బాబూరావు దంపతులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

# విషయసూచిక

## మొదటి భాగము — కావ్య వివరణము

# ప్రథమ ప్రకరణము

### 1 కవిచరిత్ర

చెన్నమరాజు చెన్నమరాజు 'చారుచంద్రోదయము'నకు కృతికర్త అనంతపురమండలములోని 'తాడిపత్రి' యితని నివాసగ్రామము ఇతడు నందవరీక నియోగిబ్రాహ్మణుడు. ఆత్రేయ గోత్రజుడు సర్వాంబా శేషామాత్యుల పుత్రుడు బాలకాంబా చెన్నమరాజుల పౌత్రుడు ఈ కవి రచించిన 'చారుచంద్రోదయము' అయిదాశ్వాసముల శృంగారప్రబంధము ఈ ప్రబంధమును 'తాడిపత్రి'యందు తాను నెలకొల్పిన గోపాలకృష్ణుని కంకిత మొనర్చెను శ్రీకృష్ణుని కుమారుడగు 'చారుచంద్రుడు' పుష్కరుడను రాక్షసుని సంహరించి. రత్నకేతన పురాధిపతి పద్మాకరుని కుమార్తెయగు సముద్వతిని వివాహమాడుట యిందలి ఇతివృత్తము

కావ్యములందు కృత్యవతారికలోనే కృతికర్తృవంశాదికమును వర్ణించుట సహజము ఇంయి కవులు తమ కుల గోత్రములను, స్వగుణాతిశయమును, వంశవృక్షమును, పాండిత్యప్రకర్షను వర్ణించుకొందురు ప్రస్తావనలోని ఈ వర్ణనలు కవిచరిత్ర తెలిసికొనుటకు తరువాతివారి కాధారభూతము లగుచున్నవి చెన్నమరాజు తన ప్రస్తావనలో నిరూపించిన వంశవృక్ష మీ విధముగ నున్నది

అప్పూలచింతల చెన్నమరాజు-1

బలమాంబ ↔ తిమ్మమ కృష్ణమంత్రి
బస్వాంబ

లక్ష్మీపతి
కొండయ తిర్మలాంబ
తిమ్మన [ఎల్లమాంబిక]
లింగనమంత్రి

చౌడాంబిక ↔ తిప్పమాంబ
తిమ్మన
తమ్మనమంత్రి
వెంకటపతి
శ్రీహరి [పెద్దమాంగన]

వెంకటామాత్యుడు
మంగపతి

చెన్నమరాజు-2 [బాలకాంబ]
రామచంద్రుడు
తాయనమంత్రి

శేషాద్రిమంత్రి

రామాంబ ↔ సర్వాంబ

తిమ్మన
లక్ష్మీపతి
చెన్నమరాజు-3 [చారుచంద్రోదయకర్త]
తాయనమంత్రి

ఎల్లమ — అక్కమ

గోపాలమాత్యుడు ↔ శేషమంత్రి

ఈ వంశక్రమమునందు చెన్నమరాజు తన ముందు నాలుగు తరములవారిని, తన తర్వాత తరమును మొత్తము ఆరుతరములవారిని వర్ణించినాడు వీరిలో సుప్రసిద్ధుడుగ అమ్మలచింతల చెన్నమరాజు పేర్కొనబడినాడు

ఆ యనవద్యవంశభవులందుఁ బ్రసిద్ధివహించి మించు నా
త్రేయపవిత్రగోత్రుఁడు సుదీనిధి యమ్మలచింతలాన్వయ
శ్రీయుతుఁ డర్ధికల్పకము చెన్నమరాజు గుణాభిరాముఁడై
(దీయు)తుఁడై మహాకవివిధేయకుఁడై విలసిల్లె నెంతయున్

— 1 ఆ. 20 ప.

ఈ పద్యమువలన చెన్నమరాజుయొక్క వంశమునకు మూలపురుషుడు 'అమ్మల చింతల చెన్నమరాజు' అని తెలియుచున్నది ఈయన పేరనే తరువాత తరముల వారికి గృహనామము ఎర్పడియుండవచ్చును చెన్నమరాజు వంశీయులలో మూడవ తరమునకు చెందిన లింగనమంత్రి శాసనమొకటి లభ్యమయినది అది తాడిపత్రి శాసనము ఈ శాసనమువలన లింగన నాటికే ఈ వంశీయుల పేరు 'చెన్నమ రాజు'గ స్థిరపడినట్లు ఋజువగుచున్నది అందువలననే 'చారుచంద్రోదయ' కృతి కర్త 'చెన్నమరాజు చెన్నమరాజు'గ చెప్పబడినాడు

'వరమొసంగిరి యోగవాగలు పంపుసే
యఁగ నందునకుఁ గాశియందు నెలమి
మోటరావి చిగుళ్లు మొలపించి అత్యద్భు
తంబుగఁ మంత్రాక్షతంబులునిచి
చౌడేశ్వరీ మహాశక్తినే దొడితెచ్చి
సాక్షిఁబల్కించి రాశ్చర్యమెసఁగ
నల నందవిభునిచే నగ్రహారము గాంచి
రాచంద్రతారార్కమై రహింపఁ
దత్పురావాసుఁడగు జనార్దను కటాక్ష
మహిమఁగూర్మిలి సత్కీర్తు లహరహంబు

ధరణి సామాన్యులే నందవరపురాఢ్య
విప్రవరు లద్భుత మహాకవి ప్రవరులు' — 1 ఆ: 19 ప.

ఇందు కవి నందవరీక బ్రాహ్మణుల ఉత్కృష్టతను తెలిపినాడు ఈ నంద వరీక బ్రాహ్మణులు తమకు గల అద్భుతమహిమచేత ప్రసిద్ధికెక్కి నందరాజుల యొద్ద అగ్రహారములను సంపాదించిరట నందరాజునకు కాశికి పోవుటకై యోగ శక్తులను ఒసగగ, ఆ రాజు వియన్మార్గమున నిత్యము కాశికి చనెడివాడట ఇంకను మోటరావిచిగుళ్ళను చైతము మంత్రాక్షరములతో మొలిపింపగల మహామహు లనియు, చౌడేశ్వరీ మహాశక్తిని తెచ్చి సాక్ష్యమిప్పింపగల సమర్థులనియు కవి తమ వంశప్రశస్తిని చాటినాడు అప్పటినుండియు వంశపారంపర్యముగ అగ్రహారికులై, రాజసభలయందు పేరుగాంచినట్లు విదిత మగుచున్నది ఈ నందవరీక బ్రాహ్మణులు బుద్ధిబలమునందేగాక భుజబలమునందును ప్రసిద్ధిగలవారని ఈ క్రింది పద్యము వలన తెలియుచున్నది—

విడువక పెమ్మసాని పెదవీరనృపాలుని యందలంబుపై
నడచు నుదార ఘోరమదనాగము నొక్కెసిడియమ్ము కొద్ది యె
క్కుడు వడిగ్రుద్దిపోదటి వెనుకొంచెను లింగనమంత్రిసింహమిం
పడరెడు వేడ్క రాయ లవురా యన నామిడిగేశి చెంగటన్
—1 ఆ: 34 ప.

దీనివలన లింగనమంత్రి పెమ్మసాని పెదవీరనృపాలుని మంత్రి యని తెలియుచున్నది ఈ లింగనమంత్రి కవియొక్క పితామహుండగు చెన్నమరాజునకు పినతండ్రియైన కృష్ణమంత్రి కుమారుడు ఇతడు పెమ్మసాని పెదవీరనృపాలుని యందలముపై నడుచున్న మదగజము కుంభస్థలమును ఒక గ్రుద్దుగుద్ది వెనుకకు మరలించినట్లు స్పష్టమగుచున్నది దీనినిబట్టి లింగనమంత్రి దేహదార్ఢ్యము వెల్లడి యగుచున్నది

చెన్నమరాజు పూర్వులు అమాత్యులై, దండనాయకులై, దాతలై కవి పండిత పోషకులై, రాజసత్కారములు పొంది కీర్తి నార్జించినట్లు ఇందలి వంశవర్ణన వలన వ్యక్తమగుచున్నది

'శ్రీరంగరాయధాత్రీతలాధ్యక్ష ద
క్షిణ భుజాదండమై చెలగినాడు
కరమొప్ప నతనిచే గురివాహనాందోళి
కాసితచ్ఛత్రతతుల్ గాంచినాడు

రమణ వెంకట దేవరాయేంద్రుఁడు నుతింపఁ
బటు కార్యదక్షుఁడై ప్రబలినాఁడు
దని యుదారులఁ దెచ్చి ఘనత నాతనికి పా
దాక్రాంతులుఁగ జేసి యలరినాఁడు
కోట కర్ణాట లాట కాంబోజ మగధ
గౌళ నేపాళ మాళవ చోళ సింధు
నృపవరాస్థానముల మంతు కెక్కినాఁడు
మంత్రిమాత్రుఁడే తమ్మయమంత్రిమౌళి' — 1 ఆ. 27 ప.

ఇంటు చెప్పబడిన తమ్మయమంత్రి మొదటి చెన్నమరాజునకు పౌత్త్రుడు తిమ్మలాంబా కొండయ్యలకు ద్వితీయపుత్త్రుడు చారుచంద్రోదయకర్తయైన చెన్నమరాజునకు పుత్త్రాత తమ్ముని కుమారుడు తమ్మయమంత్రి శ్రీరంగరాయల యొద్దను, వెంకటదేవరాయల యొద్దను మంత్రిగ నున్నట్లు తెలియుచున్నది శ్రీరంగరాయలు, వెంకటదేవరాయ లిరువురు నార్వీటి వంశములోనివారు ఈ విషయము కవి యొక్క కాలనిర్ణయమునకు దోహదకారిగ కన్పట్టుచున్నది

ఈ తమ్మనమంత్రి పెనుగొండ రాజ్యమును శ్రీరంగరాయలు పరిపాలించుచుండగా ఆతని యొద్ద మంత్రిత్వమును స్వీకరించుటయేకాక, ఆ రాజన్యుని దక్షిణ భుజాదండము అని నుతికెక్కెను ఆయనచే 'కరివాహనాందోళికాఁతచ్ఛత్రములు' బహుమానముగ పొంది ప్రసిద్ధికెక్కినాడు శ్రీరంగరాయల రాజ్యపాలన ముగిసిన పిదప రెండవ వేంకటదేవరాయల పాలనలో అనేక రాచకార్యములను చక్కపెట్టుచు, ఆయనచే పొగడ్తలను అందుకొని, ఎవ్వరికి వశ్యముకాని మన్నె సరదారులను జయించి ఆ రాజునకు పాదాక్రాంతులుగచేసి కీర్తిని ఆర్జించెను ఉత్తరదేశమున గల రాజాస్థానములయందు ప్రసిద్ధికెక్కి అందరిచేత నుతింపబడినాడు

ఈయన పినతండ్రి కృష్ణమంత్రి గొప్ప దాతగ యశస్సును సంపాదించెను ఇతడుకూడ విజయనగరసంస్థానమున ప్రసిద్ధికెక్కిన మంత్రివర్యుడు అతడు—

సకల భువనైకభవనపాళికి ననూన
మౌక్తికవితానమై తన మహితకీర్తి
వెలయుఁ జెలువొందు నయవచోవిభవహసిత
జిష్ణుహితమంత్రి చెన్నయ కృష్ణమంత్రి — 1 ఆః 29 ప.

అని చెప్పబడినాడు పెనుగొండలోని ఈ సకలభువనైకభవనము విజయనగరములోని కృష్ణదేవరాయల భువనవిజయమువంటిది అని చెప్పవచ్చును.

సన్నుతకవిత్వవిద్యా
ఖ్యున్నతి శ్రీనాథసుకవిపుంగవుకరణిన్
జెన్నమరున్ లక్ష్మీపతి
చెన్నమరాజు ప్రధాన శేఖరుఁ డెలమిన్ — 1 ఆ. 52 ప.

దీనినిబట్టి చెన్నమరాజు తాతయగు చెన్నమరాజు కవిసార్వభౌమ బిరుదాంకితుడగు శ్రీనాథమహాకవివలె కవిత్వము చెప్పగలిగిన సమర్థుడని స్పష్టమగుచున్నది

కృతికర్త తండ్రియగు శేషాద్రిమంత్రి తల్లిదండ్రుల పేర అగ్రహారములను నిర్మించినాడనియు, రాజాధిరాజులచే రాయుడని కీర్తింపబడినాడనియు, బంధువులు, విప్రులు నుతించునట్లుగ అన్నదానములు చేసి ఖ్యాతి గడించినాడనియు, సత్కవిసమూహములు స్తుతించునట్లుగ సత్తసంతతులు కూర్చి నాడనియు వంశక్రమమునందు చెప్పబడినది ఇట్టి శేషాద్రిమంత్రికి సర్వమాంబయందు తిమ్మన దండనాథుడు, లక్ష్మీపతి, చెన్నమరాజు, తాయనమంత్రి జనించినారు. ఈ చెన్నమరాజే చారుచంద్రోదయ గ్రంథకర్త ఇతనికి శేషయ, గోపాలుడు అను నామధేయములు గల ఇరువురు ధీమంతులైన పుత్త్రులు గలరు

చెన్నమరాజు "కళంకములేని వంశముఖ్యుడును, సత్యశాలియును, పెద్దల కనుకూలముగ నడుచు సర్వజ్ఞుడును, పండితులను పోషించు సత్పురుషుడును, కోరిన బంగారము నిచ్చు ఘనుడును, దుష్టత్వమును పోగొట్టగల తేజస్సుగలవాడును, తన్ను అనుసరించు జనుల కాహ్లాదము గలిగించు నరశ్రేష్ఠుడును, సుందరుడును" అని తనను గురించి వ్రాసికొనినాడు

గరుడనారాయణబిరుదధ్వజంబు బం
గారు పువ్వుల చెంద్రగావి పావ
డయుఁ దురాయి గజంబు హయరత్నమును వీర
మలహరి ఘనకంఠమాలికయును
దాళి చౌకట్లు ముత్యాల కడియములు
గండపెండేరంబు కత్తికుంచ

వెంకటపతిరాయవిభుని చెంతను దెచ్చి
పెమసాని తిమ్మభూరమణమణికి
నిచ్చి తదనుజ్ఞఁ గైకొంటి వెలమి నీవు
రాయదత్తంబులైన కుళ్ళాయిమీఁది
పాగ దవళశంఖంబులు పల్లకియును
దాళి చౌకట్లు చెన్న ప్రధానచంద్ర — 1 ఆ. 74 ప.

ఈ కవి గండరాదిత్య గండరగండ బిరుదాంకితుడు. యశఃకళావిభవుడు. కమనీయమూర్తియగు పెమసాని తిమ్మభూపాలునకు మంత్రియై, వేంకటపతిరాయల యొద్ద నుండి గరుడనారాయణ విరుదధ్వజము, బంగారు పువ్వుల చంద్రగావిపావడ, తురాయి, గజము హయరత్నము ఎరమలహరి, కంఠమాలికయును, తాళిచౌకట్లు, ముత్యాల కడియములు గండపెండెరము కత్తికుంచ తెచ్చి పెమసాని తిమ్మభూపాలుని కిచ్చి, అంచురాయదత్తములైన కుళ్ళాయిమీదిపాగ, ధవళశంఖము, పల్లకి, తాళి చౌకట్లు పెమసాని తిమ్మభూపాలుని అనుజ్ఞతో స్వీకరించినట్లు పైన చెప్పిన పద్యమువలన తెలియుచున్నది మఱియును 'కంచకాళాంజి పట్టించుకొనుహక్కును వేంకటపతిరాయలయొద్ద నుండి సంపాదించుకొనినాడు

చెన్నమరాజు తన గ్రంథమునకు స్వగ్రామ మగు తాడిపత్రియందు తనచే ప్రతిష్ఠింపబడిన గోపాలకృష్ణుని కృతిభర్తగ స్వీకరించినాడు

తాడిపత్రి పురస్థలిని గోపాలకృ
ష్ణ ప్రతిష్ఠ యొనర్చినాఁడ వెలమి
సేయించినాఁడవు చెలువంబుమీఱ నా
హరికిఁ గిరీట పీతాంబరములు
పూని యేడకిచెంత కోనేరు గట్టించి
వనము వేయించినా వనఘులీల
నలరఁజేసితి వగ్రహారంబు తల్లిషే
రను సర్వమాంబాపురంబు నాఁగ
మఱియుఁ జేసితి వఖిలధర్మములు మిగుల
నిన్నియును సఫలంబులై చెన్నమీఱఁ

చెన్నయామాత్యమణి నీవు చేయు కావ్య
మొనర గోపాలకృష్ణున కొసఁగుమనిరి — 4 ఆ: 84 ప.

కవి తాడిపత్రియందు గోపాలకృష్ణుని ప్రతిష్ఠ యొనర్చి, కిరీట పీతాంబరములు చేయించి, ఏడకిచెంత కోనేరు కట్టించి, వనము వేయించి. తన తల్లియగు సర్వమాంబపేర అగ్రహారము నిర్మించినట్లుగ పై పద్యమువలన తెలియుచున్నది దీని వలన కవికిగల మాతృభక్తి, ధర్మనిరతి వెల్లడియగుచున్నది అనేక ధర్మకార్యములు చేసి జన్మసాఫల్య మొందిన కవి, తన గ్రంధమునుకూడ గోపాలకృష్ణుని కంకితమిచ్చుట సముచిత మని విద్వజ్జనులు పలుకగ వారి అభిమతము ననుసరించి చెన్నమరాజు గోపాలకృష్ణునకు తన కావ్యమును అంకిత మొసంగెను

చారుచంద్రోదయావతారిక యందలి వంశాదిక వర్ణనవలన చెన్నమరాజు పూర్వులు నందవరీక వంశీయులనియు, వారు మంత్రులై, కవిపండిత పోషకులై, విద్వాంసులై, రాజసత్కారములు పొందినవారై, మాతృభక్తితో, ధర్మనిరతితో దాతృత్వముతో అత్యంత కీర్తిని సంపాదించుకొని దేదీప్యమానముగ ప్రకాశించినట్లు స్పష్టమగుచున్నది అమ్మలచింతల వంశీయులు ప్రసిద్ధమంత్రి వర్యులుగ మొదటి శ్రీరంగరాయలకాలమునాటి నుండియు, పనిచేయుచు విజయనగర సామ్రాజ్యము పెనుగొండలో సుస్థిరముగ నిలబడువరకు అనగా దాదాపు 1650 వరకు ఉన్నట్లు కనిపించుచున్నది వీరి కాలమునందే వైష్ణవ మతము మనదేశమున బాగుగా ప్రోత్సహింపబడినట్లు, యిందలి మంత్రుల చరిత్రవలన తెలియుచున్నది వారి యిష్ట దైవము గోపాలకృష్ణుడని విదిత మగుచున్నది

## 2. కవికాలము

"చారుచంద్రోదయము" కృత్యవతరణికయందు చెన్నమరాజు తమ వంశమును గురించి సవివరముగ తెలిపినాడు అవతారికయందలి కొన్ని పద్యములు కవి కాల నిర్ణయమునకు సహాయకారిగ నున్నవి కవి చెన్నమరాజు వంశవృక్షము నందు కృష్ణమంత్రి పుత్త్రుడు లింగనమంత్రి, కొండయ పుత్త్రుడు తమ్మయమంత్రి చరిత్ర కెక్కిన ప్రముఖులుగ తెలియుచున్నారు వారు కృతికర్తయగు చెన్నమరాజు నకు పినతాతలు అగుదురు అందు లింగనమంత్రి "తాడిపత్రి" శాసనము కవి చెన్నమరాజు కాలనిర్ణయమునకు నిర్ధారక సాధనము

లింగనమంత్రి తాడిపత్రి శాసన సారాంశమిది [1]

"Saka 1516 Jaya, Bhadrapada, Su 11 Records a gift of 4 Tums of land out of 1 putti and 2 tums granted to him by Pemmasani Narasimhanayudu for the supply of tulasi garlands and for Chamdupadi (chaltupadi) service togods Chintala Tiruvengalanatha and Raghunayaka of Tamdi parati, by Limganna, son of Channama Raju Krishnamaraju" -

ఈ శాసనమువలన లింగన్నమంత్రి క్రీ శ 1594లొ పెమ్మసాని నారసింహ నృపాలుని యొద్ద ధారాగ్రహీతముగ పొందిన భూమిలో '4' తూముల భూమిని సూర్యగ్రహణకాలమున తాడిపత్రిలోని చింతల తిరువెంగళనాథునకు, రఘునాయకునకు అర్పించినట్లుగ తెలియుచున్నది ఈ శాసనమునుబట్టి లింగనమంత్రి 1594 వ సంవత్సరమునందు కలడని నిర్ధారణ యగుచున్నది

లింగనమంత్రినిగురించి అవతారికయందు మఱొక విశేషము కలదు

విడువక పెమ్మసాని పెదవీరనృపాలుని యందలంబుపై
నడచు నుదార మోరమదనాగముఁ జేపిడియమ్ముకొద్దియె
క్కుడువడి గ్రుద్దిపోఁదఱిమె కొంచక లింగనమంత్రి సింహమిం
పడరెడు వేడ్క రాయ వురాయన నామిడిగేశి చెంగటన్

— 1 ఆ. 34 ప.

---

1 Annual Report on Indian Epigraphy for 1962-'63 Anantapur Dt, Tadipatri Taluk, p 58

వాగంటి శేషయ్యగారు ఇదే శాసనమును తాడిపత్రి యందలి ఇంకొక శాసనముగా భావించిరి ఆ శాసన సారాంశ మిది

Gift of 5 Tums of land in Villalore to the diety by Linganna. son of Krishnama Raju in S 1586, Vijaya (Ins Ced Dts, p 833, No 86)

ఈ శాసనమందు ఉదాహరించిన శ 1586 విజయనామ సంవత్సరముకాదు. ఇంతను చాగంటి శేషయ్యగారు సమన్వయించుకొనిన శ 1486 సంవత్సరముకూడ విజయనామ సంవత్సరముకాదు శ 1516 వ సంవత్సరములందు మార్చి వరకు "విజయ", మార్చి నుండి "జయ" సంవత్సరములు కలవు కావున ఈ శాసన కాలము నందు తప్పుదొర్లినది పై శాసనములోని లింగనమంత్రి, కవి చెన్నమ రాజు పినతాతయైన లింగనమంత్రి ఒకడే అగును ఇద్దఱును కృష్ణమరాజు కొడుకులే కనుక ఈ శాసనకాలము శ 1516 కావలయును

పై పద్యమువలన లింగనమంత్రి పెమ్మసాని పెదవీరనృపాలుని యందలముమీదికి లంఘించిన మదపుటేనుగును గ్రుద్ది పోదటిమెననియు, అందులకు రాయలవురా యని మెచ్చినట్లు స్పష్టమగుచున్నది

చాగంటి శేషయ్యగారు "పెదవీరనృపాలుని కాలము సునిశ్చితముగ తెలియదు కాని క్రీ శ 1540 అని చరిత్రకారు లనుచున్నారు" అని వ్రాసినారు [1] కాని శేషయ్యగారి కాలనిర్ణయము సరియైనదిగ కన్పట్టుటలేదు

పెదవీరనృపాలునిగుఱించి కొత్త భావయ్యచౌదరిగారి అభిప్రాయమిది – [2] "పెమ్మసాని పెదవీరనృపాలుడు గండికోటను పరిపాలించిన పెమ్మసాని వంశీయుడు ఈయన యాడకిలో పరిపాలన సాగించెను "

యాడకి పరిపాలకులలో పెమ్మసాని వీరప్పనాయకుని శాసన మొకటి దొరికినది ఆ శాసన విషయమిది " [3]

**'Saka 1528, Parabhava, A Sadha Su•12 Ragisters a gift of land in Kona-uppalapadu include Na ankara of Yadaki held by Pemmasani Virappa – nayaka, by Jiyyamma, wife of Vepala Yallaya of Rik–Sakha for the garland (tomala) service of god Chenna Kesava '**

ఈ శాసనమువలన వీరప్ప నాయకుడు క్రీ శ 1606 ప్రాంతమున యాడకి పరిపాలకుడుగ నున్నట్లు స్పష్టమగుచున్నది ఈ వీరప్పనాయకుడే పెదవీరనృపాలుడగును

కనుక లింగనమంత్రి తాడిపత్రి శాసనమునుబట్టి క్రీ.శ 1594 వ సంవత్సరము నందు, యాడకి శాసనమునుబట్టి క్రీ శ 1606 వ సంవత్సర ప్రాంతము నందు ఉండవలయును కావున లింగనమంత్రి కాలము స్థూలముగ 1565–1625 కావచ్చును

మఱి లింగనమంత్రికి మనుమడగు కవి చెన్నమరాజు కాలము స్థూలముగ 1615–1675 కావలయును

ఇంక తమ్మయమంత్రి గురించి అవతారికయందు ఇట్లు గలదు–

1. ఆంధ్ర కవితరంగిణి – 11వ సంపుటి పుట 248
2. కమ్మవారి చరిత్ర, పు – 188

**1 Annual Reports on Indian Epigraphy, 1958-59, B 45 – Yadaki, Anantapur Dt.**

శ్రీరంగరాయ ధాత్రీతలాధ్యక్ష ద
క్షిణభుజాదండమై చెలఁగినాఁడు
కరమొప్ప నతనిచేఁ గిరివాహనాందోళి
కాసితచ్ఛత్రముల్ గాంచినాఁడు
రమణ వేంకట దేవరాయేంద్రుఁడు నుతింపఁ
బటు కార్యదక్షుఁడై ప్రబలినాఁడు
దునియదారులఁదెచ్చి ఘనత నాతనికి పా
దాక్రాంతులుఁగఁజేసి యలరినాఁడు
బోట కర్ణాట లాట కాంబోజ మగధ
గౌళ నేపాళ మాళవ చోళ సింధు
నృపవరాస్థానముల మంతుకెక్కినాఁడు
మంత్రిమాత్రుఁడే తమ్మయ మంత్రిమౌళి

— చా. చం. - 1. ఆ: 27

పై పద్య మందలి తృతీయపాదమున "రమణ వేంకటరాయ దేవేంద్రుఁడు నుతింప" అను పాఠాంతరము కొన్ని ప్రతులందు గలదు చాగంటి శేషయ్యగారు ఈ పాఠాంతరమునే అనుసరించినారు [1] కాని యిచట యతిమైత్రి భంగము కీ శే కందుకూరి వీరెశలింగంపంతులుగారు "రమణవెంకటపతి రాయేంద్రుఁడు నుతింప" అను ఒక పరిష్కారమును సూచించినారు [2] డా॥ కొర్లపాటి శ్రీరామ మూర్తిగారు తమ 'శ్రీనాథుడు" అను సిద్ధాంత గ్రంథమునందు (అముద్రితభాగము) చెన్నమరాజుగురించి చేసిన చర్చలో వేరొక పరిష్కారమును ఈ విధముగ చెప్పి నారు "రమణ వేంకట దేవరాయేంద్రు డు నుతింప" ఈ పాఠము సరియైనదని ప్రస్తుత పరిష్కరణయందు ఋజువైనది కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిష త్కార్యాలయమునందలి తాళపత్రప్రతియందు, మరియు ప్రాచ్యలిఖిత పుస్తక భాండా గారమందలి కాగితపు ప్రతియందు ఈ విధమైన పాఠాంతరమే కలదు

కీ శే కందుకూరి వీరేశలింగంపంతులుగారు తమ్మయమంత్రిని, కృతికర్త కాశ్రయమిచ్చిన పెమ్మసాని తిమ్మరాజుగ పొరబడినారు [3] అందువలననే వీరే॥

---

1 ఆంధ్ర కవి తరంగిణి - 11వ సంపుటి పు 229
2 ఆంధ్రకవుల చరిత్ర - ద్వితీయ భాగము, పుటలు 131-2
3 పైది

లింగం పంతులుగారు "కవి శ్రీరంగరాయ, వెంకటపతిరాయల కాలములో నున్న వాడగుటచేత క్రీ శ 1574-1614 మధ్య ప్రబలియున్నాడు" అని వ్రాసినారు ఈ కాలనిర్ణయము సరియైనదికాదు అవతారికయందలి వంశవృక్షక్రమమును సరిగా పరిశీలింపక చేసిన నిర్ణయ మిది "చెన్నమరాజు తిమ్మనను పెమ్మసాని తమ్మన యనుకొనుట వలననే యీ పొరబాటు వచ్చినది" అని చాగంటి శేషయ్యగారు తమ అభిప్రాయమును తెలిపినారు [1] శేషయ్యగారి అభిప్రాయమే సరియైనది ఏది యేమైనను పై పద్యమునుబట్టి తమ్మయమంత్రి శ్రీరంగరాయల కుడిభుజమనియు, వేంకటదేవరాయల కార్యకర్తయనియు స్పష్టముగ తెలియుచున్నది

విజయనగరసామ్రాజ్యము నేలిన ఆర్వీటివంశమునందు శ్రీ రంగరాయ, వేంకటపతిరాయ నామధేయులు పెక్కుమందికలరు [1] కాని తమ్మయమంత్రి,శ్రీరంగ రాయ, వేంకటపతిరాయలకు కార్యకర్తయగుటవలన వీరిరువురు వరుసగ ఒకే సింహాసన మధిష్ఠించినవారై యుండవలయును ఈ దశ క్రీ శ 1570-1614 లో విజయనగర సామ్రాజ్యమునకు సంభవించినది వీరిరువురును వసుచరిత్ర కృతిపతి యగు తిరుమలరాయల కుమారులైన శ్రీరంగరాయలు, వేంకటపతిరాయలై యున్నారు వీరిరువురు ఒకరి తరువాత ఒకరు విజయనగర సింహాసన మధిష్ఠించి క్రీ శ 1574-1614 వరకు రాజ్యపాలనచేసిరి [2] కావున ఇదే కాలమందు తమ్మయ మంత్రి యుండవలయును ఇట్టి అభిప్రాయమునే చాగంటి శేషయ్యగారు వెలిబుచ్చి నారు [3] ఇంకను చాగంటి శేషయ్యగారు "అళియ రామరాయల తండ్రి శ్రీరంగ రాయలును, ఆ శ్రీరంగరాయల ఐదవ కుమారుడైన వేంకటపతిరాయలును కలరు కాని తమ్మయమంత్రి ఆకాలపువాడు కాడు" అని చెప్పినారు కాని ఎందుకు కాడో అను విషయమును ఇదమిత్థముగ తేల్చలేదు ఈ విషయము కవి యొక్క వంశ వృక్ష క్రమమును నిశితముగ పరిశీలించిన స్పష్టమగును వంశవృక్షములో చెప్ప బడిన లింగనమంత్రి తమ్మనమంత్రి ఒకే తరమునకు చెందినవారు "తాడిపత్రి" శాసనాధారముతో లింగనమంత్రి కాలము స్థూలముగ 1565-1625 ప్రాంతము కావున ఇదే తరమునకు చెందిన తమ్మనమంత్రి కూడ ఈ కాలమునకే చెందినవాడై యుండవలయును అందువలన తమ్మనమంత్రిని సత్కరించిన శ్రీరంగరాయలు, వేంకటపతిరాయలు అళియరామరాయల తండ్రియైన శ్రీరంగరాయలు, ఆయన ఐదవ కుమారుడైన వేంకటపతిరాయలు అగుటకు వీలులేదు లింగనమంత్రి తరము లోని తమ్మనమంత్రి 1574-1614 వరకు విజయనగర రాజ్యమును పరిపాలించిన తిరుమలరాయల పుత్త్రులగు శ్రీరంగరాయ, వేంకటపతిరాయల మంత్రియగును

1 ఆంధ్ర కవి తరంగిణి, 11వ సంపుటి, పు 240

2 తెలుగు విజ్ఞాన సర్వస్వము, 8వ సంపు, పుటలు 410-12

3 ఆంధ్రకవి తరంగిణి, 11వ సంపు, పు 240

కనుక లింగనమంత్రివలె తమ్మనమంత్రి కాలముకూడ స్థూలముగ 1565-1625 కావచ్చును అతని మనుమడగు కవి చెన్నమరాజు కాలము స్థూలముగ 1615-1675 ప్రాంతమని చెప్పవచ్చును

ఇంక వారుచంద్రోదయకర్తయైన చెన్నమరాజు గురించి అవతారికయం దిట్లు గలదు—

తనలసద్వనలక్ష్మి తన లసద్వనలక్ష్మి
పగిది నాళీవై భవములఁ బూన
తన మహాశయపాళి తన మహాశయపాళి
గతి దానవారి సంగతి వహింప
తన కళావిభవంబు తన కళావిభవంబు
సరణి నబ్జజపరిస్ఫురణ నెఱప
తన విగ్రహస్ఫూర్తి తన విగ్రహస్ఫూర్తి
రీతి దర్పకనిరాకృతి యొనర్ప
నలరుధాత్రినే మన్నె మార్తాండుఁ డట్టి
గండరాదిత్య గండరగండ బిరుద
దేవితాటోప బయదప్రతాపతీవ్ర
ఘృణికి పెమసాని తిమ్మభూమీశమణికి — 1 ఆ; 72

మంత్రియై నీవు చెన్నయ మంత్రిచంద్ర'
ప్రణుతికెక్కితి వఖిలభూపాలసభల
క్షితి హరిశ్చంద్రునకు సత్యకీర్తి సరణి
దరణి దరగర్వభేదికి గురునికరణి — 1ఆ. 73

మఱియు,

గరుడనారాయణ బిరుదధ్వజంబు బం
గారు పువ్వుల చెంద్రదగావి పావ
డయుఁ దురాయిగజంబు హయరత్నమును వీర
మలహరి ఘనకంఠమాలికయును

దాళిచౌకట్లు ముత్యాలకడియములు
గండపెండేరంబు కత్తికుంచ
వేంకటపతిరాయవిభుని చెంతను దెచ్చి.
పెమసాని తిమ్మభూరమణమణికి
నిచ్చి తదనుజ్ఞఁ గైకొంటి వెలమి నీవు
రాయదత్తంబులైన కుళ్లాయిమీఁది
పాగ ధవళశంఖంబులు పల్లకియును
దాళిచౌకట్లు చెన్నప్రధానచంద్ర — 1 ఆ: 74

కుంచకాళాంజి పట్టించుకొమ్మటంచు
ముదల యిడి రాయలెంతయు ముదముమీఱ
సకల సన్మానము లొనర్ప జగతిఁగీర్తిఁ
జెన్నుమీఱితి వౌరౌర చెన్నధీర — 1 ఆ: 75

పై పద్యముల వలన చారుచంద్రోదయ కర్తయగు చెన్నమరాజు 'గండరాదిత్య గండరగండ', 'మన్నెమార్తాండ' బిరుదాంకితుడైన పెమ్మసాని తిమ్మభూమీశునకు అమాత్యుడైనట్లుగను, గరుడనారాయణ బిరుద ధ్వజాదికము వేంకటపతిరాయల యొద్దనుండి తెచ్చి పెమ్మసాని తిమ్మనాయన కిచ్చి, ఆయన అనుమతి మీద తాను కొన్ని బహుమతు లందుకొన్నట్లు స్పష్టమగుచున్నది దీని వలన కృతికర్త చెన్నమరాజు పెమ్మసాని తిమ్మానాయనకు, వేంకటపతిరాయలకు సమకాలికు డని తెలియుచున్నది

పైన తెలిన కవి చెన్నమరాజు కాలమునందు (1615–1675) ఒక పెమ్మసాని తిమ్మానాయుడు గండికోట దుర్గాధిపతి కల డనుటకు, విజయనగర పాలకుడైన ఒక వేంకటపతిరాయలు కల డనుటకు చారిత్రకాధారము కలదు

అప్పటి పెమ్మసాని తిమ్మానాయనికి సంబంధించిన శాసనవిషయము లివి[1] ·

"Pemmasani Timmanayudu appointed in S 1566 Tarana, one Bukkapatnam Tatacharya to the head of all Samayacharam of Gandikota district, He was receive the Guruseva, to be present at Hariseva and punish people who swerved from the right path"

"A Telugu C. P in the han is of Tirumala Tatacharya Records the gift of paturu (Pulivendla taluk) in S 1566 Tarana, to Kumara Tatacharulu by Pemmsani Timmanayudu"

1. A Topographical list of the inscriptions of the Madras presidency - Rangacharyulu, pp. 607, 634

పై శాసన విషయములనుబట్టి ఒక పెమ్మసాని తిమ్మానాయుడు క్రీ శ 1644 వ సంవత్సరము నందు కలడని స్పష్టము అది పయిన చెప్పిన చెన్నమ రాజు కాలములోనిదే విజయనగర రాజులలో మూడవ వేంకటపతి రాయల కాలము 1630–42 [1] ఇదికూడ పయి కవి చెన్నమరాజు కాలములోనిదే

పయి మూడు చారిత్రక విషయముల పరస్పరోపబలకతనుబట్టి కవి చెన్నమరాజు కాలము స్థూలముగ 1615–75 ఇంకను స్థూలముగ 1600–75

చారుచంద్రోదయ రచన నాటికి కృతికర్తకు యుక్తవయస్కులైన ఇరువురు బమాయ లున్నట్లు అవతారిక యందలి 78, 79, 80, 81, 83 పద్యముల వలన తెలియుచున్నది అనగ 'చారుచంద్రోదయము' రచించు సమయమునకు కవి చెన్నమ రాజు నకు కనీసము ఏబది సంవత్సరముల వయస్సు యుండి యుండవలయును దీనినిబట్టి చారుచంద్రోదయ రచనాకాలము స్థూలముగ క్రీ శ 1650 ప్రాంతము కావలయును

సన్నుతకవిత్వవిద్యా
ఖ్యున్నతి శ్రీనాధుసుకవిపుంగవు కరణిన్
జెన్నమరున్ లక్ష్మీపతి
చెన్నమరాజ ప్రధానశేఖరుఁ డెలమిన్ 1 ఆ. 52

అను పద్యములోని రెండవ పాదమునందు 'శ్రీనాధుసుకవిపుంగవు కరుణన్' అను పాఠాంతరము కొన్ని ప్రతులందు గలదు దానినిబట్టి వెటూరి ప్రభాకరశాస్త్రి గారు కృతికర్త తాత యగు చెన్నమరాజు శ్రీనాధుని శిష్యుడని చెప్పిరి

శ్రీనాధుడు పదునైదవశతాబ్ది చివఱను ఉన్నను. కృతికర్త తాత చెన్నమ రాజు శ్రీనాధుని శిష్యుడైనచో పదునైదవశతాబ్ది చివఱలో నుండవలయును తాత పదునైదవ శతాబ్దము నందు. మనుమడు పదునేడవ శతాబ్ది యందును ఉండుట పొసగదు తాత మనుమల మధ్య రెండువందల సంవత్సరముల వ్యత్యాస ముండదు కనుక తాత చెన్నమరాజు శ్రీనాధుని శిష్యుడు కాడను చాగంటి శేషయ్యగారి.[2] డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తిగారి [3] అభిప్రాయములే సమంజసము

---

1 విజ్ఞాన సర్వస్వము - మూడవ సంపుటి, పుట 419
2 ఆంధ్ర కవితరంగిణి - అయిదవ సంపుటి, పుట 192
3. శ్రీనాథుడు, పుట 55

'శ్రీనాధు సుకవిపుంగవు కరణిన్'అను పాఠము 'ఆంధ్రసాహిత్య పరిషత్ గ్రంధాలయ తాళపత్ర ప్రతి' యందు కలదు ఆ పాఠమునుబట్టి తాత చెన్నమ రాజు సకలవిద్యాసనాధు డైన శ్రీనాధుని వలె కవిత్వము చెప్పగలవాడని మాత్రమే అర్థము వచ్చును

మొత్తముమీద చారుచంద్రోదయ కర్త చెన్నమరాజు కాలము స్థూలముగ 1600–75 చారుచంద్రోదయ రచన కాలము స్థూలముగ 1650 ప్రాంతము

## 3. అవతారికావిశేషములు

కావ్యారంభమునందు కవి వ్రాయునది 'అవతారిక' 'తౄ' అను ధాతువు నకు 'ఇక' ప్రత్యయము చేరగా ధాతువులోని 'ఋ' అను అచ్చునకు వృద్ధి వచ్చి 'తారిక' అను రూప మేర్పడును ఈ 'తారిక' కు 'అవ' అను ఉపసర్గ చేరగా 'అవతారిక' అను శబ్దము నిష్పన్నమగును 'అవతారయతీతి అవతారికా' – దిగు నట్లు చేయునది అనగా కధను అవతరింప చేయుచున్నది కనుక 'అవతారిక' అవతారికకు బదులు 'పీఠిక' అను మాటకూడ వాడుకలో నున్నది ఇష్టదేవతాస్తుతి, సుకవిస్తుతి, కుకవినింద, కృతికర్తల విషయము, కృతిభర్తృప్రశంస, కావ్యోత్పత్తి వృత్తము, రచనా సంప్రదాయము మొదలగు విశేషాంశములు అవతారికలోని ప్రధాన విషయములు

తెలుగు కావ్యములలో ఆరంభ పద్యమున కావ్యార్థమును సూచించుట ఒక సంప్రదాయము. చెన్నమరాజు మొదటి పద్యమునందు రుక్మిణీ శ్రీకృష్ణుల శృంగారమును వర్ణించినాడు ఇందు శ్రీకృష్ణుని అష్టభార్య లందు పట్టమహిషి యైన రుక్మిణితో శృంగారము మాత్రము చెప్పబడినది మిగిలిన సపత్నులను తలంప లేదు కావున కావ్యకధకు రుక్మిణితో సంబంధము కలదని సూచించుచున్నది రుక్మిణీశ్రీకృష్ణుల పుత్త్రి డగు చారుచంద్రుడే కావ్యనాయకుడు

కవి కృత్యారంభమున దేవీసహితులైన త్రిమూర్తులను వేర్వేరు పద్యము లలో స్తుతించినాడు ఇతడు త్రిమూర్తులను స్తుతించు సందర్భమున ఒకరిని ఒక పద్యములో వెంటనే ఇంకొక పద్యములో అతని దేవేరిని స్తుతించినాడు ఈవిధముగ స్తుతించుట 'పంచతంత్రము', 'అహల్యాసంక్రందనము', 'రాజశేఖర విలాసము' ఇత్యాది కావ్యము లందు కన్పట్టుచున్నది. దేవీ సహితులైన త్రిమూర్తులను

స్తుతించిన పిదప ప్రత్యేకముగ తరువాత పద్యమునందు వినాయకుని స్తుతించినాడు సరస్వతీదేవిని బ్రహ్మపత్నిగను మఱియు తన కృతికి చమత్కృతిని కూర్చుమని చదువుల తల్లిగ ప్రార్థించినాడు ఈరీతిగ చెన్నమరాజు త్రిమూర్తులతోపాటు వారి దేవేరులకుకూడ ప్రత్యేక స్థానము నిచ్చి, స్తుతించినాడ

కవులయొక్క ఇష్టదేవతాస్తుతి కవుల కృతిపతుల మతము ననుసరించి యుండును చెన్నమరాజు తన కావ్యమును గోపాలకృష్ణుని కంకిత మొనర్చి ఇష్ట దేవతాస్తుతి యందు హరిహరుల కభేదమును ప్రవచించినాడు

హరికిని మా కభేదమని యందఱికిన్ బ్రకటించు వైఖరిన్
బరమ సుదర్శనాయుధము పవ్యహరిద్వసనంబు మత్తకుం
జరవరదాంకమున్ విబుధసన్నుతదైత్యపురప్రహారవి
స్ఫురణముఁ గల్గు శంకరుఁ బ్రపుణ్యవశంకరు నే భజించెదన్ —
1 ఆ. 3 ప

ఇది శివస్తుతి యైనను, ఇందు హరిహరాభేదతత్త్వము చెప్పబడినది ఇందు శ్లేషను ప్రయోగించుట ప్రత్యేకత

ప్రాచీనాంధ్రకవులు తమకు మార్గదర్శకు లయిన సంస్కృతాంధ్ర కవులను అవతారిక లందు పేర్కొని స్తుతించినారు. చెన్నమరాజు సంస్కృత కవులగు వాల్మీకి, శక్తిపౌత్రుడు దండి, భారవి, కాళిదాసు, వామనుడు మయూరుడు, భవభూతి మొదలగు కవులను నుతి యొనర్చినాడు అట్లే ఆంధ్రకవులలో నన్నయ, తిక్కన ఎఱ్ఱన, శ్రీనాథుడు భైరవుడు అనంతామాత్యుడు, సోమనలను స్తుతించెను చెన్నమరాజు తొలుత కవిత్రయమును 'శబ్దశాసనుడు కుండలీంద్రుడు, శంభుదాసుడు' అని వారి బిరుదములతో పేర్కొనినాడు మఱియు శబ్దశాసనుని 'ప్రకృతికృదవ్యయప్రత్యయసుప్రతిష్ఠాధనుని గా, కుండలీంద్రుని సరసమా ప్రియంకర పదాలంకారవృత్తిసాంద్రుని గా, శంభుదాసుని 'సర్వజ్ఞగణమనః సంప్రీతికరకవిత్వవిలాసుని గా, శ్రీనాథుని బహుముఖ ప్రఖ్యాత మహితశయ్యా విశేషసనాథుని గా చెప్పి వారిని స్తుతించినాడు ఇచటకూడ శ్లేషను ప్రయోగించి నాడు

చెన్నమరాజు, కుకవులు తప్పులు లేకున్నను తప్పులు వెదుకుటకు ప్రయత్నింతురు, సృష్టికర్త యైన బ్రహ్మను కూడ తప్పుగ జూతురు, తామె పద్యమును చెప్పలేరు, ఈవిధముగ 'కుచేష్టలుబోవు కవులను శిష్ట విబుధప్రకరంబులు మెచ్చుదురా' అని, వారిని నిరాకరించినాడు

ఆంధ్రకవులకు అవతారికలో కావ్యరచనకు గల ముఖ్యకారణమును. కావ్యోత్పత్తిక్రమమును చెప్పుకొనుట ఒక సంప్రదాయము ముఖ్యముగ తెలుగు సాహిత్య రచనకు రెండు కారణములు కనప్పట్టుచున్నవి ఒకటి రాజాదరణము, రెండు దైవానుగ్రహము అందువలననే సాధారణముగ ఆంధ్రకావ్యము లన్నియు దైవమునకో, కవి కాశ్రయమిచ్చిన ప్రభువునకో అంకిత మీయబడినవి ఇంతేకాక కావ్యరచనకు బీజముగ స్వప్నసాక్షాత్కార కథను చెప్పుట తిక్కనతో మొదలయి సర్వసాధారణమైనది కవియొక్క ఇష్టదైవమో, పితృపితామహులో స్వప్నమున సాక్షత్కరించి కావ్యరచనకు పురికొల్పుట యిందలి ప్రధానాంశము

స్వప్నవృత్తాంత సంప్రదాయమును ప్రవేశపెట్టినవాడు తిక్కన సోమయాజి తిక్కన ననుసరించి తరువాత పెక్కుమంది తెలుగు కవులు స్వప్నప్రకారమును తమ అవతారికలందు ప్రవేశపెట్టినారు ఎఱ్ఱన 'నృసింహ పురాణము', శ్రీనాథుని 'పలనాటి వీరచరిత్ర', అనంతుని 'భోజరాజీయము', బైచరాజు వెంకటనాథుని 'పంచతంత్రము', కృష్ణదేవరాయల 'ఆముక్తమాల్యద', చింతలపూడి యెల్లనార్యుని 'రాధామాధవము' మొదలైన కావ్యము లందు స్వప్నవృత్తాంతము కలదు

చెన్నమరాజు చారుచంద్రోదయ మహాప్రబంధమును రచియింప సన్నద్ధుడై యున్న సమయమున స్వప్నమున ఒక పురుషవరేణ్యుడు కనిపించి కృతిని తన కంకిత మిమ్మని కోరినట్లుగ స్వప్నవృత్తాంతమును చెప్పుకొనినాడు ఆ పురుష వరేణ్యుని యిట్లు వర్ణించినాడు

సాధుబృందావనోజ్జ్వల ఖేలనము వాఁడ
    విలసితవంశాప్తిఁ జెలఁగువాఁడ
శూరసంతానవిశ్రుతచరిత్రమువాఁడ
    విజయానుగతవృత్తి వెలయువాఁడ
సద్విజప్రణుతభాస్వర వర్తనమువాఁడ
    ప్రద్యుమ్నగురుఁ డనంబఱఁగువాఁడ
దైవతద్రుమమహాదానసైపుణివాఁడ
    లలితసత్యాసక్తి నలరువాఁడ
ప్రబల భద్రానుభూతి వైభవమువాఁడ
సురభిచక్రైకపాలనస్ఫురణవాఁడ
ననుచుఁ దనచర్యఁ దెల్పి యత్యంత చాతు
రీగరిమఁ బల్కె పురుషవరేణ్యుఁ డొకఁడు — 1 ఆ: 12 ప.

సత్పురుషుల యొక్క సాంగత్యముతో ప్రవర్తించినవాడు, ఉన్నతమైన వంశమునందు జన్మించినవాడు పరాక్రమవంతులచే అధికముగ పొగడబడిన చరిత్ర గలవాడు, విజయవరంపర లనెడి వృత్తిచే ప్రకాశించువాడు, సత్పురుషుల సమూహాముచేత పొగడబడినవాడు, ప్రద్యుమ్నునికి గురుడుగ భాసించినవాడు, కల్పవృక్షమువలె కోరిన కోర్కెల నిచ్చు దాతృత్వము గలవాడు సత్యవాక్పరిపాలకుడు, కామధేనువును భక్తితో పూజించినవాడు అని ఆ పురుషవరేణ్యుని చర్యలను వర్ణించెను అట్టి పురుషవరేణ్యుడు కవిని యిట్లు ప్రశంసించెను

చెప్పఁగ నేర్తువు రసములు
చిప్పిలఁ గావ్యములు సుకవిశేఖరహితమై
యొప్పఁగ సమస్తభాషల
నిప్పుడమి భవత్సమాను లెవ్వరుఁ దెలియన్ —1 ఆ. 13 ప.

దీనినిబట్టి చెన్నమరాజు సమస్త భాషావిదుడనియు అతడు రసములు చిప్పిలునట్లు, సుకవిశేఖరులకు హితమగునట్లు కావ్యములు రచింపగలవాడనియు తెలియుచున్నది

మేదుర మాధురీగరిమ మించఁగ నీ వొనరించు చారుచం
ద్రోదయ కావ్యమిమ్ము విబుధోత్తము లెంచఁగ మాకు సుస్థిర
శ్రీదళకొత్తు నీకెపుడు చెన్నమరాజకులాబ్ధిచారుచం
ద్రోదయ • చెన్నమంత్రిమణి • యుజ్జ్వలధీసురదేశికాగ్రణీ •
— 1 ఆ: 14 ప

ఇందు కవి, కావ్యమును తన కంకిత మిమ్మని పురుషవరేణ్యుడు తనను అర్థించినట్లుగ చెప్పినాడు అత్యంత మధురముగ నీవు రచింపదలచినట్టి చారు చంద్రోదయ కావ్యమును సత్పురుషు లందరు ప్రశంసింపగ తనకు కృతి నిమ్మనియు, అందువలన కవికి శాశ్వతమైన కీర్తి లభించుననియు పలికినాడు

తరువాత కవి మేల్కాంచి ప్రభాత సమయమున సముచిత కృత్యములు ముగిసిన పిదప సకల విద్వత్కవిబంధుసందోహములను రావించి వారి యాశీర్వాదమును పొంది తన స్వప్న వృత్తాంతమును విన్నవించినాడు వారు తెలిపిన నిర్ణయ మిది—

సాధు బృందావనోజ్జ్వల ఖేలనమువాఁడు
విలసితవంశాప్తి వెలఁగువాఁడు

శూరసంతానవిశ్రుతచరిత్రమువాఁడు
విజయానుగతవృత్తి వెలయువాఁడు
సద్వ్రజప్రణుతభాస్వర వర్తనమువాఁడు
ప్రద్యుమ్నగురుఁ డనంబఱఁగువాఁడు
దైవతద్రుమ మహాదానసైపుణివాఁడు
లలిత సత్యాసక్తి నలరువాఁడు
ప్రబలభద్రానుభూతి వైభవమువాఁడు
సురభిచక్రైకపాలనస్ఫురణవాఁడు
ఘనుఁడు గోపాలకృష్ణుఁ డొక్కరుఁడెగాక
కలఁడె మఱియొక్కఁడీరీతిఁ గల విభుండు — 1 ఆః 16 ప.

బృందావనము నందు మనోహరముగ ఆటలాడువాడును. పిల్లనగ్రోవితో ప్రకాశించువాడును. యాదవకులమందు ప్రసిద్ధమైన ఖ్యాతి కలవాడును. విజయుడు అనుగతముగ ప్రవర్తించువాడును, వ్రజులచేత నమస్కరించబడిన వర్తనము గలవాడును, ప్రద్యుమ్నునియొక్క తండ్రియును, పారిజాతమును ఖండించి తెచ్చినవాడును, సత్యభామయం దాసక్తికలవాడును, భద్రయందు అధికమైన అనురాగవైభవము కలవాడును, భక్తులను పాలించుటయందు మనోజ్ఞమైన చాకచక్యము కలవాడును అగు ఆ పురుషవరేణ్యుడు గోపాలకృష్ణుడని వారు నిర్ణయించిరి

ఇందు కవి మొదటిసారి 'పురుషవరేణ్యుడు' అను అర్థము స్ఫురించునట్లుగను, రెండవసారి 'గోపాలకృష్ణుడు' అను అర్థము వచ్చునట్లుగ ఒకే పద్యమును రెండు సారులు రచించి చమత్కారముతో తాను చెప్పదలచుకొనినది ప్రౌఢముగా చెప్పినాడు

కలలో నీ కల గోపికావిభుఁడు సాక్షాత్కారమున్ జెంది యా
త్మలసద్వైభవమెల్లఁ దెల్పి కృతి యిమ్మా మాకు నీవన్న య
ప్పలుకెంతన్ బరికింపఁగా సకలసౌభాగ్యైకసారస్వతా
కలనం దెల్పెడు నీదు పుణ్యపరిపాకం బెన్నఁగా శక్యమే
— 1 ఆః 17 ప.

గోపాలకృష్ణుడు కలలో కనిపించి కృతి యిమ్మని పలికిన పలుకులను పరిశీలింపగ అతని కంకిత మిచ్చుటవలన కవియొక్క పుణ్యపరిపాక మెన్నుటకు శక్యము కాదని వారు తెలిపిరి మఱియు నందవరపావనాన్వయోన్నతి వహించియు, సంతతాచార నియమనిష్ఠ కలవాడును అతి పవిత్ర చరిత్రుడైన చెన్నమరాజునకు గోపాలకృష్ణుని కంకిత మొసగు భాగ్యము కలుగుట అరుదుకాదని విద్వత్కవులు, బంధుసమూహము శ్లాఘించిరి ఈ ప్రకారము విద్వజ్జనముల ముఖమున స్వప్నవృత్తాంతమును విపులముగ వివరించినాడు

కావ్యావతారిక యందు గ్రంధకర్తలు తమ వంశాదికమును వర్ణించుకొనుట సాధారణము కొందఱు కవులు తమ వృత్తాంతమును వారే తెలుపుకొందురు తమ వృత్తాంతమును తామే వర్ణించుకొనుట ఆత్మస్తోత్ర మని భావించి స్వప్నమున సాక్షాత్కరించిన ఇష్టదైవము పలికినట్లుగ కొంతమంది చెప్పుకొందురు కొందరు కృతిపతి తనను గూర్చి చెప్పినట్లుగ తమ పాండిత్యమును తెలుపుకొందురు మఱి కొందరు తమ వంశమును గూర్చి విద్వజ్జనులు అభివర్ణించునట్లు రచింతురు 'చారుచంద్రోదయము' నందు చెన్నమరాజు తన వంశాదికమును విద్వజ్జనములు అభివర్ణించినట్లు చెప్పుకొనినాడు

కావ్యావతారికలో చివరిభాగము 'షష్ఠ్యంతములు' చెప్పుట షష్ఠ్యంతములనగా షష్ఠీవిభక్తి ప్రత్యయములు చివర వచ్చునట్లుగ పద్యములను రచించి, కృతిపతికి అంకితమును ప్రకటించుట షష్ఠ్యంతములు చెప్పిన తరువాత వచనముగ కృతిపతికి సమర్పితముచేసి కథ మొదలిడుట తెలుగుకావ్యములందు సర్వసాధారణముగ కన్పట్టుచున్నది ఈ పద్ధతినె చెన్నమరాజు తన కావ్యమునందు అవలంబించినాడు

ఇట్లు చారుచంద్రోదయ మందలి అవతారికలో చాలవరకు పూర్వాంధ్రకవుల సంప్రదాయముల ననుసరించినట్లుగ కనిపించుచున్నది ఇష్టదేవతా స్తుతి, సుకవి స్తుతి, కుకవి నింద, కృతికర్తల ప్రశంస, వంశానుక్రమము కావ్యేతివృత్తము మొదలగు అన్ని సంప్రదాయములను పాటించినాడు ఒకటి రెండు విషయములందు మాత్రము చెన్నమరాజు తన ప్రత్యేకతను చూపించుకొనినాడు ముఖ్యముగ విద్వజ్జనుల ముఖమున వంశాదిక్రమమును, స్వప్న వృత్తాంతమును, కృతికర్త ప్రశంసను చెప్పుట విశేషముగ కన్పట్టుచున్నది అటులనే ఇష్టదేవతాస్తుతి యందు హరిహరనాథుల కభేదమును శ్లేషద్వారా చూపించినాడు ఇదియును ఒక విశేషమే.

## 4. కథాసంగ్రహము

శ్రీకృష్ణుని భార్యలలో రుక్మిణీదేవి వాసికెక్కినది సవతు లందఱు ఆమెతో భేదాభిప్రాయములులేక సఖ్యముగ నుండిరి ఆమె సకల వైభోగములు అనుభవించు చున్నను దానవసంహారమునకు తండ్రికితగిన పుత్రుడు లేడని విచారించుచుండెను ఒకనాడు తన మనమునందలి కోరికను భర్తకు తెలుపగ అతడు సమ్మతించెను అంత ఒకానొక శుభసమయమున లోకములు సంతసిల్లునట్లుగ రుక్మిణీదేవికి పుత్రోదయ మయ్యెను ఈ శుభవార్త వినగానే శ్రీకృష్ణుడు తన వంశగౌరవమునకు తగినట్లుగ దానధర్మములు విరివిగా చేసినాడు యాదవకుల పురోహితుడగు గర్గమౌని జాతకర్మము లన్నియు విధ్యుక్తముగ ఒనర్చినాడు ఈ పసివాడు శత్రువులను అణచి భూవలయమును పరిపాలింపగల డని 'చారుచంద్రుడు' అని నామకరణ మొనర్చెను

చారుచంద్రుడు బాల్యమున తల్లిదండ్రులను సంతోషపెట్టుచు. సార్థక నామ ధేయు డగునట్లుగ. సకలగుణములతో ద్వారావతీ పట్టణములోని ప్రజలను కూడ సంతోషపెట్టుచు క్రమక్రమముగ రాజ్యపాలన కర్హమగు వయస్సునందెను

ఒకదినము చారుచంద్రుడు తన చెలికానితో రైవతకపర్వత ప్రాంతమునకు విహారమునకు వచ్చి. ఆ కొండయొక్క మహిమను గూర్చి విని మనమునందు నాశ్చర్యమొందెను ఆ పర్వతప్రాంతమునందు మహోన్నత వైభవము కలిగి, ఋషులకు ప్రీతికరమైన ఒక వనవాటికను సందర్శించినాడు అచట నొక్కచోట చారుచంద్రుడు అందమైన పూవులతో నిండిన నొక పొదరింటి గూడులో నున్నని పువ్వొడితిన్నెపై కూర్చుండి యుండగ ఋషి వేషధారుడైన సిద్ధు డొకడు తటాలున వచ్చి నిలిచినాడు అతడు కుశలప్రశ్నల యనంతరము తన నామధేయము శాంత భూషణు డనియు, మానస సరస్సునకు ఉత్తరముగ నున్న పర్వతప్రాంతము నందున్న ఆశ్రమము అతని నివాసస్థల మనియు తెలిపి తాను వచ్చిన పని చారు చంద్రునికి ఇట్లు వివరించెను

"పుష్కరు డను రాక్షసుడు రత్నపురమును రాజధానిగ చేసికొని పరిపాలించు చుండెను ఈ రాక్షసుడు ఈశ్వరుని వలన అజేయునిగ వరము పొంది సాధుజను లను బాధింపసాగెను ఇతని దుష్కార్యములకు యక్షులు కిన్నరులు గంధర్వులు ఋషులు మహర్షుల సముదాయము దేవతావరులుకూడ భయపడుచుండిరి అప్పు డింద్రుడు బ్రహ్మ యొద్దకు వెళ్ళి పుష్కరుని గురించి విన్నవింపగ, హరి సుతు డైన చారుచంద్రునకు తెలియజేయు మని చెప్పెను అందువలన ఇంద్రుడు కార్య సాఫల్యము చేసికొని రమ్మని తెల్పి ఒక దివ్యరథము నిచ్చి పంపినాడు."

ఇట్లు తాను వచ్చిన పనిని వివరించి ఆ రథమును చారుచంద్రునకు ఇచ్చి పుష్కరాసురుని చంపి భూవలయమును పరిపాలించిన 'చారుచంద్రుడు' అను పేరు సార్థక మగునని ఆశీర్వదించెను అతని పలుకులు విని చారుచంద్రుడు పుష్కరుని సంహరించెదనని పలికి ఉత్సాహముతో ఇంద్రుడు పంపిన రథ మెక్కి మునీంద్రునితో ఉత్సాహపు వనప్రాంతమునకు చేరెను

పుష్కరాసురుడు నిండుకొలువులో నున్న సమయమున చారు డొకడు చారుచంద్రుని ఆగమనమును గురించి తెలిపెను అంత పుష్కరుడు భీషణముఖుడై రథమెక్కి ఘోర సైన్యములతో యుద్ధమునకు నడిచెను శౌరికుమారుడు ఆ రాక్షస సైన్యములను చూచి యుద్ధమునకు సన్నద్ధుడై నిలిచెను అప్పుడు శాంతభూషణుడు శౌరినందనునకు సహాయముగ తన యోగమహిమచేత గజవాహన రథములను, మహాసైన్యములను పంపినాడు పిదప చారుచంద్రుడు పుష్కరుని సంహరించి విజయమును పొందెను

అప్పుడు దేవేంద్రుడు సంతృప్తి నొంది, చారుచంద్రుని యొద్దకు వచ్చి సకలలోకములకు బాధకుడైన పుష్కరాసురుని చంపి లోకప్రియముగ విజయమును పొందితివి అని అతని శౌర్యపరాక్రమములను పొగడి రత్న భూషణములను అపారముగ ఇచ్చి సత్కరించినాడు మరియు దృశ్యాదృశ్య కళల యందు ప్రసిద్ధి కెక్కిన 'త్రికాలవెది' అను నామము గల కీరమును బహూకరించినాడు

పిదప శాంతభూషణుడు చారుచంద్రుని శౌర్యపరాక్రమములను మెచ్చి తన ఆశ్రమమునకు తోడ్కొనివెళ్ళి యోగమహిమతో అద్భుతమైన మణిమందిరమును సృష్టించి అందు రాజకుమారునికి విందు చేసెను అపుడు చారుచంద్రుడు సుఖాసీనుడై త్రికాలవెది యగు చిలుకను పిలిచి తన భావిజీవితమును గూర్చి చెప్పుమనగ, కీరరాజము విష్ణువరసంజనిత యగు కుముద్వతి అతనిని వరించునని పలికెను అప్పుడు రాకుమారుడు ఉత్సాహముతో ఆమె వివరములను వినుపింపుమని కోరెను అంతట చిలుక కుముద్వతీ వృత్తాంతమును చారుచంద్రునికి ఈ విధముగ తెలిపెను

"రత్నకేతన పురమునకు అధిపతియై పద్మాకరుడు పరిపాలించుచుండెను ఒకానొకనాడు పద్మాకరుడు నిండుకొలువును తీర్చిదిద్దియున్న సమయమున 'కపింజరుడు' అను నామము గల మౌని రాజు నొద్దకు విచ్చేసెను రా జతని కెదురేగి సాష్టాంగ దండప్రణామము చేసి అర్ఘ్యపాద్యాదివిధులను నిర్వర్తించి కొలువు కూటమునకు తీసికొని వచ్చి అతని క్షేమ సమాచారములను అరసెను కపింజరుడుకూడ రాజు క్షేమమును అడిగెను అంత పద్మాకరుడు ——

వినుఁడు నీకృప నేమిట వెలితి లేదు
వెలితి యొకయింత గలదు - 2 ఆ, 92 ప.

అని తన మనము నందలి చింతను ముని యెదుట వ్యక్తము చేసెను అప్పుడు పద్మాకరుని చింతకు కారణము అనపత్యత యని సర్వజ్ఞుడైన మునీంద్రుడు యోగ దృష్టితో తెలిసికొని అరణ్యమున కేగి కమలాక్షుని గురించి తప మొనరించిన సంతానవంతుడవు అగుదువని రాజునకు తెలిపి దీవించెను. అంత పద్మాకరుడు కొలువు చాలించి. అంతఃపురమునకు ఏగి, తన్ను నరణ్యమునకు తోడ్కొని పొమ్మని వేడుచున్న భార్య నోదార్చి మంత్రికి రాజ్యాధికారము అప్పగించి అరణ్యమునకు వెళ్ళి కౌశికీనది చెంతను ఘోరతప మొనర్చుటకు పూనుకొనెను

"పద్మాకరుని తపోమహిమను అమరాధినాయకుడు వారునివలన తెలిసికొని తప యింద్రత్వమును గురించి తప మొనర్చుచున్నాడని వెఱచి, అతని తపమును భగ్నము చేయుటకు రంభ మొదలగు అప్సరసలను,మదనాదులను పంపెను అపుడు మదనాదులు తమ తమ ప్రయత్నములు చేసినను పద్మాకరుడు తపోనిష్ఠతో చలింప కుండెను ఇంద్రుడు విఫల మనోరథుడై విష్ణుమూర్తిని శరణు వేడెను ఆ పర మాత్మునివలన పద్మాకరుని నిజతపఃకారణమును తెలిసికొని తన భయమును విడ నాడెను పద్మాకరుని తపస్సుకు మెచ్చి శ్రీమహావిష్ణువు అతనికి ప్రత్యక్షమయ్యెను పద్మాకరుని సాష్టాంగదండప్రణామమును స్వీకరించి. యాతని స్తోత్రమునకు సంతసించి అభీష్టసిద్ధి కలుగునని వర మిచ్చి అంబుజనాభుడు వెనువెంటనే అదృశ్యు డయ్యెను

పద్మాకరుడు సంతోషాంతరంగుడై తన రాజ్యమున కేగి మనోభీష్టసిద్ధికై నిరీక్షింపసాగెను అంత పద్మాకరుని భార్య గర్భము ధరించి యొక శుభ ముహూర్తమున కుమారుని, కుమారీరత్నమును ప్రసవించినది కుమార్తెకు 'కుముద్వతి' అని నామకరణము ఒనర్చిరి కుముద్వతి దిన దిన ప్రవర్ధమానయై పెరుగుచు తన బాల్యచేష్టలతో రత్నకేతనపురమునందలి పౌరులను, తల్లిదండ్రులను సంతోష పెట్టుచు యౌవనవతియై అతిలోక సౌందర్యముతో ప్రకాశించుచుండెను"

కుముద్వతీ వృత్తాంతమును విని చారుచంద్రుడు కుముద్వతీ దర్శన భాగ్య మును కల్పింపుమని కీరమును కోరగ రత్నకేతనపుర ప్రాంతమునకు విచ్చేసినచో, తన కౌశలముతో రాజకుమార్తె నాకర్షించి చూపించెదనని చిలుక పలికెను అంతట హరిసుతుడు చెలికానితో అరణ్యములను, దుర్గములను దాటి రత్నకేతన పుర ప్రాంతమున ఒక మామిడిచెట్టు నీడను నిలిచెను చిలుక దృశ్యాదృశ్యమంజుకళ లందు మేటి కావున తన మాయచే బంగారు పావురమును సృష్టించి, దానిద్వారా చారుచంద్రుని, చెలికానిని వేరుచేసి చారుచంద్రునకు ఏకాంతమును కలిగించెను

మఱియు తన మాయాజాలముతో చారుచంద్రుని అదృశ్యు మొనర్చె. ఆ వనప్రాంతమున చెలులతో విహరించుచున్న కుముద్వతిని చూపెను

చారుచంద్రుడు కుముద్వతిని చూచుట యందు నిమగ్నుడై యుండగ, చిలుక కుముద్వతి సమీపమున నున్న ఒక వృక్షశాఖపై వ్రాలి, చిత్రమైన చేష్టలతోను, తన మధురాతి మధురమైన పలుకులతోను కుముద్వతిని ఆకర్షించెను. అతి చతురమతియైన ఆ కీరరాజుయొక్క పలుకులకు సంతసించి కుముద్వతి కీరమును ఆ ప్రాంతమునకు వచ్చుటకుగల కారణమును ప్రశ్నించెను. అప్పుడు చిలుక తన వాక్చాతుర్యమును ఉపయోగించి ఈ విధముగ చెప్పెను—

"పూర్వము తారకుడను రాక్షసుని కుమారస్వామి సంహరింపగ, దేవేంద్రుడు మెచ్చి తన కుమార్తె యగు దేవసేనను నిచ్చి పరిణయ మొనర్చెను. పిదప హరుని యొద్ద కేగి, అతనిచేత గౌరవమును పొంద మఱలి వచ్చునప్పుడు పార్వతీదేవి పాలో ఓం నన్ను బహుమానముగ ఒసగెను. పిదప ఇంద్రుడు పుష్కరాసుర సంహారము నకు హర్షముతో రుక్మిణీ కుమారుడగు చారుచంద్రునకు నన్ను బహూకరించెను. అతని సౌందర్య ధైర్య భుజశౌర్యాది గుణంబులకు అలరి అతని కనుకూలమైన కన్యకారత్నమును ఎల్లలోకములయందు అన్వేషింపగ కలిగుట లేకపోయినది. యోగదృష్టితో పరికింపగ విష్ణువంశసంజాత వగు నీవే తగిన కన్యక వని తెలిసికొని నీ యొద్దకు వచ్చితిని. అదృశ్యాంజనాకర్షణాది విద్యలన్నియు నాకు తెలియును. చారుచంద్రుని మీకు వలె నన్నవో చూపెదను."

ఇట్లు చెప్పి ఒక దివ్యాంజనము పెట్టి ఆమెకు చారుచంద్రుని చూపించెను. ఈరీతిగ కుముద్వతి చారుచంద్రుల మధ్య చిలుక దౌత్యమును నెఱపినది. తదుపరి వారిరువురు విరహవేదనతో పరితపించిరి.

చివరకు పెద్దల అనుమతితో కుముద్వతి చారుచంద్రుల వివాహము అత్యంతవైభవముగ జరిగినది. తరువాత వారు కేళీక్రీడలందు మునిగితేలుచు విలాసముగ కాలము గడపసాగిరి. చారుచంద్రుని శౌర్య ధైర్య ముఖ్య సద్గుణములకు దేవతలు మునులు ముదము చెంది ఇంద్రునికి తగిన తనయుడని ప్రశంసించిరి.

## 5. కథామూలము

శ్రీకృష్ణునకు రుక్మిణి యందు దుదయించిన 'చారుచంద్రుడు' పుష్కరుడను అసురుని సంహరించి రత్నకేతన పురాధీశ్వరుడగు పద్మాక్షుని కుమార్తె కుముద్వతిని పరిణయమాడుట యీ ప్రబంధమునందు వర్ణింపబడినది. ఈ కథలకు మూలము ఏ పురాణము నందున్నదో తెలియరాకున్నది. రాయలకాలమునుండి పురాణేతిహాసములనుండి కథలను రేఖామాత్రముగ గైకొని తమ స్వతంత్ర

కల్పనలతో కావ్యగుణము లాపాదించి సౌందర్యవంతము చేయుట ప్రాచుర్యము లోనికి వచ్చినది శ్రీకృష్ణదేవరాయల అనంతరము అనగా 16-17 శతాబ్దములలో పెక్కురు కవులు శ్రీకృష్ణునికి వేర్వేరు భార్యలందు కల్గిన పెక్కు పుత్త్రుల గాథలను కథావస్తువులుగా స్వీకరించి ప్రబంధములను రచియించిరి అందులో చెప్పుకోదగినవి 'ప్రభావతీ ప్రద్యుమ్నము', 'సాంబోపాఖ్యానము', 'చంద్రభాను చరిత్రము' మొదలైనవి అదే కాలమునకు చెందిన చెన్నమరాజు కూడ రుక్మిణీ కృష్ణుల పుత్త్రుడగు చారుచంద్రుని శృంగార నాయకునిగా స్వీకరించి యీ కథను కల్పించి వ్రాసెను

శ్రీకృష్ణునకు రుక్మిణియందు పదిమంది పుత్త్రులు, ఒక కుమార్తెయు కలిగినట్లుగా అన్ని పురాణేతిహాసము లేకగ్రీవముగ చెప్పుచున్నవి కాని దశపుత్త్రుల నామములు వివిధ పురాణములు మఱియు ఒకే పురాణమునందు కూడ వేర్వేరు ప్రతులు వేర్వేరుగా తెలిపినవి

సంస్కృత భాగవతమునందు రుక్మిణీ పుత్త్రుల నామములు ఇట్లు కలవు—

'చారుదేష్ణ స్సుదేష్ణశ్చ చారుదేవశ్చ వీర్యవాన్।
సుచారుశ్చారుగుప్తశ్చ భద్రచారు స్తథాపరః॥
చారుచంద్రో విచారుశ్చ చారుశ్చ దశమో హరేః।
ప్రద్యుమ్న ప్రముఖాజాతా రుక్మిణ్యా నవమాః పితుః॥'

పయి శ్లోకములందు ప్రద్యుమ్నుడు, చారుదేష్ణుడు, సుదేష్ణుడు, చారుదేహుడు, సుచారువు, చారుగుప్తుడు, భద్రచారువు, చారుచంద్రుడు, విచారువు, చారువు అని రుక్మిణీ పుత్త్రుల పేరులు కలవు మడికి సింగనార్యునిచే రచింపబడిన 'ద్విపద భాగవత' మందు కళ్యాణకాండములో ప్రద్యుమ్నాది కుమార జనన వృత్తాంత సందర్భములో రుక్మిణీ పుత్త్రుల ప్రసక్తి కలదు

హరికి రుక్మిణికిని నగ్రనందనుఁడు
పరమానురక్తుఁడై ప్రద్యుమ్నుఁ డట్టి
వీరుఁడు మొదలుగా వినుసదేష్ణుఁడును
జారువేష్ణుండును జారుదేహుండు
జారుతృప్తుండును జారుచంద్రుండు
జారుహస్తుండును జారువీర్యుండు
జారుధీమణివిచారుఁడు బదరు — పు. 126

1. భాగ, 10 స్కం, ఏకషష్టితమోధ్యాయః 10-11 శ్లో.

పోతన భాగవత ప్రతులందు వావిళ్ళ ప్రతిలో దశమస్కంధమున ఉత్తం భాగమందు — 'ననంతరంబా సుందరీలలామంబువలనఁ బ్రద్యుమ్నుండు, చారు దేష్ణుండు, సుదేష్ణుండు, సుచారువు, చారుదేహుండు, చారుగుప్తుండు, భద్రచారువు వారుచంద్రుడు, విచారువు చారువు ననియెడు పదుగురు తనయులం బడసె'

ఇట్లు తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారి ప్రతి యందును చారుచంద్ర నామము కన్పట్టుచున్నది

ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వారిచే ప్రచురింపబడిన భాగవతమునందు 'అనంతరంబ యా సుందరీలలామంబువలన ప్రద్యుమ్నుండు చారుదేష్ణుండు సుదేష్ణుండు చారుదేవుండు సుచారువు చారుగుప్తుండు భద్రచారువు చారుభద్రుండు విచారువు చారువుననియెడు పదుగురు తనయులం బడసె' అని కలదు అధః సూచికి యందు తంజనగరు ప్రతిలో వారుభద్రునకు చారుచంద్ర నామ మున్నట్లు చెప్ప బడినది

సంస్కృత హరివంశములో విష్ణుపర్వమునందు వృష్ణివంశ వర్ణన సందర్భ ములో రుక్మిణీ పుత్త్రిల గురించి ఈ విధముగ కలదు

ప్రద్యుమ్నః ప్రథమం జజ్ఞే శంబరాంతకరః శుభః।
ద్వితీయశ్చారుదేష్ణశ్చ వృష్ణిసింహో మహారథః।
చారుబద్రిశ్చారుగర్భః సుధేష్ణో ద్రుమ్ఏవ్‌చ।
సుషేణశ్చారుదేష్ణశ్చ చారువిందశ్చ వీర్యవాన్।
చారుబాహుః కనీయాంశ్చ కన్యాచారుమతీ తథా।

తెలుగు హరివంశము నందును ఇట్లే కలదు — 'ప్రద్యుమ్నుని తరువాత వారలు చారుదేష్ణుండును సుధేష్ణుండును సుషేణుండును జారుగుప్తుండును జారు వాహనుండును జారువిందుండును జారుభద్రుండును జారుగర్భుండును జారుండును జారుమతియు నన దదీయ నామంబులు'

వాయుపురాణము నందు—

ప్రద్యుమ్నశ్చారుదేష్ణశ్చా సుధేష్ణః శరబస్తథా।
చారుశ్చచారుబద్రిశ్చ బద్రిచారు స్తథా పరః।

మత్స్యపురాణమందు—

రుక్మిణీజనయామాసపుత్త్రి రణవిశారదమ్।
చారుదేష్ణం రణశూరం ప్రద్యుమ్నశ్చమహాబలమ్।
సుచారుం భద్రచారుంచ సుదేష్ణాంచ।
పరశుశ్చారుగుప్తశ్చ చారుభద్రం సుచారుకమ్।

సంస్కృతాంధ్ర హరివంశములందు, వాయు మత్స్య పురాణములందు చారుభద్ర నామము గలదు

సంస్కృత మహాభారతములో చారుభద్ర, చారుచంద్ర నామములలో ఏ నామము కానరాదు ఇతర గ్రంథములలో రుక్మిణీ పుత్త్రులయందు 'చారుచంద్ర' లేక 'చారుభద్ర' నామము కన్పట్టుచున్నది

చెన్నమరాజు ఈ నామముయొక్క భాగవతములోని ఉనికి నాధారముగా తీసికొని తన స్వీయకల్పనాచాతుర్యముతో చారుచంద్రోదయ మను ప్రబంధమును సృష్టించినట్లుగ తోచుచున్నది

## 6. కథాసంవిధానము

ఆంధ్ర ప్రబంధవాఙ్మయమునందు కావ్యాది పద్యములనుండి కావ్యేతి వృత్తమును సూచించుట ఆచారమైయున్నది ఈ సంప్రదాయము ననుసరించియే చెన్నమరాజు ప్రథమపద్యమునందు రుక్మిణీకృష్ణుల శృంగారమును సూచించినాడు

శ్రీమత్కౌస్తుభదీప్తినవ్యవనితాశ్లేషాంగరాగంబుగా
భామారత్నము రుక్మిణీరమణి లో భావించి వీక్షింప నీ
పై మద్భావఘనానురాగమిదె పైఁబాటిల్లునంచున్ నయ
స్థేమన్ వేడ్కయొనర్చు యేలు కుశలున్ శ్రీకృష్ణు సేవించెదన్
— 1 ఆ : 1 ప

ఇతర సపత్నులను తలపక పట్టమహిషియు, కావ్యనాయక యగు చారు చంద్రుని తల్లియైన రుక్మిణితోడి శృంగారము మాత్రమే చెప్పుటవలన చెన్నమరాజు నిగూఢముగ రుక్మిణీ సుతుడైన చారుచంద్రుని చరిత్రమను కావ్యార్థమును సూచించినాడు

సర్వసాధారణముగ ప్రబంధము లన్నిటియందును కథయంతయు ముఖ్య పాత్రచుట్టును అల్లబడును శృంగార ప్రబంధమైన నాయికా నాయకుల శృంగార

షము, వీరరసప్రధాన ప్రబంధమైన నాయక ప్రతినాయకులయొక్క చరిత్రను ప్రధానముగ తీసికొని యితర రసములను కథానుకూలముగ పోషించుట సంప్రదాయమై యున్నది కాని అనేక ప్రబంధములయందు ఈ ఆచారము పాటింపబడలేదు ఈ నియమోల్లంఘనమునకు ఉదాహరణములు మనుచరిత్ర, సాంబోపాఖ్యానము మొదలగునవి చెన్నమరాజు మాత్రము ఈ నియమము నుల్లంఘింపక కథను సంపూర్ణముగ చారుచంద్రునిగూర్చియే చెప్పినాడు ఇంకను ఈ ప్రబంధము నందు ఒక విచిత్ర నిర్మాణము కనిపించుచున్నది ఇతివృత్తము కథ రెండు భాగములుగ విభజింపబడినది మొదటి భాగము వీరరస ప్రధానము పుష్కర సంహారముతో నిది ముగియును రెండవ భాగమంతయు శృంగారరస ప్రధానము ఇది కుముద్వతీ చారుచంద్రుల కళ్యాణముతో ముగియును త్రికాలవేది యను ఒక కీరమును సృష్టించి ఈ రెండు కథల ఆద్యంతములను చక్కగ కల్పించాడు

ఆంధ్ర ప్రబంధములన్నిటి యందును పాత్రలు ఒకే స్వభావమును కలిగి యున్నవి పరిస్థితుల ప్రభావమువలన భిన్నముగా నుండవలసిన పాత్రముల శీలము ఈ ప్రబంధములయందు ఒకె విధముగ నున్నట్లగుపడును మఱియును కావ్యత్వ సంపాదనకై సృష్టింపబడిన వర్ణనాదులవలన కథ లోపించుచున్నది మఱియును కావ్య లక్షణములగు పుర శైలాది వర్ణనలు కథావేగమున కడ్డంకి యగుట ప్రబంధములందు సామాన్యమైనది సందర్భోచిత వర్ణనలు అరుదుగా కనపడుచున్నవి చెన్నమరాజు కూడ ఈ విధమైన పోకడలకు అతీతుడు కాడు

ముందు చెప్పిన విధముగ చారుచంద్రోదయము కథా నిర్మాణమునందు ఒక క్రొత్తపోకడ కనిపించుచున్నది ఆద్యంతము బిగువు సడలనీయక కథ చక్కని వేగముతో నడపబడెను ప్రథమమున రుక్మిణి మనస్సునందు కల్గిన పుత్రోదయ వాంఛను శ్రీకృష్ణునకు తెలుపుటతో కథకు బీజము నాటబడినది 'దానవభేదన స్ఫురణఁ దంద్రునిఁబోలెడు' కుమారుడు కావలెనని కోరుటతో ముందు జరుగబోవు పుష్కర సంహారము సూచింపబడినది తరువాత చారుచంద్రుని జననము. బాల్య క్రీడలు యౌవనాగమనము త్వరితగతిని ప్రథమాశ్వాసమున చెప్పబడినవి ఇందు అవతారపురుషుడైన శ్రీకృష్ణునియొక్క శృంగారము లేశమాత్రముగ చెప్పి కథాగమనమునకు అడ్డంకి లేకుండ చేసెను

ద్వితీయాశ్వాసమున గ్రీష్మఋతు వర్ణన, చారుచంద్రుడు చెలికానితో రైవతక పర్వతప్రాంతమునకు విహారమునకు చనుట, దేవేంద్రుని దూతగ శాంతభూషణుడను సిద్ధుడు ప్రత్యక్షమగుట, ఈశ్వరవరప్రసాదుడగు పుష్కరుని యాగడములు తెలుపుట, సిద్ధుని సహాయముతో చారుచంద్రుడు పుష్కరుని సంహరించుట, దేవేంద్రుడు మెచ్చి త్రికాలవేదియను మహిమాన్వితమైన కీరమును ప్రసాదించుట, కుముద్వతి యను కన్య చారుచంద్రుని వరించునని అతనికి తెల్పుట, రత్నకేతన

పురాధీశుడగు పద్మాకరుడు కపింజరు డను మౌని ఆశీర్వాదముతో సంతాన ప్రాప్తికై తపస్సున కేగుట మొదలగునవి చెప్పబడినవి

ఈ ఆశ్వాసమునందు నగ, ఋతు, పుర, యుద్ధ వర్ణనలు సందర్భోచితముగ చెప్పబడినవి కాని యుద్ధవర్ణనము పేలవముగా నున్నది ఇందువలన చెన్నమ రాజు ఈ ప్రబంధమును శృంగారరసప్రధానముగ చేయ తలపెట్టినట్లు స్పష్టము అందువలననే వీరరసప్రధానమైన యుద్ధమున కంతగా ప్రాముఖ్య మీయలేదు అయినను ముఖ్యమైన ఈ ఆశ్వాసమున కథాగమనము కుంటుపడనీయక ఉచితమైన వర్ణనలతో నింపినాడు

తృతీయాశ్వాసమున పద్మాకరుని తపోమహిమకు వెఱచి దేవేంద్రుడు రంభ, ఊర్వశి, శశిరేఖ మొదలగు దేవవేశ్యలను తపోభంగమునకు పంపుట, వారల ప్రయత్నములు వృధాయగుట, ఇంద్రుడు విష్ణుమూర్తిని శరణు వేడుట, శ్రీమహావిష్ణువు పద్మాకరునకు ప్రత్యక్షమై అతనికి సంతానప్రాప్తి కలుగునట్లు వర మిచ్చుట, పద్మాకరుని భార్య గర్భము ధరించి కుమారుని, కుమార్తెను ప్రస వించుట, కుమార్తెకు కుముద్వతియను నామకరణమొనర్చుట, ఆమె బాల్య యౌవన వృత్తాంతములను కీరము తెలుపుట, చారుచంద్రుడు కీరమును కుముద్వతీ దర్శనము కలిగింపుమని అర్థించుట, కీరము అతనిని రత్నకేతన పురమునకు చేర్చి తన మాయాజాలముతో కుముద్వతీ చారుచంద్రులకు ఒండొరుల దర్శనభాగ్యము కలుగ జేయుట, చిలుక తన చతురతతో కుముద్వతి నాకర్షించి హరిసుతునియందు విరహము జనింపచేయుట మొదలగునవి వర్ణింపబడినవి

ఈ ఆశ్వాసమంతట శుకము ముఖ్య పాత్రధారిగ నున్నది ముందుగా శుకముచే పద్మాకరుని తపోమహిమ, కుముద్వతీ జనన బాల్య యౌవన వృత్తాంత ములు చెప్పబడినవి ఇందు కుముద్వతీవృత్తాంతము నాయికసంబంధి యగుటచే ముఖ్యమై యున్నది కాని పద్మాకరుని తపోమహిమ, దానికి వెఱచి ఇంద్రుడు దేవవేశ్యలను పంపుట, తరువాత ఇంద్రుడు విష్ణువు వలన తపఃకారణ మెఱిగి తన లోకమున కేగుట మొదలగు వృత్తాంతమంతయు కథావేగమునకు ఏ మాత్రము దోహదకారిగాలేదు ప్రబంధ లక్షణములను పోషించుటకు మాత్రమే యిది యంతయు సృష్టించబడినట్లు కనబడుచున్నది తరువాత తృతీయాశ్వాసమునందు చిలుక దౌత్యము అతి మనోహరముగ వర్ణింపబడినది చిలుక రత్నకేతనపురమున తన మాయాజాలముతో ఒక బంగారు పావురమును సృష్టించి చారుచంద్రుని నుండి చెలికానిని వేరుచేయుట, చివరకు చిలుక వారిరువురి నడుమ దౌత్యము నడిపిన తర్వాత మరల చెలికానిని చారుచంద్రునితో కలుపుట, చెన్నమరాజున ౦ గల కథా నిర్మాణకౌశలమును తెలుపుచున్నది

ప్రభావతీ ప్రద్యుమ్నము లోని శుచిముఖి వలెనే చారుచంద్రోదయమునందు త్రిశాలవేది ముఖ్యపాత్ర వహించినది ఇంద్రునిచే చారుచంద్రునకు బహూకరింపబడుటలో దాని దైవత్వము చెప్పబడినది మఱియు తన నామము సార్థక మొనరించుకొనునట్లుగ చారుచంద్రునకు భవిష్యత్తును తెలుపును తన మహిమచే చారుచంద్రుని అదృశ్యునిగా చేసి కుముద్వతీ దర్శనము కలిగించును చతురోక్తులలో కుముద్వతి నాకర్షించి తన రాకకు గల కారణమును సందర్భోచితముగ చెప్పును ఈ విధముగ చెన్నమరాజు చిలుక రాయబారమును కథయందు చొప్పించి కుముద్వతీ చారుచంద్రులయందు రాగాంకురించును నాటెను

చతుర్థాశ్వాసమునందు చారుచంద్రుడు చెలికానికి కుముద్వతి సౌందర్యమును వర్ణించుట, చారుచంద్రుడు కీరముతో ద్వారావతీనగరమునకు తిరిగివచ్చుట, ద్వారకానగరమున చారుచంద్రుని విరహము మఱియు రత్నకేతనపురమున కుముద్వతి విరహము వర్ణింపబడినవి

ఈ ఆశ్వాసమంతయు శృంగారరస ప్రధానమైనది ముఖ్యముగ నాయికా నాయకుల విరహమును, విరహిణి యగు నాయికకు చెలికత్తెలు చేయు శైత్యోపచారములు చెప్పబడినవి మరియు ప్రబంధలక్షణమగు మన్మథోపాలంభనము మొదలగునవి సందర్భోచితముగ చెప్పబడినవి

పంచమాశ్వాసము కూడ కుముద్వతి విరహముతో మొదలగును తరువాత కుముద్వతీ చారుచంద్రుల వివాహము, పద్మాకరుడు కుముద్వతికి బుద్ధులు చెప్పి అత్తింటికి పంపుట ద్వారకానగరమున కుముద్వతీ చారుచంద్రుల కేళీక్రీడలతో ఈ ప్రబంధము సమాప్తియగును

చెన్నమరాజు ఈ ప్రబంధరచన యందు రసప్రకటనమే ముఖ్యోద్దేశముగ తీసికొనక కథాసంవిధానమునకు కూడ ప్రాముఖ్యము నిచ్చియున్నాడు ఇతర ప్రబంధములవలె కాక అష్టాదశ వర్ణనములును, ఇతర రసములను ప్రకటించుటకై భిన్న భిన్న కథలను ప్రవేశపెట్టి కథాసంవిధానమును లోపభూయిష్ఠము కావింపలేదు అట్లని అష్టాదశవర్ణనలు విడువలేదు ఇందు శృంగారవీరబీభత్సరౌద్ర అద్భుత రసములు సందర్భోచితముగ చక్కగ పరిపోషింపబడినవి శృంగారమునకు అత్యంతప్రాముఖ్యము ఈయబడినది చెన్నమరాజు 'కథాసంవిధానము మొత్తము మీద చిలుక రాయబారమునకు ప్రాముఖ్యము కలదు

పక్షులను ముఖ్యపాత్రధారులుగ చేసి కథను రసవత్తరముగ నడిపించు ఆచారము కావ్యములందు అనాదిగ వచ్చుచున్నది మహాభారతములోని 'నలోపాఖ్యానము' నందు హంస రాయబారము కలదు అది శ్రీహర్షుని 'నైషధీయ చరితము' నందు, శ్రీనాథుని శృంగార నైషధము నందు మరింత రసవత్తరముగ

మున్నది తదుపరి వెన్నెలకంటి అన్నయ 'షోడశకుమార చరిత్రము' నం. మాదయగారి మల్లన 'రాజశేఖరచరితము' నందు చిలుక రాయబారము కలదు మఱల పింగళి సూరన 'ప్రభావతీ ప్రద్యుమ్నము' నందు హంసరాయబారము కలదు ఇందలి శుచిముఖి పాత్ర సూరనార్యుని కావ్యసృష్టికే మణిమకుటమై యున్నది అద్దంకి గంగాధరుని 'తపతీసంవరణోపాఖ్యానము', చెన్నమరాజు 'చారుచంద్రోదయము', కామేశ్వరకవి 'సత్యభామా స్వాంతనము', ముద్దుపళని 'రాధికాస్వాంతనము', తిరుపతి వేంకటేశ్వరకవుల 'లక్షణా పరిణయము', వల్లూరి నృసింహాని 'నాగ్నజితీపరిణయము' మున్నగువానియందును చిలుక రాయబారములు కలవు

నైషధమునందలి హంసపాత్ర పింగళి సూరనార్యుని ఎంతగనో ప్రభావితము చేసియుండును కావుననే 'ప్రభావతీప్రద్యుమ్నము' నందలి శుచిముఖి పాత్రకు ఎన్నియో మెరుగులు దిద్ది ప్రేమ సంధానమునకు, రాక్షస సంహారమునకు ముఖ్యపాత్రగ సృజించెను ఇదే ప్రభావమునకు లోనై ఇతర ప్రబంధముల యందు చిలుక రాయబారము సృష్టింపబడినది బహుశ హంస వాక్చాతుర్యము గలిగియుండుట అసహజముగ తోచి చిలుక పాత్రను ప్రబంధ కవులు ప్రవేశపెట్టి యుండవచ్చును చిలుక మాటాడుట యందే మాత్రము అనౌచిత్యము లేదు గాన రస రసపోషణకై అనేక విద్యలందు నిష్ణాతయైన చిలుక పెక్కు ప్రబంధములయందు దౌత్యము నడిపినది

వెన్నెలకంటి అన్నయామాత్యుని 'షోడశకుమారచరిత్రము లో షష్ఠా శ్వాసమునందు ఒక చిలుక గలదు పింగళి సూరనార్యుని హంసకును, ఈ చిలుకకును పోలికలున్నవి రెంటికిని గురువు భారతియే అన్నయకవి తన చిలుక పాండిత్యమును ఈ విధముగ చెప్పినాడు-

అష్టభాషల మధురాశువిస్తరచిత్ర
కవితలు చెప్పు సత్కవులు మెచ్చ
నామ్నాయములు నాల్గు నంగంబు లాఱును
నఖిల శాస్త్రంబులు నవగతములు
నూతనరీతుల ధాతువిభ్రమముల
రసములు మెఱయు వర్ణకము వాడు
నే పురాణంబుల నేకథ యడిగినం
దడఁబాటులేక యేర్పడఁగఁ జెప్పు

నోలి నవధానములు వేనవేలు సూపు
శబ్దవిజ్ఞానినై నను సరకుగొనదు
గౌతమునినైనఁ దొడరి తర్కమున గెలుచు
నవదరింపు మీ కీరంబు నవనినాథ —పు 82. 13 ప.

ప్రభావతీ ప్రద్యుమ్నమున ప్రద్యుమ్నుని రూపమును స్వప్నమున ప్రభావతికి పార్వతీదేవి చిత్రఫలక రూపమున చూపించినది హంస ఆ రూపము ప్రద్యుమ్నునిదిగా ప్రభావతికి పోల్చి చెప్పినది షోడశకుమార చరిత్రయందు చిలుక నాయకుని రూపమును నాయికయగు హంసావళి విహరించు నాట్యమంటప మందలి కుడ్యభాగమున వ్రాసి నాయికకు కుతూహల మేర్పడిజేయును నాయికచే ఈ రూపముగల పురుషుడున్నాడా యని అడిగించుకొని నాయకుడగు కమలాకరుని వృత్తాంతమును తెల్పును తదుపరి నాయిక దూతగ కమలాకరుని యొద్ద కేగి హంసావళి రూపురేఖాదులను వర్ణించి కమలాకరుని సమ్మోహితుని చేయును ఇందలి చిలుకపాత్ర ఒక ఆశ్వాసమునకు మాత్రమే పరిమితమయి యున్నను, రూపకల్పన మందు సూరనార్యుని శుచిముఖి పాత్రకు ఒరవడిగ నున్నది ఇతర ప్రబంధములలోని చిలుక పాత్రలకు భిన్నముగ ఇందలి కీరపాత్ర పోషింపబడినది ఇందలి చిలుక ముని శాపవశమున కీరముగా మారిన వివేకనిధియను కమలాకరుని మిత్రుడు ఒక సిద్ధుని చేతిలో నాయికానాయకుల చిత్రపటములు చూచి వారిరువురి పరిణయమునకు సిద్ధునిచే ప్రోత్సహింపబడి తనకు తానుగ రాయబారము నడిపెను అన్నయ ఈ సృష్టి అద్భుతము సందర్భమునకు సరిపడినంతగ, క్లుప్తముగ, కథాగమనమునకు దోహదకారిగ ఈ పాత్రను సృష్టించినాడు నాయికా నాయకులను కలుపుటకు ఒక దూత అవసరము గదా! కథయందు తప్పిపోయిన వివేకనిధిని కమలాకరునితో కలుపుటకూడా అంతే ఆవశ్యకమై యున్నది ఈ రెండు కార్యములను ఒకే పాత్రను సృజించి అద్భుతముగ మేళవించినాడు అంతేగాక కమలాకరునికి హంసావళినిగురించి తెలియజేయగనే శాపవిమోచనము కలుగునట్లు చేసినాడు వినుకలితో నాయికా నాయకుల కలయికకు త్రోవ చూపించి చిలుకపాత్రను ఉపసంహరించినాడు ఇందుకూడ చిలుక అన్ని కళలందును నిష్ణాతగను సరస్వతీ దేవి యొద్ద సకల విద్యలు నేర్చినట్లుగను చెప్పబడినది

మాదయగారి మల్లనచె రచింపబడిన 'రాజశేఖర చరిత్రము'న కల్పనా చాతుర్యము అంతగా లేకపోయినను చిలుక రాయబారము రమ్యముగా నున్నది సూరనార్యుని శుచిముఖికి ఈ చిలుక గురువుగా చెప్పుకొనవచ్చును శివవరప్రసాది యగు రాజశేఖరుడు విశంకటాసురుని ఓడించినపుడు కాళికాదేవి అనుగ్రహించి ఒక రాచిలుకను బహూకరించును ఇందలి కీరరాజము పూర్వగాథలు తెలుపగల శక్తిగల

దనియు, భూత భవిష్యద్వర్తమానములు తెలిపి వినోదము కలిగించగలదనియు చెప్పబడినది ఈ చిలుక రాజశేఖరుని దూతగా సింధురాజపుత్త్రిక యగు కాంతిమతియొద్ద కేగి రాజశేఖరుని గుణగణాదులను కీర్తించి సింధురాజును మెప్పించి నాయికానాయకుల సమాగమమునకు కారణభూత మగును ఇందు చిలుక సరస్వతీ దెవి తనకు త్రికాలవేది యను బిరుద మిచ్చినట్లుగను ఆ దేవి ముంజేతి చిలుక యొద్ద సర్వవిద్యలు నేర్చినట్లుగను సింధురాజుతో చెప్పి కొంత ఆత్మస్తుతికి పూను కొనినది వేదశాస్త్రాది చర్చలలో వేదవ్యాసులతోనైన వాదించగలననియు 'నా మాటలనేర్పు నాకే చెల్లును అని అనుకొనుటకు సిగ్గుచున్నది సుమా!' అని చెప్పు కొనును దూతకు ఆత్మస్తుతి ఔచితీభంగము కలిగించుచున్నను స్వీయ కార్య సాధనకు దోహదకారి యగుచున్నది అపరిచిత వ్యక్తితో మాటాడునపుడు స్వీయ చరిత్రమును చెప్పుకొనక తప్పదు

ఇక అద్దంకి గంగాధరుడు రచించిన 'తపతీసంవరణోపాఖ్యానము' నందు ఒక చిలుక యున్నది ఇందలి చిలుక దౌత్యమున విశిష్టత అంతగా కనపడదు. సూర్యపుత్త్రిక యగు తపతియొద్ద విద్యలు నేర్చిన ఈ చిలుక తపతీ పరిణయో న్ముఖియై దివ్యలోకములందు తగిన వరుని గానక భూలోక మెల్లెడల తిరిగి కరిపురా ధీశుడగు సంవరణుడే తగిన వరుడని నిశ్చయించి వారిరువురికి దౌత్యము నడిపెను ఇందలి శుకముకూడ సకలవిద్యాపారంగతురాలు

ఆఱంగములతోడఁ బారంగతంబుగా
　　నిగమముల్ సరహస్యముగను జదివి
కావ్యజాలములలంకారమిశ్రంబుగాఁ
　　గరతలామలకంబుగా నొనర్చి
భాష్యఫక్కికపారపాతంజలజలంబు
　　లాలాజలంబుగా లీలఁగ్రోలి
మీమాంసలేకుండ మీమాంసయుఁ బరించి
　　బ్రహ్మసాక్షాత్కారభావమంది
పేరుబలమునఁ దత్త్వవిచారగరిమి
శుకమహాద్విజముఖ్యుల్ సూడు వట్టి
యున్న నాకిఁక నితరాంధ్రయుక్తి యెంత
హస్తిపదమున నడఁగ వేయడుగులెల్ల —పు. 22:38 ప.

తత్త్వవిచారము నందు పేరుబలమున శుకమహర్షితో సమానమైన దానవని చెప్పుకొనినది

చెన్నమరాజుచె రచింపబడిన చారుచంద్రోదయ మహాప్రబంధము నందు విశిష్టమైన చిలుక రాయబార మున్నది ఇందలి చిలుకకు పింగళి సూరన హంసకు కొన్ని పోలిక లున్నవి ముఖ్యముగా రెంటికిని నామధేయము లున్నవి సూరనార్యుని హంస పేరు శుచిముఖి చెన్నమరాజు చిలుక పేరు త్రికాలవేది శుచిముఖి పద్మజుని వాహనమైన సారంగధరు డను మరాళరాజు పుత్త్రిక కావున దివ్యహంసి చారుచంద్రోదయము నందలి త్రికాలవెది పార్వతీదేవి పెంపుడు చిలుక తారకాసురుని వధించిన కుమారస్వామిని మెచ్చి దేవేంద్రుడు దేవసేన యను కన్యక నిచ్చి వివాహము చేసిన సమయమున పార్వతిదేవి శచీదేవికి బహుమతిగా ఈ త్రికాలవెది యను శుకము నిచ్చెను శుచిముఖి వలెనే త్రికాలవెది కూడ ఇతరులచే నడిగించుకొనిగాని తన అంతరంగమును తెలుపదు ఈ కీరమున కొక ప్రత్యేకత యున్నది ఇతర ప్రబంధము లందలి దూతలైన తిర్యక్కులవలె ఈ త్రికాలవేది ఎచ్చటను ఆత్మస్తుతికి పూనుకొనదు దూత కుండవలసిన వాక్చాతుర్యము, సమయస్ఫూర్తి, పాండిత్యము ఆత్మశ్లాఘోల్లంఘనము మున్నగు గుణము లన్నియు ఈ త్రికాలవేది యందున్నవి అంతేగాక దైవదత్త మగుట వలన 'అంజనాకర్షణాదృశ్యమంజుకళల' ప్రసిద్ధురాలు ఇంకను చెన్నమరాజు త్రికాలవేది యొక్క గుణగణము లన్నియు ఇతర పాత్రలచే శ్లాఘింపచేసినాడు ఎచటను ఆత్మస్తుతికి పాల్పడనీయ లేదు

పుష్కర సంహారానంతరము చారుచంద్రునకు కీరమును బహూకరించుచు ఇంద్రుడు ఈ విధముగ చెప్పెను-

కీర మొక్కటిఁ జూపి యా కీరరాజ
మంజనాకర్షణాదృశ్యమంజుకళల
వెలసియుండుఁ బేరు త్రికాలవేదియంద్రడు
శుభముఁ జేకూర్చు నిది మది సొంపుమీఱ

—చా.చం 2 ఆ. 63 ప.

తదుపరి చారుచంద్రుడు కీరమును స్తుతించి తనకు జరుగబోవు భావిశుభమును తెలుపుమని కోరిన పిదపగాని కుముద్వతి యను కన్య నిన్ను వరించునని తెలుపదు

అర్ణోరాశిపరీతభూభువన చర్యల్ నీకుఁ బ్రత్యక్షముల్
కర్ణానందములైన సత్కథలకున్ గాణాచి నీ జిహ్వ వి
స్తీర్ణాశేషకళల్ కరస్థితములై చెన్నొందు నీయందు నిన్
వర్ణింపందరమా సుధాతిరుచి హేవాకీరమా కీరమా

—చా.చం. 2 ఆ: 68 ప

నీవు త్రికాలజ్ఞానివి
నీవలనం దెలియవలయు నిఖిలార్థంబుల్
భావించి తెల్పు మా కొక
భావి శుభంబిపుడు సరసభాషాప్రౌఢిన్

—చా. చం. 2 ఆ: 69 ప

అనిన శుకంబు పల్కు మనుజాధిప ! విష్ణువరప్రసాదసం
జనితకురంగనేత్ర కులశైలపయోధరకుంజరేంద్రగా
మిని కులిశాశ్మదంతగణమేచకకేశ కుముద్వతీసమా
ఖ్యను జెలువొందు నొక్కనృపకన్యక నిన్ను వరించువేడుకన్

—చా.చం. 2 ఆ: 70 ప

కుముద్వతీ వృత్తాంతవిశేషములను కూడ చారుచంద్రునిచే మరల అడిగించు కొనిగాని చెప్పలేదు

అన విని హరితనయుఁడు త
ద్వనితామణి విష్ణువరము వలనఁ గలుగుటన్
వినిపింపుమనినఁ గీరం
బనుపమ గంభీరఫణితి నతనికి ననియెన్

—చా. చం. 2 ఆ: 71 ప

ఇట్లే ఉద్యానవనమున విహరించుచున్న కుముద్వతిని తన చేష్టలతో నాక ర్షించుకొని ఆమెచే అడిగించుకొనిన తదుపరి మాత్రమే తన వృత్తాంత మామెకు తెలిపెను.

ఎచట నేరాజు గృహసీమ నెలమి నుందు
విచటి కిప్పుడు రాఁ గతమెద్ది నీకు
నీదు విధమెల్ల వివరింపు నెమ్మితోడ
సుతనురుచిజితమరకతాంశుకమ! శుకమ!

—చా. చం 3 ఆ· 140 ప.

ఇట్లు ప్రతివారును తన్ను పొగడి తనచే చెప్పించుకొనవలెనేగాని తనకుతానై ఎవ్వరి కేవిషయమును చెప్పలేదు అంతేగాక త్రికాలవేదికి గల సమయస్ఫూర్తి అద్భుతము రత్నకేతన పురోద్యానవనమున కుముద్వతిని చారుచంద్రుడు అదృశ్యరూపుడై చూచునపుడు నాయకునకు ఏకాంతమును కలుగజేయుటకై చెలికానివి బంగారు పావురపు మిషపై దూరమునకు పంపును ఇంకను నాయికకు నాయకుని గూర్చి చెప్పునపుడు చారుచంద్రుని భుజశౌర్యపరాక్రమాది గుణములకు సంతోషించి తానే తగు కన్యకను వెదకుచుంటినని చెప్పుకొనినది చారుచంద్రుని పనుపుపై తాను వచ్చినట్లు చెప్పలేదు

నాయికానాయకుల ప్రణయావిర్భావము ప్రబంధలోకమున రెండు విధములుగా జరుగుచున్నది 1 కనుకలి 2 వినుకలి ఈ రెండు విధములైన ప్రణయావిర్భావమునకు త్రికాలవెది చారుచంద్రోదయము నందు మార్గదర్శియైనది నాయికా నాయకులు ఇరువురికి వినుకలి ద్వారా ప్రణయోత్సుకత కలిగించును చారుచంద్రుని అదృశ్యునిగా జేసి ఉద్యానవన విహారము చేయుచున్న కుముద్వతిని చూపించును కుముద్వతికి అంజనము తీర్చి చారుచంద్రుని చూపించును మఱియు విరహపీడితుడైన చారుచంద్రునకు పెక్కు కథలను చెప్పి రమాపతి అతని వాంఛితార్థము తీర్చునని ఓదార్చుటతో త్రికాలవేది పాత్ర ముగియును

త్రికాలవేది పాత్రమునందు ఈ విధముగ కార్యధురీణతను, సమయోచిత సంభాషణయందలి చతురతను, అంజనాకర్షణాదిమంజుకళలందు నేర్పరితనమును, మితభాషిత్వమును చెన్నమరాజు చక్కగా పోషించెను

ఇట్లే దక్షిణాంధ్రయుగమున ఆధునిక యుగమున రచింపబడిన పెక్కు శృంగారప్రబంధము లందు చిలుకదౌత్య మున్నది కామేశ్వరకవి రచించిన 'సత్యభామా స్వాంతనము' నందు నరకాసురవధార్థమై వెడలిన శ్రీకృష్ణుని వియోగము భరింపలేక విరహిణియైన సత్యభామ శ్రీకృష్ణుని కడకు తనను తీసికొనిపొమ్మని చిలుకద్వారా రాయబారము పంపును ఇటులనే 'రాధికా స్వాంతనము' నందు కూడ విరహిణి యగు రాధిక శ్రీకృష్ణునకు చిలుకతో తన సందేశమును పంపును

తిరుపతి వేంకటేశ్వర కవులు ఆశువుగా చెప్పిన మూడాశ్వాసముల ప్రబంధ మగు 'లక్షణాపరిణయము' నందు శుకదౌత్యమున కధికమైన ప్రాధాన్య మున్నది నారదుని వలన విని శ్రీకృష్ణుని కోరి లక్షణ చిలుకతో స్వయంవరమునకు శ్రీకృష్ణుని ఆహ్వానించును చిలుక తన నేర్పుతో శ్రీకృష్ణుని మెప్పించి కార్యసానుకూలత కలుగజేయును

ఇట్లు పెక్కు ఆంధ్రప్రబంధములయందు పక్షులు ప్రముఖపాత్రలను నిర్వహించి యున్నవి అన్నిటను ప్రభావతీ ప్రద్యుమ్నము నందలి శుచిముఖి పాత్ర చిత్రణ అత్యున్నతసాయికి చెందినది 'షోడశకుమార చరిత్ర' యందలి శుకము గ్రంథ మందు అతిస్వల్పపాత్ర వహించినను ఒక ప్రత్యేకత పొందినది చారు చంద్రోదయమునందలి త్రికాలవేది పాత్రచిత్రణమును చెన్నమరాజు అత్యంత సమర్థముగా చేసినాడు దైవదత్తమైనందువలన దివ్యశక్తులు కలిగియుండుటచే ఈ చిలుక నేర్పరితనము కొంత మఱుగుపడినను మొత్తము మీద చెన్నమరాజు చిలుకకు గల సమయస్ఫూర్తి, వాక్చాతుర్యములను స్పష్టముగ చూపించినాడు

# ద్వితీయ ప్రకరణము

## ఛందోవ్యాకరణాలంకార విశేషములు

### ఛందో విశేషములు

చారుచంద్రోదయములోని యైదాశ్వాసము లందును మొత్తము 747 గద్య పద్యములున్నవి ఇందలి వృత్తాదుల వివరణము క్రింది పట్టికలో చూపబడినది

| పద్యనామము | ప్రథమ | ద్వితీయ | తృతీయ | చతుర్థ | పంచమ | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| శార్దూలము | 9 | 4 | 10 | 5 | 6 | 34 |
| మత్తేభము | 14 | 15 | 14 | 16 | 18 | 77 |
| ఉత్పలమాల | 15 | 25 | 14 | 10 | 13 | 77 |
| చంపకమాల | 16 | 14 | 21 | 28 | 16 | 95 |
| సీసము | 42 | 32 | 27 | 20 | 20 | 141 |
| కందము | 49 | 47 | 32 | 24 | 34 | 186 |
| తేటగీతి | 14 | 7 | 17 | 17 | 11 | 66 |
| ఆటవెలది | 1 | 4 | 2 | 1 | 2 | 10 |
| తరలము | – | – | 1 | – | – | 1 |
| మాలిని | 1 | – | – | – | 1 | 2 |
| కవిరాజ విరాజితము | – | 1 | 1 | – | – | 2 |
| దండకము | – | – | 1 | – | – | 1 |
| పంచచామరము | – | 2 | – | – | – | 2 |
| రగడ | – | – | – | 1 | – | 1 |
| స్రగ్విణి | – | – | 1 | – | – | 1 |
| మత్తకోకిల | – | – | – | 1 | – | 1 |
| ద్వివిధ కందము | – | – | – | – | 1 | 1 |
| గద్యము | 12 | 11 | 12 | 5 | 9 | 49 |
| మొత్తము | 173 | 162 | 153 | 128 | 131 | 747 |

చెన్నమరాజు వాడిన పద్యముల మొత్తము వృత్తముల సంఖ్య 292 జాతులు 188, ఉపజాతుల సంఖ్య 217 మొత్తము పద్యములు 698 చెన్నమరాజు ఉపయోగించిన విశేషపద్యములలో పంచచామరము, కవిరాజవిరాజితము, మత్తకోకిల, రగడ, తరలము, స్రగ్విణి, మాలిని, దండకము లున్నవి ఈయన ధూర్జటి రచించిన 'శ్రీకాళహస్తి మాహాత్మ్యము' నందువలెనే విధిగ సీసపద్యముల క్రింద తేటగీతి పద్యములను వాడినాడు

## కవిరాజ విరాజితము :

చెన్నమరాజు తన 'చారుచంద్రోదయము' నందు రెండు 'కవిరాజ విరాజిత వృత్తము'లను రచించినాడు కవిరాజవిరాజిత వృత్తమునకువిన్నకోట పెద్దన, అనంతుడు, అప్పకవి, చిత్రకవి పెద్దన మొదలగు లాక్షణికు లందరు 8-14-20 వ అక్షరములుయతి స్థానములుగ పాదమునకు మూడు యతి మైత్రులు పేర్కొనిరి రంగకవి మాత్రము 14 వ అక్షరమునకు మాత్రమే యతిమైత్రి చెల్లునని చెప్పెను 'లక్షణదీపిక' యందు రెండు మతములు పాటింపవచ్చునని కలదు నన్నయ భారతము, మనుచరిత్ర, విక్రమార్క చరిత్ర, మార్కండేయపురాణము, అనిరుద్ధ చరిత్ర, చంద్రికాపరిణయము, ఇందుమతీ పరిణయము, కళాపూర్ణోదయము మొదలగువానియందు ఒక్క యతిమైత్రినే పాటించిరి ఉత్తర రామాయణమునందు మూడు యతి మైత్రులు పాటించెను తిక్కన మాత్రము ఉభయ మతములను అనుసరించెను తిక్కన మాదిరిగనే చెన్నమరాజుకూడ రెండు మతముల ననుసరించాడు

'సలలితలక్షణ! • చంద్రదరవీక్షణ • సామజ రక్షణ!
• చారుదయా

జలజజశంకర! • శక్రవశంకర • శత్రుభయంకర
• చక్రశయా

హలధరసోదర • యార్యజనాదర! • హరి గుహోదర!
• యబ్ధిశయా

విలసిత కేతన • విశ్వనికేతన! • వీక్షితపూతన!
• వీతభయా' — 2 ఆ:, 161 ప

ఈ పద్యము నందు చెన్నమరాజు 8-14-20 వ అక్షరములకు యతిమైత్రిని కూర్చి మూడు యతులను నాలుగు పాదములందును పాటించినాడు

జయ జయ పాండుర సైంధవబాంధవ • సర్వసుపర్వ
సుపర్వకరా
జయజయ నిత్యసభాజనభాజనశార్వ • రదుర్వహగర్వహరా
జయజయ చంద్రదవిరోచలోచన • సారదయారసపూరధురా
జయజయ సామజపాలన ఖేలన • చక్రధరానుత చక్రిహరీ
— 3 ఆ 72 ప

ఇందు ఒకే యతిమైత్రి 14 వ అక్షరమునకు పాటింపబడినది

## ర గ డ

కవులు దెవతాస్తుతి, వనవిహారాదు లందు రగడలను రచించుట పరిపాటి క్రింద వచ్చినది చారుచంద్రోదయకర్త పుష్పాపచయ వర్ణనకు మధురగతి రగడను రచించెను (4 ఆ , 83)

రగడలు దేశిజాతి పద్యములు తెలుగు లాక్షణికులు నవవిధ రగడలను పేర్కొనిరి ఈ రగడ భేదము లన్నియు వైతాళీయ భేదములని ఛందఃకర్త లగు చిత్రకవి పెద్దన అప్పకవి గుర్తించిరి రగడల ప్రస్తావన మొట్టమొదటిసారిగా 'ఛందోంబుధి' అను కన్నడ లక్షణగ్రంధములో నాగవర్మ చేసినాడు ఇతడు 10 వ శతాబ్దమునకు చెందినవాడు కన్నడమునందు 'రగళె' అనికలదు దానికి సంస్కృత రూపము రఘటా' అని కలదు కన్నడ రగళెలు మూడు విధములు అని-ఉత్సాహ, మందానిల, లలిత అనునవి-ఉత్సాహ -8 త్రిమాత్రాగణములు అనగా పాదమునకు 24 మాత్రలు మందానిల-4 చతుర్మాత్రాగణములు అనగా పాదమునకు 16 మాత్రలు, లలిత- 4 పంచమాత్రాగణములు అనగా పాదమునకు 20 మాత్రలు నిర్దేశింపబడెను యతిమైత్రి సగము పాదముపై చెప్పబడినది

రగడల ప్రస్తావన తెలుగు లక్షణ గ్రంధములందు తొలుదొల్త విన్నకోట పెద్దనగారి కావ్యాలంకార చూడామణి (1402-1407) యందు కలదు అదియును ఛందోభేదముల యందు పేర్కొనబడక కావ్యభేదాది ప్రకరణము నందు చెప్ప బడినది

సరియౌ పదిఱేకులచేఁ
బరువడి నుత్సాహపదయుగళముచే

నిరవగ వడి ప్రాసంబుల
నరుదుగ రచియింప రగడ యగుఁ దగువృత్తి న్ -5 అ., 40

'కవిజనాశ్రయము' నందు (1080-1150) వీని ప్రసక్తి లేదు అనంతుని 'ఛందోదర్పణము'న మొట్టమొదటిసారిగా 'నవవిధ రగడలు' ఛందోభేదములుగా చెప్పబడెను కాని కన్నడమునందు 10 వ శతాబ్దము నాటికే రగడలకు లక్షణ నిర్మాణము జరిగినది అయినప్పటికి తెలుగు లక్షణ గ్రంథములందు ఛందఃకర్తలు సుమారు 15 వ శతాబ్దమునాటి వరకు రగడలకు లక్షణముల నేర్పరచలేదు బహుశ అప్పటికి రగడలు ఆంధ్ర సాహిత్యమునందు సంపూర్ణమైన కావ్యార్హతను సంపాదింపలేకపోవుటయే దీనికి కారణమయియుండవచ్చును

12 వ శతాబ్దమునందు కన్నడ సాహిత్యము విషయములో, భాషలో, ఛందస్సులో మార్గ పద్ధతి విడనాడి, దేశి పద్ధతికి ప్రాధాన్యము నిచ్చి ఒకరకమైన స్వతంత్రమార్గము నవలంబించినది అందువలననే 12 వ శతాబ్దము కన్నడ సాహిత్యమునకు స్వాతంత్ర్యయుగమని చెప్పుదురు అప్పుడే వచనము అను సాహిత్య ప్రక్రియ, రగళ, త్రిపది, షట్పది అను అచ్చ కన్నడ ఛందములలో పెక్కు గ్రంథములు వెలసినవి పండితత్రయము వీరశైవమత ప్రచారమునకై కన్నడములో దేశి ఛందస్సును వాడి క్రాంతిమార్గమును త్రొక్కిరి

హరిహరుడు 'రఘటా' ఛందములో 'శివశరణుల రగళలు' మొదలైన కావ్య రచనలు చేసి కన్నడ సాహిత్యకర్తలకు తలమానికమైనాడు అదే శతాబ్దమునందలి పాల్కురికి సోమనాధుడు తెలుగు సాహిత్యము నందు రగడను ప్రవేశ పెట్టెను పాల్కురికి సోమనాధుడు బసవరగడ, బసవాఢ్యరగడ, గంగోత్పత్తి రగడ, సద్గురు రగడ రచించినట్లు తెలియుచున్నది కాని బసవరగడ ఒకటి మాత్రమే లభించినది

అధిగత ప్రమథగాణాప - రావతార శరణు బసవ
విధినిషేధ పుణ్యపాప - విసరదూర శరణు బసవ

ఇందు 3 మాత్రల గణములు 8 ఉపయోగించి పాదమునకు 24 మాత్రలను వాడినాడు అనగా కన్నడ రఘటలలోని 'ఉత్సాహ'కు సరిపోవుచున్నది కన్నడములోని 'ఉత్సాహ' తెలుగులోని నవవిధ రగడలలో ఒకటి అయిన 'తురగవల్గనము'నకు సరిపోవును

పాల్కురికి సోమన తరువాతవాడైన 'చక్రపాణి రంగనాధుడు'[1] 'నయనగతి రగడ'ను రచించెను

1. ఆంధ్ర కవితరంగిణి - మూడవ సంపుటము, పుట 147

కడఁగి సంసారములు కడగంటినని కంటి
కడఁగి శ్రీగిరిచెన్ను కారుణ్యమని కంటి
ఘనుఁడు రంగన దూష కరగండఁడని కంటి
జనకల్పతరులలో జయశాలియని కంటి

ఇందు 5 మాత్రల గణములు 4 చొప్పున పాదమునకు 20 మాత్ర లుపయోగించినాడు అనగా కన్నడమునందలి 'లలిత రఘటకు సరిపోవుచున్నది 'లలిత' తెలుగునందలి 'ద్విరదగతి రగడకు సమానము ఈ రగడయందు అంత్యప్రాస అంతట కలదు

సర్వసాధారణముగ తొలుత లక్ష్య మేర్పడి తర్వాత దాని ననుసరించి లక్షణ మేర్పడుచున్నది ఈ విధముగనే లక్షణ గ్రంధ నిర్మాణము జరుగుచున్నది అపుడు కావ్యకర్తలు లక్ష్యమును వదలి లక్షణమును ప్రామాణికముగ తీసికొని రచనలు చేయుదురు కన్నడ సాహిత్యమునందు ముందుగ రఘటలకు లక్షణ నిర్దేశము జరిగినది ఈ కన్నడ రఘటలను ఆధారముగ చేసికొని పాల్కురికి సోమన, చక్రపాణి రంగనాధుడు తెలుగునందు రగడలను సృష్టించి యుండవచ్చును

అనంతామాత్యుడు తొమ్మిది రగడలకు లక్షణనిర్దేశము చేసినాడు అవి పరిశీలించిన 3, 4 5, 7 మాత్రలు గల గణములతో ముఖ్యమైన నాలుగు రగడ భేదములు

హయప్రచారము

మధురగతి

ద్విరదగతి

హరిణగతి – వరుసగ ఏర్పడును ఈ రగడలు సంగీతశాస్త్రానుబద్ధముగ త్రిస్ర, చతురస్ర, ఖండ, మిశ్రగతులలో తాళాన్వయముగ సాగును ప్రధానమైన యీ నాలుగు రగడలను రెట్టింపుచేయుటవలన

తురగవల్గనము

హరిగతి

విజయభద్రము

వృషభగతి– అను నాలుగు రగడభేదము లేర్పడును మిగిలిన 'విజయమంగళ రగడ', 'తురగవల్గనము'నకు రెట్టింపు మిగిలిన 'హరిగతి', 'విజయభద్రము',

'వృషభగతి' రగడలను రెట్టింపుచేసి చెప్పలేదు బహుశ అట్లు చేసిన పాదములు సుదీర్ఘములగునని ఏ కావ్యకర్తయు సాహసించి యుండకపోవచ్చును కాని శ్రీనాథుని 'శివరాత్రిమాహాత్మ్యము'నందు ఇట్లు కలదు

దవుదౌ. వులఁగాం. చెంగై . లాసము ♦ తరుణేం. దు కళా
ధరునిని. వాసము. దశహరి (దవథి). స్థాన
స్థపుటిత ♦ ధవళ. చ్ఛాయా. చ్ఛేదవి. లాసము

— శి.రా.మ: 4–88

దీనిని 'తాళవృత్తమ'ని పేర్కొనినాడు ఇది 'హరిగతి రగడ'కు రెట్టింపు ప్రతి పాదమునందును 16 చతుర్మాత్రాగణము లుండును 5, 9, 13 గణముల మొదటి అక్షరములకు యతిమైత్రి చేసినాడు. ఇది లాక్షణికు లెవ్వరు చెప్పని రగడ పరిణామము

అప్పకవి తన లక్షణ గ్రంథమునందు కూడ నవవిధ రగడలనే పేర్కొని నాడు 'మధురగతి రగడ' లక్షణమందు—

నాలుగు మాత్రలు నాటిన గణములు,
నాలుగు రెంటికి నలి విరమణములు
గలసి మధురగతి కనలునుజగణము
తొలఁగిన దృతకౌస్తుభక విరమణము

— 4 అ: 486

జగణము నిషిద్ధమని స్పష్టముగ చెప్పినాడు అనంతుడు నింతటి స్పష్టత చూపలేదు కాని గగ, భ, స, నల అను నాలుగు గణములనే వాడవలయునని చెప్పినాడు అట్లే సూర్యగణములని చెప్పటచేత 'హయప్రచారము', 'తురగవల్గనము', 'విజయ మంగళము'లందు 'లగము' నిషేధింపబడినది

చిత్రకవి పెద్దనకూడ – 'జగణము చొరని చతుర్లఘుగణమటు చరణం బెనిమిదిగా'యని జగణమును హరిగతియందు ఒప్పుకొనలేదు ఈ విధముగ లాక్షణికు లందరు 'జగణము'ను, 'లగము'ను రగడలందు నిషేధించినారు

కాని కావ్యములలో రచింపబడిన రగడలలో వైలక్షణ్యము కనిపించు చున్నది లాక్షణికు లుద్దేశించిన దానికి భిన్నముగ మాత్రాసంఖ్యను మాత్రమే దృష్టిలో నుంచుకొని పూర్వకవులు రగడలను రచించినట్లు తెలియుచున్నది.

శ్రీనాధుడు 'కాశీఖండము'నందు రచించిన రగడ 'హరిగతి రగడ' అగును హరిగతి రగడకు 8 చతుర్మాత్రాగణములు పాదము నందుండవలెను అయినను కవిసార్వభౌముడు పెక్కు పాదములలో (66 పాదములలో 46 చోట్ల) మొత్తముమీద మాత్రాసంఖ్య కలిసివచ్చునట్లు రచన సాగించెను

ఉదాహరణలు .

బిందుమాధవుండను నాకెంతయుఁ
ప్రేమ కళాపాత్రము మణికర్ణిక – 9 వ పాదము
మాణికర్ణికంబగు తీర్థంబున
మజ్జనమాడిన మానవోత్తముఁడు – 15 వ పాదము
కటక హార కేయూర మేఖలా – 51 వ పాదము

వీనియందు రెండు చతుర్మాత్రాగణములకు బదులుగా 3+5 మాత్రల గణముల నుపయోగించి మొత్తము పాదమునకు 32 మాత్రలు సరిపెట్టినాడు నంది మల్లయ – ఘంటసింగయ రచించిన 'వరాహపురాణము' నందు 2 హరిగతులు, 1 మధురగతి, 1 తురగవల్గనము వాడినారు

హరిగతి

'కంరే. కాలము.దావళ. దనుజా • ఖర్వగర్వ రే. ఖాని.ర్వ్యాపక'
'పోషిత. భక్తచ పేటని. పాతిత • పూషదంతదం.
తురితర. ణాంగన'
– పంచమాశ్వాసము. 122

'పాకశాసన, ప్రముఖల. గుదిశా • పాలకు. లందరు.
నందువ. సింతురు'
– దశమా: 144

మధురగతి

తారత్తారకా • ధవధవ. కాంశుక
సారస. మృదుకర • సంభృత. సితశుక

శరణా. గతజన • సర్వసిద్ధికర
సనకా. దికహృ • త్సాధవి. హారిణి

— ఏకాదశః 26

ఈ కవులు కూడ పైపాదములలో రెండు చతుర్మాత్రాగణముల స్థానములో 5 = 3 గాని 3 = 5 మాత్రాగణముల నుపయోగించిరి పై నుదాహరించిన 'మధురగతి'యందు కొన్నిచోట్ల ఆద్యంత ప్రాసలను విడనాడినాడు దశమాశ్వాసములోని 'హరిగతి రగడ'యందు అంత్యప్రాసను పాటింపలేదు

పింగళి సూరన 'కళాపూర్ణోదయము' నందు

నిఖిలవేదవ • ర్ణితునా, రాయణుఁ
గొలిచి నిత్యము • క్తులు ప్రమ, దంబున — అష్టమః 237

రామరాజు రంగప్పరాజకవి ప్రణీతంబైన 'సాంబోపాఖ్యానము' నందు-

నినుపగు, గొజ్జగ • నీటికాలువలు
పెనుఁగొన, వనరులు • పెనుచు నీలువలు — పంచమః 317

శేషము వేంకటపతి కృతమైన 'శశాంకవిజయము' నందు-

ఇంతి' యెక్కడివె • యీ కో రకములు
చెంతనుండెని • చ్చెరకో రకములు — ద్వితీయాః 118

ఈ విధముగ వీరు మాత్రాసంఖ్యా పద్ధతినే రగడలను రచించినారు

ఇంకను పలువురు కవులు, లాక్షణికులచేత నిషేధింపబడిన 'జగణము', 'లగము'లను కూడ వాడినారు ముఖ్యముగ యీ రగడల సృష్టికర్త అయిన పాల్కురికి సోమనాధుడు తన 'బసవోదాహరణము' నందు గల 'తురగవల్గనము' నందు-

'వెండి, యునోం, కార, సార, విదిత, ముదిత, మేళ, మనకు' అను పాదమునందు 'లగము'ను ప్రయోగించినాడు పింగళి సూరన 'కళాపూర్ణోదయము' నందు కల 'మధురగతి రగడ'లో —

**'అహం క్రియాత్మకమగు శంఖంబును' —అష్టమః 238.**

**అను పాదమునందు 'జగణము' ప్రయుక్తము ధూర్జటి-**

'జయజయ. సహస్ర లింగా లయద,

రనమా. ప్రస్థిత మోదా, పాదక' – ద్వితీయాః 152

సంఖ్య 'జగణము కలదు ఈ విధముగ పెక్కురు కవులు తమ కావ్యములలోని రగడల యందు 'జగణము ను 'లగము ను కూడ వాడిరి

మొత్తముమీద పూర్వకవులలో పెక్కుమంది పాదము మొత్తమునకు గాని, సగము పాదమునకు గాని యుండవలసిన మాత్రాసంఖ్యను మాత్రమే దృష్టిలో నుంచుకొని రగడల సృష్టిని చేసినారు లాక్షణికులు చెప్పిన గణములకు గాని, పాదమునందు గణముల విరుగుడులకు గాని ప్రాముఖ్యము నిచ్చినట్లు కనిపించుట లేదు లాక్షణికులలో 'అప్పకవి మాత్రమే మాత్రాసంఖ్యకు ప్రాధాన్యము నిచ్చి నాడు అదియును హరిణ, వృషభగతులకు మాత్రమే కాబట్టి ఈ రగడల విష యమున కావ్యకర్తలకును, ఛందఃకర్తలకును పొసగకున్నది రావూరి దొరసామి శర్మగారు[1] చెప్పినట్లు రగడలకు మాత్రాసంఖ్యా పద్ధతి ననుసరించి అనుశాసనము కల్పింపవలసిన అవసరము లాక్షణికులపైని ఉన్నది

చెన్నమరాజు 'చారుచంద్రోదయము' నందలి 'మధురగతిరగడ'లో మాత్రా సంఖ్య పద్ధతిని అవలంబించినాడు ఉదాహరణ –

చిదుమంబోకు మది • చిత్తజు, తమగము
గునుకు లేటికే • కుసుమా. వళులకు
వెనుక మోసమగు • వెఱచెద. వళులకు
గంటిఁ బెట్టెదవు • కొఱగా. వలసిన
లరసి మెచ్చెనది • యామని. నలరుచు
నెన్నిలేవు మది • కేలా. గలిగెడు
నంబుజాక్షియ • ల్లదినా. కదలిక
వెంబడించకుము • విడునీ కదలిక
మనలనేలనిట • మావుల పడమట
చిగురుబోడిముఖి • సీధువు. చినుకులు
నలఁత దీర్చెఁగద • యలరుల. వలపున

1 తెలుగు భాషలో ఛందోరీతులు, పుట 188

చెలఁగి చంపకము • చెలినీ. వెదరిన
పురుడు గానమిది • భూరుహ. తిలకము — చతుర్థా: 83

ఈ విధముగ మొత్తముగ 42 పాదములలోను. పైన పేర్కొనబడిన 14 పాదముల యందును మొదటి సగమునందు రెండు చతుర్మాత్రాగణములకు బదులు 3 + 5 మాత్రాగణములను ప్రయోగించి పూర్వకవులనే అనుసరించినాడు

## దండకము

కవి ప్రయోగించిన యితర ప్రత్యేక వృత్తములలో దండక మొకటి కవులు దండకమును భగవన్నుతికి వాడిరి సాధారణముగ తెనుగునందు 'తగణ దండకము'లు ఎక్కువగ కనిపించుచున్నవి 'చారుచంద్రోదయము' నందు కూడ తగణ దండకమే దైవస్తుతికి వాడబడినది

ఇంకను మిగిలిన ప్రత్యేక వృత్తములను చెన్నమరాజు లాక్షణికుల మతముల ననుసరించి రచన చేసినాడు

## ద్వివిధకందము

గ్రంథాంతమున కవి కందపద్య రచనలో ఒక విచిత్రమైన ప్రయోగము చేసినాడు ఈ పద్యమునకు 'ద్వివిధకందము' అని పేరొసంగినాడు

వారాశి కన్యకామణీ
ధారాశాత్రాసిదాత దానవజాతా
శూరాన్వయాయజాతా
ధారావాతాసిరాజతల్పఖ్యాతా — పంచమా: 129

ఈ కంద పద్యమునందు రెండవ చరణములో రెండవగణము నుండి చదివి మొదలు విడిచిపెట్టిన నాలుగు గణములు చదివినయెడల 'త' కార ప్రాసతో వేఱొక పద్య మగునని ద్వివిధకందలక్షణమును చెన్నమరాజు చెప్పినాడు

శాతాసిదాత దానవ
జాతా శూరాన్వయాయజాతాధారా
వాతాసి రాజతల్ప
ఖ్యాతా వారాశికన్యకామణిధారా

ఇట్లు ఒక పద్యము నుండి ఇంకొక పద్యము దాగియున్నచో గర్భకవిత్వ మందురు

## యతిప్రాస విశేషములు

1 రేఫ శకటరేఫ యతి మైత్రి లక్షణ గ్రంథము లన్నింటి యందు 'ర-ఱ'లు 'ఎక్కటియతి' యందు చెప్పబడినవి విన్నకోట పెద్దన, అప్పకవి ఎక్కటియతినే 'ఏకతరయతి' అని పేర్కొనిరి ఎక్కటి యనగా అసహాయము, ప్రత్యేకము ఇతరాపేక్ష లేనిది ఏ అక్షరమైన కా యక్షరమే యతిమైత్రి పొందినచో ఎక్కటి యతి యగును అనగా రకు ర, ఱకు ఱ సాధురేఫ, శకటరేఫల యతి ప్రాసల మైత్రుల నిషేధమునకు శబ్దచింతామణిలోని- ర స్త్వత్ర గృహ్యతే ద్వివిధః, నాన్యేషాం వైధర్మ్యం లఘ్వ లఘూనాం రయోస్తు నిత్యం స్యాత్' అను సూత్రములే మూలకారణము

ర-లఘువు, ఱ-అలఘువు కావున ఈ రెండింటికి యతి, ప్రాస మైత్రులు నిషేధింపబడినవి భీమన, విన్నకోట పెద్దన, అనంతుడు ర-ఱ లను ఎక్కటి యతియందు చేర్చిరి[1] కాన వారి మతమున ర-ఱ ల యతిమైత్రి నిషిద్ధము వెల్లంకి తాతంభట్టు 'కవిచింతామణి యందు 'ఇలరేఫ ఱకారమ్ములు వళి చెల్లినఁ జెల్లుగాని వసుమతిఁ బ్రాసంబుల చెల్లవు' అనెను అప్పకవి—

మహిని రేఫాక్షరంబును మహిశతాంగ
నామక ఱకారమును సవర్ణంబులయ్యుఁ
గావ్యముల యందు నొకటి కొక్కటి గలయుక
దమకుఁ దామయ యగు నేకతర యతులన

— అప్పకవీయము-3 ఆః 85 ప

అని చెప్పినాడు రేఫమునకు రేఫమే, శకటరేఫమునకు శకటరేఫమే యతిమైత్రి చెల్లునని స్పష్టపఱచినాడు ఇతర లాక్షణికులు 'ఎక్కటియతి' అనుపేర రేఫ శకటరేఫలతోపాటు 'మ-ల-వ లను కూడ చెప్పిరి అప్పకవి వాటిని అంగీకరింపక ర-ఱ లను మాత్రమే ఏకతరయతి' యందు చెప్పినాడు ఎక్కటి యన్నను ఏకతర యన్నను భావము ఒక్కటే ఒక ప్రత్యేక వర్ణమునకు అదే వర్ణము తప్ప మఱి యొక వర్ణము యతి చెల్లదు

అధర్వణాచార్యుడు-

---

1 కవిజనాశ్రయము, పుట 8 కావ్యాలంకార చూడామణి - 48 ప పుట 129 ఛందోదర్పణము - 118 ప పు 25

అనయోస్సంగతిం యస్తు కరోతి కవితాకృతౌ
అస్యా అత్యంత దోషత్వా ద్దుష్కవిస్సహి కథ్యతే
— అథర్వణకారికావళి-సంజ్ఞా: 21.

అని తన మతమును ప్రకటించినాడు ఉభయరేఫల మైత్రి కవితలో అత్యంత దోషముగ పరిగణించి అట్లు చేయు కవి దుష్కవి యని నిరసించినాడు

శబ్దములలోని రేఫ శకటరేఫలను కవులు, లాక్షణికులు నిర్దేశించినను కొన్ని శబ్దములకు ద్వైరూప్యమును అంగీకరించిరి భిన్న స్థానజనితములకు భిన్నవర్గజములకు యతిప్రాసల మైత్రి యంగీకరింపబడగ, సవర్ణములై, ద్వైరూప్యము కలిగి లఘు, అలఘు ఉచ్చారణయందు మాత్రమే భేదము కలిగిన 'ర-ఱ' లకు యతిప్రాస మైత్రి ఏల అంగీకరింపరా దని ఆధునికుల అభిప్రాయము దానికి కారణము ప్రాచీనకవుల ప్రయోగములే చెన్నమరాజు 'ర-ఱ' లకు ఒక్కచో యతిమైత్రిని, నాలుగుస్థలము లందు ప్రాసయతి మైత్రిని కూర్చినాడు ప్రాసమును మాత్రము కూర్చలేదు

## ర-ఱ యతిమైత్రి

ప్రకట భవన్మహామమహిఁ బ్రస్తుతిసేయఁదరంబె యెట్టి వా
రికి నని యెన్నుచుండెడు త + ఱిన్ సఖుఁడల్లన వచ్చి
చెచ్చెఱన్
— చతుర్థ-4 ప.

## ర-ఱ ప్రాసయతి :

1. అనుచు జనులెన్న సభ లందు నధికకీర్తిఁ
బఱఁగు గోపాలమంత్రిశే + ఖరుఁడు శేష-ప్రథమ: 83 ప.
2. సారతర శాస్త్రగతిఁ గడ + తేఱువారు - ప్రథమ: 110 ప.
3. గిరి సమున్నతిఁబూని + పఱఁగెను జనుదోయి
— తృతీయ: 88 ప.
4. తుఱుము దఱుమును నీలంపు + సరులసిరుల
— చతుర్థ: 14 ప.

పయి లక్ష్యములనుబట్టి రేఫ శకటరేఫ యతిప్రాసలు చెన్నమరాజునకు సమ్మతమని స్పష్టమగును

## 3. ద్వ్యక్షరప్రాసము

తెలుగు పద్యము నందు ప్రతిపాదము యొక్క రెండవ వర్ణమును ప్రాస యందురు అది అన్ని పాదముల యందు ప్రాసమైత్రి కలదై వర్తింపవలయును ప్రాసలో హల్లునకు మాత్రమే మైత్రి నియతము ప్రాసాక్షరముతోపాటు దాని తరువాత అక్షరముకూడ ప్రాసముగ గైకొని రెండక్షరములను ప్రాసముగా చేసి నచో ద్వ్యక్షర ప్రాస మనబడును

కొండ యభీష్టవస్తువులు కూరిమి నే నొనగూర్తు మీకుఁ జే
కొండ యటంచు నర్థులకు గొబ్బున నెంత పదార్థమైనఁ దా
గొండ యటంచు జూడ కొసఁగున్ ధరపై నడయాడు జాళువా
కొండయ చెన్నమంత్రి మణికొండయ యెంచఁగ
మంత్రిమాత్రుఁడే — ప్రథమ. 24 ప.

ఇంకను ప్రథమాశ్వాసములోని 35, 55, 171 ద్వితీయాశ్వాసములోని 16, 35 తృతీయాశ్వాసములోని 53, చతుర్థాశ్వాసములోని 10 పద్యములందు ద్వ్యక్షర ప్రాసము కలదు

## త్ర్యక్షరప్రాసము

ప్రాసాక్షరముతోపాటు దాని తరువాత నున్న రెండు అక్షరములను ప్రాసాక్షరములుగ గ్రహించి ప్రాసను పాటించినచో త్ర్యక్షరప్రాస యగును చెన్నమరాజు ఒక్కచోట మాత్రమె వాడినాడు -

జయజయ పాండుర సైంధవ బాంధవ సర్వసుపర్వ
సుపర్వకరా
జయజయ నిత్యసభాజనభాజన. శార్వరదుర్వహగర్వహరా
జయజయ చంద్రవిరోచనలోచన. సార దయారసపూరధురా
జయజయ సామజపాలనఖేలన. చక్రధరానుత చక్రిహరీ
- తృతీయః 72 ప.

## వ్యాకరణ విశేషములు

### 1. పిడేనుంగు (1 ఆ: 117 ప.)—పిడి+ఏనుంగు

ఇట సంధి వ్యాకరణవిరుద్ధము కాకపోయినను 'పిడియేనుఁగు' అని సంధి రాని రూపమును ప్రయోగించుటయే ప్రసిద్ధము కాని చెన్నమరాజు సంధి వచ్చిన రూపమునే ప్రయోగించెను

### 2. తంతెల్ తంతెలై (2 ఆ: 23 ప.)

ఇచట కవి 'తంతియ' శబ్దము 'తంతె' క్రింద వాడినాడు 'ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగానగు' (అచ్చిక, 23) సూత్రము ప్రకారము 'తంతియ' శబ్దము 'తంతె' గా మారినది

### 3. పశుసమజము (2 ఆ: 35 ప.)

ఇట 'సమాజము' అను శబ్దమునకు 'సమజము' అను రూపము వికృతిగ తోచును కాని 'సమజము' అను ప్రకృతి శబ్దమును అదే అర్థము నందు కలదు (ఆప్టే) ఈ 'సమజము' అను పదము తెనాలి రామకృష్ణుని "పాండురంగ మాహాత్మ్యము" నందు కలదు

" పశు సమజ ముండములు, చండములౌ. "

(3 ఆ–78 ప)

### 4. మహికాంతుల్ (2 ఆ: 90 ప.)

'మహీ' శబ్దము ఈకారాంతముగ కలదు ఇకారాంతమైన మహి శబ్దమునకు గొప్పతనమనియే కాని భూమి అను అర్థము లేదు (ఆప్టే) కావున 'మహికాంతుల్' అను సమాసము వ్యాకరణవిరుద్ధము

### 5. చలించన్ (3 ఆ: 29 ప.)
### రహించన్ (3 ఆ· 32 ప.)

'చల్', రహ్' ధాతువులకు స్వార్థేం చుక్కు చేరి 'చలించు', 'రహించు అగును (క్రియా, 63 సూ ) ఇందలి 'చు' వర్ణము ఆగమ చకారము

'ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు పవ లగు' (క్రియా, 88) అను సూత్రము ప్రకారము 'ప' కారము రావలయును చలింపన్, రహింపన్. కావున బాలవ్యాకరణము ప్రకారము 'చలించన్, రహించన్' అను రూపములు అసాధువులు కాని, 'కవిత్రయేతర ప్రయోగంబుల

గొన్నియెడల ని ప్రత్యయాదులు పరంబు లగునపుడు పకారం బించుకచ్చకారంబున కేనిఁ గానఁబడదు' (క్రియా, 16) అని ప్రౌఢవ్యాకరణము నందు కలదు

కవిత్రయమువారిని విడిచి తక్కినవారి ప్రయోగములను గమనించినచో 'ని' ప్రత్యయము మొదలైనవి పరములగునపుడు ఇంచుక్కులోని చకారమునకు కూడ పకారాదేశము రాకుండుట కానవచ్చుచున్నదని సూత్రార్థము

'ని ప్రత్యయాదు లంగు 'అన్' అనునది కూడ గ్రహింపవలయును

చలించు + అన్ = చలించన్
రహించు + అన్ = రహించన్

ఇచట పకారాదేశము రాలేదు

కావున 'చలించన్, 'రహించన్', అనునవి ప్రౌఢవ్యాకరణము ప్రకారము సమ్మతింపదగినవే అగును

ఇంతకు మించి వ్యాకరణవిషశేషులు కానరావు

## అలంకారములు .

చెన్నమరాజు అలంకార ప్రియుడు తన కావ్యమునందు శబ్దాలంకారములను, అర్థాలంకారములను ప్రయోగించినాడు అర్థాలంకారములలో ఉత్ప్రేక్ష అనిన అభినివేశము అధికముగనున్నట్లు కన్పించుచున్నది సర్వసాధారణ విషయములను వర్ణించునపుడు సహితము ఉత్ప్రేక్షనే వాడినాడు ఇంకను ఉపమ, రూపక, స్వభావోక్తి, అర్థాంతరన్యాసము, అతిశయోక్తి, శ్లేష మొదలగు అలంకారములు 'చారుచంద్రోదయము నందు హెచ్చుగ కన్పించుచున్నవి

### 1. శబ్దాలంకారములు

పద్య సంఖ్యలు

| | |
|---|---|
| వృత్త్యనుప్రాసము | 1 ఆ —121, 122, 124 |
| | 2 ఆ —4, 10, 16, 22, 59 |
| | 3 ఆ —45, 48, ι2, 91, 138 |
| | 4 ఆ —37, 57 |
| యమకము : | 1 ఆ —122 |
| | 2 ఆ —35 49 |
| | 3 ఆ —15, 78 |
| ముక్తపదగ్రస్తము | 4 ఆ,—7 |

## 2. అర్థాలంకారములు

| | |
|---|---|
| ఉపమా | 1 ఆ.—33, 37, 46, 50, 56, 60, 73 |
| | 2 ఆ —46, 95, 109 |
| | 3 ఆ —63, 100, 124 |
| | 4 ఆ —97, 98, 99, 101, 103 |
| | 5 ఆ —61, 65 |
| ఉత్ప్రేక్ష | 1 ఆ —117, 119, 160 |
| | 2 ఆ —51, 53, 76, 142, 147, 153, 154 |
| | 3 ఆ —89, 91, 92, 102, 103 |
| | 4 ఆ —11, 33, 35, 60, 62, 63, 64, 66, 67, 68, 69, 70, 71, 94, 95, 96, 100 |
| | 5 ఆ —33, 36, 37, 39, 43, 59, 66, 68, 75, 91 |
| రూపకము | 2 ఆ —75, 153 |
| | 4 ఆ —39, 40, 59, 61, 65, 90 |
| రూపకముతో కూడిన శ్లేష | 2 ఆ —40, 79 |
| రూపకముతోకూడిన ఉత్ప్రేక్ష | 2 ఆ —143, 147 |
| అతిశయోక్తి | 1 ఆ —98, 100, 105, 109, 113 |
| | 2 ఆ —73 |
| స్వభావోక్తి | 2 ఆ —17 |
| | 4 ఆ —42, 102 |
| స్మృతి | 1 ఆ —95 |
| భ్రాంతిమదాలంకారము | 1 ఆ —107 |
| విరోధాభాసాలంకారము | 2 ఆ —77 |
| విషమము | 3 ఆ —57 |
| వ్యతిరేకాలంకారము | 1 ఆ —80, 111 |
| కావ్యలింగము | 4 ఆ —9 |

| | |
|---|---|
| అర్థాంతరన్యాసాలంకారము | 2 ఆ —146 |
| | 4 ఆ —78, 79 |
| | 5 ఆ —14, 121 |
| యథా సంఖ్యము | 1 ఆ —43, 81 |
| శ్లేష | 1 ఆ —3, 7 9, 26, 68, 72, 111, 122, 125, 159 |
| | 2 ఆ —40, 79, 93 |
| | 3 ఆ —18, 65, 90 99, 109 |
| | 4 ఆ —58 88 |
| | 5 ఆ —14, 22 |

## శ్లే షా ర్థ ము లు

1 హరికిని మాకభేదమని యందఱికిన్ బ్రకటించు వైఖరిన్
బరమ సుదర్శనాయుధము భవ్యహరిద్వసనంబు మత్తకుం
జరవరదానమున్ విబుధసన్నుత దైత్యపురప్రహార వి
స్ఫురణముఁగల్గు శంకరు బ్రపుణ్యవశంకరు నే భజించెదన్
1 ఆ: 3 ప

కవి దేవతాస్తుతి చెయు సందర్భమున హరిహరులకు అభేదమని చెప్పినాడు విష్ణువు పరముగను శివుని పరముగను అర్థద్వయము వచ్చునట్లుగ 'పరమసుదర్శనాయుధము, హరిద్వసనంబు, మత్తకుంజర వరదానమున్, దైత్యపురప్రహార' అను పదములను ప్రయోగించినాడు విష్ణుచక్రమను ఆయుధమును, పచ్చని వస్త్రమును, గజేంద్రునికి వరమిచ్చుటయు, రాక్షసుని పట్టణమును నాశనము చేయుటయు కలవాడని విష్ణుపరముగ అర్థము చూచుటకు అందమైన ఆయుధము (త్రిశూలము)ను, దిక్కులు వస్త్రముగను గజాసురునికి అతనిచర్మమును ధరింతునని వరమిచ్చుటయు, త్రిపురములను నాశనము చేయుటయు కలవాడని శివుని పరముగ మఱొక అర్థము ఇచ్చుట విష్ణుస్తుతి శివస్తుతి వర్ణ్యములే యగుటచేత ప్రకృతశ్లేష యని చెప్పవచ్చును

2. అనయంబద్రిసుతామనోహరుఁడు నెయ్యంబొప్ప
లాలింపుచున్
దనపై నెక్కుడు వేడ్కఁజూపఁగ సముద్యల్లీలవర్తించు ధ
న్యు నహీనోత్కటదానశాలిఘనతుండున్ సాధుపక్షోజ్జ్వలున్
వినతానందకరున్ వినాయకుని భావింతున్ శుభావాప్తికిన్
1 ఆ: 7 ప.

కవి వినాయకుని స్తుతించునపుడు 'వినతానందకరుడు' అనగా గరుత్మంతుడు అను అర్థము వచ్చునట్లుగ శ్లేషను వాడినాడు

| | |
|---|---|
| అద్రిసుతామనోహరుడు | పార్వతీమనోహరుడు |
| ఎక్కుడు వేడ్క | హెచ్చు వేడుక |
| అహీన+ఉత్కట+దానశాలి | మిక్కిలి అధికముగ మదముకల పెద్ద |
| ఘనతుండున్ | తుండము కలవానిని (గజముఖుని) |
| సాధుపక్ష+ఉజ్జ్వలున్ | మంచివారి పక్షమున ప్రకాశించువాడును |
| వినత+ఆనందకరున్ | వంగి నమస్కారముచేసిన వారికి ఆనందమును చేకూర్చువాడగు |
| వినాయకుడు | వినాయకుడని |
| | వినాయకుని పరమైన అర్థము |
| అద్రిసుతామనోహరుడు | చెంచులక్ష్మి మనోహరుడు (?) |
| ఎక్కుడు వేడ్క | ఎక్కవలెనని వేడుకతో |
| అహి+ఇన+ఉత్కట+దాన+ శాలిఘనతుండున్ | సర్పరాజములను తీవ్రముగా ఛేదించుటయందు నేర్పుగల పెద్ద ముక్కు కలవాడును |
| సాధుపక్షోజ్జ్వలున్ | చక్కని రెక్కలతో ప్రకాశించువాడును |
| వినాయకుని | గొప్ప నాయకుని (పక్షులకు నాయకుడు) |
| వినత+ఆనందకరున్ | వినతకు ఆనందమును చేకూర్చు గరుత్మంతుడని మఱొక యర్థము |

3 ప్రకృతి కృదవ్యయప్రత్యయ సుప్రతి
ష్ఠాధనుశబ్దశాసను భజించి
సరసమౌళిప్రియంకరపదాలంకార
వృత్తిసాంద్రుని కుండలీంద్రు నెంచి
సర్వజ్ఞగణమనస్సంప్రీతికరకవి
త్వవిలాసు నల శంభుదాసుఁ బొగడి
బహుముఖ ప్రఖ్యాత మహితశయ్యావిశే
షసనాదు శ్రీనాదు సంస్తుతించి -1 అ. 9 ప

పై పద్యమునందు సుకవి స్తుతి చేయునపుడు శబ్దశాసనుడు', 'కుండలీంద్రుడు', శంభుదాసుడు 'శ్రీనాథుడు అను విశేష్యములకు వాని విశేషణములకు శ్లేష కలదు

శబ్దశాసనుడు—బ్రహ్మ నన్నయ (శబ్దము-వాక్కు, సరస్వతి) ప్రకృతిని చేయు ఎరుగని శక్తిచేత గొప్పకీర్తి అను ధనము కలవాడని బ్రహ్మ పరముగ ఒక అర్థము

ప్రకృతి కృత్తు అవ్యయము, ప్రత్యయము-వీనిచేత గొప్పకీర్తి అను ధనము కలవాడని నన్నయ పరముగ మఱొక అర్థము

కుండలీంద్రుడు-ఆదిశేషుడు తిక్కన

సరసశ్రేష్ఠులకు ఇష్టమైన విష్ణువు యొక్క (అత్యాహార్యము) పాదముల అలంకారము ప్రధానమైన వృత్తిగా కలవాడు ఆదిశేషువు అని ఒక అర్థము ఇట శేషతల్పమున విష్ణువు పాదములు ఉండుట కవి ఊహకావచ్చును

సరసశ్రేష్ఠులకు ప్రియమును కలిగించు పద, అలంకార వృత్తులుఅధికముగా కలిగిన కవిత్వము చెప్పువాడనీ తిక్కన పరముగ మఱొక అర్థము

శంభుదాసుడు-శివుడు, ఎఱ్ఱన

శివునియొక్క గణముల మనస్సునకు సంప్రీతిని కలిగించు మనీషావిలాసము కలవాడని శివునిపరముగ ఒక అర్థము

శివునియొక్క భక్తులకు సంప్రీతిని కలిగించు కవిత్వవిలాసము కలవాడని ఎఱ్ఱన పరముగ మఱియొక అర్థము

శ్రీనాధుడు—విష్ణువు. శ్రీనాధుడు

వేయిపడగలుగల శేషుడు శయ్యగా కలిగినవాడని విష్ణువు పరముగ ఒక అర్థము

బహుముఖములుగ ప్రసిద్ధమైన, గొప్పదైన శయ్యా విశేషమునకు అధిపతియైనవాడని శ్రీనాధునిపరముగ మఱియొక అర్థము

4. ఏమంత్రిమార్తాండుఁ డేవేళఁ గువలయా
నందకృద్గుణరేఖ నందమొందె
నేమంత్రి దేవేంద్రుఁ డేవేళ ఘనగోత్ర
రక్షణోదారుఁడై రహి వహించె
నేమంత్రిహిమధాముఁ డేవేళ మితిమీఱు
కళలచే బుధుల నింపలరఁజేసె
నేమంత్రి ధూర్జటి యేవేళ నగణిత
ద్విజరాజసంభృతిఁ దేజరిల్లె . . – 1 ఆ: 26 ప.

పై పద్యమున తమ్మనమంత్రి గొప్పతనమును వర్ణించు సందర్భమున కవి 'మార్తాండుడు', 'దేవేంద్రుడు', 'హిమధాముడు', 'ధూర్జటి' పరముగ శ్లేషను వాడినాడు

మార్తాండుడు—మంత్రిమార్తాండుడు, సూర్యుడు

మంత్రి మార్తాండుడు భూమండలమునకు ఆనందమును కలుగచేయువాడని తమ్మనమంత్రిపరముగ ఒక అర్థము

భూమండలమునకు ఆనందము కలిగించు గుణము కలవాడని సూర్యునిపరముగ మఱొక అర్థము

దేవేంద్రుడు – మంత్రి దేవేంద్రుడు, ఇంద్రుడు

మంత్రిదేవేంద్రుడు గొప్పకులములను రక్షించుటయందు ఔదార్యము కలవాడని మంత్రిపరముగ అర్థము

దేవేంద్రుడు పెద్దకులమును (దేవతలను) రక్షించుటయందు ఔదార్యము కలవాడని మఱియొక అర్థము

హిమధాముఁడు - మంత్రిహిమధాముఁడు, చంద్రుడు

మంత్రిహిమధాముడు అన్ని సమయముల యందు అధికమైన విద్యల చేత పండితులను అలరింపచేసెనని మంత్రి పరమైన అర్థము చంద్రుడు అన్నివేళల యందు కళలచేత దేవతలకు సంతోషమును కలుగజేయువాడని మఱియొక అర్థము

ధూర్జటి – మంత్రిధూర్జటి, శివుడు

మంత్రిధూర్జటి అసంఖ్యాకమైన బ్రాహ్మణులను పోషించుటచేత ప్రకాశము కలవాడని ఒక అర్థము

శివుడు శిరస్సున (సాటిలేని) చంద్రుని ధరించి ప్రకాశించుచున్నాడని మఱొక అర్థము

5 దండిప్రియంకరాఖండప్రసన్నత
భూవిశ్రుత మురారి భావకలన
రమణీయకుండలిరాజశయ్యాలీల
సుగుణై కభారవిస్ఫురితవృత్తి
లలితమయూరకలాపమాధుర్యంబు
వినుత భాస్కర పదవిలసనంబు
బాణాతిశయమై శ్రతభాస్వదోజఃస్ఫూర్తి
యమరేశపాకమహత్త్వభృతియుఁ
గలిన యమర వరాన్వయంబలరి యుండ
సత్కృతుల్ సేయనేర్చు శేషప్రధాన
విభుని లక్ష్మీపతి రసజ్ఞవిబుధకోటి
యరయ లక్ష్మీపతి కిదేమి యరుదనంగ – 1 అ. 68 ప

కవి తన వంశవృక్షమును వర్ణించునపుడు సోదరుడైన 'లక్ష్మీపతి' నామముపై శ్లేష నుపయోగించినాడు లక్ష్మీపతి కవిత్వపరముగను, లక్ష్మీపతి అయిన విష్ణువు పరముగను అర్థము స్ఫురించునట్లు పై పద్యమున చెప్పినాడు

దండి + ప్రియంకర + అఖండ + ప్రసన్నత

దండిమహాకవికి ప్రియమైన సాటిలేని ప్రసాదగుణము (పదలాలిత్యము) అని కవిత్వపరమైగ ఒక అర్థము

సన్న్యాసులకు ఆనందమును కలిగించు సాటిలేని ప్రసన్న గుణము కలవాడని విష్ణువు పరముగ ఒక అర్థము

భూవిశ్రుత + మురారి + భావ + కలన

లోకప్రసిద్ధమైన మురారికవి భావన అని కవిత్వపరమైన అర్థము

భూవిశ్రుత + ముర + అరి + భావ + కలన

లోక ప్రసిద్ధమైన మురాసురుని శత్రువైన విష్ణువుయొక్క భావనావ్యాప్తి యని మఱొక అర్థము.

రమణీయ కుండలి రాజశయ్యాలీల

తిక్కన సోమయాజి అందమైన శయ్యావిలాసము అని కవిత్వపరమైన అర్థము

సుందరమైన ఆదిశేషువుపై శయ్యావిలాసము కలవాడని విష్ణువు పరముగ అర్థము

సుగుణ + ఏక + భారవి + స్ఫురిత + వృత్తిమంచి—గుణములతో కూడిన భారవికి తోచిన వృత్తి (అర్థ గాంభీర్యము) అని ఒక అర్థము

సుగుణ + ఏక + భార + విస్ఫురిత + వృత్తి

మంచి గుణముల బరువుతో ప్రకాశించు నడవడిక కలవాడని విష్ణువు పరమైన అర్థము

లలితమయూరకలాపమాధుర్యంబు—

మయూరకవి యొక్క సుందరమైన భూషణముల (అలంకారములు) మాధుర్యము అని ఒక అర్థము

సుందరమైన నెమలి పింఛముయొక్క సౌందర్యము అని మఱొక అర్థము

వినుత భాస్కర పదవిలసనంబు—

ప్రసిద్ధిగాంచిన భాస్కరుని పదవిన్యాసము అని ఒక అర్థము

ప్రసిద్ధిగాంచిన సూర్యుని స్థానమునందు ప్రకాశించువాడని మఱొక అర్థము

బాణ + అతిశయ + జైత్ర + భాస్వత్ + ఓజః + స్ఫూర్తి

భట్టబాణుని అతిశయించి ప్రకాశించు ఓజోగుణ మని కవిత్వపరమైన అర్థము

బాణాసురుని శౌర్యమును జయించి ప్రకాశించు తేజస్సు కలవాడని విష్ణు పరమైన అర్థము

"అమరేశ పాకమహత్త్వ భృతియుఁగలిగి"—

అమరేశకవి కవితా పాకముయొక్క గొప్పతనము అని కవిత్వపరమైన అర్థము ఇంద్రుని యొక్క పరిపక్వమైన గొప్పతనము అని విష్ణువుపరమైన అర్థము [పాక - పరిపాక]

"అమరవరాన్వయంబలరియుండ సత్కృతుల్ సేయనేర్చు శేష ప్రధాన విభుని లక్ష్మీపతి"—

సద్వంశమున ప్రకాశించి సత్కావ్యములు రచించు శేషయామాత్యుని కుమారుడైన లక్ష్మీపతి అని ఒక అర్థము

దైవాంశ సంభూతుఁడై సత్కార్యములుచేయు ఆదిశేషుని ప్రభువైన లక్ష్మీపతి యని విష్ణుపరముగ మఱొక అర్థము

6 విగ్రహంబందు వెల్వెలఁబోక పటుశరా
    సారసంప్రాప్తికి నోరసిలక
తమమీఁద నిలనరుండు మఱెక్కడను లేక
    యహరీశపదయోగ మాసపడక
పరపంకజాస్యానుభావంబు గోరక
    గోత్రనిర్వ్యథనంబు గుఱు తెరుఁగక
యాత్మఘనవ్యపాయము సహింపక సదా
    చరణక్రమంబున జడను గొనక
ధరణినప్రాప్తపక్షపాతంబు వదలి
మానసమహోద్ధతాదిసంబంధ మెడలి
పురవరంబున నధికస్ఫూర్తి మెఱయు
సాద్భుతగుణంబు రాజహంసవ్రజంబు -1 ఆ॰ 111 ప.

ఇందు 'రాజహంస' లన రాజశ్రేష్ఠులైన క్షత్రియులని ఒక అర్థము శ్రేష్ఠములైన హంసలని మఱొక అర్థము రాజశ్రేష్ఠులకు రాజహంసలకు సాదృశ్యముతో పాటు, రాజహంసలకంటె రాజశ్రేష్ఠులకు ఆధిక్యము చెప్పబడినది

'విగ్రహము, శరాసారము, అహరీశపదము, పంకజాస్య, గోత్ర ఘన వ్యపాయము, సదాచరణము, పక్షపాతము, మానసము' మొదలగు పదముల యందు శ్లేష కలదు

'విగ్రహంబంను వెల్వెలఁబోక' –
విగ్రహము–శరీరము, యుద్ధము
హంసలు తెల్లనివి.
రాజశ్రేష్ఠులు యుద్ధము నందు వెల్లబాటుతనము లేనివారు
'పటుశరాసారసంప్రాప్తికి నోరసిలక' –
శరాసారము–ధారావర్షము, బాణవర్షము
హంసలు ధారావర్షమునకు లొంగును
రాజశ్రేష్ఠులు బాణవర్షమునకు లొంగరు
'తమమీద నిలనరుండు మఱెక్కుడనులేక' –
హంసలకంటె భూమిమీద అధికులైన మానవులు కలరు
భూమిమీద రాజశ్రేష్ఠులకన్న అధికమైనవారు లేరు
'అహరీశపదయోగ హాసపడక' –
అహరీశపదము– ఆకాశము, సూర్యమండలము
హంసలు ఆకాశమార్గమున విహరించును (ఆశపడును)
రాజశ్రేష్ఠులు సూర్యమండలమున ప్రవేశించుటకు ఆశపడరు
(రాజులు భూమిని ఏలుటకే ఇష్టపడుదురు)
'పరపంకజాస్యానుభవంబు గోరక' –
పర–పరమమైన, అన్యము
పంకజాస్య–పద్మముఖములు, స్త్రీలు
హంసలు పరమమైన పద్మముఖములను అనుభవించును
(హంసలకు మానస సరోవరములోని పద్మములే ఆహారమని ప్రసిద్ధము)
రాజశ్రేష్ఠులు అన్యస్త్రీల అనుభవమును కోరరు
'గోత్రనిర్వ్యధనంబు గుఱు తెఱుఁగక'–
గోత్రము–పర్వతము, కులగోత్రము
హంసలు క్రౌంచపర్వతము రంధ్రము నుండి మానస సరోవరమునకు పోవునని ప్రసిదము

రాజశ్రేష్ఠులు గోత్రలోపము గుర్తెఱుగరు అనగా గొప్ప గోత్రము కలిగి యుండెదరు

'ఆత్మఘనవ్యపాయము సహింపక –
ఘనవ్యపాయము–మేఘముల ప్రమాదము, గొప్ప ఆపద
హంసలు తమయొక్క మేఘములని ప్రమాదమును సహించును
రాజశ్రేష్ఠులు గొప్ప ఆపదలను సహింపరు (ఎదిరించెదరు)
సదాచరణక్రమంబున జడను గొనక' –
సదాచరణము–ఎల్లప్పుడు తిరుగుట
సత్ + ఆచరణము – మంచి ఆచారము
హంసలు ఎల్లప్పుడు తిరుగుట యందు మందగమనమును ఆచరించును
రాజశ్రేష్ఠులు సదాచారము నాచరించుటలో వెనుకడుగు వేయరు
'ధరణి నప్రాప్తపక్షపాతంబు వదలి
అప్ + ప్రాప్త – నీరుదొరుకుట వలన
పక్షపాతము–ఱెక్కలు ప్రాలుట, ఒకి పక్షమందు అభిమానము
భూమిమీద నీరు దొరుకుట వలన హంసలు ప్రాలును
నఞ్ + ప్రాప్త – రాజులు
భూమిమీద రాజులు పక్షపాతము లేకుండ ఉందురు
మానస మహోద్ధతాది సంబంధ మెడలి'
మానసము – సరోవరము మనస్సు

హంసలు మానస సరోవరముయొక్క సంబంధమును కొంతకాలము వదలి వేయును

రాజశ్రేష్ఠులు మనస్సునందు ఎట్టి గర్వములేకుండ ఉందురు

పైదానినిబట్టి ఆ ద్వారకా పట్టణము నందలి రాజశ్రేష్ఠులు రాజహంసలను మించి ప్రకాశించుచున్నారని తెలియుచున్నది

7 పాటలాంఘ్రి పరమప్రాగ్భారకలనంబు
రంభాతరూరువిజృంభణంబు
తుంగభూమిజఘనాభంగురాభ్యుదయంబు
చంచల్లతామధ్యసౌష్ఠవంబు

స్వర్ణాగపృథులకుచశ్రీవిలాసంబు
క్రముకరాజగళ సద్గౌరవంబు
భవ్యజపాధరోద్భవరాగవిభవంబు
మదనబాణాలోకమంజిమంబు
కుందకమనీయదంతాళి కువలపాళి
భాసితరసాలకానన ప్రకటరేఖ
దనర వనితల మురువు నవనితలములు
వరవయఃస్ఫూర్తిఁ జెన్నొందుఁ బురమునందు

—1 ఆ.. 122 ప.

ద్వారకా పట్టణమునందలి ఉద్యానవనము వనితలను పోలియున్నవని కవి శ్లేష రూపమున చెప్పినాడు

'పాటలాంఘ్రిపరమప్రాగ్భారకలనంబు' –

పాటలీవృక్షముల వేరుల సమూహముతో అతిశయించుచున్నదని ఉద్యానవన పరమైన అర్థము

ఎఱ్ఱని పాదములతో అతిశయించుచున్నారని స్త్రీపరమైన అర్థము

'రంభాతరూరు విజృంభణంబు' –

మిక్కిలి పెద్దవైన అరటిచెట్లతో అతిశయించినదని ఉద్యానవనపరమైన అర్థము (తరు + ఉరు)

అరటిబోదెల వంటి తొడలు గలవారని స్త్రీపరమైన అర్థము (తరు + ఊరు)

'తుంగభూమిజఘనాభంగురాభ్యుదయంబు' –

పొడవైన వృక్షములయొక్క గొప్పదైన, నాశనముకాని అభివృద్ధి అని ఉద్యానవనపరమైన అర్థము

పొడవైన ప్రదేశము కల పిరుదులయొక్క నాశనముకాని అభివృద్ధి అని స్త్రీపరమైన అర్థము (పృథునితంబ)

'చంచల్లతామధ్యసౌష్ఠవంబు' –

చలించుచున్న లతలమధ్య సౌష్ఠవమని ఉద్యానవనపరమైన అర్థము

మెఱుపుతీగవంటి పెదవులయొక్క సౌష్ఠవమని స్త్రీపరమైన అర్థము

'స్వర్ణాగ స్పృథులకుచశ్రీవిలాసంబు –

కాంచనవృక్షముల, పొడవైన లకుచ వృక్షము (గజనిమ్మ చెట్లు) సంపదల విలాసమని వనపరమైన అర్థము

మేరుపర్వతము వంటి విశాలమైన స్తనయుగ్మము విలాసమని స్త్రీపరమైన అర్థము

'క్రముకరాజగళసద్గౌరవంబు' – ఇది స్పష్టమగుటచేత

భవ్య జపాధరోద్భవ రాగవిభవంబు –

శ్రేష్ఠమైన మంకెనపూలయొక్కల ఎఱ్ఱనికాంతి అని ఉద్యానవనపరమైన అర్థము

మంకెనపూవులవలె ఎఱ్ఱని అధరము నుండి పుట్టిన ఎఱ్ఱని కాంతి అని స్త్రీపరమైన అర్థము

'మదనబాణాలోకమంజిమంబు' –

మదనబాణ వృక్షసమూహములతో వనము అందముగా నున్నదని ఉద్యాన వనపరమైన అర్థము

మన్మథబాణములవంటి తీవ్రమైన చూపులతో అందముగా నున్నదని స్త్రీపరమైన అర్థము

కుందకమనీయ దంతాళి –

కమనీయమైన మల్లెలతల వరుసలతోనున్న పొదరిళ్ళు కలిగినవని ఉద్యాన వనపరమైన అర్థము

మల్లెమొగ్గలవలె అందమైన దంతముల వరుస అని స్త్రీపరమైన అర్థము

'కువలపాళిభాసితరసాలకానన ప్రకటరేఖ' –

కలువల సమూహముచేత ఒప్పిన మామిడితోటయొక్క కాంతి అని ఉద్యాన వనవనపరమైన అర్థము (రసాల + కానన)

ముత్యముల సమూహముచేత ఒప్పిన అందమైన ముంగురులతోడి ముఖము యొక్క కాంతి అని స్త్రీపరమైన అర్థము (రస + అలక + ఆనన)

8. గర్గమౌని జాతకర్మంబు విధ్యుక్త
ముగ నొనర్ప శౌరిపుత్రమణికి
నరుల నడచి కువలయం బేలఁగలడని
చారుచంద్రు డనెడు పేరొసంగె —1 ఆః 159 ప.

ఇచట 'కువలయము' అను పదమునందు శ్లేష కలదు

అరులు-శత్రువులు

కువలయము-భూమి, కలువ

శత్రువులను సంహరించి భూమిని పరిపాలింపగలడని నాయకుడైన చారు చంద్రుని పరముగ ఒక అర్థము

శత్రువులైన తామరలను అణచి అనగా ముకుళింపఁజేసి కలువపూవులను ఏలగలడు అనగా వికసింపఁ జేయఁగలడని చంద్రుని పరముగ మఱొక అర్థము

9. చండకరమండలాగ్రతేజఃప్రభావ
పుష్కలంబగు పుష్కర స్ఫురణమడఁచి
కువలయముఁ బ్రోచితేని సూరవర నీకు
చారుచంద్రాభిధానంబు సార్థమగును —2 ఆః 40 ప.

'పుష్కరము'. 'కువలయము'. 'చంద్ర' —ఈ మూడు పదములయందు శ్లేషను ప్రయోగించినాడు.

పుష్కరము-పుష్కరుడను రాక్షసుడు తామర

కువలయము-భూమి. కలువ

చంద్ర-చారుచంద్రుడు, చంద్రుడు

తీవ్రమైన తేజస్సుతో పుష్కరుని అధికమైన గర్వమును అణచి భూ మండలమును రక్షించినవాడని చారుచంద్రుని పరముగ ఒక అర్థము

తీవ్రమైన తేజస్సుతో అధికమగు తామరలను నాశనముచేసి కలువలను రక్షించువాడని చంద్రుని పరముగ మఱియొక అర్థము

10. ఓజఃప్రసాదసంయుక్తిచే రవణిల్లి
బహుళార్థసామగ్రిఁ బరిఢవిల్లి

సందివిగ్రహ భేదచాతుర్యముడివోక
పరదురాక్షేపముల్ సొరఁగనీక

లోకాబివర్ణితశ్లోకసంగతిఁ గాంచి
సరసబావస్ఫూర్తి సరణిమించి

వడిఁగల్గి ప్రాసంబులెడఁ గౌశలముహెచ్చ
సమితి నెంతయు ధీరసమితిమెచ్చ

సకల జనములు నితడెంత సుకృతియనఁగ
దాత్రియేలె — 2 అ. 79 ప.

కుముద్వతి తండ్రియగు పద్మాకరునియొక్క పరిపాలనను వర్ణించుచు కవిత్వ లక్షణము లిట్లున్నవని కవి శ్లేషరూపమున సూచించినాడు

"ఓజః ప్రసాదసంయుక్తిచే రవణిల్లి"—

పరాక్రమము, అనుగ్రహముల కూడికచే ఒప్పియున్నదని పరిపాలనా పరముగ అర్థము

ఓజోగుణముచే (సమాసభూయిష్ఠము) ప్రసాదగుణముచే (సరళ పద బంధము) ఒప్పినదని కవిత్వపరముగ అర్థము

"బహుళార్థసామగ్రిఁ బరిఢవిల్లి"—

అనేక సంపదలు వస్తువులతో అతిశయిల్లినదని పద్మాకరుని పరముగ అర్థము

పెక్కు అర్థములతో ప్రవర్తిల్లియున్నదని కవిత్వపరముగ అర్థము

"సంధివిగ్రహభేదచాతుర్యముడివోక"—

సంధి, విగ్రహము, భేదము చాతుర్యము అను రాజనీతి అతని పరిపాలన నుండి తొలగిపోలేదని పద్మాకరుని పరముగ అర్థము

చక్కని సంధులతో, మంచి సమాసభేదములతో, చతురతతో ఒప్పియున్నదని కవిత్వపరముగ మఱొక అర్థము

"పరదురాక్షేపముల్ సొరఁగనీక"—

శత్రువులయొక్క దుష్టమైన ఆకర్షణలకు తావులేదని పరిపాలనా పరముగ అర్థము

ఇతరులయొక్క చెడు విమర్శలకు తావులేదని కవిత్వపరముగ అర్థము

"లోకాభివర్ణితశ్లోకసంగతిఁ గాంచి"—

లోకముచేత వర్ణింపబడిన కీర్తితో నిండియున్నదని పరిపాలనా పరమైన అర్థము

లోకముచేత కొనియాడబడిన శ్లోకములతో కవిత్వము నిండియున్నదని వేఱొక అర్థము

"సరసభావస్ఫూర్తిఁ సరణి మించి"—

సరసమైన భావములతో కూడినదని పరిపాలనాపరముగ అర్థము

రసము, భావము బాగుగా స్ఫురించునట్లున్నదని కవిత్వపరముగ అర్థము

"వడిఁగల్గి ప్రాసంబులెడఁ గౌశలము హెచ్చ"—

వేగముగ ఖడ్గములు ప్రయోగించుటయందు నేర్పరితనము అధికముగా కల దని పరిపాలనాపరమైన అర్థము

యతి, ప్రాస ప్రయోగించుటయందు నేర్పరితనము హెచ్చుగా నున్నదని కవిత్వపరమైన అర్థము

"సమితినెంతయు ధీరసమితిమెచ్చ"—

యుద్ధమునందు వీరవరులు మెచ్చునటులుగ నున్నదని పద్మాకరుని పరిపాలనాపరముగ అర్థము

సభలలో పండితులు మెచ్చుకొనునట్లున్నదని కవిత్వపరముగ అర్థము

11. సుధర్మనితాంతస్థితి మంతుకెక్కి బుధులన్ రక్షించు కారుణ్యవీ
క్షనిరూఢిన్ గనునీకుఁ గల్గుటరుదా సంతానసౌభాగ్యముల్
— 2 ఆ: 93 ప.

పద్మాకరుని పరముగను, ఇంద్రునిపరముగను ద్వంద్వార్థము స్ఫురించుచున్నది

సుధర్మ-మంచిధర్మములు, ఇంద్రునిసభ

బుధులన్-పండితులను, దేవతలను

సంతానము-సంతతి, కల్పవృక్షము

మంచి ధర్మములతోను, పండితులను రక్షించు దయావీక్షణములతో సంతతి సౌభాగ్యములు కలవాడని పద్మాకరుని పరముగ అర్థము

స్వర్గలోకమునకు అధిపతియై దేవతలను కాపాడు కారుణ్యదృష్టి, కల్పవృక్ష సౌభాగ్యములు కలవాడని ఇంద్రునిపరముగ అర్థము

12. —పుడమిఁ బద్మాకరాంతరస్ఫూర్తి నడఁచు
పటిమ శశిరేఖ నీ కెంతపని గణింప — 3 ఆ. 18 ప.

శశిరేఖ–శశిరేఖ, చంద్రరేఖ

పద్మాకర–పద్మాకరుడు, సరస్సు

పద్మాకరునియొక్క మనోదార్ఢ్యమును అణచివెయగలదని శశిరేఖపరమైన అర్థము

సరస్సులోని తామరల బింకమును అణచివెయగలదని చంద్రరెఖపరముగ అర్థము

13 మొల-నవ్వులపేరఁ జిలుకదేరె యెండ
కువలయోల్లాసి వైభవము గాదె
యదరమాదురిపేర నలమదే యమృతంబు
కమనీయలక్షణాకరము గాదె
గురుహావరుచి పేరఁ గురియదే వలిమంచు
పరిపూర్ణతర సుధాకరము గాదె
యుదుటుక్రొవ్వేదపేర నొరయదే ఘనరాజి
నిగనిగ తారకాన్వితము గాదె
సిద్ధమగు చెక్కుటద్దంబు నీడ పేర
బింబము వహింపదే ప్రసన్నంబు గాదె.... —3 ఆ. 99 ప.

పై పద్యమునందు కుముద్వతిపరముగ, చంద్రునిపరముగ శ్లేష నుపయోగించినాడు

కువలయము–భూమి, కలువ

కుముద్వతి మోము భూమండలమునకు ఆనందము కల్గించునట్లు మొలక నవ్వులను కురిపించుచున్నదని ఒక అర్థము

చంద్రుడు కలువలకు ఆనందము కల్గించునట్లు వెన్నెలను కురిపించు చున్నాడని రెండవ అర్థము

అమృతముతో సమానమైన అధరమాధుర్యముగల ఆమె మోము సౌభాగ్య లక్షణములతో ఒప్పుచున్నదని కుముద్వతిపరమైన అర్థము

అమృతమయుడై, చక్కని లక్షణములతో ఒప్పుచున్నాడని చంద్రుని పరమైన అర్థము

ఆమె మోము అధికమైన హావభావముల కాంతితో సుధాకరమైనదని కుముద్వతిపరముగ వర్ణించెను

తెల్లని మంచును కురిపించుచు చంద్రుడు అమృతమయుడని మఱొక భావము

కుముద్వతి మోము నిగనిగలాడు కనుపాపలతో ప్రకాశించుచున్నదనియు, చంద్రుడు తారకలతో కూడియున్నాడని 'తారక' అను పదమునకు కనుపాపలు, నక్షత్రములను అర్థముతో శ్లేషను ప్రయోగించినాడు

14. '—సమధిక హంసకాప్తిని నెసంగెఁ బురాహరి
పాదసేవలన్ — 3 ఆః 109 ప.

హంసకాప్తి-చిన్నహంసలతో సహవాసము
పాదమంజీరము ధరించుట

పద్మములే కుముద్వతి పాదములుగ జన్మించుటచేత చిన్న హంసలతో సహవాసము చేసినవని పద్మములపరముగ ఒక అర్థము కుముద్వతి పాదములు పాదమంజీరము ధరించెను అని 'హంసకాప్తి' అను పదయినందు శ్లేషను వాడినాడు

15. అకలంకద్విజవన్యవృత్తి వనమధ్యక్షోణి వర్తింపుచున్
ప్రకటప్రక్రియనాగమాంతపరిచర్యాధుర్యతన్ మించి రా
మకథావైఖరు లుగ్గడించి ఫలసంప్రాప్తిన్ విజృంభింపఁగా
శుకనామంబు ఘటించెఁగా యుజుఁడు మించుంబోడి
రాచిల్కకున్ — 4 ఆః 58 ప.

'శుకము' అను పేరు చిలుకకు ఎట్లు కలిగినదో కవి శ్లేషాలంకారము ద్వారా చమత్కరించి చెప్పినాడు

శుకయోగిపరముగను, చిలుకపరముగను అర్థములు వచ్చునట్లు వివరించెను

ద్విజ–బ్రాహ్మణుడు పక్షి

ఆగమము–వేదము, చెట్టు (ఆగమ శబ్దముకంటె స్వార్థమునందు వృద్ధి రూపము)

ఫలము–మోక్షము పండు

వనమునందు సంచరించుచు, ఉపనిషత్తులలో చెప్పబడినవిధముగ సేవాధురీణుడై, రామకథావిశేషములను చెప్పుటద్వారా మోక్షప్రాప్తి కలుగుచున్నదని శుకమహర్షిపరముగ అర్థము

వనమునందు సంచరించుచు సమీపించినవారికి సేవించుటయందు నేర్పరితనము చూపి రామకథావిశేషములను చెప్పుటద్వారా ఫలప్రాప్తి కలుగుచున్నదని శుకముపరముగ అర్థము

## 1. వర్ణనలు

కవి యొక్క ఊహావైశిష్ట్యమును చాటునవి వర్ణనలు ఈ ఊహ సందర్భసన్నివేశరసాదుల ననుసరించి యుండవలెను కేవలము కవియొక్క మేధాసంపత్తిని ప్రకటించునట్లుండరాదు దృశ్యము కన్నులకు కట్టునట్లు చేయుటకును, కథాకథనము పేలవము కాకుండ నూత్న చైతన్యమును కలిగించుటకును వర్ణనలు కావ్యములందు ఆవశ్యకములై యున్నవి వర్ణనకు ఔచిత్యము, స్పష్టత ప్రధానమైనవి

కావ్యవర్ణనగురించి మొదట చెప్పినవాడు భామహుడు అతని 'కావ్యాలంకారము'నందు ఐదు మాత్రమే పేర్కొనినాడు అవి 'మంత్ర దూత్య ప్రయాణ యుద్ధ నాయకాభ్యుదయములు [1] అష్టాదశ వర్ణనలను మొదట చెప్పినవాడు దండి

'నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః
ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవైః
విప్రలంభై ర్వివాహైశ్చ కుమారోదయవర్ణనైః
మంత్రదూత ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి'

– కా ద: 1–16, 17 శ్లో॥లు

1 కావ్యాలంకారము - ప్రథమ పరిచ్ఛేదము, 20 శ్లో

1 నగరము, 2 పర్వతము, 3 ఋతువులు, 4. చంద్రోదయము, 5 సూర్యోదయము, 6 ఉద్యానవనము, 7 సలిలక్రీడ, 8 మధుపానము, 9 రతి, 10 విప్రలంభశృంగారము, 11 వివాహము, 12 కుమారోదయము, 13 సముద్రము, 14 మంత్రము, 15 దూత్యము, 16 ప్రయాణము, 17 యుద్ధము, 18 నాయకాభ్యుదయము

చివరి ఐదువర్ణనలు భామహుడు పేర్కొనినవె విద్యానాథుడు దండి ననుసరించి 'ప్రతాపరుద్రీయము'లో అష్టాదశ వర్ణనలనే చెప్పెను కాని 'దూత'కు బదులుగ 'ద్యూత' వాడినాడు పెక్కు ప్రబంధములయందు దౌత్యమే వర్ణింప బడినది కావున అష్టాదశవర్ణనలయందు 'ద్యూతము' కంటె 'దూత్యము' సమంజసము

విశ్వనాథుడు 'సాహిత్యదర్పణము'నందు ఇరువదినాలుగు వర్ణనలను పేర్కొనెను

సంధ్యా సూర్యేందు రజనీ ప్రదోషధ్వాంతవాసరాః
ప్రాతర్మధ్యాహ్న మృగయా శైలర్తు వన సాగరాః
సంభోగ విప్రలంభౌచ ముని స్వర్గ పురాధ్వరాః
రణ ప్రయాణోపయమమంత్ర పుత్రోదయాదయః
వర్ణనీయా యదాయోగం సాంగోపాంగా అమీఇహ

— సా.ద. — 6–619–21

1 సంధ్యాకాలము, 2 సూర్యుడు, 3 చంద్రుడు, 4 రాత్రి, 5 సాయంకాలపు సంధ్య, 6. చీకటి, 7 పగలు, 8 ప్రాతఃకాలము, 9 మధ్యాహ్నకాలము, 10 వేట, 11 పర్వతము, 12 ఋతువులు, 13 అడవులు, 14 సముద్రము, 15 సంభోగశృంగారము, 16 విప్రలంభ శృంగారము, 17 ముని, 18 స్వర్గము, 19 యజ్ఞము, 20 యుద్ధము, 21 ప్రయాణము, 22 వివాహము, 23 మంత్రము, 24 పుత్రోదయము

కేశవమిశ్రుడు 'అలంకార శేఖరము'[1] నందు వర్ణన లింకను పెంచి ముప్పది రెండు వర్ణనలను పేర్కొనెను

వర్ణ్యశ్చ రాజాదేవీచ దేశో గ్రామః పురీసరిత్
సరోఽబ్ధ్య రణ్యోద్యానాద్రి ప్రయాణ రణ వాజినః

---

కావ్యమాల - కేశవమిశ్రుని అలంకార శేఖరము - ఎడిటర్ పండిత శివదత్త, పు 46

హ స్త్యర్క చంద్రావృతవో వివాహోద స్వయంవరః
సురాపుష్పాంబు సంభోగః విశ్లేష మృగయా(శ్రమాః
కలాఋతు వయస్సంధీ ధాతు వృక్షాభిసారికాః

1 రాజు. 2 రాణి 3 దేశము. 4 గ్రామము. 5 పురము. 6 నది. 7 సరస్సు. 8 సముద్రము. 9 అరణ్యము. 10 ఉద్యానవనము. 11 పర్వతము. 12 ప్రయాణము 13 రణము 14 గుఱ్ఱము, 15 ఏనుగు, 16 సూర్యోదయము 17 చంద్రోదయము. 18 వివాహము 19 స్వయంవరము. 20 సురాపానము. 21 పుష్పాపచయము 22 జలకేళి, 23 సంభోగము, 24 విరహము 25 వేట. 26 ఆశ్రమము, 27 కళ. 28 ఋతువు 29 వయస్సంధులు, 30 ధాతువు. 31 వృక్షము. 32 అభిసారిక

మొత్తముమీద దండి, విశ్వనాథుడు. కేశవమిశ్రుడు క్రమముగ పదునెనిమిది, ఇరువదినాలుగు ముప్పదిరెండు వర్ణనలు పేర్కొనిరి అష్టాదశ వర్ణనలలో ఉన్న వర్ణనలు కొన్ని విశ్వనాథుడు కేశవమిశ్రుడు పేర్కొనలేదు విశ్వనాథుడు 1 ఉద్యానవనము 2 సలిలక్రీడ 3 మధుపానము, 4 యాత్రము. 5 నాయకాభ్యుదయము, 6 పట్టణముల గురించి చెప్పలేదు కేశవమిశ్రుడు 1 కుమారోదయము 2 మంత్రము 3 దూత్యము 4 నాయకాభ్యుదయమును విడచిపెట్టినాడు విశ్వనాథుడు. కేశవమిశ్రుడు అష్టాదశ వర్ణనలలో లేని అన్యవర్ణనలను ప్రవేశపెట్టిరి అవి - 1 సూర్యుడు. 2 చంద్రుడు 3 రాత్రి. 4 చీకటి. 5 పగలు. 6 ప్రాతఃకాలము. 7 మధ్యాహ్నకాలము 8 వేట 9 అడవులు 10 ముని, 11 స్వర్గము, 12 యజ్ఞము 13 రాజు 14 రాణి. 15 దేశము. 16 గ్రామము. 17 నది 18 సరస్సు, 19 అరణ్యము. 20 గుఱ్ఱము. 21 ఏనుగు 22 స్వయంవరము. 23 పుష్పాపచయము. 24 ఆశ్రమము, 25 కళ. 26 వయస్సంధులు 27 ధాతువు. 28 వృక్షము 29 అభిసారిక 30 సాయంకాలము

తెలుగు లాక్షణికులైన విన్నకోట పెద్దన నరసభూపాలీయకర్త అష్టాదశ వర్ణనలను పేర్కొనిరి అప్పకవిఅష్టాదశ వర్ణనలలోని 'దూత్యము'నకు బదులు 'ద్యూతము'ను చెప్పి 'వేట, ఆశ్రమము కన్యాంగసౌందర్యము దౌహృదము అను నాలుగు వర్ణనలను అధికముగ చెప్పెను అనగా మొత్తము ఇరువదిరెండు వర్ణనలను పేర్కొనెను సాధారణముగ వర్ణనలు వివిధ రసపోషకములు లాక్షణికులు చెప్పిన దృష్టితో ప్రయత్నపూర్వకముగ చేసిన వర్ణనలు ఒక్కొక్కసారి కావ్యసౌందర్యమునకు ఆటంకము కలిగించును అందుచేత కవులు రసాను

గుణముగ, తమ కవసరమైన వర్ణనలను మాత్రమే గ్రహించి మిగిలినవానిని వదలి వేయుదురు అన్ని వర్ణనలు లేనంతమాత్రమున కావ్యము కావ్యము కాకపోదు

## చారుచంద్రోదయములోని వర్ణనలు

'చారుచంద్రోదయము' వర్ణనా ప్రధానమైన ప్రబంధము. సంస్కృతాంధ్ర మహాకావ్యములందువలె ఇందు అనేక వర్ణనలు కన్పించుచున్నవి. వర్ణన లన్నియు ప్రాచీన కవుల ననుసరించినవే ఇతర ప్రబంధకవుల వర్ణనలకు, చెన్నమరాజు వర్ణనలకును భేదము అంతగ కన్పించదు ఇందు కథకన్న వర్ణనల కెక్కువ ప్రాధాన్యము కలదు అష్టాదశ వర్ణనలలో సముద్రవర్ణనము తప్ప మిగిలిన పదునేడు వర్ణనలు చారుచంద్రోదయమునందు కలవు అవి 1 పురవర్ణన, 2 పర్వత వర్ణన 3 ఋతువులు 4 చంద్రోదయము 5 సూర్యోదయము 6 ఉద్యానవనము, 7 జలక్రీడ, 8 మధుపానము 9 సంభోగ శృంగారము 10 విప్రలంభ శృంగారము, 11 వివాహము, 12 కుమారోదయము 13 మంత్రము 14 దూత్యము, 15 ప్రయాణము, 16 యుద్ధము, 17 నాయకాభ్యుదయము

## చారుచంద్రోదయములోని అన్యవర్ణనలు

1 ఆశ్రమము, 2 కన్యాంగ సౌందర్యము, 3 దౌహృదము, 4 పుష్పాపచయము, 5 తపస్సు, 6 ఇంద్రుని కొలువుకూటము (స్వర్గము), 7 ముని, 8 రాజు, 9 సూర్యుడు, 10 చంద్రుడు, 11 ప్రాతఃకాలము, 12 సాయం సంధ్య, 13 గుల్మము, 14 నది, 15 సరస్సు

పయి వర్ణనలను చేయుటలో కవి చూపించిన పాండిత్యప్రకర్ష, భావనాశక్తి నిరుపమానము ఈ వర్ణనలు కథానుగుణముగను, కాలసూచకముగను, పాత్రలకు సంబంధించినవిగను, రసవంతముగను ఉన్నవి వీనివలన చెన్నమరాజు యొక్క వర్ణనావైవిధ్యము వ్యక్తమగుచున్నది

## పురవర్ణన

చారుచంద్రోదయమునందు ద్వారావతీపురమును (1 ఆ 95–124), రత్నకేతన పురమును (2 ఆ 72–74) వర్ణించినాడు. సంప్రదాయము ప్రకారము కావ్యము పురవర్ణనతో ప్రారంభమైనది ద్వారావతీపురమును ముప్పది పద్యములలో ప్రౌఢముగ వర్ణించెను

చంద్రశాలాశరచ్చంద్రబింబాననా
సంస్మారి తామర సముదయంబు
గగనాబ్జగేహినీకటికింకిణీభవ
ద్గాంగేయవప్రశృంగవ్రజంబు
వియదవేళా మరుద్విభుచాపభావనా
ప్రౌఢరత్ననిశాంతబంధురంబు
హరిదశ్వకాంతవాహప్రియంభావుకో
దారగోపురకేతు మారుతంబు
త్రిదశకల్లోలినీజాలపదకలాప
లాపనధురీణ మణిహర్మ్యలాస్యకార
కీరవాణీవతంససంక్రీడ దంఘ్రి
నూపురంబొప్పు ద్వారావతీపురంబు — 1 ఆ. 95

ఈ పురమునందలి మేడలు చంద్రశాలయి ఆ చంద్రశాలల యందు నివసించు స్త్రీలు దేవతాస్త్రీలు అను భ్రాంతిని కలుగచేయుచు ఒప్పుచున్నారు ఆకాశగంగలోని పద్మమునందు వసించియున్న లక్ష్మీదేవి మేఖలాకింకిణులవలె ఆ సౌధముల బంగారు కోట కొమ్మలు ప్రకాశించుచున్నవి ఆ నిశా సమయమునందు భవనములమీది రత్నములు ఇంద్రచాపమా అను భావము కలుగు విధముగా కాంతులతో అలరారుచున్నవి ఈ పట్టణ గోపురములమీద నున్న జెండాలనుండి వీచు వాయువు సూర్యుని గుఱ్ఱములకు అలసట తీర్చుచున్నవని ఉత్ప్రేక్షించినాడు ఇంకను ఆకాశగంగలో కమనీయముగ సంచరించు హంసలను తక్కువచేయుచు మణిహర్మ్యములందు నాట్యము చేయుచున్న స్త్రీలయొక్క పాదమంజీరములతో నొప్పుచున్నవని ద్వారావతీపురమును వర్ణించినాడు

విచికిలగంధులందుఁ దెలివెన్నెలరే లమరాద్రితోఁ గచా
కచిఁబచరించు మేడల సుఖస్థితి నా రతికేని పాడఁగా
నచటి కళానిధుల్ గరఁగు టబ్బురమే ? మిహికారసోర్మికా
నిచయమిషంబునన్ గరఁగు నింగి కళానిది వేయునేటికిన్—
1 ఆ. 101

వెన్నెల రాత్రులందు ఈ పట్టణ సౌధములు మేరుపర్వతముతో పోటీ పడుచున్నవట మేరుపర్వతము దేవతల నివాసము గనుక దేవతలకన్నను ద్వారావతీ

పట్టణములోని మేడలలో నివసించు స్త్రీలే ఎక్కువ సుఖముగ నున్నారను భావము కలిగించువిధముగ పయి పద్యమునందు కవి వర్ణించినాడు

మేలిమెఱుంగు మానికపు మేడలపై యపరంజికుండ లు
ద్వేలరథావరోధమొదవించిన వాజుల సందుసందులన్
దోలెడు సూర్యసారదిఁ గనుంగొని కుండలలోన గుఱ్ఱముల్
దోలెడునంచు నవ్వుదురు తొయ్యలు లచ్చటఁగేలిసేయుచున్
– 1 ఆ: 109

ఆ పట్టణసౌధములు ఎత్తుగా నుండుటచేత ఆ మేడలమీద నున్న బంగారు కుండలు సూర్యునియొక్క రధసారధికి అడ్డువచ్చుచున్నవి అతడు మావి చూచి గుఱ్ఱములను ఆ కుండల సందులనుండి తోలుచుండగ ఆ పట్టణస్త్రీలు కుండలలో గుఱ్ఱములను తోలుచుండెనని పరిహసించుచుండిరి ఈ విధముగ కవి ఆ పట్టణ సౌధముల ఔన్నత్యమును వర్ణించినాడు

పురవర్ణనలో చతుర్వర్ణములవారిని, వారి వృత్తులను, చతురంగబలమును, రాజును, అతని పరిపాలనను మొదలయిన విషయములను వర్ణించుట సంప్రదాయము అదే విధముగ చెన్నమరాజు బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను, రైతులను, వేశ్యలను, పుష్పలావికలను, గుఱ్ఱములను, రధములను, కాల్బలమును, తోటలను, రాజమార్గములను (1 ఆ, 110–24) వర్ణించెను

ఆ పురములోని రైతులు పండించిన ధాన్యరాసులు ఆకాశగంగయంత ఎత్తుగ నున్నవని ఈ క్రిందివిధముగ వర్ణించినాడు—

రాజితధరణీధరవి
భ్రాజిత వివిధైకధాన్యరాశులమీఁదన్
బూజని సురనది కలువలఁ
బూజింపుదు రచటి హాలికపుంగవు లెలమిన్ – 1 ఆ: 113

గజవర్ణనలో కవి ఒక అపూర్వమైన కల్పన చేసెను ఇటువంటి కల్పన ఏ ప్రబంధకవి తమ కావ్యములందు చేయలేదు ఉదా–

వలనొప్పన్ గడికొమ్ముపై యచటి మావంతుల్ పిడేనుంగు గు
న్నలపై నెక్కి నొకింత నిక్కి శశిలోనన్ గప్పు బల్మ్రి ని

చ్చలు తుండింపఁగఁ గానలేక యునికిన్ శాఖోపశాఖోన్నతిన్
దళమై యూడలుఁబారి ముంచుకొనదే తారాధిరాణ్మండలిన్
- 1 ఆ. 117

ఈ పద్యము ఆ పట్టణములోనున్న ఏనుగుల యొక్క ఔన్నత్యమును తెలియజేయుచున్నది మావటివాండ్రు తమ గున్నఏనుగుల నెక్కి వానికి ఆహారముగ చంద్రునిలోగల మఱ్ఱిచెట్టు ఆకులను తుంచివేయుదురట అటుల చేయనిచో ఆ చెట్టు వ్యాపించి మిక్కిలి దట్టమై చంద్రుడినే కప్పివేసియుండెడి దని ఉత్ప్రేక్షించి చెప్పినాడు

## రత్నకేతనపుర వర్ణన

సాధారణముగ కవు లందరు పురవర్ణన తామే చేయుదురు ఈ సంప్రదాయమును ద్వారావతి పట్టణ వర్ణనయందు చెన్నమరాజును పాటించినాడు కాని రత్నకేతనపుర వర్ణన మాత్రము 'త్రికాలవేది యను చిలుక, నాయకుడైన చారుచంద్రునకు కుముద్వతి జననవృత్తాంతమును చెప్పు సమయమున చేయబడినది

ఇందు పట్టణములోని మణిసౌధమును ఒక స్త్రీగ భావించి వర్ణించినాడు

గగనతరంగిణీనిబిడకాంచనపద్మపరాగసంగతిన్
దగఁ బసుపాడి మేఘమునఁ దాసిక దట్టముగఁగట్టి రిక్కరా
మగువుల కుత్తికంట్లిడి హిమద్యుతి నద్దముఁజూచుచున్ బెడం
గగు మణిసౌధలక్ష్మిఁ దనరారు మహోన్నతి నప్పురంబునన్
- 2 ఆ. 74

ఆకాశగంగలో దట్టముగా నున్న కాంచనపుష్పముల పుప్పొడిని శరీరమునకు పూసి స్నానముచేసి మేఘమును పావడ గట్టి నక్షత్రములను కంఠమున ఆభరణముగ అలంకరించుకొని, వెన్నెల యను అద్దమున తిలకించుచున్న మణిసౌధ మనెడు లక్ష్మి ప్రకాశించుచున్నది

## పర్వత వర్ణన

ఇందు రైవతక పర్వతమును గుఱించి ఏడు పద్యములలోను, ఒక పెద్ద వచనము (2 ఆ, 12, 14-20) నందు వర్ణించినాడు నాయకుడైన చారుచంద్రుడు రైవతక పర్వత వనములలో విహరించు సందర్భమున శైలవర్ణన చేసినాడు చారు

చంద్రుడు. అతని చెలికాడు రైవతక పర్వతమును చూచిరి ఆ పర్వతము సూర్యుని గుఱ్ఱముల యొక్క అలసటను పోగొట్టగల సెలయేటియొక్క చల్లని గాలులతో దిట్టముగ అలముకొని యున్నది కవి పర్వత వర్ణనను చెలికానితో చెప్పించెను జననాథాగ్రణికి నర్మసచివుడు చెప్పుట రాజమర్యాద కనుక చెన్నమరాజు రాచ మర్యాదను ఈ సందర్భమున పాటించినాడు

పర్వత సమీప ప్రాంతమునందు సంచరించు చెంచుస్త్రీలు కెంపురంగుతోనున్న గురిగింజదండలను వేసుకొని ఆకులను వస్త్రములుగ ధరించుటను వాస్తవిక వర్ణించెను

గెంటని కెంపునింప గురిగింజలదండలు పాఱుటాకు ప
య్యంటలు శాతమార్గణశరాసనముల్ గని కాకవేల్పు వా
ల్గంటులఁ గూడియాడుచు మెలంగెడు కల్కిమిటారి చెంచువా
ల్గంటుల నేర్పరించి పలుకందరమా నృప॰ యీ నగంబునన్
-2 ఆః 17

## ఋతువర్ణన

### గ్రీష్మఋతు వర్ణన

కవి కాలసూచకముగ గ్రీష్మ ఋతువును (2 ఆ. 3-9) వర్ణించినాడు

పగలు బంగరుకమ్మి బలితంపుఁ గమ్మచ్చు
దవ గంధవహబంధు ధమన ధమని
కలిగొట్టు విరిమొగ్గ గమిరిక్క తుదసంజ
వశ్చిమాశోజ్జ్వల పవనభస్త్రి
పుడమి పెన్మోదవుమై బెడిదంపుఁబులిగోరు
పదికయాయోపరి ప్రళయవార్త
చిగురుఁగైదువు రాచపొగరు నిద్దుర టెంకి
ఘర్మాంబువృష్టి భేకస్వనంబు
గండుకోయిలమూక వాకట్టుమందు
ఖగమృగాంభశ్చరాహార కాళరాత్రి

బొండుమల్లియచూలాంౘ్ర ప్రొద్దులనెల
గ్రీష్మమేతెంచె లోకైక భీష్మ మగుచు -2 ఆ: 3

గ్రీష్మ ఋతువు కమసాలి బంగారురేకును వెడల్పు చేసిన విధముగ పగటివేళను ఎర్పడ్డమచున్నది కొలిమితిత్తితో అగ్నిహోత్రము జ్వలింపినరీతిగ దావాగ్ని హోత్రమును పెంచుచున్నది పాటలీవృక్ష మనెడి నక్షత్రములు తుద అయిన సంధ్యలో విరిమొగ్గలవలె గ్రీష్మ ముండి వడమటి గాలులతోను, భూమి విటలు వారి బాటసారులకు మిక్కిలి దుఃఖమును కలిగించుచున్నది ఈ సమయమున మన్మ థుని దర్పము అణగారిపోయి వర్షాకాలమున వర్షధారలు కురియునట్లు చెమటలు పట్టుచున్నవి ఈ వేసవి కొయిలలు నొటికి మంచువలె నుండి పక్షులకు మృగము లకు, చేపలకు తిండి లేకుండ చేయుచున్నది బొండు మల్లియలు వికసించుటకు తగిన సమయము వలె గ్రీష్మ మేతెంచినది

ననవిల్కాడను బాదుషా గినుకఁ బాంధశ్రేణిపై నా మజా
దనుపన్ మాధవుడన్ వజీరుఁడు నిజోద్యానోచితస్ఫూర్తి స్యం
దనముల్ మావులు గండనాగములు పున్నాగంబులున్
బూన్చి గె
ల్పెనయన్ వేలము వెల్గఁజేసి చనునా హెచ్చైన్
వనీదావముల్ -2ఆ. 5ప

ఈ వెసవి సమయమున మన్మథు డను పాదుషా బాటసారులమీద అలిగినాడు ఆ బాటసారులకు ఆనందమును కలిగించుటకు వసంతు డను వజీరుడు ఉద్యానవనము లోని మామిడి చెట్లను, పున్నాగచెట్లను రథములుగ పూన్చి ఆ ఉద్యానవనములోని దావాగ్నిని చల్లార్చినాడట

ఇంకను సొగసుగల వాలుజడలతో బొండుమల్లెలు ధరించిన స్త్రీలు పసిడి చెంబులతో చల్లని నీరిచ్చి బాటసారులకు సేవ తీర్చుచున్నారు ఆ వేసవిలో కర్పూర శీతల పానీయములను వాలుచూపులతో పాంథులకు ఇచ్చుచున్నారని స్త్రీలను రెండు పద్యములలో రమ్యముగ వర్ణించినాడు

వలిచన్నుం జిగి కావిమోవిపసలన్ వాలారు కంజూపులన్
నెలరాగిండ్లపరంజికెంజలువ మెల్నీలంపు రాగిండ్ల చా

యలఁజూపట్టఁ బ్రపాప్రపాలికలు సారామోదకర్పూరశీ
తలపానీయముఁ గ్రోలఁజేయుదురు పాంథశ్రేణి నవ్వేసవిన్
—2 ఆ: 9

చెన్నమరాజు మఱియొకచోట గ్రీష్మఋతువును (2 ఆ. 137) కథానుగుణముగ చేసినాడు. సంతానప్రాప్తికై రాజగు పద్మాకరుడు మునుల సలహా ననుసరించి కఠినమైన తపస్సుకు పూనుకొనెను ఆ సందర్భమున ఋతువర్ణనను ప్రవేశపెట్టినాడు అనగా రాజు కాలానుగుణముగ ఇంద్రియ నిగ్రహమును కలిగి తపస్సు చేసెనని వ్యక్తపఱచెను

## వసంతఋతు వర్ణన

కుముద్వతి విరహవేదన చెందుచున్న సమయమున కవి ఆమనిని (4 ఆ. 37–42, 55) వర్ణించినాడు

జలదము పాదునీటఁ దము సంతతమున్ మును ఋచ్ఛు
కొన్న య
ప్పులకయి యడ్డగింప ఫలపుష్పము లయ్యెడనేమిలేమి వా
టిల గతిలేక పత్రములిడెన్ దరుకోటి యనంగ సంతతా
నిలహతి పండుటాకు గమి నిండె నభోంగణసీమ నామనిన్
—4 ఆ: 38

వసంతసమయమున పండుటాకులు రాలి, ఎగురుట సహజసిద్ధమయిన విషయము దానికి కవి ఒక హేతువును కల్పించి చక్కని ఊహ చేసినాడు మేఘములు వృక్షములకు నీటిని ఈయక, తామింతకుముందు తీసికొనిన అప్పుకై అడ్డగించినవి అప్పు తీర్చుటకు ఫలములు, పుష్పములు లేక బలముగ వీచు వాయువు వలన పండుటాకులను మేఘములకిచ్చి ఋణ విముక్తులయినట్లు పై పద్యమునందు మనోహరముగ వర్ణించినాడు

తమిపువ్వు తేనియల్ తనివితీఱగఁ గ్రోలి
చెలరేఁగి గానముల్ సేయు నళుల
నతి సౌరభాంకురంబాకంఠముగ మెక్కి
క్రొవ్వి కూకలుపెట్టు కోకిలముల

లలితమాదుర్యసత్ప్వలరసంబులు ద్రావి
కలకలములు సేయు చిలుకగములు
చాయాతరుచ్ఛాయ జలదమాలిక యంచు
సారె నర్తించు మయూరతతుల
నవనవామోదభరిత నానాప్రదీప్త
భూజరాజ సుమమరంద రాజి రాజి
మలయనిలయా నిలాంకూర మహితవిహిత
నిత్యశైత్యావనుల్ నెగడెనపుడు -4 ఆ. 42

వసంతఋతువు మిక్కిలి హృద్యముగ నున్నదని చెలికత్తెద్వారా నాయిక యైన కుముద్వతికి కవి చెప్పించినాడు. ఇచట వసంతకాలములోని ప్రకృతి ధర్మమును సహజసిద్ధముగ వర్ణించినాడు.

## వర్షఋతు వర్ణన

తపోవర్ణనలో గ్రీష్మఋతు వర్ణన ముగిసిన వెంటనే చెన్నమరాజు వర్షఋతు వర్ణన పది పద్యములలో (2 ఆ 140-49) చేసినాడు

నానాటన్ దరదాదిగా బడలి డెందంబంబుదధ్వానశం
పాళీకంబు లు విన్నఁ గన్నఁ బ్రమదంబందన్ గ్రమోద్వాసిత
గ్లానిన్ నైజజలంబు చాతకపుమూకల్ చల్లఁగ్రోలన్ దదీ
యానందాశ్రుకణాళి తొల్చినుకులౌ నంబోదరశ్రేణికిన్
-2 ఆ. 142

శరత్కాలము ప్రారంభించి వర్షాకాలము వచ్చువరకు నీరులేక చాతకపక్షులు బడలియున్నవి వర్షాకాలము రాగానే మేఘగర్జనను విని మెఱుపుతీగలను చూచి సంతోషము పొంది చల్లని నీటిని త్రాగి ఆనందించినవి ఆనందాతిరేకమున వాటి కన్నులనుండి పడుచున్న బాష్పబిందువులవలె తొలకరి చినుకులు పడసాగెను

అలరఁ బయోదరాటనము హంసకముల్ గదలంగ వేణి కో
చ్ఛలనముమించఁ గంకణపు సందడి హెచ్చఁగ రోదసీవదూ

తిలకము, వారిదాయన పతిన్ రతిఁబై కొని క్రీడసల్పఁగా
జలజలరాలు హారమణిసంతతినాఁ గరకాళి భాసిలెన్
_2 ఆ: 143

కవి రోదసిని స్త్రీగను, మేఘమును పురుషునిగాను ఊహించినాడు రోదసి అను కాంత తన స్తనమండలము కదులుచుండ (మేఘములు కదులుచుండ), పాద కటకములు ఆడుచుండ (చిన్నహంసలు పరుగిడుచుండ), జడ కదల్చుచుండగ (నదీ ప్రవాహములు హెచ్చుగుచుండ), కంకణముల చప్పుడు పెరుగగ (నీటి బిందువుల సందడి అతిశయింపగ) మేఘ మను భర్త ను స్వీకరించెను ఆతని సంపర్కము వలన జలజలరాలు మణుల యనునట్లు వడగండ్లు నేలపై పడెను

తళుతళుకుతళుకుమనఁగాఁ
దొలి మించులు మించనంచ తొలఁగెన్ మలఁగెన్
జలముల యుబ్బుల మబ్బులు
ఫెళఫెళమని యుఱిమె జల్లు పెల్లునఁ గురిసెన్ _2 ఆ: 144

వర్షపు జల్లులు తళుకుమని తొలి మెఱుపులు అతిశయింపగ, మబ్బులు ఫెళఫెళమని ఉఱుమగ పెల్లున గురిసినవి ఇందులో సహజమైన వర్ణన గలదు ఇచట 'పెల్లున గురిసినద'ని జాతీయమును వాడినాడు 'ఫెళ ఫెళ, తళుకు తళుకు' అను ధ్వన్యనుకరణములను ప్రయోగించినాడు

ననబోడి నిడువాలు కనుడాలు సరిఁబోలు
తొగగుంపు జిగిపెంపు దొలఁగఁజేసె
నవచంచలాంగి లేనడుమించు వెలయించి
నంచబోదల గంచు మించఁజేసె
కోడె గుబ్బెతమోము తోడునీడనఁగూడు
హరిణాంకు జలధరాంతరితుఁజేసె
లతకూన కటి తటోన్నతి తీరుఁగని మీఱు
పులిన వైఖరి నీటఁ గలయఁజేసె
సకట ప్రాణేశ్వరీ జ్ఞాపనానురూప
వస్తువీక్షా సుఖంబు దైవంబు కంటి

కింత ప్రేఁగయ్యెనే యని వంతనొందె
ప్రావృడాగమపరిపాటి పాంథకోటి  —2ఆ. 145

పథికజనము కాంతావియోగమును భరింపలేక వర్షాకాలమున తమ కాంత అవయవములతో సమానమగు వస్తువులను గాంచి విరహమును పోగొట్టు కొనుట సహజము దాని నాధారముగ కవి యీ పద్యమును రచించెను తమ ప్రియురాలు వాలుచూపులతో సరియగు కలువలను చూచి ఆనందించెద మనిన ఆ కలువలన్నియు నీటిచే కప్పబడెను ఆమె నడకల ననుసరించు చిన్న హంసలను చూచి సంతోషించెద మనిన అవి యెగిరిపోయెను ఆమె ముఖముతో సరియగు చంద్రబింబము మేఘముతో కప్పబడెను ఆమె కటిప్రదేశమును బోలు పులిన తలమును చూచి సంతోషించెద మనిన అదికూడ నీటిలో కలిసిపోయెను దైవము కనిసము ఈ సౌఖ్యముకూడ మనకు లేకుండచేసెను అని పథికులు విచారించు చుండిరి

పనివడి నాథుఁగానక తపఃస్ఫురణన్ గృశియించు నిమ్నగా
వనరుహపత్రనేత్రలఁ బ్రవాహసమేతులఁ జేసి మేఘుఁ డ
వ్వననిధిఁగూర్చి. జీవనము వారక యించె నటంచు నెచ్చటన్
ఘనునకుఁ జేసినట్టియుపకారము మిన్నకపోవనేర్చునే
— 2 ఆ: 146

వేసవికాలమునుండి తన భర్తయైన సముద్రుడు తమకు కనపడకపోవుటచే నదు లన్నియు కృశించిపోయినవి అపుడు నదులకు మేఘుడు జీవము పోసినాడు అనగా వర్షపునీటితో ఆ నదిని విస్తృతపఱచినాడు ఈ అభిప్రాయమును రూప కముతో ఒక పెద్దమనిషి, భర్తృవియోగముతో కృశించుచు తపస్సు గావించుచున్న కాంతను తన భర్తతో కూర్చి ఆమెకు జీవనమును ప్రసాదించెను అను అర్థముతో అభేదము గావించి వర్ణించెను ఇంకను 'ఘనునకుఁ జేసిన యుపకారము మిన్నక పోవనేర్చునే' అను అర్థముతో పైన చెప్పినదానిని చక్కఁగ సమర్థించినాడు

కాదంబవితతియుఁ గాదంబవితతియు
పరువము మురువుముఁ బరిచయింప

వనశిఖిజాతంబు వనశిఖిజాతంబు
జయమును లయమును సరవినొంద

ప్రోదినీకాండంబు ప్రోదినీకాండంబు
కలిమియు బలిమియు గలిగి చెలఁగ
నర్జునపాళియు నర్జునపాళియు
పసిమియు రసిమియు నెసఁగిపొసఁగ
నీపములును బలాకాకలాపములును
బ్రిసవముఁ బ్రసవమును గాంచి పరిడవిల్లఁ
దనరె నంతంతఁ బాంధులఁ దరిమిపోరు
సూనశరుమేటి దుముదారు వానకారు - 2 ఆ: 149

పదముల చమత్కృతితో, శబ్దాడంబరముతో వర్షఋతువును వర్ణించి అటువంటి వర్షఋతువునందు కూడ రాజు పద్మాసనము వేసికొని, గోవర్ధనుని మనసులో నిలుపుకొని బట్టబయలు ప్రదేశము నందు తపస్సుచేయాచున్నాడని కవి వర్ణించెను.

## శరదృతు వర్ణన

శరదృతువును కవి తపస్సందర్భమున మూడు పద్యములలో(2 ఆ. 152-54) వర్ణించినాడు

కవి ఋతువర్ణనలను వర్ణించుటలో ఒక ప్రత్యేకతను నిలుపుకొనినాడు

నిదురమేల్కొను శౌరి పదముఁజేరెడి వేల్పు
గముల వజ్రపు విమానము లనంగఁ
గమ్మఁదెమ్మెర పైకిఁ జిమ్మ నాకాసమంటి
నిప్పైన కపురంపు లప్పలనఁగఁ
గలకదీఱిన తమ్మికొలను నీట జరింప
నవనికేతెంచు రాయంచలనఁగఁ
వినువాక ప్రతిఫలించిన దండుపననుండు
రాపిండు వెలిగుడారము లనంగ
నలనభోలక్ష్మికై సమయంపుఁజాకి
చలువ లొనరించి మిన్నేటి కెలసనార

నిడిన దువటంబులగు స్వాతిమడుగులనఁగ
మినుకులీనుచు వెలిమబ్బు తునకలెసఁగె -2 ఆ: 154

శరత్కాలమున శేషశయ్య నుండి లేచిన శ్రీవిష్ణువును దర్శించుటకు పోవు చున్న వజ్రములతో నిర్మించిన దేవతల విమానము లనునట్లుగ, గాలి గట్టిగ వీచగ ఆకాశమున కేగి అచట నిలచిన కర్పూరపు తిప్పలా యనునట్లు, చెఱు వులలోనుండు నీరు స్వచ్ఛమగుటచే ఆకాశము నుండి క్రిందికి దిగివచ్చు హంసలా యనునట్లు సైన్యము దాటిపోవగ మిగిలి, ఆకాశగంగలో ప్రతిఫలించు రాజు తెల్లగుడారములా యనునట్లు మబ్బుతునుకలు ఒప్పుచున్నవి ఇంకను ఆకాశ లక్ష్మికై కాలమను రజకుడు చలువచేసి ఆకాశగంగా సమీపమున ఆరగట్టిన తెల్లని వస్త్రములా యనునట్లుగ చిన్నచిన్న మబ్బుతునకలు శరత్కాలమున తెల్లని కాంతు లతో కనిపించుచున్నవి

## హేమంత వర్ణన

హేమంత వర్ణన మూడు పద్యములలో (2 ఆ, 156-58) చేయబడినది

హేమంతమున ఎక్కువ మంచు పడుటచె ఆకాశము నుండి చూచువారందఱికి హిమవత్పర్వతము నందు మఱియొక హిమవత్పర్వతమున్నట్లు కనపడుచుండెను అటువంటి సమయమున రాజు ఎక్కువ మంచుతో కూడిన కంఠసుపోతు నీటిలో ధీరుడై చలింపక తపస్సు చేసినట్లు వర్ణించాడు

కవి ఐదు ఋతువులను మాత్రమె వర్ణించి 3ిర ఋతువు ను విడచి పెట్టినాడు

## చంద్రోదయము

కవి కుముద్వతి విరహసందర్భమున చంద్రోదయ వర్ణనను పది పద్యము లలో (4 ఆ, 120-24, 5 ఆ, 3-77 చేసినాడు

గగనసౌధాదారకల్పిత నూతన
స్ఫటికశిలా స్తంభచయమనంగ
శార్వర నిరసనోత్సాహియౌ నుడురాజు
గెడపిన చిల్కపావడలనంగ
నంతికస్థమ హేంద్రదదంతికర్ణోపాంత
ఘటితముక్తాదామకములనంగ

సమ్భృతాబ్ధితనయ మోహమునఁ జంద్రునకు ముం
గలిగ నంపిన తరంగము లనంగఁ

జతికళానిధి యరుదేఱఁ బ్రమదమందు
రజని కింద్రాశపేరి సైరంధ్రిముడువ
నెత్తువిరియెత్తులో యన నిందు రుచులు
గగనమునఁ గొన్ని యల్లన నెగయుఁదెంచె- 4 ఆ: 123

కవి ఈ పద్యము నందు - చంద్రుని కిరణములు వేరువేరుగా బయలుదేరి. క్రమముగ పలుచగ ఒక వస్త్రము మాదిరిగా తయారయి పిదప దట్టముగ వ్యాపించి నవి అని చెప్పుటకు తన కవిత్వములో సొగసును చూపించినాడు

చేఁతకురాని దువ్వటము చేతికిరాని వెలంది యానవాల్
వ్రాఁతకురాని స్రావ్యసలిలంబును బూతికిరాని పువ్వుటిం
తీఁతకురాని పాలకడలెక్కఁగరాని వడంకుఁ గొండమై
పూఁతకురాని చందనము పున్నమవెన్నెల పర్వెనుర్వరన్
- 5 ఆ: 6

చేయుటకురాని దుప్పటి. చేతికిరాని స్త్రీ. వ్రాయుటకు పనికిరాని ప్రవాహము. ఈతకురాని పాలకడలి, ఐశ్వర్యమునకు ఉపయోగపడని ఇంతి, ఎక్కలేని మంచు కొండ. శరీరమున పూయుటకు పనికిరాని గంధము మాదిరిగ పున్నమివెన్నెల యున్న దట ఈ ఉపమానములు చమత్కారముగ నున్నవి ఇంతకుముందు ఎవరును ప్రయోగింపని ఉపమానములు ప్రయోగించినాడు తరువాత వెన్నెలను ఒక పెద్ద వచనమునందు వర్ణించినాడు

## సూర్యోదయము

కవి సూర్యోదయమును నాలుగు పద్యములలో (5 ఆ . 36-39) వర్ణించెను. కుముద్వతి విరహముతో బాధపడుతున్న సమయమున. ఆమెకు చారుచంద్రునితో వివాహము నిశ్చయమైనదను శుభవార్తను చెలికత్తె తెలియజేసినది ఆ శుభవార్త విని రాజకన్య తన మనస్సులో మిక్కిలి ఆనందమును పొందినది అప్పటివరకు అలముకొనిన దుఃఖమను చీకట్లుపోయి ఆనందమను వెలుగు ఆక్రమించినదను భావము సూచించుటకుగాను ఇచట సూర్యోదయమును వర్ణించినాడు ఈ వర్ణనా సందర్భము ఇతని సమయస్ఫూర్తిని తెలుపుచున్నది

## ఉద్యాన వనము

ఉద్యానవనము శృంగారరసమున కుద్దీపన విభావము చైత్ర సంపద. వృక్షములు, పుష్పములు, శుకపికాదుల కలకలము మొదలైనవి ఉద్యానవన విశేషములు

రైవతక పర్వతమును వర్ణించునపుడు, ఆ పర్వత ప్రాంతము నందున్న వృక్షములను, పుష్పములను, శుకపికాదుల కలకలములను గూర్చి చెప్పెను

ఇక్కడి పొరువంపురొదలీ పొద లీ కదళీవనోత్కరం
బిక్కడి చంద్రకాంతదరు లీ తరులీ విరులీను సౌరభం
బిక్కడి తావి దీవి మెకమీ పిక మీ శుకవాక్యవైభవం
బెక్కడ నెక్కుడై తగు మఱెక్కడ నిట్టివిలేవు భూవరా

— 2 ఆ. 16

కవి కుముద్వతి విరహమును వర్ణించునపుడు ఉద్యానవన వర్ణనను ప్రవేశ పెట్టినాడు ఈ ఘట్టమును పదునారు పద్యములలో వర్ణించెను (4 ఆ. 56-71)

ఇది కందళితకుంద మిది నందవనబృంద
మిది నందదరవింద మిందువదన ·
యది తుంగతరతుంగ మది సంగతలవంగ
మది యంగజతురంగ మణువలగ్న·
యిది జంభలకదంబ మిది బింబనికురంబ
మిది పంబర కదంబ మేణనయన ·
యది వంజులనికుంజ మది మంజుల కరంజ
మది గుంజదళపుంజ మనుపమాంగి ·
యువిద· యవి తామరకొలంకు లవి జవాది
వలపుల కెలంకు లల్లవి చలివెలుంగు
చలువరాటెక్కు వీక్షింపు సరవితోడఁ
గనులకుఁ బండువై చాలఁ గనఁగనయ్యె — 4 ఆ· 57

ఇందు కవి ఇందువదన, కందళిత, కుంచ నంద, బృంద, అరవింద, తుంగ, వంగ, తురంగ మొదలగు పదములు ప్రయోగించుటచే అతని భాషా పటిమను, శబ్దాలంకార సౌష్టవము తెలియుచున్నది ఉద్యానవన వర్ణనచేయునపుడు కవి—

శుంభన్నూతనబంధుజీవనికరాస్తోకాగ్నిలో బంభరీ
డింభాచ్ఛధ్వనిదంభమంత్రపరిపాటిన్ దామరందాహుతుల్
సంభావ్యంబుగ వేల్చి కాంచెనది పున్నాగంబు రంభాపరీ
రంభారంభసుఖంబు జూచితె శరద్రాజీవపత్రేక్షణా

— 4 ఆ: 59

అని "రంభావృక్ష, పున్నాగ" వృక్షముల సహవాసమును కవి చమత్కారముగ వర్ణించెను పురుషశ్రేష్ఠుకు యజ్ఞమునందలి హోమమును మంత్రపూర్వకముగ నాచరింప ఆ యజమానికి రంభాసంభోగము లభించునని శాస్త్రము అట్లే యిచట పున్నాగము, బంధుజీవపుష్పములను అగ్నిలో, చిన్న తుమ్మెదల ఝుంకారమను మంత్రములతో, మకరందమను నేతిని బోయుటచే రంభాపరిష్వంగము ఆ పున్నాగమునకు లభించెనని రూపకాలంకారముతో వర్ణించినాడు

కవి చూతలతను నటిగా ఊహించి చక్కని వర్ణన చేసినాడు

అలరుం గ్రొవ్విరిగుత్తిభృంగభరితంబై బంతియైమించఁజూ
తలతాఖ్యాననటీవధూటి వనపద్మకాంత చెంతన్ మహా
బలుఁడొయ్యయ్యఁ బరాగపుందెరఁదెరల్పన్ బల్లవాంచత్కర
మ్ములఁ బుష్పాంజలి సంఘటించె విగళత్పుష్పావళీ
దంభంబునన్ — 4 ఆ: 64

ప్రభువుల సమక్షమున నర్తకి నృత్యము చేయుటకు ముందు తెరవేయబడి యుండును దానిని ఒక వ్యక్తి తొలగింపగ, ఆ నర్తకి ముందుగవచ్చి తన చేతులతో పుష్పములను ప్రభువునకు సమర్పించును అదేవిధముగ ఉద్యానవనమునందు "చూతలత"యను నటి వనలక్ష్మి సమీపమున తుమ్మెదలతో నిండిన పూలగుత్తులను ధరించి యుండగ, వాయుదేవుడు పరాగమను తెరను తొలగింపగ చూతలత ఆ పూవులను వనలక్ష్మి చెంగట విడిచెనట

వనమునందలి వృక్షములు గాలివశమున ఒకదానితో నొకటి కలసి కొమ్మలతో రాపాడుచుండుటను మల్లులు ముష్టియుద్ధమును చేయుచున్నట్లున్నదని వర్ణించెను

పుష్పాడి మట్టిఁబూసి పికపోతనినాదపు మాతఁజేసి మైఁ
జిప్పిలు తేనెనెత్తురులఁ జింద మిళిందపుఁజాళ్ళు తాళ్ళుగా
నొప్పఁగ శాఖికాకర మహోద్ధతిఁబోరెడు చెట్లు జెట్లు నాఁ
గప్పురగంధి! గంధవహకల్పితఘర్షణకై తవంబునన్
- 4 ఆ. 65

మట్టిని పూసికొనుట, హుంకారముచెయుట, శరీరమున నెత్తురువారుట, త్రాళ్ళతో కట్టివేసినట్లుగ ఒకరికొకరు ఎదురుబంధములతో పోరాడుట మున్నగు విశేషములతో ముష్టియుద్ధమును కన్నులకు కట్టినట్లు చిత్రీకరించెను పైన ఉదాహరించిన రెండు పద్యములు చెన్నమరాజు ఊహావైశిష్ట్యమును చాటుచున్నవి

## సలిలక్రీడ

విప్రలంభశృంగారమున కనుబంధముగ ఈ వర్ణన చేయబడినది కుముద్వతి, ఆమె సఖులు పుష్పాపచయ మొనరించిన తరువాత అలసి ఒక కాసారమును మాచి అందు జలక్రీడ చేయుటకు పూనుకొందురు ఈ జలకేళి వర్ణన పదునాలుగు పద్యములలో సాగినది (4 ఆ, 90-103)

జలక్రీడ సమయమున ఒక చెలి నిలువుగ ఈదుచున్నది ఆమె ఈదునపుడు ముఖబింబము చంద్రబింబమువలె సరస్సుపైకి కనిపించుచున్నది ఆమె కేశములు ముఖబింబము నంటి సాగుచున్నవి ఆ దృశ్యమును కవి తన ఊహాచమత్కృతితో ఆకాశమున చంద్రుని మ్రింగుటకు వెంటాడుచున్న రాహువుతో అద్భుతముగ పోల్చినాడు

నిలువన నీదె నొక్క సితనీరజపత్రవిశాలనేత్ర ని
ర్మలవదనంబు వెంబడి నరాళతరాయత నీలవేణి వే
తలఁపుచు జారిపోయెడు సుధాకరబింబము వెంటనంటి యు
గ్గలికముబోవు రాహువనఁగాఁదగి యెంతయుఁబొల్పఁ
మీఱగన్ - 4 ఆ. 94

జలకేళిని స్వభావోక్తి అలంకారముతో ఉన్నదున్నట్లు చక్కని పదములతో అతి సులువుగ వర్ణించినాడు

ఒకచోటఁగ్రుంకి వేఱొకచోట గ్రక్కున
నగుచుఁ దటాలున నెగయువారు

సముదగ్రతటజాతశాఖిశాఖల నిల్చి
తొడరి గుభాలున దుముకువారు
పెక్కండ్రు గుమిగూడి యొక్కతెఁ దెలినీట
రువ్వి కకావిక నవ్వువారు
కపురంపుఁగొమ్ములఁ గమ్మదేనియ నించి
వేచి చటాలున వేయువారు
నగుచు జలకేళి యొనరించి యలసి సొలసి
కొలను వెలువడి వెడవింటి బలువజీరు
పులుకడిగినట్టి పువ్వుఁదూపులా యనంగఁ
దత్తటంబున నిలిచిరి తరుణులెల్ల — 4 ఆ: 102

జలకేళీ వర్ణన కథోచితముగ, పాత్రానుగుణముగ చేయబడినది విరహముతో నున్న నాయిక ఉద్యానవన విహారమును కోరుకొనును ఇచట కుముద్వతి చెలులతో వనవిహారమునందు పుష్పాపచయము చేసి అలసి సొలసి జలకేళి కుద్యుక్తురాలగుట సమంజసముగ నున్నది

## మధుపానము

కవి మధుపానమును, స్త్రీ పురుషుల శృంగార విలాసములను చంద్రికావర్ణన సందర్భమున వచనమున వర్ణించినాడు (5–7)

"మఱియుఁ గొన్నితావుల పూవుల తీవలఁ బ్రబలు వాసనాధౌరేయంబులగు మైరేయంబులు నాకంఠంబుగ గ్రోలి యన్నునఁ గన్నుల నిదుర గదుర నెదల పయ్యెదలుజాఱ నిమురించుతఱి వల్లభులు బిగియఁ గౌఁగిలించి బింబాధరములాని "

'మఱియుఁ గొన్నియెడల దళుకు దివాణంబులగు హరివాణంబులఁ గాదంబరి నెంచి తదీయాధిదేవతల కర్పితంబు గావించి సగందంబు సగంబు గ్రోలు నోలుచు విటులపై వ్రాలుచు, మేలంబు లాడుచుఁ జిందులాడుచు, యేలలు పాడుచు మదన కదనంబునకు మల్లచఱచుచు మేను మఱచుచు ప్రియుల గాఢంబుగాఁ గౌఁగిలింపుచు మోవులు నజ్జుగావింపుచు ' మధుమదోన్మత్తమత్తకాశినులు విహరించెడివారు

## సంభోగశృంగారము

కుముద్వతీచారుచంద్రుల రతికేళి పదునైదు పద్యములలో (5 అ. 110-24) వర్ణింపబడినది

కుచములంటఁగఁబోయి గొబ్బున భ్రమియించి
గేలిమై నీవికిఁ గేలుసాచు
కురులు తీర్చఁగఁబోయి సరుగున భ్రమియించి
పూని వాతెఱ కమ్మఁదేనె కొడియు
వేణిఁబట్టఁగఁబోయి వేగంబె భ్రమియించి
ఘన జఘనంబుపై కరము నిలుపు
నడుగు లంటఁగబోయి తడబడ భ్రమియించి
తోడనే మెఱుఁగుఁ బెందొడలు నిమురు
హారములు చూడఁబోయి నీహార కిరణ
తులితముఖచారుచుబుకంబుఁ దొడరిపట్టి
మనుజపతి బాలికామణి మదనకదన
సాహసక్రీడ నలయించ నూహ సేసి - 5 అ. 116

కవి శృంగారరసాసక్తులైన నాయికా నాయకులను కన్నులకు కట్టినట్లుగా పై పద్యమునందు చిత్రీకరించినాడు పదునైదు పద్యములయందును సంభోగ శృంగారము అత్యంత వాస్తవికముగను, మనోహరముగను ఉన్నది

## విప్రలంభశృంగారము

కవి చారుచంద్రోదయము నందు నాయికానాయకులకు పరస్పర సందర్శనము వివాహము ముందే కలిగించెను ఈ నాయికానాయకుల పరస్పర సందర్శనమునకు మూలసూత్రధారి త్రికాలవేది యను చిలుక చిలుక తన ఐంద్రజాలిక విద్యచే నాయకుని అదృశ్యము చేసి ఒక ఉద్యానవనమునందుంచి అచటకు తన నేర్పుతో నాయికను ఆకర్షించెను ఈ విధముగ నాయకునికి నాయిక దర్శనము కలుగును తరువాత నాయికకు అంజనమువేసి నాయకుని చూపించును ఇది అంతయు తృతీయాశ్వాసమున జరుగును నాయిక దర్శనానంతరము ద్వారకకు వెళ్ళి చారుచంద్రుడు విరహతాపమును పొందెను అదే విధముగ కుముద్వతి రత్నకేతన పురమున

వియోగము ననుభవించెను నాయకుని విరహము చతుర్థాశ్వాసము నందు (4 ఆ. 21–27) వర్ణించెను కుముద్వతి విరహవర్ణన (30–44) పదునైదు పద్యములలో చేయబడినది కవి విప్రలంభ శృంగారమునకు ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చెను చతుర్థాశ్వాసమంతయు నాయిక విరహముతోనే పూర్తిగా సాగినది ఈ సందర్భము ననే వసంతము, వనము, పుష్పాపచయము, జలకేళి, మన్మథపూజ, చంద్రో దయము, సూర్యాస్తమయము, చంద్రోపాలంభనము, మన్మథోపాలంభనము మలయమారుత, శుకపికముల ఉపాలంభన, శిశిరోపచారములు మొదలగునవి వర్ణించెను

## వివాహము

కుముద్వతీ చారుచంద్రుల వివాహము సంప్రదాయబద్ధముగ వివరింప బడినది మనుచరిత్రాదుల మాదిరిగ హైందవ సంప్రదాయప్రకారము విపులముగ వర్ణింపబడినది పురాలంకరణ, పేరంటాండ్రు నలుగిడుట, చారుచంద్రుని అలంక రించుట కుముద్వతిని పెండ్లికుమార్తెను చేయుట, వివాహానంతరము కట్నములను చదివించుట, కుమార్తె పసుపుకుంకుమల క్రింద తండ్రి కానుక లిచ్చుట, కూతురుకు అత్తమామల యింట మెలగు పద్ధతిని ఉపదేశించువరకు సమస్తము విపులముగ వర్ణింపబడినది

వివాహ సందర్భమున పట్టణమంతయు పరువింద వజ్రాది రత్నములతో, నిర్మలమైన అద్దములతో నిర్మింపబడిన తోరణములను కట్టిరి దానికి కవి చక్కని ఊహ చేసినాడు

వనజహితేందు లాత్మ ఘనవంశజరాజసుతాతిదివ్యశో
భనవిభవంబుఁజూడ బహుభంగుల మేనులుదాల్చి వచ్చిరో
యనఁగురువిందవజ్రసముదంచితనిర్మలదర్పణాతినూ
తనతర తోరణావళులు దట్టములయ్యెఁ బురాంతరంబునన్
– 5 ఆ; 43

పెండ్లికుమారుడైన చారుచంద్రుడు చంద్రవంశమునకు చెందినవాడు పెండ్లి కుమార్తె యైన కుముద్వతి సూర్యవంశము నందు జనించినది తమ వంశస్థులైన వధూవరులను చూచుటకై వచ్చిన సూర్య, చంద్రబింబముల మాదిరిగ ఆ తోర ణములలోని దర్పణాదులు కనపడుచుండెనట

వివాహవేదికను కవి లక్ష్మీదేవితో సామ్యమొనర్చినాడు అనగా అచేతన పదార్థమైన వితర్దికను, చేతనమైన లక్ష్మీదేవితో పోలిక చెప్పినాడు

అంబోజరాగంబు లరుణపాదంబులై
చిగురాకు మోవియై సొగసుఁ జూపఁ
దళుకువజ్రపునిగ్గు లెలనవ్వు మొలకలై
ముత్యాలసరములై మురువు నింప
నీలాల చకచకల్ నిడువాలుఁజూపులై
పెన్నెఱి జొంపమై చెన్నుమీఱ
నెలరాఱ మినమినల్ కలికి చెక్కుల మిన్కు
లై చెల్వ దువ్వల్వలై రహింప

నపుడు సాక్షాత్కరించిన యనుపమాన
శోభనాంబోజగేహినివై భవమున
ప్రకటరుచిమించు నవరత్నరాజమాన
శుభవితర్దిక యదురాజసుతుఁడు వచ్చె — 5 ఆః 84

వేదిక పద్మరాగమణులతోను, వజ్రములతోను, ఇంద్రనీలమణులతోను చంద్రకాంతమణులతోను నిర్మింపబడినది పద్మరాగమణులు లక్ష్మీదేవి ఎఱ్ఱని పాదములవలె, చిగురాకు పెదవి మాదిరిగ యున్నవి వజ్రపుకాంతులు మందహాసములను, ముత్యాల మాలలను పోలియున్నవి ఇంద్రనీలమణుల కాంతులు నిడువాలు చూపుల వలెను కేశపాశముల వలె నొప్పుచున్నవి లక్ష్మీదేవి చెక్కిలి మాదిరిగ, ఆమె ధరించిన తెల్లని వస్త్రమువలె చంద్రకాంతమణులు ప్రకాశించుచున్నవి కావున ఆ వివాహవేదిక సాక్షాత్కరించిన లక్ష్మీదేవి మాదిరిగ ఒప్పుచున్నదట

## కుమారోదయము

రుక్మిణీ శ్రీకృష్ణులకు చారుచంద్రుడు ఉదయించుటను కవి ఇట్లు వర్ణించెను

గ్రహములు నాలుగు నొక్కట
మిహిరునిఁజేరంగఁబోని మేలిమివేళన్
రహిమీఱ సుతునిఁ గనియెన్
మహిళామణిభోజకన్య మాధవుఁడలరన్ —1 ఆ., 154

తరువాత పద్మాకరునకు ఒక కుమారుడు. కుమార్తె జన్మించినట్లు చెప్ప బడినది

నవమాసంబులు నిండినం గనియె నానాళీకపత్రాక్షి రా
జవరేణ్యుండలరన్ శుభగ్రహము లుచ్చస్థంబులై పద్మబాం
ధవునిన్ డాయఁగఁబూని యట్టి సుముహూర్తంబందు
సౌందర్యభూ
రివిభాశాలిఁ గుమారచంద్రునిఁ గుమారీరత్నమున్
వేడుకన్ —2 ఆ: 80

## మంత్రము

పుష్కరుడను రాక్షసుడు మిక్కిలి పరాక్రమవంతుడు యుద్ధమునందు అజేయుడు అతనివలన మునిజనానీకము పెక్కు బాధలు పొందుచుండిరి అపుడు ఇంద్రుడు బ్రహ్మ దగ్గఱకువెళ్ళి ఆ రాక్షసుని చంపుటకు ఉపాయము ఆలోచింపుమని ప్రార్థించెను బ్రహ్మ శ్రీకృష్ణుని పుత్త్రుడైన చారుచంద్రుడు ఒక్కడే అతనిని సంహరించుటకు సమర్థుడు అని చెప్పెను అంతట ఇంద్రుని పనుపుపై శాంతభూషణుడను ముని చారుచంద్రుని యొద్దకువచ్చి. అతనిని ప్రోత్సహించి పుష్కరుని మీదకు యుద్ధమునకు పంపెను

ఇంద్రుడు పద్మాకరుని తపస్సునుగుఱించి తెలియగానే భయపడి గురువైన బృహస్పతిని పిలిపించి ఆ రాజు తపస్సును విఘ్నము చేయు విధమును తెలుపుమని అడిగెను దానికి బృహస్పతి శీఘ్రముగ అప్సరసలను, వాయువును, కంతుని, వసంతుని, చంద్రుని తపోవనమునకు పంపుము అని సలహా చెప్పెను

## దూత్యము

కవి త్రికాలవేది యను చిలుకను దూతగ ప్రవేశపెట్టెను కుముద్వతీ జనన వృత్తాంతమును, ఆమె సౌందర్యమును చిలుకపాత్రద్వారా పలికించెను కుముద్వతిని గుఱించి చారుచంద్రునకు, చారుచంద్రుని గుఱించి కుముద్వతికి చెప్పి అంజనము వేసి వారిరువురు ఒకరినొకరు చూచుకొనునట్లు ఏర్పాటు చేసెను నాయికానాయకుల మధ్య ప్రేమ జనించుటకు త్రికాలవేదిని ప్రధానపాత్రగ తీర్చిదిద్దెను

## ప్రయాణము

పద్మాకరుడు సామ్రాజ్యాధిపత్యమును అమాత్యునకు అప్పగించి సంతాన ప్రాప్తికై కార్తాంతికులు నిర్ణయించిన ముహూర్తము ప్రకారము అరణ్యమునకు ప్రయాణమయ్యెను (2 ఆ, 117 118) ఇంకను చారుచంద్రుడు వివాహ ముహూర్తమునకు ప్రయాణ మగుటను ఒక పద్యము నందును, వచనము నందును (5 ఆ, 73, 74) పేర్కొనినాడు

## యుద్ధము

శాంతభూషణు డను మునిద్వారా పుష్కరుని రాక్షసకృత్యములను విని చారుచంద్రుడు పుష్కరుని మీదికి యుద్ధమున కేగెను వారిరువురి సైన్యములను, యుద్ధమును కవి పదునైదు పద్యములతో (2 ఆ 47-60, 62) వర్ణించెను యుద్ధ వర్ణన సులభశైలిలో సాగిపోయినది

పెటపెట పండ్లుగీఁటి పటుభీకరఖడ్గముసారెఁజిమ్ముచున్
గటముల ఘర్మబిందువులు గ్రందుకొనన్ జటులాక్షికోణముల్
జొటజొట విస్ఫులింగముల సోనలసీనఁగ నట్టహాసము
త్కటముగఁజేసి యాప్తులఁ బ్రధానులఁగన్గొని
దర్పమేర్పడన్ —2 ఆ, 45

ప్రతినాయకుడైన పుష్కరుడు రౌద్రముతో చేసిన చేష్టలను కవి మన కనులకు కట్టినట్లు చిత్రీకరించి చూపించినాడు

## నాయకాభ్యుదయము

నాయకుడైన చారుచంద్రుడు పుష్కరుని సంహరించి విజయమును పొందెను ఆ సందర్భమున -

కూడిరి దైత్యరాజుఁ జెఱగొన్న సురాంగన లాత్మనాథులన్
పాడిరి కిన్నరుల్ మణివిపంచిక లల్లన మీటి మాటుఁగా
నాడిరి దేవతాసతు లుదారతఁ దూర్యరవంబుమీఱఁగా
పొడిరి దానవుల్, దివిజవర్యులు వీడిరి భీతి నెమ్మదిన్
—2 ఆ., 62

ఇంకను దేవేంద్రుడు సంతుష్టుడై అతనికి పెక్కు కానుక లిచ్చి, ఒక విలు కను కూడ బహుమతిగా నొసంగెను

## కన్యాంగసౌందర్యము

నాయిక సౌందర్యమును వర్ణించుట ప్రబంధ కవిత్వమునందు సర్వ సాధారణము కాని 'కన్యాంగ సౌందర్యము'ను వర్ణనగ పేర్కొనిన మొదటి లాక్షణికుడు అప్పకవి ఈ వర్ణన సాధారణముగ కవులు చేయుదురు ఇతర పాత్రలచేత నాయికావర్ణన చేయించుటకూడ మన ప్రబంధములందు అరుదు కాదు 'చారు చంద్రోదయము' నందు కుముద్వతి సౌందర్యమును నాయకునిచేతను, త్రికాలవేది యను చిలుక పాత్రద్వారా చేయించెను నాయిక బాల్యవర్ణన అనంతరము ఆమె యౌవనమును వర్ణించుచు కన్యాంగసౌందర్యవర్ణనను చిలుక చారుచంద్రునకు వినిపించును (3 ఆ. 88-111) కుముద్వతీ సౌందర్యమును అంగాంగ వర్ణన చేయుటలో చెన్నమరాజు ఇతర ప్రబంధకవులను అనుసరించిపోయెను పూర్వకవులు ఉపయోగించిన ఉపమానములనే స్వీకరించినాడు

కుముద్వతి అవయవ విలాసమును వర్ణించుచు ప్రతి అవయవమునకు ప్రసిద్ధ ఉపమానములను స్వీకరించినను అవి యన్నియు శ్రీకృష్ణునిపరముగచేసి ఒక నూతనమైన మార్గమును త్రొక్కెను

శిఖిపింఛమహిమ మెంచెను గొప్ప నునుఁగొప్పు
విధుమహాభిఖ్యమై వెలసె మోము
కమలాంబకగురుత్వగతిఁగాంచెఁ గన్నులు
చిందంబురేవఁ జెన్నొందె గళము
గిరిసమున్నతిఁబూని పఱఁగెను జనుదోయి
భుజగాతిశాయియై పొలిచె నారు

ఇందు శిఖిపింఛము, విధుడు, కమలాంబకుడు, శంఖము, గిరిసమున్నతి, భుజగాతిశాయి, ఘనచక్రవిస్ఫూర్తి, గజముచే సన్నుతుల్, కూర్మరూపము మొదలగు విశేషణము లన్నియు శ్రీనివాసుని భావనలే కన్యాంగ సౌందర్యమును శ్రీకృష్ణునితో పోల్చుటలో కవియొక్క వైష్ణవభక్తి ప్రకటిత మగుచున్నది

కుముద్వతి కురులను వర్ణించునపుడు నూతనమైన కల్పన చేసినాడు

తేటయగు మౌనిజనహృత్కవాటవాటిఁ
బాటితము సేయు నవ శరాభ్యాసమునకు
నొసలు టద్దంబుపై నిల్పు నసమశరుని
గుఱులు గానోపు నల లతకూనకురులు —3 ఆ. 89

మొలకనవ్వులపేరఁ జిలుకదే రేయెండ
కువలయోల్లాసివైభవము గాదె
యధరమాధురిపేర నలమదే యమృతంబు
కమనీయలక్షణాకరము గాదె
గురుహావ రుచిపేరఁ గురియదే వలిమంచు
పరిపూర్ణతరసుధాకరము గాదె
యుదుటుఁగ్రొవ్వెదపేర నొరయదే ఘనరాజి
నిగనిగ తారకాన్వితము గాదె
సిద్ధమగు చెక్కుటద్దంబు నీడపేర
బింబము వహింపదే ప్రసన్నంబుగాదె
కంటి కుత్సవమగు కలకంఠకంఠి
మోము నెఱచందురుఁడు గామి కేమి గతము —3 ఆ. 99

పై పద్యమునందు కవి నాయిక లక్షణములను చంద్రుని లక్షణములతో సమన్వయించి చెప్పినాడు అది ఎట్లనిన కుముద్వతి మోము మొలకనవ్వులను కురిపించును చంద్రుడు వెన్నెల నిచ్చును ఆమె మోము ప్రపంచమునకు ఆనందము నిచ్చును చంద్రుడు కలువలకు వికాసము నిచ్చును ఆమె అధరమాధుర్యము అమృతముతో సమానము చంద్రుడు అమృతమయుడు ఆమె ఆననము సౌభాగ్యలక్షణములు కలది చంద్రుడు చక్కని లక్షణములు కలవాడు ఆమె చల్లని హావభావములను చూపించును చంద్రుడు చల్లని మంచు కురిపించును. ఆమె అమృతమునకు నిధి చంద్రుడు అమృతకరుడు ఆమెకు పొడవైన కేశపాశము కలదు చంద్రునకు మేఘపంక్తి కలదు ఆమెకు నిగనిగలాడు కనుపాప కలదు చంద్రుడు తారకలతో కూడియుండును చక్కని నిర్మలమైన గండభాగము కలదు చంద్రునకు బింబము అనుపేరు గలదు ఈరెండును ప్రసన్నములే కావున పూర్ణచంద్రునితో కుముద్వతి మోము అన్నివిధముల సరిపోవునని కవి వర్ణించినాడు

ఆమె పాదములు పద్మముల వలె నున్నవని చెప్పుటకు కవి చక్కని చమత్కార మొనర్చినాడు

సమదమతంగజప్రకటసంగచరన్మధుపావళీసమా
క్రమణము రోఁగి లేచి విడఁగానక జీవనమందుటెంత మా
త్రమని పయోజముల్ సతిపదద్వయమై జనియించి
నిచ్చలున్
సమధికహంసకాప్తిని నెసంగెఁ బురాహరి పాదసేవలన్
—3 ఆ: 109

ఏనుగు గండస్థలముల యందు సంచరించుటచేత తుమ్మెదలకు నీచత్వమును ఆపాదించినాడు తుమ్మెదలు సంతతము తనపై వ్రాలుచు, లేచుచునుండును కావున అటువంటి జీవనము వ్యర్థమని తలంచి తామరపూవులు కుముద్వతి పాదములై జన్మించినవట అట్లు పుట్టుటచే ఆ పాదములకు 'హంసకాప్తి', 'హరి పాదసేవ' లభించెనట

బలు గుబ్బలలరు వంతలను చెట్టని చిఱు
నవ్వు వెన్నెల వేగనవ్వు టెట్లు

తళుకుఁ బెందొడ లనంటులఁ గూలపని నడల్
కరటి మదవడచు కడిఁది యెట్లు

వెడదకన్నుల తమ్మి విరిరేకు మదవతి
నెమ్మోము సోముఁ గుందించు టెట్లు

కెంపుమోవి చిగుళ్ళు ద్రుంపని ముద్దు మా
టలు పికంబుల తావెడలుచు టెట్లు

వింతయని యెంతు రిది యేమి వింత దెలియ
ఘనచికురగాదొ! హరిమధ్యగాదొ! రాహు
రోమలత గాదొ! రామాభిరామ గాదొ!
నవ్యసౌందర్యధామ, కాంతాలలామ —4 ఆ: 9

కవి యిచట కుముద్వతిని 'ఘనచికుర, హరిమధ్య, రాహురోమలత, రామాభిరామ' అని సంబోధించి యిటువంటి లక్షణము లుండుటచేతనే వెన్నెలను,

ఏనుగు నడకలను, చంద్రమండలమును, కాకిలను తిరస్కరించుచున్నదని చక్కని కారణములను చూపి మనోజ్ఞముగ వర్ణించినాడు

## ఆశ్రమము

చిలుకబోదలఁ జేరఁబిలిచి వేదార్థంబు
సరహస్యముగఁ దెల్పు సాళువములు
కోడెనాగుల గూర్చి కూర్మితో నుపనిష
త్పటలి వక్కాణించు బర్హిణములు
నెలుక పిల్లలకు బుద్ధులు జెప్పి యోగంబు
సాంగంబుగా నేర్చు ముంగిసలును
సింగంపుఁ గొదమల చెక్కిళ్ళు వడివెట్టి
సాంఖ్యంబుఁ జదివించు శరభములును
గలిగి యలిగీతి (కా) హేతుకలితతిలక
వికచలికుచపరిస్ఫుటముకుళవకుళ
పరమపరిమళకేళికాభవనపవన
విశ్రమగతశ్రమమగు సిద్ధాశ్రమంబు — 2 ఆ. 128

అని ఆశ్రమసమీపమున జంతువులన్నియు శత్రుభావమును విడిచి మైత్రితో జీవించుచున్నవని సాధారణముగ వర్ణించినాడు

## దౌహృదము

చారుచంద్రుని గర్భముతో నున్న రుక్మిణిని గురించి నాలుగు పద్యములలో (1 ఆ. 148-51) వర్ణించెను నాయిక యైన సముద్వతి తల్లి యొక్క దౌహృదమును మూడు పద్యములలో (3 ఆ. 77-79) వర్ణించెను

## పుష్పాపచయము

పుష్పాపచయమును కవి (4 ఆ. 73-86) పదునాలుగు పద్యములలో వర్ణించెను

గుజ్జు లేమావి గ్రైకొనెఁ గిరసల్లాప,
యటుబోవకమ్మ బింబాధరోష్ఠి
వలపుఁద్రొవ్విరి గొమ్మవచ్చె సింధురయాన,
యటుబోవకమ్మ పద్మాయతాక్షి
కేళికానగము చక్కి వసించె ఘనవేణి!
యటుబోవకమ్మ యో హంసగమన
యలమె గేదఁగిగుంపు లహిరాజరోమాళి!
యటుబోవకమ్మ యేణాంకనయన

యని యొక గయాళినవ్వ జవ్వని యొకర్తు
సాంకవామోదలార! పంచముఖమధ్య
లార! పావనచారిత్రలార! చక్ర
వరపయోధరలార! పోవచ్చు ననియె — 4 ఆ: 73

చిగుళ్ళను చేకొనుట కేతెంచిన చిలుకలవలన దొండపండువంటి పెదవులకు, విరిసిన పుష్పశాఖలతో నిండిన వనములోని ఏనుగులవలన పద్మములవంటి కళ్ళకు, ఆకాశము నంటు కేళికానగమునగల మేఘమువంటి కురుల వలన హంసగమనము లకు, మొగడపూవు లలముకొన్న సర్పశ్రేష్ఠుని (రాహువు)వంటి నూగారువలన చంద్రునివంటి కన్నులకు అమిత్రత్వము నాపాదించి ఒక చెలి వనప్రదేశమువలదని వారింపగా, మరియొక చెలి "సాంకవామోద, పంచముఖమధ్య, పావనచరిత్ర, చక్ర పయోధర" అను సంబోధనల నుపయోగించి పూర్వ విరుద్ధముగ వనగమనమునకు సూచించెను ఇందు ముఖ్యముగ గమనింపదగినది కవి చెలులు సంభాషణ యనెడి వ్యాజముతో వసంతశోభను, ప్రకృతి విశేషములను మనోహరముగ వర్ణించెను

కవి అకాలదోహదాదులను (4 ఆ, 74-82) తొమ్మిది పద్యములలో వర్ణించెను

ప్రేంకణపు చెట్టు స్త్రీల సంపర్కమున, పగడచెట్టు ముఖమద్యమును ఉమ్ముట చేతను, అశోకము తన్నుటచేతను, తిలకవృక్షము చూచుటచేతను, గోరింట ఆలింగ నముచేతను, మందారవృక్షము చమత్కార సంభాషణమున, సంపెంగ మృదువుగ నవ్వుటచేతను, మామిడి ముఖమారుతముచేతను, సురపొన్న సంగీతముచేతను, కొండగోగు నృత్యముచేతను వికసించునని కాళిదాసు మొదలగు కవులుచెప్పిరి ఇంచు మించు అదేవిధముగ చెన్నమరాజు కూడ వర్ణించినాడు.

పుష్పాపచయదోహదక్రియలను సఖులు సంభాషిటను అంత్యాను ప్రాసతో నున్న రగడలో (4 ఆ. 83) వర్ణించెను

అతనుధర్మచ్ఛేదమని విచారించి యో
కుసుమకోమల విరుల్ గోయదయ్యో
పల్లవగోష్ఠి యొప్పదటంచుఁ దలఁచి యో
కిసలయోష్ఠి చిగుళ్ళు గిల్లదయ్యోఁ
గడు రాజసప్రవృత్తి గాదనియొపరాగ
సితహాస పుష్పొడిఁ జెనకదయ్యో
ఫలభంగములు సేయ పాపంబనియె దాడి
మీపల స్తని పండ్లు మీటదయ్యో
ననుచు రోలంబపికములు ననిలశుకము
లను దయాంచితదృష్టిఁ గన్గొని మదాళి
వరచికుర కోకిలాలాప సురభినిశ్వ
సిత శుకీవాణి యనియె నా సుదతులకును — 4 ఆ. 85

ఆమె 'అళిచికుర, కోకిలాలాప, సురభినిశ్వసిత, శుకీవాణి" అగుటచేత తుమ్మెదలను, కోకిలలను, వాయువును, చిలుకలను అభిమానించి, వానిమీద దయతో పూవులను కోయలేదు కిసలయములను ఖండించలేదు పుష్పొడిని హరింప లేదు ఫలభంగము చేయలెదు దానికి "అతనుధర్మచ్ఛేదము, పల్లవగోష్ఠి రాజసప్రవృత్తి, ఫలభంగము" అను పదముల నుపయోగించెను ఇంకను "కుసుమకోమల, కిసలయోష్ఠి, పరాగసితహాస ఫలస్తని" అను విశేషణములను ప్రయోగించి ఆమె ఆచరించు కార్యక్రమమును కవి మనోజ్ఞముగ సమర్థించెను

## తపస్సు

పద్మాకరుని తపస్సును కవి కాలానుగుణముగ వర్ణించెను

జటియౌటనో సముత్కటజటాసంఘాత
కృతనీడములఁ బక్షివితతిఁజేసె
శమిగావుననొ ఘనజ్వాలికామాలికా
ఖీలమై తలచిచ్చు పెచ్చువిరిగె

కలితకుండలియైన కతననో తనువల్లి
వితతవల్మీకసంగతిఁదనర్చె
జగతీవరస్థానువగుటనో చాంచల్య
రహితభావోన్నతి రహి వహించె
ననుచు ననిశంబు నిచ్చ సన్మునులు మెచ్చ
యమనియమముఖ్యవిఖ్యాతి నధిగమించి
శమదమస్ఫూర్తి మించి రాజన్యమౌళి
యుగ్రతపమిట్లు గావింపుచున్న యంత — 2 ఆ: 36

మునులందఱు ఆశ్చర్యపడు విధముగ యమనియమములతో, శమదమములతో ఘోరాతిఘోరమైన తపస్సు చేయుచుండెను.

తపస్సును అచ్చతెనుగు పదములతో వర్ణించెను అతని తపస్సు బ్రహ్మ, పరమేశ్వరుడు, నారాయణముని, వామనుని, దేవతల తపస్సులను మించి అతిభీకరముగ నున్నది

తొలుఁబలుకు కన్నంపు దొంగ గొంగని బొడ్డు
నన బిడారంపు జాపని తపంబు
ఆట కూఁకటిపిట్ట హరిబితేజి దువాళి
సరదారుఁ గన్నదేవరతపంబు
పిడుగుఁగ్రైదువు దారి పడపు గుబ్బెత కాన్పుఁ
దొడరాడఁదగు జోగి దొరతపంబు
పుడమిచేడియకొల్పుటడుగుఁదామర మించు
మఱుగుజ్జు తాఁటదమ్మని తపంబు
చారణామరగంధర్వసాధ్యసిద్ధ
యక్షరక్షస్తపంబులు నచట నచటఁ
జూచితిమికాని కాన మెచ్చోట నిట్టి
యఖిలలోకాతిభీకరమైన తపము — 3 ఆ: 6

పద్మాకరుని తపోవిఘ్నమునకై ఇంద్రుడు అప్సరసలను నియమించెను కవి శశిరేఖ మొదలగు అప్సరసల సౌందర్యమును వర్ణించినాడు అప్సరసలు పద్మాకరుని కవ్వించి విఫలులైరి ఆ సమయమున కవి—

హరిణిచలించె రంభహృదయంబునఁబూనె జడత్వమెంతయున్
గరఁగె ఘృతాచి హేమరుచి గాసిలి నిల్చెను జంద్రరేఖయున్
సరగునఁ బూనుచుండె నెద చక్కన కందల చిత్రరేఖ నే
ర్పఱఁదగెఁ జిత్రరూపమున నయ్యెడ నా
నృపమౌని చెంగటన్ – 3 ఆ: 65

అని వర్ణించినాడు లేడికి చంచలత్వము, అరటిచెట్టునకు జలత్వము (ల-డ అభేదము), ఘృతము కరగుట, బంగారమునకు రంగుమారుట, చంద్రరేఖలో మచ్చ యుండుట, చిత్రరేఖ బొమ్మయగుట సహజములు కావున ఆ నామముతో నున్న హరిణి, రంభ, ఘృతాచి, హేమ, చంద్రరేఖ, చిత్రరేఖ అను దేవకాంతలు పై చాంచల్యాది గుణములను ధరించినారని నామసార్థక్యమును గావించి కవి చక్కగ సమర్థించినాడు

## న ది

పద్మాకరుడు సంతానప్రాప్తికై కౌశికీనది సమీపమున తపస్సుకు పూనుకొనెను ఆ సందర్భమున కవి కౌశికినదిని ఐదు పద్యములలో (2 అ, 119-23) వర్ణించెను

దరిదొట్టి కనుపట్టు పిరిదమ్మి తెట్టువల్
కాషాయవస్త్రమనీషఁ గొలువ
మించు దిబ్బల విశ్రమించు సంచలపట్టు
స్ఫటికాంబుకుండికాభ్రాంతిఁ దెలుప
వెలిదమ్మి వలగొన్న బలు తుమ్మెదలబారు
పద్మాక్షమాలికాభ్రమ ఘటింప
నీరింకునెడల నెండిన నాచు జొంపంబు
కృష్ణాజినాశంకఁ గీలుకొలుపఁ
జేరి చేకొనఁ బఱతెంచు పారికాంక్షి
పట్టుభద్రులఁగని పకాపకను నవ్వు
నా తరంగిణి, లహరికాఘాతజాత
నూతనపుముంపుమారావ కైతవమున – 2 ఆ· 120

ఈ పద్యమునందు కవి కౌశికీనదిని సన్యాసినిగా ఊహించి వర్ణించినాడు ఆ నదిలోని గట్టుచుట్టు వ్యాపించిన తామరపూవుల పరాగము కాషాయ వస్త్రముల మాదిరిగ,-మధ్యనున్న ఇసుకతిన్నెలపై నివసించు హంస స్వచ్ఛమైన కమండలము వలె, తెల్లతామరపూవులచుట్టు తిరుగుచున్న తుమ్మెదల వరుస జపమాలికవలెను, ఎండిన నాచు లేడితోలువలెను, చూచువారికి కౌశికీనది సన్యాసినివలె కన్పించు చున్నది ఈ విధమైన వేషమును ధరించి ఆ నది తన సమీపమునకువచ్చు సన్యాసులను చూచి తరంగధ్వనులను మిషచేత పరిహసించుచున్నట్లు వర్ణించెను

## సరస్సు

నాయిక వన విహారాంతమున అలసి విరహాధికయై గ్రుమ్మరు సమయమున ఒక సరస్సును చూచెను ఈ సమయమును కవి చక్కగ ఉపయోగించుకొని సరస్సు వర్ణన కుపక్రమించినాడు ఈ వర్ణన ఒక పద్యమునందు, దీర్ఘమైన వచనమునందు (4 ఆ, 88, 89) చేయబడినది తదుపరి చేసిన జలకేళి వర్ణనకన్న ఈ సరస్సు వర్ణననే కవి మనోజ్ఞముగ చిత్రీకరించెను

ఆ కాసారమును వర్ణించిన మత్తేభపద్యము శ్లేషతో కూడియున్నది

జలజాతోద్భవదివ్యమందిర రమాసాధ్వీమణీసౌధ శి
ల్పిలతాంతాయుధకేతు రక్షి, మధుపాళీపానగేహంబు శీ
తలభానుప్రియభోగినీజనజనిస్థానంబు చక్రద్విజో
జ్జ్వలతంత్రావసథంబుఁ గాంచి రొక కాసారంబు
దూరంబునన్ - 4 ఆ: 88

బ్రహ్మదేవుని దివ్యమందిరమువలె, లక్ష్మీదేవికి చక్కని సౌధమును నిర్మించు శిల్పివలె, మన్మథుని జెండాను కాపాడునదియై, మద్యపానము చేయు వారికి పానశాలవలె, భోగకాంతలైన స్త్రీలకు చల్లని నివాసస్థానమునై బ్రాహ్మణులు తంత్రముచేయు నివాసమువలెను కాసారము కుముద్వతీసఖులకు కన్పించి నది అనగా తామరపూవు పుట్టుటకు దివ్యమైన స్థలము, లక్ష్మీదేవి నివాసమైన తామరపూవును సృష్టించునది, మన్మథునికి కేతనమైన చేపలను రక్షించునది, తుమ్మెద పంక్తులకు పానశాల, సూర్యుని ప్రియులైన పద్మలతలు పుట్టుటకు స్థానము, చక్రవాక పక్షులు సంచరించు స్థలము

ఆ సరస్సు ముత్యములవలె నున్న నీటిబిందువులతో కదలాచున్న తామరపత్రములతో నిండియున్నది ఆ తామరపత్రములను జలాధిదేవతాడుమాలుర మతకు

చెలులకు స్వాగతము చెప్పుటకై ముత్యములతో పొదిగి, పచ్చమణులతో చేయబడి యుంచబడిన హారతి పళ్ళెములవలె నున్నవని కవి చమత్కరించినాడు

మఱియు సరస్సు సమీపమున నున్న వనవైభవమును కవి వసంతుడనే యాజకుడుచేసిన యజ్ఞఫలముగ వర్ణించెను ఆ వనములోని తుమ్మెదలే ధూమము గను, పుప్పొడి అగ్నికణముగను, పక్షులయొక్క ధ్వనులు మంత్రములుగను పూదేనియలు నెయ్యిగను, మలయానిలముపలన కలిగిన సంతోషమునే యజ్ఞఫలము నకు కలిగిన హింసగను ఊహించి అద్భుతమైన రూపకల్పన చేసినాడు

ఇంకను ఆ సరస్సులోని తామరల కదలికను నర్తకీమణుల నాట్యముతో సామ్యమొనర్చినాడు, వాయువనే నటుని ఆజ్ఞపై పద్మినులు రసజ్ఞ రాజహంససన్నిధి నాట్యముచేయగ ఎగసిపడుచున్న తరంగశబ్దములు మృదంగనినాదములుగను, తుమ్మె దల ఝుంకారము సంగీతధ్వనులుగ చెలరేగ తటాకసమీపమున నున్న వృక్షములు మెచ్చి తమ శాఖలనే చేతులుచాచి అప్పటికప్పుడే పుప్పొడి యను శాలువను కాను కగా కప్పెననట ఈ విధముగ అద్భుతమైన ఊహాకల్పనతో వచన మంతయు కాసార వర్ణనతో నిండియున్నది

## సూర్యాస్తమయము

చెన్నమరాజు సూర్యాస్తమయమును మూడు పద్యములలో (4 ఆ 114, 115 5 ఆ, 70) వర్ణించెను

చారుచంద్రుని మీద నున్న విరహముతో మన్మథ బాధ భరింపలేనిదై చల నము లేనట్లున్నది నాయికయైన కుముద్వతి ఆమెను చూచి చెలికత్తెలు మన్మథునికి జాలిలేదని తలంచి మందిరమునకు తోడుకొని వెళ్ళిరి ఆ సమయమున ఆమె బాధ నర్థము చేసికొని ఆమెకు సానుభూతి చూపుటకయి సూర్యుడు వెళ్ళిపోవుచున్నట్లుగ కవి కడు రమ్యముగ వర్ణించినాడు

> అరిగెన్ బశ్చిమవార్ధి పజ్జగల పద్మాప్తుండు పద్మాకరా
> ఖ్య రసాధీశ్వరమౌళి• నీ వరమునన్ గన్పట్టి యక్కన్యకున్
> విరహంబెచ్చెఁ దదీప్సితం బిడి కృపన్ వే ప్రోవవే యంచు శ్రీ
> హరి నంభోనిధిశాయిఁ బ్రార్థనముసేయంబోపు చందంబునన్
>
> —4 ఆ. 114

సూర్యుడు అస్తమించుట సహజమైన విషయము దానికి కవి కుముద్వతి విరహావేదనను చూచి తన వరము వలన జన్మించిన ఆమెను రక్షింపుమని శేషశాయి

అయిన హరిని ప్రార్థించుటకుగాను పశ్చిమాద్రి వెనుకకు సూర్యుడు వెళ్ళినట్లుగ ఒక హేతువును కల్పించి ఉత్ప్రేక్షించి చెప్పినాడు ఇంకను చీకటి అసురులకు ఇష్టమైన సమయము కనుక పూర్వపు పగను గుర్తించుకొని సూర్యుడు సముద్రములో మునిగి పోయినాడు సహజమైన సూర్యాస్తమయమును రాక్షసులకు భయపడి సూర్యుడు సముద్రములో దాగినట్లు వర్ణించుట మిక్కిలి మనోజ్ఞముగ నున్నది

శౌరి కనుసన్న మెలఁగెడు సరసుఁడగుట
సారసహితుండు వడిఁ దక్కుమారమణికి
దివ్యమగు సేసముత్తెముల్ దెచ్చుకొఱకుఁ
జనియెనో యన పశ్చిమజలధిఁ జేరె —5 ఆః 70

కృష్ణునియొక్క కనుసన్నలలో మెలగువా డగుటచేత సూర్యుడు చారు చంద్రునకు తలంబ్రాలు పోయుటకు మేలిమి ముత్యములను తెచ్చుటకై పశ్చిమ సముద్రములోనికి వెళ్ళినాడు సముద్రము ముత్యములకు నిలయము కనుక వివాహ ముహూర్తమునకు సేసబ్రాలు అచటినుండి తెప్పించుమన్నట్లుగ కవి కథాసందర్భోచిత ముగ ఊహించినాడు

## చీకటి

కవి చీకటిని మూడు పద్యములలో (4 ఆ. 116-118) వర్ణించెను

సమయపరాశరవరసం
యమి సంధ్యాదాశకన్య నంగజకేళిన్
దమిఁ గలయుచుఁ గల్పించిన
హిమమో యన నంధతమస మెసఁగెన్ దిశలన్ —4 ఆః 116

పరాశరముని దాశకన్యతో సంధ్యాకాలమున క్రీడింపదలచి తాను సృష్టించిన హిమమా యనునట్లు చీకటి నలుదిశల వ్యాపించినదట

ఘన ఋక్షాలయమౌ మహాబిలమునన్ గన్పట్టఁగానీక యే
పున దద్దీప్తమణిన్ హరించుట జగత్పూర్ణస్వరూపంబు మిం
చి నతిపార్థిధనంజయున్ జటులతేజస్స్ఫూర్జితున్ జేయుటన్
గని యూహించిరి కృష్ణమూర్తి యని వేడ్కన్ బుంశ్చలుల్
చీఁకటిన్ — 4 ఆః 118

ఎలుగుబంట్లకు నిలయమైన పెద్ద గుహయందు ప్రకాశించుచున్న మణిని హరించుటకుగాను జగత్పూర్ణరూపమును ధరించిన శ్రీకృష్ణ దని చీకటిని యూహిం చిరి ఈ వర్ణన వలన జాంబవంతుని గుహ, శమంతకమణి కొఱకు కృష్ణుడు వెళ్ళిన సంఘటనను గుర్తుకు తెచ్చుచున్నది

## ప్రాతఃకాలము

కనుపట్టెం దొలుసంజ తూర్పున నుషఃకాలంబునన్ వహ్ని వీ
డ్కొని యంశుప్రజు నాత్మనాధుఁడగు నర్కున్ జేరు
నాకాంక్షమైఁ
జని తన్మార్గమునన్ దదాగమనిరీక్షన్ నిల్చు చందంబునన్
దనరెన్ దద్విరహంబుచే బలె గృహాంతర్దీపికల్ శుభ్రతన్
—2 ఆ: 36

ప్రభాతసమయమున ఇండ్లలోని దీపములు వెలవెలపోవుచుండెను దానికి కవి రాత్రికాలమందలి కాంతి ఉషఃకాలము రాగానే తన ప్రియుడైన సూర్యుని చేరవలెనను ఆకాంక్షతో వియోగవ్యధను భరింపలేక వెలవెలవోయిన వని ఊహా చమత్కృతి నొనర్చినాడు

## సూర్యుడు

తనరెన్ దిక్కుల నాకసంబున లసద్వాతూలధూతాంబుజా
తనితాంతోత్థితసూనరేణుచయముల్ తద్వేళ చెల్వంబుగా
వనజాతాప్తదినేంద్రరాజవదనోద్వాహార్థమై పద్మినుల్
మినుకుంబట్టు పటాళిఁగట్టిరె జగా మేల్కొట్లునా నెంతయున్
—5 ఆ· 38

## సాయంసంధ్య

కవి సాయంసంధ్యను హోమముతో పోల్చెను

జగముల్ గెల్చు మనీషనెంతయు మనోజాతుండు హోమార్థమై
యెగయంజేసిన వహ్నికీల లనగా నేపార సంధ్యారుచుల్

పొగరెత్తం గనుపట్టెఁ జీఁకటులు తద్భూరిస్ఫులింగాకృతిన్
నెగడెన్ చుక్కలచాలు పుష్కరమునన్ నిర్నిద్రకాంతిస్థితిన్
—5 ఆ: 71

లోకముల నన్నిటిని జయించుటకై మన్మథుడు హోమము చేయుటకై సంకల్పించెను ఆ హోమము నందలి అగ్నిశిఖలేమో యనునట్లుగ సంధ్యాకాంతు లున్నవి పొగ మాదిరిగ చీకటి కన్పట్టుచున్నది చీకటి దట్టముగ వ్యాపించుటచేత ఆకాశమున చుక్కల వరసలు స్ఫటికలింగముల వలె కన్పట్టుచున్నవి

## చంద్రుడు

వేల్పుల యానవాలపడి వెన్నెలకోరు కొటారు మంచు పూ
రాల్పుల మించులాడు, వలరాయని మాయనికీర్తి తమ్మిపూ
చాల్పుల చొక్కమందు తొగచానకునై దువత్రాడు బేసికన్
దాల్పరి జుట్టుక్రొవ్విరి సుధానిధి గన్గొననయ్యె నయ్యెడన్
—5 ఆ: 72

## ఇంద్రుని కొలువుకూటము

తెలిమేని గిబ్బరాతేజి యెక్కుడు రౌతు
పిలుదబ్బ యెవ్వాని వీడుపట్టు
మడుగు చూలడుగుఁ దాకురమాయవడుగు చెం
దొవ చుట్ట మెవ్వాని తోడబుట్టు
పుడుకుఁగేల్జడదాలి యొడయని విడియమ్ము
మిన్న యెవ్వని కేల మెఱయువాలు
గాడ్పుమేతరి మేలి ఖాణంపు టొయ్యారి
వార్వంపుసామి యెవ్వని దణాయి
యట్టి యమరాధినాయకుం డనుపమాన
భవ్యనవరత్నమయసభాభవనసీమ
సకలసురవర్యు లిరువంక సరవిఁగొల్వ
నిండుపేడుక నోలగం బుండునపుడు —3 ఆ: 3

అని అచ్చతెనుగు పదములతో ఇంద్రసభను వర్ణించెను

## ముని

చారుచంద్రునకు కనిపించిన సిద్ధుని (2 ఆ. 26) వర్ణించెను మఱియు పద్మాకరుని కొలువుకూటమునకు వచ్చిన మునీశ్వరుని (2 ఆ. 82) మఱియొకచోట వర్ణించెను

నునుబూది రవపూఁత నెనయు నెమ్మేనితో
జనవశీకరవిశేషకముతోడ

నిడునాగ బెత్తాన ముడిగొన్న జడలతో
సలిలపూరిత కమండలువుతోడ

పులితోలు యొడ్డాణము బిగించు కౌనుతోఁ
గలితకేదారకంకణముతోడ

పేరెదఁ గనుపట్టు పెను యోగవట్టతో
భసితగుంభితకక్షపాలతోడ

శోణపంకజనిభనేత్రకోణరుచులఁ
గెంపు నిద్దంపు రవ చెక్కడంపు సొంపుఁ
జూపు నెలజాతి కామాక్షిజోడు తోడ
సిద్ధ తేజోధికుం డొక సిద్ధ విభుఁడు —2 ఆ. 26

## గుఱ్ఱము

చారుచంద్రుఁడు రైవతకపర్వతప్రాంతములందు విహారించునప్పుడు అతఁడు ఎక్కిన గుఱ్ఱమును వర్ణించెను (2 ఆ. 11)

విజయలక్ష్మీవాసవికసితాబ్జంబు నా
హొంబట్టు జిగి తలాటంబు మెఱయ

పటువాజిరాజిత పభవ పక్షంబు నా
కవదౌనల్ పార్శ్వభాగముల నలర

పురుషకోద్గతిలగ్న తరుణిబింబంబు నా
వంఘ్రి బంగరు తళుకుటందె దనర

కబళితాహితవర్యకమనీయకీర్తి నా
ముఖమున ఫేనంబు మురువుఁజూప

కెంపు రవకెంపు సూర్యపుటంబు మెఱుఁగు
పల్లమును దెల్ల జల్లులు పసిఁడిమువ్వ
గవ్వదండలుఁ బూన్చి యా ఘనుని యెదుటఁ
దేజి యొక్కటి సాహిణిఁదెచ్చి నిలిపె —2 ఆ: 11

రా జు

రత్నకేతనపురాధిపతియైన పద్మాకరుని, అతని యొక్క పరిపాలనను (2 ఆ. 75-79) వర్ణించెను పద్మాకరుడు రాజ్యమును ప్రజానురంజకముగ పరిపాలించెను కావున అతని పరిపాలనలో అధర్మమునకు తావులేదు అని చెప్పుటకు కవిత్వపరముగను, పరిపాలనాపరముగను శ్లేషతో చెప్పెను

ఓజఃప్రసాదసంయుక్తిచే రవణిల్లి
బహుళార్థసామగ్రిఁ బరిఢవిల్లి

సంధివిగ్రహభేద చాతుర్య ముడివోక
పరదురాక్షేపముల్ సొరఁగనీక

లోకాభివర్ణితశ్లోకసంగతిఁ గాంచి
సరసభావస్ఫూర్తి సరణిమించి

వడిఁగల్గి ప్రాసంబులెడఁ గౌశలము హెచ్చ
సమితి నెంతయు ధీరసమితి మెచ్చ

సకలజనములు నతఁడెంత సుకృతియనఁగ
ధాత్రియేలె నితంబినీనేత్రమీన
వలనకలనాతిగణ్యలావణ్యరసశు
భాంగపద్మాకరుండు పద్మాకరుండు —2 ఆ: 79

పద్మాకరుని పరిపాలన నిగ్రహానుగ్రహములతో నిండి, సంధి విగ్రహ యానాసనద్వైధీభావ సమాశ్రయసమ్మిశ్రితమై, శత్రు దురభిప్రాయములకు తావులేక లోకము నందు సంశ్లోకింపబడిన కీర్తితో, రసికతకు మూలమైన అభిప్రాయములతో హెచ్చుగాగల ఆయుధముల నేర్పుతో, యుద్ధములో వీరవరులు మెచ్చునట్లున్నది

పై వర్ణనలనుబట్టి పరికింపగ చెన్నమరాజు వర్ణనాప్రియుడని తెలియుచున్నది ఇట్టి వర్ణనలు సంప్రదాయానుసారముగ, చమత్కారముతో ఉదాత్త భావములతో ఇంపును కలిగించుచున్నవి కథ చిన్నదైనను మిగిలిన ప్రబంధకవుల మాదిరిగనే వర్ణనాధిక్యతను పాటించినాడు చెన్నమరాజు చేసిన వర్ణనలు కథాగతికి, రసనిష్పత్తికి, పాత్రపోషణకు అనుకూలముగ నున్నవి వర్ణనలలో స్పష్టత, ఆవశ్యకత, అవసరమైనచోట దీర్ఘవర్ణన అనవసరమైనచోట సంక్షిప్తత కనుపించును

## 2 శైలీవిశేషములు

సంస్కృతలాక్షణికులు తమ లక్షణగ్రంథములందు కావ్యరచనావిధానమునకు నాలుగు లక్షణములను విధించిరి అవి - రీతి, శయ్య, వృత్తి పాకము రీతులు గుణాశ్రయములు గుణ, వృత్తి రసాలంకారధ్వనులకు కఠిన, మృదు పదముల పొందికయే కారణము గావున ఆ పదముల కూర్పే 'రీతి' యని ఆలంకారికుల మతము దండి కుంతకుడు మాత్రము 'రీతి'ని 'మార్గము' అని పేర్కొనిరి

అస్త్యనేకో గిరాం మార్గః సూక్ష్మభేదః పరస్పరమ్
తత్ర వైదర్భగౌడీయౌ వర్ణ్యేతే ప్రస్ఫుటాంతరౌ
కావ్యాదర్శము. I- 40

సూక్ష్మమైన భేదము గల, అనేకవిధములైన వాక్కుల యొక్క మార్గము కావ్యరీతి అని దండి చెప్పి అందు వైదర్భి గౌడ మార్గములను వ్యక్తీకరించెను కుంతకుడు తన 'వక్రోక్తి జీవితము' నందు సుకుమార, విచిత్ర మార్గములను పేర్కొనినాడు ఈ 'రీతి' లేక 'మార్గము'నకు నేడు 'శైలీ' శబ్దము సాహిత్యరంగమున చోటు చేసికొనినది

రసమునుబట్టి పాత్రలనుబట్టి శైలి భిన్నమైన మార్గములలో నుండును మానవుల స్వరూపస్వభావముల యందు భేదమున్నట్లే కవుల రచనావిధానమునందు కూడ భేదముండును ఈ అభిప్రాయమును కుంతకుడు - 'కవి స్వభావభేద నిబంధనత్వాదనంతభేద భిన్నత్వ మనివార్యమ్' [1] అని స్పష్టపఱచినాడు (కవి స్వభావ భేదమునుబట్టి కావ్యరచనా విధానమునందును పెక్కుభేదములుండును) ఈ భేదమే ఒక కవి నుండి మఱియొక కవిని వేఱు చేయును కావున ప్రతి కవికి తనదైన ఒక రచన యుండును ఆ రచనా విధానమే అతనియొక్క వ్యక్తిత్వమును, స్వభావమును చాటును

దండి —

1 వక్రోక్తి జీవితము, పు 102

ఇక్షుక్షీరగుడాదీనాం మాధుర్య స్యాన్తరమ్ మహత్
తథాపి న తదాఖ్యాతుం సరస్వత్యాపి శక్యతే[1]

చెఱకు, పాలు, బెల్లము మొదలగువాని యందుగల అధికమైన మాధుర్య భేదమును మాటలలో చెప్పుటకు సరస్వతీదేవికి గూడ శక్యము కాదు అదే విధముగ కవుల రచనా విధానములోని మాధుర్యభేదమును వ్యక్తము చేయుటకూడ ఎవరికి సాధ్యముకాదని చెప్పినాడు

దృశ్యకావ్యములయందు ప్రేక్షకుడు ప్రత్యక్షముగ విభావానుభావ సాత్త్విక భావములను దర్శించి రసాస్వాదన పొందిన విధముగ, పాఠకుడు శ్రవ్యకావ్యముల యందు శైలిద్వారా వాటిని ప్రత్యక్షముగ ఆకట్టుకొని మాధుర్యమును ఆస్వాదింప గలడు ఆ కావ్యమునందలి శబ్దవిన్యాసములను జ్ఞప్తికి తెచ్చుకొని మరల మరల ఆనందించును ఆ విధమైన అనుభూతిని పాఠకుడు కవి యొక్క రచనావైశిష్ట్యము వలననే పొందగలడు

ప్రబంధకవులు కథాకథన విషయములోను, వర్ణనల విషయములోను ఒకే మూసలో పోసిన విధముగ నడచినను శైలి విషయములో మాత్రము వారు వేఱు వేఱు మార్గములను అనుసరించిరి

చెన్నమరాజు 'చారుచంద్రోదయము' నందు నాయిక తండ్రియైన పద్మా కరుని పరిపాలనాచాతుర్యమును, కవితాచాతుర్యమును శ్లేషగర్భితముగ చెప్పినాడు ఆ పద్యమునందు కవిత్వము ఓజః ప్రసాదములతో కూడి, బహుళార్థసమన్వితమై చక్కని సంధులతో, మంచి సమాసభేదములతో, చతుర వచనములతో, దురాక్షేపణ లేక చక్కని కొనియాడదగిన పద్యములతో, రసము, భావము స్ఫురించి, యతిప్రాసలతో పండితులు మెచ్చుకొనునట్లున్నదని పరోక్షముగ తన కవితారీతిని వ్యక్తము చేసినాడు ఇంకను కలలో కనిపించిన గోపాలకృష్ణుడు –'మేదుర మాధురీ గరిమ మించఁగ నీ వొనరించు చారు చంద్రోదయ కావ్య మిమ్ము ' (చా చం, 1 ఆ, 14 వ) అని పలికినాడని చెప్పుకొనుటచేత అతని కావ్యమునందు మాధుర్య గుణము బహుళముగ నున్నట్లు తెలియుచున్నది

శ్లేషః ప్రసాదః సమతా సమాధిర్మాధుర్యమోజః
పదసౌకుమార్యమ్
అర్థస్య చ వ్యక్తి రుదారతా చ కాన్తిశ్చ కావ్యార్థ
గుణా దశైతే

అని భరతుడు పది గుణములను పేర్కొనినాడు అవి సర్వమతసమ్మతములు ఈ పదిగుణములలో భామహుడు 'ఓజః ప్రసాదమాధుర్యములు' మూడుమాత్రమే

1 కావ్యాదర్శము, ప్రథమ పరిచ్ఛేదము, 102 శ్లో

ముఖ్యగుణములుగ పేర్కొనినాడు చెన్నమరాజు కూడ 'చారు చంద్రోదయము' నందు ఓజః, ప్రసాద మాధుర్య గుణములకే ఎక్కువ ప్రాధాన్యము నిచ్చినట్లు కనిపించుచున్నది

వామనుడు – 'రీతిరాత్మా కావ్యస్య విశిష్టాపదరచనారీతి, విశేషో గుణాత్మా అనినాడు (I, 6 7, 8) ఇంకను —

కావ్యశోభయాః కర్తారో ధర్మాగుణాః
తదతిశయ హేతవ స్త్వలంకారాః[1]

కావ్యమునకు గుణములు శోభను కలిగించు ధర్మము లనియు అలంకారములు ఆ శోభను ద్విగుణీకృతము చేయు హేతువు లనియు పేర్కొనినాడు మఱియు గుణహీనునికి అలంకారములు ఏ విధముగ శోభను కలుగచేయవో, ఆదే విధముగ గుణశూన్యమైన కావ్యమునందు ఎన్ని అలంకారము లున్నను ఆ కావ్యము నందు రామణీయకత లోపించునని ఒక అభిప్రాయమును నొక్కి చెప్పినాడు

## ఓజస్సు

గుణము లన్నింటిలో ఓజోగుణమునకు సమాసాధిక్యము కలదని ఆలంకారికుల అభిప్రాయము

'గాఢబంధత్వ మోజ - వామనుడు (III – 5)

మొత్తము మీద సమాసభూయిష్ఠమైన గాఢబంధముల రచన అని అలంకారికుల మతము

చంద్రశాలాశరచ్చంద్రబింబాననా
సంస్మారితామర సముదయంబు
గగనాబ్జగేహినీ కటికింకిణీభవ
ద్గాంగేయవప్రశృంగవ్రజంబు
వియదవేళామరుద్విభుచాపభావనా
ప్రౌఢరత్ననిశాంతబంధురంబు
హరిదశ్వతాంతవాహప్రియంభావుకో
దారగోపుర కేతుమారుతంబు

1 కావ్యాలంకార సూత్ర వృత్తి తృతీయ.1

త్రిదశకల్లోలినీజాలపదకలాప
లాపనధురీణమణిహర్మ్యలాస్యకార
కీరవాణీవతంససంక్రీడదంఘ్రి
నూపురం బొప్పు ద్వారావతీపురంబు — 1 ఆ: 95

సంస్కృతపదములతో, సమాసభూయిష్ఠమై, గాఢబంధముతో ఓజోగుణము ప్రస్ఫుటమగుచున్నది

ఓజశ్చిత్తస్య విస్తారరూపం దీప్తిత్వముచ్యతే
వీరబీభత్సరౌద్రేషు క్రమేణాధిక్యమస్యతు

అని విశ్వనాథుడు 'సాహిత్యదర్పణము' నందు నిర్వచించినాడు ఓజోగుణము వలన పాఠకుని మనస్సునకు దీప్తి కలుగును వీరము కంటె బీభత్సము నందును, బీభత్సము కంటె రౌద్రము నందును, ఓజోగుణము అధికముగ నుండును ఈ అభిప్రాయమునకు అనుగుణముగ చెన్నమరాజు యుద్ధసందర్భమున ప్రతినాయకుడగు పుష్కరుడు రౌద్రముతో నాయకుడగు చారుచంద్రుని తన సైన్యముతో ఎదుర్కొనినపుడు ఓజోగుణమును పోషించినాడు

దానాంబుధారార్చ్యమానసింధురగజేంద్ర
ఘంటికామణఘణక్వణన మెసఁగ
మారుతవైరాయమాణాశ్వగళకింకి
ణీఝుణంఝుణమంజునినద మొదవ
పటునేమికార్భటీబాభజ్యమానోగ్ర
రథకేతుపటపటారావమొనర
నన్యోన్యఘర్షణజన్యమానభటౌఘ
తరవారిఖణిఖణీధ్వానమమర
నలినజాండోపరిస్థితి నానటత్ప్ర
టహపటుఢమంఢమఢమంఢమంనినాద
మడర సంగ్రామకౌతుకావాప్తి నలరి
యపుడు దనుజేంద్ర ఘోరసైన్యములు నడచె —2 ఆ. 48

'అర్చ్యమాన వైరాయమాణ బాభజ్యమాన, జన్యమాన, నానటత్' మొదలగు సంస్కృతపదములను వాడుట వలన కవి పాండిత్యప్రకర్ష వ్యక్తమగుచున్నది ఇంకను సంయుక్తాక్షరముల ప్రయోగముతో, రేఫయుక్తసంయోగముతో, అధిక సమాసములతో, గాఢబంధము కలిగి యుద్ధతీవ్రత ప్రస్ఫుటమగుచున్నది పద్యము నడకలో వేగము కన్పట్టుచున్నది ఇంకను కవి ఘణ ఘణ, ఝుణ ఝుణ పటపట, ఖణిఖణి ధమంధమ అను ధ్వన్యనుకరణప్రయోగములను వాడి పద్యములందు సొగసును చూపించినాడు

నాయకుడైన చారుచంద్రుడు వీరముతో ప్రతినాయకుని ఎదుట నిలిచినపుడు ఓజోగుణమును వ్యక్తము చేసినాడు

దిగ్వారణకర్ణదుర్భరనిగాఢధనుర్లతికోగ్రటంక్రియా
వారితవైర్యవార్యధృతివై భవుఁడై నిలిచెన్ మహోద్ధతిన్
-2 ఆ: 49

అల్పసమాసములతో కూడిన ఓజోగుణము ఈ క్రింది పద్యమునందు కనిపించుచున్నది

అని తోడ్తోడఁగ ఘోరభీషణధనుర్జ్యావల్లరీ టంక్రియా
ఘనఘోషంబుల రోదసీకుహరమార్గంబెల్ల ఘూర్ణిల్లఁ ద
త్తనువున్ గేతనమున్ శతాంగమును రథ్యవ్రాతమున్ మాతలిన్
మునుఁగన్ వేసె నిశాతమార్గణములన్ బుంఖానుపుంఖంబుగన్
-2 ఆ: 59

సాక్షాదనంగహరుఁ డన
వీక్షింపఁగరాక దుర్నిరీక్ష్యతపస్యా
దక్షుండై క్షోణితలా
ధ్యక్షుఁడు చలియింపకుండె నతులిత నిష్ఠన్ 3 ఆ. 61

ఇంక ఓజోగుణముతో కూడిన వృత్త్యనుప్రాసను వాడినాడు ఇంకను,

వనితా॰ చూచితెభృంగపంక్తు లెసఁగెన్ వన్యాసరిద్బంధురా
ట్తనయాలోలనిరీక్షణంబు లయి తద్ద్రాఘిష్ఠవేణీవినూ

తనకాంతిచ్ఛటలై తదీయవిలసత్పాదాబ్జమంజీరమం
జునగారాతిశిలాకలాపజనితాస్తోకాంశుజాలంబులై 4 ఆ: 61

శుంభన్మదాఖర్వజంభారిగజగర్వ
భంజనోద్ధతిమించు భద్రగజము
కంధిరాజోద్భూతగంధర్వగంధని
ర్గంధనస్థితిఁబొల్చు సైంధవములు -5 ఆ: 100

మొదలగుచోట్ల ఓజోగుణము ప్రస్ఫుటమగుచున్నది ఈ విధమైన సమాసభూయిష్ఠ మైన రచన చారుచంద్రోదయము నందు ఆద్యంతము హెచ్చుగ కనిపించుచున్నది ఇందలి వచనములు సంస్కృతపదజటిలమై, దీర్ఘ సమాస భూయిష్ఠమై ఓజోగుణ భరితములై యున్నవి దండి "ఓజః సమాస భూయస్త్వమేతద్గద్యస్య జీవితమ్" అను అభిప్రాయముతో ఏకీభవించి గద్యములందు ఓజోగుణమును ఎక్కువగ ప్రదర్శించినాడు

## ప్ర సా ద ము

'ప్రసాదవత్' ప్రసిద్ధార్థమ్.-కావ్యాదర్శము
"శైదిల్యం ప్రసాదః" -కావ్యాలంకార సూత్రవృత్తి
"చిత్తం వ్యాప్నోతియః క్షిప్రం శుష్కేంధన మివానలం
సప్రసాదః సమస్తేషు రసేషు రచనాసుచ'

-సాహిత్యదర్పణము

అనగా ప్రసాదగుణముతో కూడిన రచన ఆస్వాదించునపుడు శుష్కేంధనాగ్నివలె, తటాలున వ్యాపించి పాఠకుని మనస్సునకు వికాసమును కలుగజేయును

ప్రసిద్ధములై సులువుగ అర్థమును స్ఫురింపచేయు పదములు కలిగియుండుట ప్రసాదము (ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము)

'ప్రసిద్ధపదంబుల నలఘూక్తి ప్రసాదము' -నరసభూపాలీయము

చారుచంద్రోదయము నందు ప్రసాదగుణము వర్ణనాసందర్భములయందును శ్లేషపద్యము లందు లోపించినదని చెప్పవచ్చును కథాభాగమునందు ప్రసాదగుణము అధికముగ కనిపించుచున్నది.

కలువకంటులు తలయంటి నలుగువెట్టి
వలపుగోర్వెచ్చ పన్నీట జలకమార్చి
వేగఁ దడియొత్తి తెలిదమ్మి సోగరేకు
మెనుకు పొత్తుల బాలకు నునిచిరంత — 1ఆ: 158

కర్ణాట మేదినీ కాంతావతంసంబు
వినతుఁడై కార్యములు విన్నవింప
మాగధకుంభినీమండలాధిపమౌళి
పలుమాఱు కైవారములు ఘటింప —2 ఆ· 81

వింటివె వాలుగంటి • కడు వేడుకతో జడదారి రాచ ము
క్కంటి కపింజరుండు ననుఁ గన్గొన డెందమునం దలంచి నే
డింటికి నేఁగుదెంచి మది నే ననపత్యతఁగాంచు ఖేదముల్
గెంటని దివ్యదృష్టిఁబరికించి యపార కృపారసోన్నతిన్
—2 ఆ: 99

శిథిలబంధము కలిగిన ప్రసాదగుణము పై పద్యమున కనిపించుచున్నది

అలవి దలిర్పనంటి తలయంటి నలుంగిడి తేటనీటిచే
జలకమొనర్చి యుగ్గొసఁగి చన్నిడి చల్వల జిల్గుపొత్తికల్
పొలుపున మేలుఁగా బఱచి తొట్టులలోపల నుంచి దాదు లిం
పలరఁగఁ బ్రోదిఁ బెంచి రనయంబుఁ గుమారుఁగుమారికామణిన్
—3· ఆ· 82

ఓజఃప్రసాద గుణములతో కూడిన పద్యములు కూడ ఈ గ్రంధమునందు కలవు

అలఘుతర త్వరాకలితయై తగు వత్తురగంబునెక్కి యు
జ్జ్వలగతి నేఁగి కాంచెనల శౌరి తనూజుఁడు ప్రాంతసంచర
న్నలిన సుహృత్తురంగ మఘనశ్రమవారినివారినిర్ఝరీ
జలలహరీమరున్నివహసాంద్రము రైవతకాచలేంద్రమున్
—2ఆ· 12

మొదటి రెండు పాదముల యందు అల్పసమాసములతో ప్రసిద్ధమైన పదములతో ప్రసాదగుణము కనిపించుచున్నది. తరువాత రెండు పాదములయందు గ్రుక్కత్రిప్పుకోని నడకతో సమాసభూయిష్ఠమై సంస్కృతప్రౌఢిలో రైవతక పర్వతపు గొప్పతనము వెల్లడి యగుచున్నది

## మా ధు ర్య ము

మధురం రసవద్వాచి వస్తున్యపి రసస్థితిః
యేన మాద్యన్తి ధీమన్తో మధునేవ మధువ్రతాః
—కావ్యాదర్శము [2-51]

చిత్తద్రవీభావ మయోహ్లాదో మాధుర్యమిష్యతే
సంభోగే కరుణే విప్రలంబే శాంతేఽధికం క్రమాత్
-సాహిత్యదర్పణము

'చక్కని విడివిడి పదములతో విలసిల్లు వాక్యము'
-ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

'సరసములగు వాక్యంబులు
వరుసను వేర్వేఱమించు వగ మాధుర్యంబు'
-నరసభూపాలీయము

తేనియ బావిమోవి సుధతేటలు మాటలు, కమ్మవిల్తుకై
కానుక తూపుచూపు జిగి గల్గిన వెన్నెలక్రొవ్వునవ్వు
-3 ఆ: 111

కలికి మిటారి లేనడల కంతుని పట్టపుదంతి ముద్దు ప
ల్కుల వలరాచతేజి జిగి కుందనపుం బని కీలుబొమ్మ వె
గ్గలమగు తావి కస్తురిమెకమ్ము చొకాటపు గుమ్మనవ్వు వె
న్నెల నెలపోగ యా చెలువ నీక తగున్ నరపాలశేఖరా
-3 ఆ: 113

కొటు కొటు రామతమ్మ యిదె కొమ్మని కమ్మని తావి మోవి
-3 ఆ: 138

పై పద్యములయందు విడివిడి పదముల కూర్పు కనిపించుచున్నది

తొడ లనఁటుల్ మొగంబు నెలతోయజముల్ కనుదోయి
తేఁటిగు
ళ్ళడుగులు పల్కు గప్పురము హ స్తయుగంబు బిసంబు
నాఁచు క్రొ
మ్ముడితరఁగల్ వళీత్రయము మోవి సుధారసధార నిక్కమా
పడతి నురంబుపై నిడకపాయునె కాయజతాపమక్కటా ॥
-4 ఆ. 17

ఇందు విప్రలంభమాధుర్యము కనిపించుచున్నది

తనరె వసంత మంతట నితాంతలతాంతనిశాంతమీనకే
తన రణతాంతకాంతవనితాజనత్రాతనుతాపరూపకం
జన చణ సారసౌరభవిసారసమీరకిశోరవారన
ర్తనదళదంబుజాతమిళితభ్రమరభ్రమరీతరంగమై -4 ఆ 37

నిలువున గౌఁగిలించి ధరణీపతి యొయ్యన బాలికామణిన్
దలిమముఁజేర్చి యంకమునదార్చి రయంబున బుజ్జగించి వే
నలి బలుమాటి దువ్వి మదినాటిన ప్రేమఁ దదీయ వక్త్రని
ర్మలినబిసప్రసూనజ నిరంతర వాసనఁగ్రోలి సోలుచున్
-5 ఆ 113

రీతులలో వైదర్భీరీతి యుత్తమమైనదని లాక్షణికుల అభిప్రాయము
వామనుడు—

'సమగ్రగుణా వైదర్భీ' (I-11)
'అస్పృష్టా దోషమాత్రాభిః సమగ్రగుణగుంఫితా
విపంచీ స్వర సౌభాగ్యా వైదర్భీరీతి రిష్యతే'

అని చెప్పినాడు దోషము కొంచెమును లేక పరిపూర్ణము లగు ఓజః ప్రసాద మాధుర్యాది గుణములతో కూడి వీణాధ్వనిని అనుసరించి యుండినది వైదర్భి యనినాడు

చెన్నమరాజు తన కవిత్వమును 'ఓజః ప్రసాదసంయుక్తిచే రవణిల్లి' అని చెప్పుకొనిన విధముగనే తన కావ్యము నందు ఓజః ప్రసాదమాధుర్యగుణములను ప్రదర్శించి వైదర్భీరీతిని పాటించినాడు

శయ్య :

మాలాకారో రచయతి యథా సాధు విజ్ఞాయ మాలాం
యోజ్యం కావ్యేష్వవహి తధియాతత్త్వ దేవాభిధానం
—కావ్యా: 1-59

అని భామహుడు 'శయ్య' అని వాడక రచనావిశేష మనినాడు పూలమాలాకారుడు ఏపూవు తర్వాత ఏపూవు కూర్చిన ఆ మాలకు అందము చేకూరునో తెలిసి దండను తయారుచేసినట్లు కవి ఏ పదము తర్వాత ఏ పదమును కూర్చిన పద్యమునకు బాగసు కలుగునో ఎఱింగి రచన చేయవలయును అని వ్యక్తము చేసినాడు

వామనుడు —

యత్పదా నిత్యజంత్యేవ పరివృత్తి సహిష్ణుతాం
తం శబ్దన్యాస నిష్ణాతాః శబ్దపాకం ప్రచక్షతే

శయ్యను 'శబ్దపాకము' అనినాడు

'యా పదానాం పరాన్యోన్యమైత్రీ శయ్యేతి కథ్యతే'
—ప్రతాపరుద్రీయము

పదము లొండొంటితోఁ గదిసి మేల్పరణి
గుదిరిన శయ్యనాఁ గొమరారు కృతుల
—ఆంధ్ర ప్రతాపరుద్రయశోభూషణము

కదిసి పదంబుల ముందటి
పదములతోఁబరమమైత్రిఁ బరగి పర పదా
స్పదమనకుండిన గతులం దది శయ్య
— నరసభూపాలీయము

మొత్తముమీద పదముల విడదీయరాని సంబంధము 'శయ్య' అని చెప్ప వచ్చును

అణుమధ్యం బసియాడ గుబ్బలొరయన్ హారాళినర్తింప నీ
క్షణముల్ చిందులుఁద్రొక్క వేనలి చలించన్ గింకిణీకంకణ
క్వణనంబుల్ — 3 ఆ.,29

ఈ పద్యమునందు శరీరావయవములను వర్ణించుచు ఉపయోగించిన 'అసియాడ, ఒరయన్, నర్తింప, చలించన్ మొదలగు క్రియలన్నియు అన్యోన్య మైత్రితో నున్నవి ఇందు ఆ పదములను తప్పించి వానికి తగిన పర్యాయపదములను ప్రయోగించిన అర్థస్ఫూర్తి చెడును

హరిణి చలించె రంభ హృదయంబునఁబూనె
జడత్వమెంతయున్
గరఁగె ఘృతాచి హేమరుచి గాసిలి నిల్చెను —3అ: 65

"హరిణి–చలించె", "రంభ–జడత్వము" "కరఁగె–ఘృతాచి" "హేమరుచి–గాసిలి" మొదలగు పదముల మైత్రివలన పద్యమునకు సొగసు కలిగినది

జయజయ పాండురసైంధవ బాంధవసర్వసుపర్వకరా
జయజయ నిత్యసభాజనశార్వరదుర్వహగర్వహరా
జయజయ చంద్రవిరోచనలోచనసారదయారసపూరధురా
జయజయ సామజపాలనఖేలనచక్రధరానుతచక్రిహరీ
— 3 అ: 72

పద్యము నడకలో వేగము కన్పట్టుచున్నది ఒక పదమునుతీసి మఱియొక పదమును వాడిన పద్యము నడకయొక్క సౌందర్యము చెడిపోవును

వేమఱు కంరదఘ్నజలవేణి వసించియుఁ గంకణంబులన్
దామరసంబులంట వవి తామరసంబులు సాటియే రస
శ్రీమహనీయకంకణగరిష్ఠములై తగు మా కటంచు న
క్కోమలి కేలుఁదమ్ములు నగున్ నఖరాంశుకులచ్ఛలంబునన్
— 3 అ: 102

తామరసంబు లను పదము తాము+అరసంబులని, తామరసములని(పద్మములవి) శ్లేష నుపయోగించినాడు "తామరస" పదమునకు మాఱు "పద్మ", "సరోవర" పదములు వాడినచో పద్యముయొక్క సొగసు నశించును

కలఁగు హృదంతరంబున శుకప్రమదాళి మదాళిమాలికా
కలరవగానవైఖరులు గ్రక్కున వీనుల సోకినంతనే

తలఁకొను దాల్పఁగాఁ జిలుక తాళియుఁ దుమ్మెదతాళి
బింబకో
జ్జ్వలసుమనోరసాధరరసాధరసారపయోధరంబులన్
- 4 ఆ. 32

ప్రిమదాళి, మదాళి, గ్రిక్కున వీనుల, తాళి, రసాధర మొదలగు పదము లకు బదులు వేఱొక పదములను వాడిన పద్యమునందలి అంచమువోవును

కురులు నటింప, నెన్నడుముఁగొంతచలింప నురోజహారముల్
వరువడి చౌకళింప నిటలంబున లేఁజెమ టంకురింప వి
స్ఫురితకరద్వయీవలయముల్ రవళింప - ఏ ఆ: 47

కురులు-నటింప, నెడుము-చలింప, హారముల్-చౌకళింప, చెమట-అంకురింప, కరద్వయీవలయముల్-రవళింప మొదలగు పదములకు పరస్పర సంబంధము కలదు

## వృత్తి :

రసానుగుణమగు అర్థములతోకూడిన పదబంధమునకు "వృత్తి"యనిపేరు ఈ వృత్తులు నాట్యమునకు రసోపస్కారములుగ నున్నవని భరతాదులు చెప్పిరి విశ్వనాధుడు "సాహిత్యదర్పణము" నందు-

శృంగారే కైశికీ - వీరే సాత్త్వత్యారభటీ పునః
రసే రౌద్రేచ బీభత్సే వృత్తి స్సర్వత్ర భారతీ
చతస్రోవృత్తయో హ్యేతాః సర్వనాట్యస్యమాతృకాః

అని వృత్తి లక్షణమును నాటక ప్రకరణమునందే చేర్చినాడు ప్రతాపరుద్రీయము నందు విద్యానాధుడు వృత్తులను నాటకప్రకరణమునందు చెప్పక కావ్యలక్షణము లందు చెప్పుటచేత వృత్తులు శ్రవ్యకావ్యములకు అనుకూలించునని స్పష్టమగును కాని ఈ వృత్తులు అర్థగతములు

## కైశికీవృత్తి

'గీత, నృత్యవిలాస కామోపభోగాదులతోఁ గూడి మృదువైన శృంగార వ్యాపారము కైశికి' అని ధనంజయుని దశరూపకమున కలదు

చారుచంద్రోదయమునందు జుముద్వతి చారుచంద్రుల చక్షుఃప్రీతి, నాయికకు నాయకునిమీద అనురాగము కలుగుట, శృంగార విలాసముతో కూడిన చేష్టలు, నాయకుని విరహము, నాయిక విరహము నాయికను సఖులు శైత్యోపచారములు చేయుచు, ఊరడించుట మొదలగు సమయములందు కైశికీవృత్తిని వాడినాడు సంభోగశృంగార సమయమున కైశికీవృత్తినే చూపినాడు ఇంకను ముని పుష్కర రాక్షసుని బాధలను నాయకునితో మొరపెట్టుకొను సందర్భమునందును, పద్మాకరుని తపోవిఘ్నము చేయుటకై అప్సరసల చేష్టలను వర్ణించునపుడను కైశికీవృత్తిలోనె పద్యరచన సాగినది

## సాత్త్వతి

'వీరే సాత్త్వతీ' – సాహిత్యదర్పణము

'వీరరసమున సాత్త్వతి వెలయుచుండు' – దశరూపకము

'ఈషత్ప్రౌఢములగు వీరభయానకరసములను ఈషత్ప్రౌఢ సందర్భమున వచించిన సాత్త్వతి యగును'

— ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

చారుచంద్రోదయమునందు ద్వితీయాశ్వాసములో యుద్ధ సమయమున సాత్త్వతి కనిపించుచున్నది

తద్దనుజపురీపరౌపవనధారుణి నిల్చె మహారణోద్ధతిన్

2 – 41

వీరమునకు స్థాయి భావమైన ఉత్సాహముతో నాయకుడు ప్రతి నాయకుని ఎదుర్కొనినపుడు సాత్త్వతిలోనే పద్యరచన సాగినది

శౌరితనూజుఁ డయ్యసురసైన్యముఁ గన్గొని దివ్యసాధనా
దారధరాదరాహితరథం బధిరోహణ మాచరించి ది
గ్వారణకర్ణదుర్భరనిగాఢధనుర్లతికోగ్రటంక్రియా
వారితవైర్యవార్యధృతివై బవుఁడై నిలిచెన్ మహోద్ధతిన్

— 2 ఆ· 49

ఇంకను యుద్ధవర్ణనా సందర్భమున (2-53-55, 60), రైవతక పర్వత ప్రాంతమునందు నివసించు చెంచుల శౌర్యమును తెలుపునపుడు సాత్త్వతి కనవచ్చుచున్నది

చిత్తజు చిక్కటారులగు చెంచు మిటారులచే కటారులన్
హత్తి కచాకచిం దొడరి నట్లనె మత్తకరీంద్ర వైరులన్
కుత్తుకఁ గోసి తజ్జరరకుంజరమస్తకమౌక్తికావళుల్
దెత్తురు ప్రాణనాధులు భళీ యన నగ్గిరిశృంగవీధులన్
— 2 ఆ. 18

నాయిక తండ్రియైన పద్మాకరుని గొప్పతనమును వర్ణించు సమయమున సాత్త్వతితోనే కవి పద్యమును నడిపినాడు

దండితశత్రుఁ డవ్విభుఁడు ధర్మము హస్తగతం బొనర్చి భూ
మండల మేలఁగా విదితమర్మ మధర్మము తద్ధరిత్రిలో
నుండఁగ నోడి కాదె దన కూరట యౌనని నిల్చె దూరపుం
గొండల కాపులుండు రిపుకోటుల హస్తములన్ సుఖస్థితిన్
— 2 ఆ. 78

భయానకము కూడ సాత్త్వతియని కొందరిమతము పద్మాకరుని తపోవార్త చారుని వలన విని ఇంద్రుడు భీతినొందిన సమయమున సాత్త్వతి ద్యోతితమగు చున్నది

యదవదయై వదివది మొనకైదువు నేలవైచె
మోచినభీతిన్' — 3 ఆ. 8

ఆరభటి :

'మాయేంద్రజాలసంగ్రామ క్రోధోద్భ్రాంత విచేష్టితైః
సంయుక్తా వధ బంధాద్యైరుద్ధతారభటీ మతా–సాహిత్యదర్పణము.
'అత్యుద్ధతరసౌ రౌద్రబీభత్సౌ పరికీర్తితా'
— ప్రతాపరుద్రీయము
'మాయాదివ్యాపార మారభటి' – దశరూపకము
'ఆరభటి రౌద్ర బీభత్స హారణియగు'– నరసభూపాలీయము
'రౌద్రబీభత్సరసములు పెలుసుగ వర్ణింపబడినఆరభటియగు'
– ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

చెన్నమరాజు యుద్ధవర్ణన సందర్భమున పుష్కరాసురుడు నాయకుడైన చారుచంద్రుని రౌద్రముతో ఢీకొనినపుడు ఆరభటీవృత్తి కలదు (2 ఆ 48, 53, 55, 59)

## భారతి

'కొంచెము సుకుమారార్థరచన కలది భారతీవృత్తి హాస్య శాంత అద్భుత రసములతో కూడినది —ప్రతాపరుద్రీయము

'వృత్తిః సర్వత్ర భారతీ' – సాహిత్యదర్పణము
'అలరు భారతి హాస్య శాంతాద్భుతముల'
– నరసభూపాలీయము

'కొంచెము కోమలములగు హాస్యశాంతి అద్భుతరసములు కొంచెము మృదువైన సందర్భమున చెప్పబడిన భారతివృత్తియగును' – ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

నాయకుడైన చారుచంద్రుని సమక్షమున అద్భుతము కలుగునట్లుగ సిద్ధవిభుడు తటాలున నిలిచినపుడు (2–27) భారతీవృత్తి కలదు

పద్మాకరునితోపాటు అతని భార్యకూడ అరణ్యమునకు వచ్చెద నని వేడుకొనినపుడు ఆ రాజు హాస్యముతో–

జడలును నారచీరలను జంత మృగాజినమూని మౌనినై
యడవికిఁబోఁగడంగి లలితాంగి' నినుం గవగూడి చన్నచోఁ
దడయక మాయదారి జడదారి యితండని యుండనీక నా
నడవడి జూచి కేలిఁగొని నవ్వుదు రవ్వని మౌనిపుంగవుల్
2 ఆ 107

అని పలికినపుడు భారతీవృత్తి కలదు

చిలుక ఒక బంగారు పావురమును సృష్టించి, విజన మొనర్చి నాయకునికి నాయికను చూపెను తరువాత చెలికాడువచ్చి మాయమైపోయె నమ్మకుమాయ పులుగు' అనినాడు అపుడు చారుచంద్రుడు చిలుకచేసిన వింతనుగూర్చి చెలికానితో చెప్పునపుడు భారతీవృత్తి కనిపించుచున్నది

సఖా! యది యొక్కటి వింతయౌనె కా
విను మొకవింతయా చిలుక విస్మయమైన యదృశ్యవిద్యచే

ననితరలక్ష్మి తాంగుఁడగునట్లుగ నన్నొనరించి చూపె మా
కనుపమరూపయౌవనశుభాకృతి నొక్క వధూటి నిచ్చుటన్
4 ఆ: 6

చెన్నమరాజు రసానుగుణమైన పదరచనతో, చక్కని కూర్పులో రచన సాగించినను మొత్తముమీద ఓజః, ప్రసా. మాధుర్యగుణములతో కైశికీవృత్తిలోనే ఎక్కువగ నాగినదని చెప్పవచ్చును

## పాకము

'రసాస్వాదనార్హమైన రచన పాకము' –ప్రతాపరుద్రీయము
'ఉదీరితార్థ పరిపాకము' – నరసభూపాలీయము

'అర్థగంభీరిమా పాకః' – గాంభిర్యమనగా ఆస్వాదయోగ్యవిశేషమని యొకరు, రసమునకు అనుగుణమైన శబ్దార్థనిబంధనను పాకమని యొకరును, చెవికి అమృతముగా సోకు పదముల వ్యుత్పత్తి పాకమని యొకరును నిర్వచించిరి

వామనుడు శబ్దపాకమనినాడు కాని వాని విశేషముల నతడు చెప్పలేదు,

అర్వాచీనులు పాకము అర్థము నాశ్రయించి యుండుననియు, పదసముదాయము వలన కలుగు అర్థముయొక్క పరిపాకమే పాకమని వారి అభిప్రాయమును వ్యక్తీకరించిరి

మొత్తముమీద పాకము శబ్దగతముగాక శబ్దార్థముల నాశ్రయించి యుండును లోకమునందు పాకము, అనేకమైన రుచి కలిగిన పదార్థముల సంయోగముచే నానావిధమైన నూతనరుచులు కలుగజేయును అట్లే కావ్యమునందు పాకము, రీతి గుణవృత్తుల సమ్మేళనముచే పాఠకులకు ఆస్వాదయోగ్యత కలుగ చేయును

ద్రాక్షాపాకము, నారికేళపాకము అని రెండు విధములని కొందరి మతము, కొందఱు కదళీపాకమునుకూడ చేర్చి మూడు విధము లనిరి

ద్రాక్షాపాకో భవేత్సో యం బహిరంతఃస్ఫురద్రసః
బహిఃఖరో నారికేళపాక స్త్వంతర్మృదుర్భవేత్
—— సాహిత్యరత్నాకరము

వెలుపల, లోపల రసము స్ఫురించునది ద్రాక్షాపాకము బయట పరుషముగను, లోపల మృదువుగ నుండునది నారికేళపాకము అనగా పాఠకుడు చదువుచు

అర్థమును గ్రహించుసమయముననే వెంటనే రసస్ఫూర్తిని కలుగజేయునది ద్రాక్షాపాకము. మొదట పరుషముగ నుండి గుప్తముగ రసస్ఫూర్తి కలిగిన పాకము నారికేళపాకము. ఈ రెండింటికీ మధ్యస్థముగా నుండునది కదళీపాకము.

సూర్యచంద్రోదయమునందు అధికభాగము పద్యరచన ద్రాక్షాపాకములోనే సాగినది. వర్ణనా సందర్భములో శ్లేషపద్యరచనయందు నారికేళపాకము కనిపించుచున్నది. అచటచట కదళీపాకములో సాగిన పద్యములు కూడ కలవు

## ద్రాక్షాపాకము

నవముక్తానికరంబులై విమలకుందశ్రేణులై చంద్రికా
నివహోద్యద్రుచికేతకీదళములై నీరేజసంఘంబులై
ధవళవ్రాతములై మెఱుంగుగమిలై టెక్కున్ బిక్కటిల్లన్ రహిన్
నవలా చూపులు(బర్వె 3 ఆ. 143

వాదోడైన శుకాంగనామణులఁ బిల్వంగాఁ గచశ్రేణికిన్
సైదోడైన మరాళిగీతి చెవిపజ్ఞం జేర్పఁగా నెప్పుడున్
జేదోడైన మణీమనోహరవిపంచిన్ లీలఁ బల్కింపఁగా
సౌదామన్యభిరామ రామ గడు వేసారున్
మరుం డేచఁగన్ — 4 ఆ 31

## నారికేళపాకము

శుంభన్నూతనబంధుజీవనికరాస్తోకాగ్నిలో బంభరీ
డింభాచ్ఛధ్వనిదంభమంత్రపరిపాటిన్ దా మరందాహుతుల్
సంభావ్యంబుగ వేల్చి కాంచెనది పున్నాగంబు రంభాపరీ
రంభారంభసుఖంబు జూచితి శరద్రాజీవపత్రేక్షణా 4 ఆ. 59

జలజాతోద్భవదివ్యమందిరరమాసాధ్వీమణీసౌధశి
ల్పి లతాంతాయుధకేతురక్షి మధుపాళీపానగేహంబు శీ
తలభానుప్రియభోగినీజనజనిస్థానంబు చక్రద్విజో
జ్జ్వలతంత్రావసదంబుఁ గాంచి రొక కాసారంబు దూరంబునన్
4 ఆ. 88

## కదళీపాకము

అవరోధాంగన లొండురం గడచి యత్యంతత్వరన్ డాయుచున్
శ్రవణానందముగాఁ దదీయ శుభవార్తల్ పైపయిన్ దెల్పినన్
ధవళాంభోరుహపత్రనేత్రుఁ డల కాంతారాజి కిప్పించె స్వ
ర్ణవిభాస్వన్మణికీలితాభరణవస్త్రవ్రాతముల్ మెచ్చుగన్
1 ఆ: 156

చెన్నమరాజు ఒక్కొక్కసారి సంస్కృతభాషాప్రౌఢి చూపుట, మఱియొక సారి సంస్కృతభాషాప్రౌఢి నడుమ తెలుగు నుడికారమును ప్రయోగించుటయేకాక దేశీయశైలితో కూడిన పెక్కు అచ్చతెనుగు పద్యములను రచించినాడు

కౌశికీనదిని స్తుతించునపుడు సంస్కృతభాషనే ప్రయోగించినాడు

హర పాపాని మమాఖిలానిచ తపస్యా సిద్ధమాత్రాశ్రమే
కురు మే కౌశికీః కౌశికాదిసుమనఃకోటి స్తుతే త్వాంభజే
శరధిధ్యేయముఖాంబుజే 2 ఆ: 125

శరదృతువును వర్ణించిన సీసపద్యము నందు సంస్కృతప్రౌఢి కన్పట్టు చున్నది

బంధూకఘనవిభాప్రభవసంధ్యాశయ
శ్లథవధూపరిరంభచక్రకంబు
పునరుద్యదంబుదధ్వనిబుద్ధిదమదేభ
ఘీంకృతిశ్రుతినటత్కేకికులము 2 ఆ: 152

పద్మాకరునకు ప్రత్యక్షమైన విష్ణుమూర్తిని స్తుతించిన దండకమునందు సంస్కృతప్రౌఢి అధికముగ కన్పట్టుచున్నది ఇంకను వచనములయందు, పెక్కు పద్యములందు సంస్కృతప్రౌఢిని చూపించుటచేత అతనికి గల పాండిత్యప్రకర్ష వ్యక్తమగుచున్నది

చెన్నమరాజు సంస్కృతప్రౌఢి, అచ్చతెనుగు నుడికారమును కలిపి మిశ్రమ శైలిలో నడిపిన పద్యము కలదు సీసపద్యములోని పాదము సగభాగము అచ్చ తెనుగు, తరువాతి సగము నందు సంస్కృతప్రౌఢిని చూపినాడు

దరిదొట్టి కనుపట్టు విరిదమ్మి తెట్టువల్
కాషాయవస్త్రమనీషఁ గొలువ
మించు దిబ్బల విశ్రమించు నంచల పట్టు
స్ఫటికాంబుకుండికాభ్రాంతిఁ దెలుప
వెలిదమ్మి వలగొన్న బలు తుమ్మెదల బారు
పద్మాక్షమాలికాభ్రమ ఘటింప
నీరింకు నెడల నెండిన నాచు జొంపంబు
కృష్ణాజినాశంకఁ గిలుకొలుపఁ 2-120

కవి ఎసపద్యము నడకలో చెప్పదలచిన వర్ణనలో చంద్రుడు మన్మథుడు ఇత్యాది పదములకు అచ్చతెనుగు పదములను ప్రత్యేకముగ వాడినాడు

చలనమొందె సగంధమలయగంధవహుండు
ధరణీశు కుండలి స్ఫురణముసను
వెలవెల్లనయ్యె రేవెలుగు వేలుపు జోదు
భూవరు నుత్తమభావగరిమ
విచ్చుమొగ్గై జాజి వేగ మామని ఱేఁడు
భూమివల్లభు తపఃస్ఫూర్తి వలన
కడు నిరాకృతిఁజెంది పెడవింటి నెఱజోదు
క్షితినాధు నచలసంస్థితిక కలన 3-66

చెన్నమరాజు ఎసపద్యములోని ఆరు ఇంద్రగణములకు 'సల'నే వాడి పద్యము నడకలో చక్కని రామణీయకమును చూపినాడు పద్యరచన మృదు మధురమై సరసత్వము కలిగి ఒప్పారినది

ఇది కందళితకుంద మిది నందవనబృంద
మిది నందదరవింద మిందువదన
యది తుంగతరతుంగ మది సంగతలవంగ
మది యంగజతురంగ మణువలగ్న

యిది జంభలకదంబ మిది బింబనికురుంబ
మిది శంబర కదంబ మేణనయన!
యది వంజులనికుంజ మది మంజులకరంజ
మది గుంజదళపుంజ మనుపమాంగి • 4-57

చెన్నమరాజు తాతయైన చెన్నమరాజు గొప్పతనమును ఈపద్యములో చెప్పునపుడు పాదములోని మొదటి సగమున అతని విశిష్టతను, తరువాత సగమున వానికి తగిన ప్రసిద్ధమైన ఉపమానములను ఉంచి పద్యరచన కావించినాడు

పటునీతి సత్కృపాబాహుశౌర్యంబుల
వాసవగురుఁడు శ్రీవరుడు నరుఁడు
ధీవిశేష ప్రతిజ్ఞావిష్ణు సేవలఁ
గంజసంభవుఁడు భార్గవుఁడు ధ్రువుఁడు
మహనీయ భోగ సన్మార్గదానంబుల
నముచిమర్దనుఁడు శంతనుఁడు ఘనుఁడు
సత్త్వమిత్రైశ్వర్యసౌందర్యరేఖలఁ
గరధృతహలుఁడు శ్రీగళుఁడు నలుఁడు 1 ఆ: 50

కవి తన వంశీయుడైన కృష్ణమంత్రి కీర్తిని ఈ పద్యమునందు అచ్చతెనుగు పదములతో భావగాంభీర్యమును ప్రస్ఫుటింపచేయుచు, దూరాన్వయమును చూపినాడు

తావి మోపరి దిండి దాయ తత్తడిరౌతు
పానుపు నిగనిగల్ పరిహసించి
మినుకుఁగ్రొవ్వెరిబోటి మిన్న యెక్కుడుమేలి
తేజీల ధళధళల్ దీలు పఱచి
వలినేలతాల్పు రా కలికి కూతుటు జేని
తెలిమేని మిసమిసల్ ధిక్కరించి
తెఱగంటి మూఁక పెఱిదెరువు కేళాకూళి
తరగచాల్ ధగధగల్ తారసించి

సకలభువనైకపవనపాళికి ననూన
మౌక్తికవితానమై తన మహితకీర్తి 1 ఆ 29

ఇందు మొదటి పాదమున 'ఆదిశేషుని' గురించి చెప్పుటకు గాలి ఆహారముగ గలిగినవానికి శత్రువైన గరుత్మంతుని వాహనముగ కలిగిన విష్ణుమూర్తి యొక్క పానుపు అని చెప్పినాడు రెండవ పాదమున 'హంస'లను గురించి చెప్పుటకు సరస్వతీదేవి ఎక్కు స్వచ్ఛమైన వాహనము అనినాడు మూడవ పాదమున పరమేశ్వరుని గురించి చెప్పుటకై మంచు కొండను పరిపాలించువాని అందమైన కుమార్తె భర్త యని అర్థము వచ్చు అచ్చతెనుగు పదములను కూర్చినాడు నాలుగవ పాదమున 'ఆకాశగంగ' ను చెప్పుటకు దేవతల సమూహములకు రాజమార్గమైన పెద్ద ఏరు అని చెప్పినాడు కవికి అచ్చతెనుగు పదములు వాడుట యందు గల నైపుణ్యము ఇందు వ్యక్తమగుచున్నది

వెలఁది వెన్నెలదార తళుకుదీవి బిడార
మేలువాఁడల లచ్చి మేలువాఁడు

పొలదిండి బలు తెంపముల పెంపు దలఁగింపఁ
జాలువాఁడడుగు పెంజాలువాఁడు

చిలువరా తెలిగూటి కలరు పుల్గులమేటి
డాలువాఁ డెదఁ గెంపు డాలువాఁడు

వెలుఁగు కెంజిగి తెట్టు కలుగులే మొనచుట్టు
వాలువాఁ డెనలేని వాలువాఁడు

చెలఁగి గిలకొట్టు మున్నీట మెలఁగువాఁడు
చెలువమగు జాళువా వన్నె వలువవాఁడు
ననుచు వేడుక నందఱు మనుచువాఁడు
వెన్నుఁ డరయంగ మన యిలవేల్పుగాఁడె 2 ఆ 102

ఈ పద్యమునందు శ్రీకృష్ణుని చక్కని అచ్చతెనుగు పదములతో వర్ణన చేసినాడు చంద్రునివలె ప్రకాశించుచు శ్వేతద్వీపమును పరిపాలించువాడును, లక్ష్మీపతి యని మొదటిపాదమున చెప్పినాడు రెండవపాదమున రాక్షసుల పరాక్రమాదులను తొలగించువాడు పాదములను పెంచి లోకములను ఆక్రమించినవాడు (వామనావతారము) అని వర్ణించినాడు సర్పరాజులను ఆహారముగ కలిగిన గరుత్మంతుని

కేతనముగ కలవాడును. కౌస్తుభమాణిక్యమును హృదయమునందు ధరించినవాడని మూడవ పాదమున తెలిపినాడు నాలుగవ పాదమున కెంపులవలె ఎఱ్ఱని కాంతులతో, సన్నని కొనలతో ఒప్పు సుదర్శనచక్రము కలవాడును. సాటిలేని ఆయుధమును కలవాడును అని వివరించినాడు తేటగీతి పద్యము నందు పాలసముద్రములో నివసించువాడనియు, పీతాంబరధారి యనియు, అందరిని ప్రేమతో కాపాడువాడు వెన్నుడని అచ్చతెనుగు పదముల సొగసుతో వర్ణించినాడు

తెలిమేని గిబ్బరాతేజి యెక్కుడు రౌతు
    విలుదబ్బ యెవ్వాని వీడు పట్టు
మడుగు చూలడుగుఁ దామర మాయవడుగు చెం
    దొవచుట్ట మెవ్వాని తోడబుట్టు
పుడుకుఁ గేజ్జడదారి యొడయని విడియమ్ము
    మిన్న యెవ్వని కేల మెఱయు వాలు
గాడ్పు మేతరి మేలి ఖాణంపు టొయ్యారి
    వార్వంపు సామి యెవ్వని దణాయి
యట్టి యమరాధి నాయకుండ 3 ఆ: 3

వృషభవాహనుని విల్లు అయిన పినాకము పుట్టినచోటు ఎవ్వనికి నివాసస్థలమో, కపటబ్రహ్మచారిగ మారిన వామనుడు ఎవ్వనికి తోబుట్టువో దధీచి వెన్నెముకతో తయారైన వజ్రము ఎవ్వని ఆయుధమో, పాములను తిను పక్షిరాజు వాహనముగా గల విష్ణువు ఎవ్వనికి సేవాపతియో అట్టి దేవరాజు ఇంద్రుడు అని కవి దూరాన్వయముతో అచ్చతెనుగు పదములను వాడి సౌందర్యమును చూపినాడు

వేల్పుల యానవాలపడి వెన్నెలకోరు కొటారు మంచు పూ
రాల్పుల మించులాడు వలరాయని మాయని కీర్తి తమ్మిపూ
చాల్పుల చొక్కుమందు తొగ చానకునై దువత్రాడు ఖేసికన్
దాల్పరి జుట్టు క్రొవ్విరి సుధానిధి గన్గొననయ్యె నయ్యెడన్
5 ఆ: 72

ఈ పద్యము నందు చంద్రుని వర్ణన అచ్చతెనుగు పదములతో చక్కగ సాగినది దేవతల ఆహారము నుంచు కలశము. వెన్నెలయొక్క నిధి. మంచు అనే పూవులను కురిపించువాడు. మన్మధుని చెడని కీర్తి. తామర పూవులు నిద్రించు

టకు మందు, కలువకాంతకు కంఠసూత్రము, ఫాలాక్షుని తలపైనున్న పూవు, అమృతమునకు నిధి యని వర్ణించినాడు

ఇంకను చారుచంద్రోదయము నందు అచ్చతెనుగు పద్యములు, అచ్చతెనుగు పదములను కూర్చిన పద్యములు పెక్కులు గలవు వీనివలన చెన్నమరాజుకు అచ్చతెనుగు పదముల మీద గల మోజు, వానిని ప్రయోగించుటలో అతనికి గల చాతుర్యము వ్యక్తమగుచున్నది

పాత్రోచితమైన భాష, భావ సౌకుమార్యము, జాతీయములు పలుకుబడులు, లోకోక్తులు, నానుడులు ప్రయోగించుట వలన కలుగు సహజత్వము దేశీయశైలి అని చెప్పవచ్చును శైలి సంవాదకరూపములో నున్నపుడు శబ్దములు సరళముగ నుండి, వ్యవహారములోనున్న పదజాలము రచనలో కనిపించి సహజత్వము సిద్ధించును జాతీయము, పలుకుబడి, సామెతలు, లోకోక్తులు నానుడులు తామరతంపరగ కావ్యమునందు దొరలును చెన్నమరాజు సామెతలను, జాతీయము లను విరివిగా ఉపయోగించెను సామెతలు కావ్యకన్యకకు ఆమెతలవలె నుండును సామెతల విలువ తెలిసినవారే వానిని సందర్భోచితముగ ప్రయోగింపగలరు ఈ సామెతల వలన విషయస్పష్టత, అర్థబోధకత సాధింపవచ్చును లోకోక్తులే సామె తలుగా వ్యవహరింపబడుట సర్వసామాన్య విషయము ఈ సామెతలు సర్వకాల సర్వావస్థల యందు వాడుకొనవచ్చును

జాతీయములు, నుడికారములు ఈ గ్రంథమునందు పెక్కు కనిపించు చున్నవి ఏదైనను ఒక అపూర్వమైన భావమును ప్రకటించుటకై కొన్ని పదములను కలిపి నిత్యజీవితంలో ప్రజలు సందర్భానుసారముగ వాడుదురు అవి కాలక్రమ మున నుడికారములుగాను, పలుకుబళ్ళుగాను, జాతీయములుగాను వ్యవహరింప బడును ఆ పదములు విడివిడిగ సామాన్య విషయములనే తెలుపునప్పటికిని, వాని సమ్మేళనము వలన వైశిష్ట్యమును పొంది ఒక క్రొత్తభావమును కలుగచేయును కావుననే కవులు జాతీయములను, పలుకుబళ్ళను, సామెతలను సందర్భానుసారముగ వాడి తమ రచనలకు వన్నెను చేకూర్చుదురు అదేవిధముగ చెన్నమరాజును తన కావ్యము నందు పెక్కు సామెతలను, జాతియములను వాడినాడు

'పిచ్చుక గుంటుపయి పయి వి
యచ్చరనది వచ్చినట్టులయ్యె' –2 ఆః 29
'వెన్నకుఁ బండ్లువచ్చె' –2 ఆః 46
'మూతెఁడుగాని బాతెఁడుగాని లేదు' –2 ఆః 73
'గోరంతాలస్యము గొండయంత పని చేటౌ' –3 ఆః 11

'కాలిగోరున నైనను బోలఁగలరె' –3 ఆ: 40
'వలపింపఁబోయి తా వలచె' –3 ఆ: 43
'ఎటుపోయెటువలె వచ్చునో' –3 ఆ: 64
'ఇంతుల మనోంబుజవృత్త మెఱుంగవచ్చునే' –3 ఆ: 145
'వనరుహాస్య లధికతర సాహసోద్ధతస్వాంతలనుట
నిక్కమయ్యె' –4 ఆ: 52
'తల్లి కిఁగానివార లిఁకఁ దక్కినవారికి మంచివారలే'–5 ఆ: 27
'గురువు ముందఱనే వివరించి చూచినన్ గుటగుటలు'
– 5 ఆ: 28
'ఏమి గావింపఁబోయిన నేమి యయ్యె' –5 ఆ: 31
'పోఁకముడిమాత్రమున కింత పొరలనేల
కొండలంతేసి పనులు పైనుండు టరుదె' –5 ఆ: 120

## జాతీయములు

'పోరికిఁదాఁ బెద్దసేసి' –2 ఆ: 58
'దూరపు కొండల కాపులుండు' –2 ఆ: 78
'తామరతంపర' –2 ఆ: 90
'గుండియ ఝల్లురు మన' –2 ఆ: 90
"పస మీఱఁగ" — 3 ఆ: 24
"స్వామికార్య స్వకార్యముల్ సంఘటిల్లె" — 3 ఆ: 41
"కులాచారధర్మంబు మైలపఱచి" — 3 ఆ: 45
"కుడిచి కూర్చుండి" — 3 ఆ: 47
"నేలపాలుగఁ జేసెద" — 3 ఆ: 47
"హస్తిమశకాంతరము" — 3 ఆ: 50
"పుడికి పుచ్చి" — 3 ఆ: 56
"నీచునకుఁ జేయు నుపకృతు

తైఁ చెవిటికిఁబట్టు శంఖులై, సుప్తపదా
సేచనమై రిత్తగు నిలు
పోచిళ్ళయి 3 ఆ. 62
ఆ యుఖములుకా యీ చినుకులు" 2 ఆ. 67
"వాడి కత్తులబోను" 4 ఆ. 48
"కొప్పు పట్టీడ్చినట్లు" 4 ఆ. 93
"కోడియై కూసె" 4 ఆ. 108
"ఆజ్యకోశాతకి న్యాయమయ్యె నయ్య" 5 ఆ. 11

చెన్నమరాజు తన ప్రబంధమున ధ్వన్యనుకరణశబ్దములను అధికముగ ఉపయోగించెను ఇవి అచటచట పునరుక్తములై యున్నవి గణగణ (1-40) వికావిక (1-107), మినమినలు (1-108), చకచక (1-114), నిగనిగ (1-130), వడివడి (1 136), ధగధగల్ మినమినల్ (1-140), వెడవెడ (1-152), ధళద్ధళ (2-18) కిలకిల (2-18) నిగన్నిగల (2-18) వికవిక (2-19), ఝుళాఝుళ ధళాధళ (2-27), నకనక (2-34), పెటపెట (2-45), జోటజోట (2-45), కివాకిహ (2-55), ఘగఘగల్ (2-106) జలజల (2-143), ఫెళఫెళ (2-144) తళతళ (3-78), గొక్కురన (4-16), గడగడ (4-30), బోరిబోరి (5-63) కిరాపిం (4-102) తుకతుక (5-32), విటపట (5-32,) ఘలు ఘలు (5-58)

అన్యదేశ్యములను కూడ చెన్నమరాజు ప్రయోగించెను పాదుషా (2-5), వజీరు (2-5) పాదుషాహు (3-125), జోహారు సలాము (4-107) రుమాలు (5 52) మొదలగునవి

చారుచంద్రోదయమునందు నాటకీయత కన్పించుచున్నది ప్రథమాశ్వాసము నందు శ్రీకృష్ణుడు రుక్మిణీదేవి అంతఃపురమునకు వచ్చినపుడు 'వచ్చి యొకతె జలకమునకు విచ్చేయుమటంచు విన్నవించెన్ హరికిన్' (1-31) మొదలు 'భోజ కన్యామణి చానొక్కొక్క పడుపె యొసంగుచు మక్కువ నిట్లనియె' (1-144) వఱకును, ద్వితీయాశ్వాస మంతటను తృతీయాశ్వాసము నందు అచ్చటచ్చట చతుర్థాశ్వాసము నందు నాయకునికి చిలుక నాయికను అంజనము వేసి చూపించిన తరువాత జరిగిన సంభాషణలోను నాటకీయత కన్పించుచున్నది

## 3. రసపోషణ

కావ్యము రసప్రధానము రస శబ్దము 'ఆస్వాదించు' అను అర్థమున మొట్టమొదట పేర్కొనినవాడు భరతుడు

"విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః"
— నా.శా: 7 అ: 344

దశరూపక కర్తయైన ధనంజయుడు దీనిని విపులీకరించెను

"విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమాన స్స్వాదుత్వం స్థాయీభావో రసః స్మృతః"

ధనంజయుడు 'సాత్త్విక', స్థాయి' భావములను రెండింటిని అదనముగ జోడించినాడు విభావములచేతను, అనుభావములచేతను, సాత్త్వికభావములచేతను, వ్యభిచారిభావములచేతను ఆస్వాదయోగ్యము కావింపబడు స్థాయిభావమే రసము విభావానుభావవ్యభిచారిభావములలోని 'భావ'శబ్దము ఆవృత్తము చేయబడినది భావ మనగా మానసికవికారము ఈ భావము స్థిరముగ నుండక తారుమారైనయెడల వ్యభిచారిభావ మగును ఇది స్థిరముగ నిలిచిన అనుభావములు, సాత్త్వికభావములు కలుగును ఆ భావములను ఉద్దీపన విభావములు అభివృద్ధి పరచును అపుడు ఆ భావము సుస్థిరమై 'స్థాయి' అను పేరుతో పిలువబడును ఈ 'స్థాయి' భావము అనుభవగోచరమైనచో రస మగును వర్ణనానిపుణుడైన కవి మదిలో మెదలు అనాదిప్రాక్తన సంస్కారప్రతిభామయములైన రాగాదులు పైన చెప్పిన భావముల ద్వారా సాధారణీకరణమును పొంది ఆస్వాదయోగ్యము లగును కవి పొందిన అనుభూతిని సహృదయుల కందజేయుటకు ఈ భావములు ఉపయోగపడును అనగా కవి తాను ముందు తాదాత్మ్యము చెంది, తన మనస్సులోని భావములను స్ఫుటము చేయుటకు వర్ణనలను ఆశ్రయించి సహృదయులకు ప్రత్యక్ష కల్పన చేయును అపుడు పాఠకుడు ఆ అనుభూతిని పొందును ఆ అనుభూతియే రసానుభూతి

ఆలంకారికులు నవరసములలో శృంగారము ప్రథమమైనదిగను, ప్రధాన మైనదిగను అంగీకరించిరి రసవంతమైన కావ్య మనగ లోకమున శృంగారరస ప్రధానమైనదని ప్రతీతి ఈ ప్రాధాన్యమును ప్రాచీనులలో ఆనందవర్ధనుడు గుర్తించెను

శృంగారఏవ మధురః పరః ప్రహ్లాదనోరసః
తన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి
— ధ్వన్యాలోకము, 2-7 శ్లో.

భోజుడు శృంగార మొక్కటే రస మని చెప్పినాడు ఈ వాదము నితడు-

"రసో౽భిమానో౽హంకారః శృంగార ఇతిగీయతే"
— స. కం. 5-1 శ్లో.

అని సూచించి,

"శృంగారహాస్యకరుణాద్భుతవీరరౌద్ర
బీభత్సవత్సలభయానకశాంతనామ్నః
ఆమ్నాసిషుః దశ రసా నపరే వయం తు
శృంగార మేవ రసనాద్రస మామనామః"

అని 'శృంగారప్రకాశము' నందు వివరించినాడు

'చమత్కారచంద్రిక' కర్తయైన విశ్వేశ్వరుడు-

"మధురః సర్వ సమ్మత్యాతి క్తాదిషు రసేష్వివ
హాస్యాదిషు స శృంగారో రససామ్రాజ్య మర్హతి"
— చమత్కార చంద్రిక. 5-6

అని నుడివినాడు

ఆనందవర్ధనుడు శృంగారము పరమప్రహ్లాదరస మనియు, మాధుర్య భరిత మనియు శృంగార రసమునకు పట్టము కట్టగ భోజుడు రస్యమానతాహేతువుచే శృంగార మొక్కటే రసమని కంఠోక్తిగ చెప్పినాడు విశ్వేశ్వరుడు శృంగారము 'రసరాజము' అని స్పష్టముగ పేర్కొనినాడు పై కారణములచేతనే కవులందరు తమ కావ్యముల యందు ఎక్కువగ శృంగారమునకే అగ్రస్థానము నొసంగి యుండ వచ్చును

ప్రబంధముల యందు నానారసనిబంధనము ప్రసిద్ధమైనను ఒక్క రసమునే అంగిరసముగ గ్రహింపవలయునని ఆలంకారిక నియమము కలదు

ప్రసిద్ధే౽పి ప్రబంధానాం నానారసనిబంధనే
ఏకో రసో౽ంగీ కర్తవ్యస్తేషా ముత్కర్షమిచ్ఛతా
— ధ్వన్యాలోకము. 3-21

సమస్త రసములు కావ్యమునందు సమానముగ పోషించినచో సహృదయ పాఠకుడు రసానుభూతిని పొందలేడని పై నిబంధన విధించి యుండవచ్చును

ధనంజయుడు తన అలంకార శాస్త్రము నందు –

"ఏకోరసోఽంగీ కర్తవ్యో వీరః శృంగారఏవవా అంగమన్యే
రసాస్సర్వే" —దశరూపకము : 3-33

వీర శృంగారములలో ఏదో ఒకదానిని అంగిరసముగను, తక్కినవానిని అంగరస ములుగను కావ్యమునందు ప్రయోగింపవలె నని చెప్పినాడు

ఆలంకారికుల ప్రమాణము ననుసరించి, లోకమున శృంగారరస ప్రాచుర్య మునుబట్టి 'చారుచంద్రోదయ' ప్రబంధమునందు చెన్నమరాజు శృంగారరసమును అంగిరసముగ స్వీకరించినాడు మిగిలిన రసములలో వీరరసమును అంగరసముగను, తక్కిన రసములను సందర్భానుసారముగ పోషించినాడు

ప్రథమం దృశ్యతే యత్తు శ్రూయతే సూచ్యతేఽపి వా
తత్ప్రధాన మితి ప్రాహుః రసప్రాధాన్యవేదినః
— భావప్రకాశము. 6-30

ముందుగా ఏది చూడబడునో, ముందుగా ఏది వినబడునో, ముందుగా ఏది సూచింపబడునో అదియే ప్రధాన రసమని రసప్రాధాన్య మెఱిగిన ప్రాచీనులు పలికిరి. అని విదితమగుచున్నది పైన చెప్పిన ఆలంకారిక నియమము ప్రకారము కావ్య ప్రారంభమును బట్టియు రసమును నిర్ణయింపవచ్చును

చెన్నమరాజు కావ్యారంభమున నాయకుడైన చారుచంద్రుని జన్మకు కారకులైన రుక్మిణీకృష్ణుల అనురాగమును చెప్పుచు 'ఆశ్లేష', 'అనురాగము' అను పదముల ద్వారా శృంగారమును సూచింపచేసినాడు విష్ణుమూర్తి స్తుతి పద్యమున 'శృంగారరస' శబ్దమును ప్రత్యక్షముగ వాడినాడు బ్రహ్మను స్తుతించు సందర్భమున తన కావ్యమునందలి శృంగారరస నాయిక 'ముగ్ధ' అను భావమును వ్యక్తము చేసినాడు ఈ విధముగ స్థూలముగ పరికించిన చారుచంద్రోదయము నందలి ప్రధాన రసము 'శృంగారరస' మని వెల్లడి యగుచున్నది

'న వినా విప్రలంభేన సంభోగః పుష్టిమశ్నుతే' అను లాక్షణికోక్తి ననుసరించి చెన్నమరాజు విప్రలంభమును కల్పించి సంభోగమునకు పరిపుష్టిని చేకూర్చెను విప్రలంభము నందు 'పూర్వరాగ విప్రలంభము'ను మాత్రమే ఎన్నుకొనెను మిగిలినవానిని విడిచిపెట్టెను ఈ పూర్వరాగ విప్రలంభమునే అభిలాషవిప్రలంభ మని కొందరు పేర్కొనిరి ఈ పూర్వరాగవిప్రలంభమున నాయికానాయకుల మనః ప్రవృత్తులు ప్రకటితమగును

## పూర్వరాగవిప్రలంభము లేక అభిలాషవిప్రలంభము

"యత్రైవమ సంగమాత్పూర్వం దర్శనశ్రవణాదిభిః,
పూర్వరాగస్స విజ్ఞేయః" —రసార్ణవసుధాకరము. 2_171

పూర్వరాగ విప్రలంభము పరస్పరానురక్తులయిన నాయికా నాయకుల ప్రథమ సంగమమునకు పూర్వావస్థ 'కలయక మున్న రాగమధికంబగునే నభిలాష' అని అనంతామాత్యుడు తన రసాభరణము నందు పేర్కొనెను ఇందు నాయికా నాయకు లకు సంగమము లేకుండుటచే శ్రవణ దర్శనములు అంగీకరింపబడినవి శ్రవణము దూత, సఖీముఖమున, ఇలరి గుణకిర్తనముచేతను కలుగును దర్శనము ఇంద్ర జాలమునందును, చిత్రమునందును, స్వప్నమునందును చేయబడును శ్రవణము ద్వారా నాయికానాయకులు ఆకర్షింపబడినచో 'వినుకలి' వలపు దర్శనము ద్వారా వారిరువురు కలియవలెనని కాంక్ష కలిగినచో 'కనుకలి' వలపు

'చారుచంద్రోదయము' నందు ద్వితీయాశ్వాసము (70 ప) నుండి పంచ మాశ్వాసము నందు చెలికత్తె వివాహవార్త కుముద్వతికి చెప్పువరకు పూర్వరాగ విప్రలంభమే కలదు కుముద్వతిచారుచంద్రులు పరస్పరము ఆకర్షింపబడుటకు కవి శ్రవణమునందు దూతను, దర్శనమునందు ఇంద్రజాలమును ఎన్నుకొనెను ఇందలి దూత 'త్రికాలవేది' యను చిలుక పుష్కరాసుర సంహారమునకు మెచ్చి ఇంద్రుడు చారుచంద్రునకు ఈ చిలుకను బహూకరించెను చారుచంద్రుడు భావి శుభమును గూర్చి తెలుపమని అడుగగ, చిలుక 'విష్ణువరప్రసాదసంజనిత కురంగ నేత్ర, కులశైలపయోధర, కుంజరేంద్రగామిని, కులిశాశ్మదంతగణమేచకకేశ కుముద్వతీ సమాఖ్య (2 ఆ 70) వరింపునని చెప్పి నాయకునియందు ఆసక్తిని రేకెత్తించెను అపుడు చారుచంద్రుడు కుముద్వతీ వృత్తాంతమును వివరింపు మని కోరిన పిదప నాయికను గురించి (2ఆ, 72 ప—3 ఆ, 118ప) సమగ్రముగ తెలిపెను విష్ణువు వరము వలన పుట్టుట, బాల్యము, యౌవనమును వర్ణించి, ఆమె రూపసౌందర్యము కన్నులకు సాక్షాత్కరించునట్లు జేసి అతనియందు అనురాగ బీజమును నాటుటకు ప్రయత్నించెను యౌవన వర్ణన చేయునపుడు—

'వయోలావణ్యశ్రీ '(2ఆః 84)
'నెమ్మేని సిండితీవ ' (85)
'చిన్నారిభరణి చిప్పలరీతిన్ గన్నులపండువ సేయుచు
కన్నియకుం బూప చన్నుఁగవ గనుపట్టెన్'—86 ప
'అవయవంబు లారూఢవరవయస్కంబులగుట '

— 88 ప.

అని అంగాంగవర్ణనకు పూనుకొని చివరకు,

'నీయొద్దఁగాక నాతి రుచిరాంగరీతి విఖ్యాతిఁగనునె'
—112 ప.

అని ఆఖరి అస్త్రమును ప్రయోగించెను చిట్టచివరకు,

కలికిమిటారి లేనడల కంతుని పట్టపుదంతి ముద్దు ప
ల్కుల వలరాచ తేజి జిగి కుందనపుం బని కీలుబొమ్మ వె
గ్గలమగు తావి కస్తురి మెకమ్ము చొకాటపు గుమ్మనవ్వు వె
న్నెల నెలనోగ —113 ప.

అని వర్ణించి ఆమె అందము చారుచంద్రునికి మాత్రమే తగునని స్పష్టపఱిచి వాసనా రూపమున నున్న కోర్కెను ఉద్దీపింప చేసెను

ఇంకను 'మరకతపల్లవపరిమళభరితమై, సువర్ణప్రసూన, బహురత్న ఫలస్ఫురితంబై ' (3-115) వన మొక్కటి కలదని, ఆ సమీపప్రాంతము నందు 'విగరంపుఁగెంపుగమి కోనావంక, పూనీటి కాల్వావొంతన్, నలతాంత కేసర చయంబాచెంత సంతానవాటీపర్యస్త పరాగవేదిపయి ' (3 ఆ. 116 ప ) 'పద్మాకరేశాత్మజ'ను చూచితినని ఉద్దీపనసామగ్రిని పెంచి రుక్మిణీతనూజుని మది యందు కుముద్వతీదర్శనకాంక్ష ప్రారంభమగునట్లు చేసినది ఇది యింతయు 'వినుకలి' నాయకుడు కోరిన పిదప ఇంద్రజాలముతో అదృశ్య మొనర్చి నాయి కను చూపించినది ఇది 'కనుకలి' 'త్రికాలవేది' చూపిన కుముద్వతి-

తళుకుం జెక్కుల చాకచక్యములు దంతచ్ఛాయలన్ దెల్పుగు
బ్బల సౌభాగ్యము కుంభవిభ్రమముఁ దెల్పన్ బాహుభూ
షాఝుళం
ఝుళనిక్వాణము లంఘ్రిలగ్ననిగళస్వానంబులం దెల్పఁదొ
య్యలి వచ్చెన్ విడివడ్డ మన్మథుని మాద్యద్దంతిచందంబునన్
— 3 ఆ: 124

మన్మథుని నుండి విడివడిన మాద్యద్దంతి మాదిరిగ కనిపించినది ఇచట కవి 'చెక్కుల చాకచక్యములు', 'దంతచ్ఛాయలు', 'గుబ్బల సౌభాగ్యము' మొద లగు రూప యౌవనాదులను, పాదభూషణములను, అలంకారములను చెప్పి నాయ కునికి ఉద్దీపనము కలుగజేసెను

ఆ విధముగ కనిపించిన కుముద్వతి తన చెలికత్తెలతో వనమునందు ప్రవేశించి 'వినోదవైఖరుల వెమఱుఁ బలుకుచుఁ గేరి నవ్వుమన్ మెలఁగి మెలఁగి కొంతలసి ' కమ్మ తెమ్మెరలు వ్యాపింపగ, ఒక మామిడితోటయందు బంగారముతో చేసిన తురంగి గద్దియపైన కొలువుండి చేసిన చేష్టలతో నాయకుని ఆకర్షించెను. నాయకుడు 'హర్షపయోధిమగ్నుఁడై' 'రాజముఖీమణిని చూచెను ఆ విధముగ మాటమండగ చిలుక కుముద్వతి సమీపమున నున్న చెట్టుపై ప్రాలి ఆమెను ఆకర్షించెను అపుడు దానిని కుముద్వతి అనురాగముతో తెక్కలు చక్కదిద్దుచు, చక్కెర మేపుచు మేను ఉవ్వుచు, లాలనగ పలుకుచు, కోకిల కలధ్వనితో చిలుక వచ్చుటకు గల కారణమును వివరింపుమని వేడెను ఇవి అన్నియు కుముద్వతి చేష్టలు ఈ చేష్టలు నాయకునికి ఉద్దీపన సామగ్రి

ఈ విధముగ కవి యాతయైన త్రికాలవేది ద్వారా 'వినుకలి నడిపించి నాయకుని యందు దర్శనోత్సాహమును పెంపొందింప చేసి 'కనుకలి ద్వారా నాయికను చూపి, ఆమె రూప యౌవనాదులను, చేష్టలను విలోకింపజేసి నాయిక యొక్క సమాగమునకు తహతహ లాడునట్లు చేసినది

పిదప కుముద్వతిని ఆకర్షించిన చిలుక నాయకుని గుఱించి 'రుక్మిణీసతీగర్భదుగ్ధార్ణవపూర్ణిమాపూర్ణచంద్రుఁడు' అగు చారుచంద్రుడు దుష్కర శౌర్యుడగు పుష్కరాసురుని పరిమార్చినాడని తెలిపి నాయికయందు ఆసక్తిని కలుగచేయుటకు ప్రయత్నించెను తరువాత అతని సౌందర్య, ధైర్య, భుజశౌర్యాది గుణములకు సంతోషించి, అతనికి తగిన కన్యక కొఱకు మూడులోకములు అన్వేషించినను కనిపించలేదని పలికెను తరువాత 'యోగదృష్టి తో పరికించిన ఆమె చారుచంద్రునికి తగిన వనిత అని తెలిసినదని తాను వచ్చిన పనిని తెలివితేటలతో వెల్లడించెను ప్రశంసకు ఎంతటివారైన ఆకర్షితు లగుదురుగదా! అదే విధముగ ఇచట నాయిక ప్రశంసకు ముగ్ధురాలై చిలుకద్వారా నాయకుని గుణగణములను విని ఆకర్షింపబడెను ఇది 'వినుకలి ఇచట కవి సూచనామాత్రముగనే చేసెను కుముద్వతి స్త్రీ స్వభావముచేత నాయకుడు బయటపెట్టినట్లుగ దర్శనాకాంక్షను వ్యక్తము చేయలేదు కాని చిలుక ఆమె లజ్జను గ్రహించి, నాయకునిచూచుటకు ఆమెను అంగీకరింపచేసి 'దివ్యాంజనము ద్వారా చారుచంద్రుని చూపించినది ఇది 'కనుకలి

ఈ రీతిగ కుముద్వతీచారుచంద్రులు ఇంద్రజాలమహిమ ద్వారా దర్శించిన పిదప వారి మధ్య అనురక్తి స్థిరముగ నిలిచి పరస్పరసంగమముకొఱకు నిరీక్షించుచు విరహము ననుభవింపసాగిరి

ఈ 'పూర్వరాగ విప్రలంభము' నందు మన్మథావస్థలను అభివర్ణించుట కావ్యసంప్రదాయము వీనినే స్మరదశలు, కామావస్థలు అని కూడ అందురు

సంచారీభావములు ఉత్కటము అయినపుడు పూర్వరాగమున అభిలాష మొదలు మరణము వరకు అనేక అవస్థ లేర్పడు ననియు. అవి పది అని రసార్ణవసుధాకర కర్త నుడివెను

అభిలాషశ్చింతానుస్మృతిగుణసంకీర్తనోద్వేగాః
సవిలాపా ఉన్మాదవ్యాధీ జడతా మృతిశ్చతాః క్రమశః
—రసార్ణవసుధాకరము. పు. 544, 176

తరువాత కొందఱు లాక్షణికులు కొంచెము భేదముతో

'దృఙ్మనస్సంగ సంకల్పో జాగరః కృశతారతిః
హ్రీత్యాగోన్మాదమూర్ఛాంత ఇత్యనంగదశా దశ'

అని పేర్కొనిరి

ప్రతాపరుద్రీయము నందు విద్యానాథుడు ప్రలాపము. సంజ్వరము అను మరి రెండు అవస్థలను అదనముగ చేర్చినాడు ఈ ద్వాదశావస్థలను చెన్నమరాజు తన కావ్యము నందు పోషించుటకు ప్రయత్నించినాడు

కావ్యగతమైన కామావస్థలు కవులు ఎక్కువగ నాయికాగతములుగనే వర్ణించినారు కాని ఈ అవస్థలు ఇరువురికి సమానమే. అనుభవవిషయమున మాత్రము తరతమ భేదము లుండవచ్చును స్త్రీ పురుషులలో ప్రకృతి తారతమ్య ముండుట చేతను. ధీరోదాత్తుడైన నాయకుడు బహుకార్యమగ్నుడై యుండుట వలనను 'ఆదౌ వాచ్యః స్త్రీయారాగః' అను అలంకారికోక్తి ప్రకారము కవులు నాయికలకే ప్రాధాన్యమిచ్చి ఈ కామావస్థలను వర్ణించిరి

నాయికకు కనుకలి ద్వారా 'చక్షుః ప్రీతి' కలిగి, అనురాగ ముదయించినది అతనిని చూచిన తరువాత నాయిక చిగుళ్ళు త్రుంపి చిలుక మీదకు విసరుట, 'చూపులతో కౌగిలించుట', 'మొనపంటితో మోవిని నొక్కుట', 'చన్నుల నెద గ్రుచ్చుట'. 'కన్నుగవ నూల్కొనుట మొదలగు రాగప్రకాశచేష్టలు చేసినది (3 ఆ. 145) ఇది యంతయు నాయకుని దర్శించిన తరువాత పొందిన అవస్థ ఇవి నాయిక పరముగ అనుభవములు. నాయకుని పరముగ ఉద్దీపనవిభావములు ఇట్లు చూపులతో 'మనస్సంగమైన' తరువాత కుముద్వతి విభుడు కనిపింపక పోవుటచేత కుతూహలముతో బాష్పదృష్టితో పరికింపగ చింత యందు మునిగిపోయినది ఇచట ఆమెకు 'సంకల్పము' ఏర్పడి 'కార్శ్యము' అను అవస్థ ఏర్పడినది అపుడు చెలికత్తెలు ఆమెను రత్నకేతనపురమునకు చేర్చిరి అచట కుముద్వతి విరహముతో తపించి 'చారుచంద్ర విరహోత్కట చింతానలజ్వరాతి తప్తాశయె' (4 ఆ. 29)

సంతాపము అను అవస్థను చేరినది ఆ సమయమున ఆమె యందు 'కంపము వైవర్ణ్యము అను సాత్త్వికభావములు పొడసూపినవి తరువాత లలిత మున్నగు లావణ్యహావవికారములు రాణించి పుష్పశయ్యపై అటు ఇటు చింతతో పొరలినది ఆమె తాపమును గమనించి సఖులు చేసిన శైత్యోపచారములు ఆమె తాపమును మరింత పెంపొందింప జేసినవి ఆ తాపమును పోగొట్టుకొనుటకై ఉత్పలవారి పూల గులలో ఊలక మాడగ అవి పెడెక్కి శరీరమును కాల్చినవి ఆమె సుమచాపదురాప తాపములను ఓర్చుకొనలేకపోయినది దీనికి సహాయముగ వసంతఋతువిజృంభ ణము ఈమె విరహమును రెట్టింపు చేసినది ఆమె పరిస్థితిని చూచి చెలికత్తెలు కలత చెందిరి ఆ సమయమున

కుసుమకోమల విరహాగ్ని విసిగి విసిగి
యుసురుపై యాస యంతయు నోసరించి 4 ఆ 45 ప

సఖులకు చెప్పక 'మరణప్రయత్నము చేయవలె నని శుకవాహనసహాయ ముతో వనవాటికకు వెళ్ళినది ఆ వనశోభ కూడ ఈమె తాప మధిక మగుటకు దోహదము చేసినది చెలికత్తెలు ఆమెను అంతఃపురమున కానక అడుగుజాడల ననుసరించి కుముద్వతిని అన్వేషించిరి అపుడు ఆమె

వీడిన కొప్పుఁగప్పు నెఱవీడిన తాల్మియు బాష్పవృష్టిచే
వాడిన మోముఁ దమ్మికయి వ్రాలినచూపులు గుబ్బచన్నులం
గూడిన జిల్గు పయ్యెదయుఁ గొంచపు టెల్గునుగల్గియున్న యు
చ్చ్చేడియ నంతి కోపవనసీమఁ గనుంగొని లోఁగలంగుచున్
4 ఆ. 50 ప

అశ్రువు వైవర్ణ్యము, నిస్స్వరము, లజ్జ, దైన్యము మొదలగు భావములతో చెలులకు దర్శన మిచ్చినది చెలులు ఆమెను మృదులోక్తులతో కుదుటపఱచుటకు ప్రయత్నించి, ఆమె సంతోషము కొఱకు కుసుమాపచయమునను జలకేళికి సిద్ధ పడిరి తరువాత కుముద్వతి ఇష్టసిద్ధికై మన్మథ పూజకు ఉపక్రమించిరి వారి నోటి వెంట విభునిపేరు వినగానే రాగ మధికమై తన ప్రియుని ఆకారము స్మృతికి వచ్చి మనస్సు నందు స్థిరముగ నిలిచి పోయినది అపుడు ఆమె ఉన్మాదమూర్ఛావస్థ లను బొందగ,

అంతరవీది నిల్చిన తదాకృతి నిశ్చలదృష్టిఁగాంచి చే
ష్టాంతర ముజ్జగించి యచలాకృతి నుండు కుముద్వతీసతిన్

గంతుశరాహతిప్రభవగాడవికారిణిఁగాఁదలంచి లోఁ
జింతిలి యింక నిచ్చట వసింపగరాదని యెంచి నెచ్చెలుల్
—4 ఆ: 112

చెలులు ఆమెను సౌధమునకుచేర్చిరి వెన్నెల ఆమె విరహతాపమునుఅధికము చేసెను దానిని భరింపలేక ప్రలాపమువలె చంద్రోపాలంభన మన్మథోపాలంభన కావింపగ సఖులు మలయమారుత, శుకపికముల ఉపాలంభనకు పూనుకొనిరి తరువాత వారు కుముద్వతి అనంగతాపమును పోగొట్టుటకై ప్రొద్దుగడుపుటకు కథలు చెప్పుచు శైత్యోపచారములు చేసిరి కాని ఆమెకు ఉపశమనము కలుగక దుఃఖము అధికమయ్యెను ఈ విధముగ మన్మథాగ్నిచేత తప్తాంగియైన ఆ కుముద్వతి ముక్కు ముంగర చివర వ్రేలాడు ముత్యము కాటుక కంటినీటిచే నిండి నల్లనై ఆమె నిశ్వాసమారుతగంధమును ఆస్వాదించుటకై వచ్చిన గండు తుమ్మెదవలె కనపడుచున్నదని కవి విశిష్టమైన కల్పన చేసి, ఆమె విరహమునకు చిట్టచివరి స్థితిని కల్పించినాడు ఈ రీతిగ విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావ సహితముగ వర్ణింపబడినది

నాయకునికి త్రికాలవేది ద్వారా 'చక్షుఃప్రీతి' కలిగినది తరువాత చిలుక అతని అదృశ్యభావమును పోగొట్టి 'కాయజరూప! నీకుఁదగు కామినియౌఁగద' అని ప్రశ్నింపగ 'బాయని వేడ్క నవ్విభుఁడు భాసురహాసవిలాసవక్త్రుఁడై, 'చొక్కపుఁ జక్కదనంబు జవ్వనిన్ చూపితివని చిలుకను ప్రశంసించెను దీని వలనను, 'చక్షుఃప్రీతి' వలనను చారుచంద్రునికి నాయికయందు 'మనస్సంగమై' 'సంకల్పరూప' మేర్పడినది తరువాత చెలికాని యొద్ద కుముద్వతి సౌందర్య కీర్తనము చేసి, నాయిక మీద తనకు గల కోరికను వ్యక్తము చేసెను అతనిలోని తీవ్రతాపము 'లజ్జా త్యాగము' చేయించినది అపుడు 'హాళి నఖర్వవరాళి మౌర్వి దోర్వినుతశరాళికిన్ దలఁకి విన్నఁదనంబు వహించియున్న' అతనిని చూచి చిలుక రమాపతి అతని వాంఛితార్థము తీర్చునని అభయహస్త మిచ్చెను తరువాత చిలుక సహాయముతో ద్వారావతీపట్టణమునకు వెళ్ళి నాయిక యందు విరహము ననుభవింపసాగెను రుక్మిణీదేవి, చెలులు స్నానభోజనాదులకు ఎంత పిలిచినను ఇచ్ఛ లేకయే యాంత్రికముగ ఆ కార్యక్రమమును పూర్తి చేసి 'అరతి' అవస్థను చేరెను పిదప పూసెజ్జపైన పవ్వళింపగనే కుముద్వతి స్మృతికి వచ్చి కనుల ఎదుట సాక్షాత్కరించినట్లనిపించెను అంత నాలుగు దిక్కులు వెదకి ఆమె కనపడకపోవుటచే మనస్సునందు ప్రేమ తలపోసి, మన్మథవేదన భరింపలేక అటు ఇటు పొరలుచు ప్రలాపధోరణితో 'బాలికామణి గాఢాంకపాళిఁ దేల్చి ప్రోడఁ గావించు టెన్నఁడు పొసఁగు నొక్కొ' అని చింతింపసాగెను ఈ విధముగ 'కార్శ్యము', 'ప్రలాపా

వస్థల ను పొందెను ఆ సమయమున కీరము శితలోక్తులతో కథం వినిపించి సేద తీర్చుచు. ప్రౌఢ్ముం గడుచునట్లు చేయసాగెను

ఈ రీతిగ కుముద్వతీచారుచంద్రుల యందు విరహము క్రమ వికాసము నొంది వివిధావస్థలను చేరి సంభోగమునకు పుష్టిని చేకూర్చినది వారియందు రతి కాంక్ష పెరిగినది చెన్నమరాజు ద్వాదశావస్థలను నాయికా నాయకు లిరువురిపట్ల పోషించినాడు, నాయిక యందు సమగ్రముగ, నాయకుని యందు సూచనా మాత్రముగ చేసినాడు దిరుద్వైన నాయకుని యందు కృశత ఉన్మాదము, మూర్ఛ, మరణము, జాగరము, సంజ్వరము మున్నగునవి వర్ణించిన రసపుష్టికి భంగముకలుగుననివానిని పరిహరించి, ముగ్ధయైన నాయిక యందు ఈ అవస్థ లన్నింటిని ప్రదర్శించి 'హ్రీత్యాగము'ను విడిచిపెట్టినాడు కుముద్వతి ముగ్ధ కావున సహజ సిద్ధమైన 'లజ్జ చేత మొదటనే నాయకుని యందలి దర్శనకాంక్షను బయటపెట్టలేదు. చివకే ఆమె మనస్తత్వమును గ్రహించి ఆమెను అంగీకరింపచేసి చూపించినది అదేవిధముగ ఇచట చెలికత్తెలకు తన మనస్సులోని భావములను తన నోటితో చెప్పక వారంత వారు గ్రహించునట్లు ప్రవర్తించినది కావున కామావస్థలో నాయిక పరముగ 'హ్రీత్యాగము'ను విడిచిపెట్టుట సమంజసముగనున్నది పూర్వరాగము ఈకావ్యము నందు మంజిష్ఠారాగము

## సంభోగ శృంగారము

పరిస్పరానురక్తు లయిన నాయికానాయకుల దర్శన, స్పర్శన ఆలింగన అధరపాన, చుంబనాదులచే దీపించును 'చారుచంద్రోదయము' నందు సంభోగ శృంగారము ఆలోకన, ఆలింగన, చుంబన, సురతాది క్రియలతో సమన్వయింప బడినది ఈ శృంగారమును కవి సంపూర్ణముగ వర్ణించినాడు అనగా శాస్త్రోక్తమైన వివాహతంతు కుముద్వతీ చారుచంద్రులు ద్వారావతీ నగరమునకు వచ్చి గృహ ప్రవేశము చేయుట చెలికత్తెలు నాయికను పడకగదిలో విడిచి వెళ్ళుట, కన్యా విస్రంభణము, ప్రథమ సమాగము మొదలగు విషయములను విపులముగ చిత్రీక రించినాడు వివాహ సమయమున తెరతీయగనే—

ఒండొరున్ బతియుం గంజదళాక్షియు దీర్ఘదీర్ఘలో
చనరుచు లెంతయున్ గదిసి సారెకు సారెకు సామువేయుఁగన్
—5 ఆ. 90

వారియువురి ఆలోకనదృష్టిని వర్ణించినాడు

కుముద్వతి యత్నముతో చెలుల సహాయముతో ప్రియునికడకు వచ్చిన పిదప సఖులు నాయికను పడకగది యొద్ద విడిచి కిలకిల నవ్వుచు వెడలిపోయిరి పిదప చారుచంద్రుడు నిలువున కౌగిలించుకొని, బాలికామణిని చలిమంచము మీదికి చేరి అంకమున చేర్చుకొని, బుజ్జగించి, వేనలి వలుమాఱు మువ్వెను తరువాత ఆమె 'జిగిమోవి'ని, 'కలికి లేజూపులను', 'గురు పయోధరములను', మెఱుంగుల మేనును', కౌను తన మనస్సునందు నిలిచిపోయినవని చతురోక్తులతో ఆమెను మిక్కిలి గౌరవించెను ఇవి సుకుమారమైన శృంగార చేష్టలు

కుచము లంటఁగఁబోయి గొబ్బున భ్రమియించి
గేలిమై నీవికిఁ గేలుసాచు
కురులు తీర్పఁగఁబోయి సరుగున భ్రమియించి
పూని వాతెఱ కమ్మఁదేనె కొడియు
వేణిఁబట్టఁగఁబోయి వేగంబె భ్రమియించి
మనజఘనంబుపై కరము నిలుపు
నడుగు ెంటఁగఁబోయి తుది బడ భ్రమియించి
తొడనే మెఱుఁగుఁ బెందొడలు నిమురు
హారములు చూడఁబోయి నీహారకిరణ
తులిత ముఖ చారు చుబుకంబుఁదొడరిపట్టి . . –5 అ: 116

చారుచంద్రుడు బాలికామణిని మదనక్రీడలయందు అలరించుటకు ప్రయత్నించెను ఆ సమయమున కుముద్వతి సిగ్గుతో నాయక చేష్టలను తిరస్కరింపగ,

పోకముడి మాత్రమున కింత పొరలనేల
కొండలంతేసి పనులు పైనుండుటరుదె –5 అ॰ 119

అని సరస సంభాషణ చేసెను తరువాత విభుడు 'నీవియుఁ గుచదుర్గంబులు గావఁగ లే కలరుబోడి కరపల్లవముల్ లావరి యుండఁగఁ గైకొనె' (5 అ, 120) ఆ కలహసంభ్రమసమయమున కుముద్వతి ధరించిన ధవళవస్త్రము ఎనంత తానే జారెనని కవి సంభోగమునకు పరాకాష్ఠ స్థితిని కల్పించినాడు వారిరువురి రతిక్రీడ లోని ఉత్కృష్టతను కవి యిట్లు వర్ణించినాడు

గ్రక్కునఁ గౌఁగిలించి తమకంబున వాతెఱ తేనెలాని లేఁ
జెక్కిలి ముద్దుఁబెట్టుకొని చిక్కని చక్కని గుబ్బలంటుచున్

మక్కువ బుజ్జగించి పలుమాఱు మదిన్ గరఁగించి భూవిభుం
డక్కువలాయతాక్షి మకరాంకసుఖాంబుధిఁ దేల్చె
నెంతయున్ -5 ఆ: 122

ఇంతవఱకు కవి సమకూర్చిన విభావానుభావ సాత్త్విక వ్యభిచారిభావ సామగ్రి అంతయు స్థిరమై సఫలీకృతమైనది. కువలయవతి ఏ విధముగ ముగ్ధత్వమును విడనాడి రతిక్రీడయందు ప్రౌఢ అయ్యెనో తెలిపి సంభోగశృంగారమును ముగించెను

## అంగరసము

ఈ కావ్యమున 'వీరము' అంగము. వీరమునకు స్థాయి 'ఉత్సాహము' ప్రతినాయకుని ఉత్కర్ష ఉద్దీపనము. అసమ్మోహము, అధ్యవసాయము, నయము వినయము, బలము, పరాక్రమము, శక్తి, ప్రతాపము, ప్రభావము, అవిషాదము ధైర్య, శౌర్యాదులు విభావములచే పుట్టును. స్థైర్య, ధైర్య, శౌర్య, త్యాగ వైశారద్యము మొదలగు అనుభావములచే వీరాభినయము చూపింపవలయును. ధృతి, మతి, గర్వము, ఆవేశము, ఔగ్ర్యము, అమర్షము, స్మృతి, రోమాంచము మొదలగునవి వ్యభిచారిభావములు.

చారుచంద్రుని ప్రతినాయకుడు పుష్కరుడు. ఇతడు ఆలంబన విభావము. అతడు దేవతలను, మునులను పెట్టిన బాధలు అతని ఉత్కర్ష

శాంతభూషణుడు—

చండకరమండలాగ్రగతేజఃప్రభావ
పుష్కలంబగు పుష్కరస్ఫురణ మడఁచి
కువలయుఁబ్రోచితేని సూరవర నీకు
చారుచంద్రాభిధానంబు సార్థమగును -2 ఆ: 40

అని ప్రశంసింపగ ఇంద్రుడు ఇచ్చిన రథమెక్కి మహారణోద్ధతితో ఆ రాక్షసుడు నివసించు ప్రాంతమునకు చేరెను. స్థాయియైన ఉత్సాహమును కవి యిట్లు వర్ణించెను—

శౌరితనూజుఁడయ్యసురసైన్యముఁ గన్గొని దివ్యసాధనా
ధారధరాధరాహితరథం బధిరోహణ మాచరించి ది

గ్వారణకర్ణదుర్భరనిగాఢదనుర్లతికోగ్ర టంక్రియా
వారితవైర్యవార్యధృతివై భవుఁడై నిలిచెన్ మహోద్ధతిన్
_2 అ: 49

ఇట్టి 'ఉత్సాహము'తో నాయకుడు గజవాహనరధ ముఖ్యములగు మహాసైన్యముతో ఆ రాక్షసేంద్రుని సైన్యమును ఎదుర్కొనెను ఉభయదళములు కలియబడుటచేత రక్తనదులు ప్రవహించెను రాక్షససేన విజృంభణమునకు తాళలేక భయపడి చారుచంద్రుని సేన వెనుకకు మరలెను అప్పుడు యాదవ కుమారుడు ఆగ్రహవృత్తితో శౌర్యప్రతాపాదులతో పుష్కరసేనను ఛిన్నాభిన్నముచేసి, తన కోపాగ్నికి గురిచేసినాడు ఆ సమయమున పుష్కరుడు రౌద్రముతో-

...ఘోరభీషణధనుర్జ్యావల్లరీటంక్రియా
ఘన ఘోషంబుల రోదసీ కుహర మార్గంబెల్ల ఘూర్ణిల్లు'

నల్లుగ చారుచంద్రుని చతురంగబలమును తన నిశాతమైన బాణపరంపరను పుంఖాను పుంఖముగ కురిపించి ఢీకొనెను చివరకు,

జననాథాగ్రణి వానినన్నిటిని శస్త్రిశ్రేణిచేఁ ద్రుంచి కాం
చనవర్మం బగలించి మౌళితటచంచద్రత్నకోటీరమున్
దునియల్గా నొనరించి బాహుయుగమున్ దుంద్రించి
వే మించి త
ద్దనుజాగ్రేసరు మూర్ధమున్ దునిమె నుద్యద్బాణ
రాజంబునన్ _2 అ: 60

పుష్కరుని సంహరించెను

పైన జరిగిన సంగర మంతయు సంగ్రహముగ వివరించబడినది ఇచట నాయకుని యందలి 'వీరము'ను, ప్రతినాయకునిలోని 'రౌద్రము'ను, యుద్ధక్షేత్రము నందలి 'బీభత్సము'ను కవి హృద్యముగ వర్ణించెను ఇందలి యుద్ధవీరము ధర్మ సంబంధమైనది

'చెన్నమరాజు' కథా ప్రారంభము నుండియు, వీరరసమును అంగరసముగ పోషించుకొనుచు వచ్చినాడు శౌనకాది మునులు 'దైత్యధ్వంసియైన తత్ప్రితాపానూనోదయుఁడెల్పవే' అని సూతుని ప్రశ్నించినట్లుగ కథాప్రారంభము చేసినాడు తరువాత ద్వారావతీ పట్టణమున కధిపతియై గోపాలుడు దనుజకోటి సంహారమొనర్చ

అలరుచున్నాడని తెలియజేసెను పిదప 'దానవభేదని స్ఫురణం పంప్రపాపె పట్టి లేమికిన్ రుక్మిణీసతి చింతిల్లుచున్నదని వ్యక్తము చేసినాడు దీనినిబట్టి రుక్మిణీ కృష్ణులకు జన్మింపబోవు చారుచంద్రుడు రాక్షస సంహార మొనర్చునని తెలియు చున్నది ఈ ప్రకారము తన కావ్యమునందలి అంగరసము వీరరసమని సూచించి నాడు

పిదప గర్గముని 'అరుం బెడవి కువలయంబేలంగలండని' చారుచంద్రుడను పేరొసగినాడు ఆ పసివాడు పుష్కరాసురుని సంహరించుటకు దీక్ష వహించిన విధముగ నున్నాడని వర్ణించినాడు ఈ విధముగ కథాప్రారంభము నుండి అంగరస ముగ వీరరసమును సూచించుచు పుష్కరసంహారము వరకు దానిని క్రమముగ పోషించినాడు చిట్టచివరకు తండ్రివలెనె దనుజదరడియనుచు చారుచంద్రుని శౌర్య, ధైర్య ముఖ్య సద్గుణములను మెచ్చిరి అని సూతుడు పలికించిన చారు చంద్రుని విలసిచర్యలను పవి హర్షమును వ్యక్తము చేసినట్లుగ ముగించినాడు ఈ రీతిగ అంగరసమైన వీరమును కథానుగుణముగ పోషించినాడు

ఇక ఈ కావ్యము నందలి అన్యరసములను సందర్భానుసారముగ పోషించి నాడు కాంతభూషణుడు పుష్కరుని బాధలను వర్ణించునపుడు, ఇంద్రుడుపోయి బ్రహ్మతో మొరపెట్టుకొనినపుడు, రాక్షసుని దౌష్ట్యము కన్న వీరి బాధలే పారమని గుండెను కరగించునట్లుగ ఉండుటచేత 'కరుణరసమ'ని చెప్పవచ్చును ప్రతినాయకు డైన పుష్కరుని యందు రౌద్రరసము (2 ఆ, 45, 57, 59) ను, యుద్ధక్షేత్రము నందు అసురుల యుద్ధ వైఖరిని వర్ణించునపుడు బీభత్సమును, తపస్సందర్భమున, విష్ణువును స్తుతించునపుడు భక్తిరసమును పోషించినాడు ఇంకను త్రికాలవేది చారు చంద్రుని చెలికానికి తన మాయతో రత్నకేతనపుర ప్రాంతమునకు తీసికొనిపోయి నపుడు చారుచంద్రునకు ఏకాంతము కల్పించుటకై బంగారు పావురమును సృష్టించి నపుడు, అదృశ్యకళతో నాయకుని అదృశ్యము చేసినపుడు, కుముద్వతికి దివ్యాంజ నము వేసి చారుచంద్రుని చూపించినపుడు 'అద్భుతరసము పోషింపబడినది వన విహార సమయమున సఖుల సంభాషణయందును, సంతానాభిలాషియై తపస్సున కేగు నపుడు పద్మాకరుడు భార్యను నచ్చచెప్పునపుడును తపోవిఘ్నమునకు వచ్చిన అప్సరసల సంభాషణలోను హాస్యరసము సూచనమాత్రముగ కనిపించుచున్నది

## 4. సమకాలికసమాచారము

కృతికర్త చెన్నమరాజు అనంతపురిమండలమునకు చెందిన తాడిపర్తి నివాస గండికోట దుర్గాధిపు డగు పెమ్మసాని తిమ్మానాయని మంత్రిగ, ఎహాళ కీర్తి కెక్కినాడు తళ్ళికోట యుద్ధానంతరము హంపీవిజయనగరము ధ్వంసము

చేయబడినది అప్పుడు అళియ రామరాయలసోదరుడైన తిరుమలరాయలు విజయనగరం సింహాసనమును చంద్రగిరికి తరలించెను ఆనాటినుండియు అంతిమదశ వఱకు విజయనగరం రాజులు చంద్రగిరిని గాని, పెనుగొండను గాని రాజధానులుగ చేసికొని పరిపాలన సాగించిరి కృతికర్త చెన్నమరాజు కాలమునాటికి విజయనగరరాజు మూడవ వెంకటపతిరాయలు ఈ రాయలను మెప్పించి కృతికర్త గరుడ నారాయణ బిరుదధ్వజము, బంగారుపువ్వుల చంద్రగావి పావడ, తురాయి, గజము, హయ రత్నము వీరమలహారి, కంఠమాలిక తాళిచౌకట్లు, ముత్యాల కడియములు, గండ పెండేరము, కత్తిమంచ తెచ్చి ఒసె ప్రభునగు పెమ్మసాని తిమ్మ భూపాలుని కిచ్చి నాడు (1–74) మఱియు 'పంచకళాంజి పట్టి మహాను హక్కులు వెంకటపతిరాయల యొద్ద మెండి పొందినాడు దీనివలన ఆనాటిరాజులు 'పంచకళాంజి పట్టించుకొనెడి వారని తెలియుచున్నది మఱియును రాయల మెప్పు సంపాదించినవారికి బహుమానములిచ్చెడిరీతి తెలియుచున్నది

సమకాలికసమాచారము కావ్యము లందు ప్రతిబింబించుట సర్వ సామాన్య విషయము అదేవిధముగ 'చారుచంద్రోదయము' నందు రాజసంబంధమైన విషయ ములు, దేశపరమైన సంగతులు, మతవిశేషములు, ఆచారవ్యవహారములు, వినోద విహారములు అలంకరణలు మొదలైన సమకాలిక విశేషములు కలవు

చెన్నమరాజు శ్రీకృష్ణుని పద్మాకరుని చారుచంద్రుని పాత్రలను చిత్రీకరించు నపుడు ఆనాటిరాజుల లక్షణములను, రుక్మిణీకుముద్వతుల పాత్రలను పోషించు నపుడు నాటి రాణివాసమును ద్వారావతి రత్నకేతనపురములను వర్ణించునపుడు నాటి రాజధానిని, రాజప్రాసాదములను, రాజాంతఃపురములను దృష్టియందుంచుకొని రచన కావించినట్లు తోచుచున్నది ఇంకను నాటి రాజసభలను, రాచమర్యాదలను, యుద్ధరీతిని కావ్యమునందు చక్కగ వ్యక్తము చేసినాడు

ఆనాటి ప్రభువులకు బహుభార్యాత్వము సర్వసామాన్యము (1–127) వారి పరిపాలనలో అధర్మమునకు తావులేదు (2–78) నిగ్రహానుగ్రహములతో ఆక్షేపణ లేకుండ పరిపాలన సాగించెడివారు రాజులకు సిద్ధుల, మునులమీద భక్తిగౌరవములు అధికముగ నుండెడివి మునులకు ఎదురేగి తోడ్కొనివచ్చి, అర్ఘ్యపాద్యాదు లొసగి, చేయూత నిచ్చి ఉన్నతాసనముమీద కూర్చుండబెట్టి కుశల ప్రశ్నలతో గౌరవించెడివారు (2–826) మునులు కూడ రాజుల క్షేమము సదా కాంక్షించెడివారు (2–89) రాజు కొలువున్న సమయమున సామంతరాజులు, ధీరులు, వీరభటులు, సుకవులు, స్త్రీలు సేవించెడివారు (2–81) రాజులు నిండు కొలువుతీర్చియున్నపుడు చారులు ముఖ్యవార్తలు అందజేసెడివారు (2–45, 3–4) ప్రభువులు శుభకార్యములకు,యుద్ధమునకు ఏనుగులనే ముఖ్యవాహనములుగ వాడెడి వారు (5–73) వాహ్యాళికి గుఱ్ఱములనే వాహనములుగ ఉపయోగించుకొనెడివారు

ఆనాడు రాజులు రాణులకు స్వయముగ వడ్డించెడివారని తెలియుచున్నది (1-138) భోజనానంతరము స్త్రీలే శీతలగంధోదకములతో చేతులను వార్చుచుండెడివారు (1-139) తరువాత ప్రభువు కేళీగృహము నందు 'హళఁది సూర్యపుటపుఁబలుపున గుంకుమపూతలాడ మల్లెవిరిపాన్పుగల తూఁగు మంచమున' కూర్చుండిన సమయమున ఒక దాసి నునుజిలుఁగు పావడతో పాదముల తడి యొత్తెడిది (1-140, 141) అంత ఒక చెలికత్తె కర్పూరపు పలుకులొసగగ, రాణి తాంబూలపు మడుపుల ప్రభువునకు ఇచ్చెడిది (1-144) దీనినిబట్టి ఆనాడు ప్రభువులకు పరిచర్య లన్నియు చెలికత్తెలు చేయగ, భోజన తాంబూలసేవలు మాత్రము స్వయముగ రాణులే చేసెడివారని తెలియుచున్నది ఆనాటి రాజులు పద్మరాగమణులు కూర్పబడిన కోళ్ళ, వైడూర్యములతో పొదగబడిన పట్టెలు, మణులకాంతితో ఒప్పు వితానము, కుంకుమ రంగు పఱుపుకల మంచముమీద పవ్వళించెడివారు (5-107)

చెన్నమరాజు నాయకుడైన చారుచంద్రుడు ప్రతినాయకుడైన పుష్కరుని ఎదుర్కొనినపుడు చతురంగ బలముతో యుద్ధమున కేగినట్లు చెప్పినాడు యుద్ధమున కేగునపుడు ఆ సైన్యము రేపిన ధూళి, యుద్ధమున మరణించిన వీరుడు సూర్యుని శరీరమును ఛేదింపకుండ తాల్చిన కవచమా యనునట్లుగ సూర్యుని కప్పెను (2-51) అని చెప్పుటచేత ఆనాడు యుద్ధము నందు వెనుకంజవెయని వీరుడు, వీరమరణము పొందినచో సూర్యమండలము దాటిపోగలడను శాస్త్రోక్తి మీద నమ్మకము కలిగి యుండెడివారని తెలియుచున్నది ప్రతినాయకుడైన పుష్కరుడు సింధురగజేంద్రముల ఘంటికాఘణఘణలతో, అశ్వముల గళకింకిణీఝణ ఝణలతో, రథముల యొక్క పటాపటారావములతో, అన్యోన్య సంఘర్షణమున కాల్బలము వలన జనించిన ఖణిఖణి ధ్వనులతో, ధిమిధిమ నినాదములతో సైన్యమును నడిపించినాడు (2-48) ఇంకను యుద్ధభూమియందు మహాపరాక్రమవంతులైన శత్రువులను ఎదుర్కొనలేక జడిసి సైన్యము వెనుకకు మరలినపుడు ఆ సేనానాయకుడైన ప్రభువు ఆగ్రహవృత్తితో శత్రునాయకుని సైన్యమును నాశనము చేసినట్లు కనిపించు చున్నది (2-56) అపుడు శత్రునాయకుడు రోషారుణ అగ్నికణములు జ్వలింపగ శత్రువును సంబోధించి తనతో పోరుమని రెచ్చగొట్టి బాణపరంపరను గుప్పించుట, అపుడు ఎదుటనున్న నాయకుడు వాటి నన్నింటిని ముక్కలు చేసి శత్రువును సంహరించుట (2-58-60) ఆనాటి యుద్ధవైఖరిగ తోచుచున్నది

కృతికర్త చెన్నమరాజు రాయలసీమ ప్రాంతమువాడు కావున ఆ పరిసర ప్రాంతములు, అచటి నాగరికత, ఆచార వ్యవహారసంప్రదాయములు చారుచంద్రోదయము నందు ప్రతిఫలించినవి రాయలసీమ ప్రాంతమంతయు పర్వతసాంద్రత కలిగిన ప్రదేశము అచట దుర్గమారణ్యములు, బండరాళ్ళు హెచ్చుగా నున్నవి కావుననే కవి రైవతకపర్వతప్రదేశమును నానాప్రసూనపరాగసమూహములతో

నిండి. సూర్యకిరణములకు కూడ దురవగాహములైన తిగిజొంపములు కలిగి, 'వటీర, రసాల, దాడిమీ, పనస, పాటలీవిటపకోటి లో' పెనగొనియున్న మేటి చలువపందిళ్ళతో ఒప్పినట్లు చెప్పినాడు (2-14, 24) ఇంకను ఆ పర్వతప్రాంతమున పూరజములతో నిండిన నున్నని రాతి తిన్నెలను వర్ణించినాడు (2-25)

'సోపానపఙ్క్తి నెఱిన్ బైపయి నంతటంతటను దంతెల్ దంతెలై యున్న ఎల్మొనరావల్వల వెంబడిన్' (2-23) అను వాక్యమునందలి భావము రాయలసీమ యందలి రాళ్ళప్రదేశమునే స్ఫురింపచేయుచున్నది

'విస్ఫారచందనశాఖా లతికాపరంపరల యూఁతం డిగ్గి (2-23) పట్టి చెట్టు ఊడలను ఆలంబముగ చేసికొని అవతలివైపునకు దాటుట పల్లెటూళ్ళలో మనకు సహజముగ కనిపించును ఈ అభిప్రాయమును ఆధారముగ చేసుకొని ఎవి దాసుగ వ్యాపించిన చందనశాఖలను అల్లుకొనిన తీగల సమూహముయొక్క ఊఁతతో నాయకుడు కొనకో క్రమించినట్లు తెలిపినాడు

నగరవైభవమును చెప్పునపుడు కోనలు దివిజకుంజములు, సూనసమగ్ర సౌరభవిశోభిత భూజలతావితానములు, కదళీవనోత్కరములు, చంద్రకాంతతరులు, పారువంపు రొదలు, కస్తూరి మెకములు, వికళుకవాక్యవైభవములను 'ఎక్కడ నెక్కడై తగు మఱెక్కడ నిట్టివి లేవు' (2-16)—ఈ వర్ణనంతయు రాయలసీమ ప్రాంతవైభవమే ఇంతటి వైభవము మఱెక్కడను లేదని ఖండితముగ చెప్పుటను బట్టి కవికిగల మాతృదేశాభిమానము స్పష్టమగుచున్నది

ఆనాటివారికి ఒట్టుమీద జ్యోతిష్యముమీద అపారమైన నమ్మకము కలదు (2-36, 2-69) తాంత్రికులు నిర్ణయించిన ముహూర్తమునకు పద్మాకరుము తపస్సున కేగుటవలన (2-119) ముహూర్తబలము మీద వారికి గల నమ్మకము తెలియుచున్నది బిడ్డ పుట్టగనే జాతకము చూపించుట, శాస్త్రోక్తముగ నామ కరణము చేయుట కనిపించుచున్నది (1-159) పిల్లలకు 'లాలి లాలి' యను జోల పాటలు పాడి నిద్రపుచ్చు ఆచారము సర్వసాధారణము (3-83) పచ్చనైన మణులతో తయారైన ఎళ్ళెములతో హంతు లిచ్చెడివారు (4-89) సాటి స్త్రీలు తమ యింటికి వచ్చినపుడు వారిని గౌరవించుటకై వెండి బంగారములతో తయారైన పాత్రలలో పరిమళద్రవ్యములను నుంచి వారి కిచ్చెడివారు (4-89) బాటసారులు మధ్యలో విశ్రాంతి గొనుటకు, దాహము తీర్చుకొనుటకు పందిళ్ళు వేసి, కర్పూర శీతలపానీయము లిచ్చుటకు చలివేందిర లందు స్త్రీలను నియమించెడివారు (2-8)

కవి పేర్కొనిన ఆచారములలో వివాహవ్యవస్థ ఒకటి దీని తీరుతెన్నులను ఆద్యంతము సంప్రదాయానుబద్ధముగ చెప్పినాడు రాజకుటుంబములలోని వివాహోత్సవములకు ఆ పట్టణమంతయు అలంకరించెడివారు (5-40) సమస్తగృహ

ములను అలికి ముగ్గులు వేసెడివారు పసుపుటాకుల దళ్ళుకట్టి, పట్టిగ్రేళ్ళ తడికెలతో రమణీయమైన పందిళ్ళు వేసి తోరణములు కట్టెడివారు (5-41) చతురంగ బలముతో ఎదురేగి వియ్యాలవారిని విడిది గృహమునకు ఆహ్వానించెడివారు (5-45) మంగళస్నానమునకు ముందు వధూవరులకు ముత్తైదువులు పాటలు పాడుచు నుదుటిమీద శుభాక్షతలను పెట్టెడివారు (5-46)

కుంకుమ రసముతోను, పసుపుతోను నలుగు పెట్టి, పన్నీరు చిలికి, గంధపు టటకలిపెట్టి, పసిడికుండలలోని జలముతో స్నానము చేయించి, పైరాణి జిలుగు వలువతో తడి యొత్తెడివారు (5-48, 49, 50, 51) పెండ్లి కుమారుడు భద్ర గజము నెక్కి వివాహమునకు ప్రయాణమై పోవుచుండగ గురుజనులు, బంధుమిత్ర సమూహములు ఆశీర్వాదపూర్వకముగ శోభనాక్షతలు చల్లుట ఆచారము (5-74) భేరి, మృదంగ, తమ్మట, కాహళ, ఢక్కా, హుడక్కా వాద్యవిశేషధ్వనులు, సాంబ్రాణి ధూప వాసనలు ఆకాశమార్గ మంతయు వ్యాపింపగ, వారకాంతల చేష్టలతో, నర్తకీమణుల నాట్యముతో, ఫలపుష్పములు పరిణయోచిత వస్తుసంభారములు చేత పట్టుకొని నడిచెడి స్త్రీలతోను, చతురంగబలముతోను, అసంఖ్యాకమైన కరదీపికలతోను పెండ్లివారు రాజమార్గమునందు పయనమై వివాహమునకు తరలివచ్చెడివారు (5-74) ఆ సమయమున అంతఃపురకాంతలు సౌధములపై నెక్కి పెండ్లికుమారుని చూచెడివారు తరువాత వారు సంతోషముతో బంగారు పత్రములు, కలువలు, మందారములు పెండ్లికుమారునిపై చల్లెడివారు (5-75, 81) కాళ్ళు కడిగి మధుపర్కము లిచ్చుట, పెండ్లికుమార్తెను తీసికొనివచ్చుట, తెర ఎత్తుట, మంగళసూత్రము కట్టుట, తలంబ్రాలు పోయుట, పేళాలు పేల్చుట, అరుంధతీనక్షత్రమును చూపించుట, బ్రాహ్మణులు ఆశీర్వాదములు చెప్పుట, కుల దేవతలకు నమస్కరింపచేయుట, ఒండొరుల నామములు చెప్పించుట, బంధువులు కానుకలు చదివించుట మొదలగునవి జరిగెడివి చివరకు బిడ్డకు బుద్ధులు చెప్పి అత్తవారింటికి సాగనంపెడివారు (5-85,103)

ఆనాడు వైష్ణవమతమునకు ప్రాధాన్యము కలదు కృతికర్త వైష్ణవ మతస్థుడు అంతేగాక ఇష్టదైవమైన గోపాలకృష్ణునకు తన కృతిని సమర్పించిన వైష్ణవ భక్తుడు తాడిపర్తియందు గోపాలకృష్ణునకు దేవాలయమును నిర్మించినాడు ముని పద్మాకరునితో 'అహిరాజశయనుఁడు ఇహపర సౌఖ్యములకు హేతువు' అని పలుకుటలో ఇది స్పష్టము (2-94) కవి హరిహరనాథులకు అభేదము చెప్పుటచే ఆనాటివారు కొందఱు హరిహరాభేదమును అంగీకరించియుండవచ్చును ఆనాడు వైదికమతమును వైభవము నొందినది

వ్రతమై బౌద్ధులు మించి తారకనిజస్పష్టోక్తి వర్ణంబులు
ద్ధతి నిందింపఁ ద్రయీమయుం డగుట నుద్యద్రోష
రక్తాంగుఁడై
దృతిఁ దజ్జృంభమడంప సద్ద్విజతతుల్ దీపింపఁగాఁజేయ ను
ద్యతుఁడై వచ్చినమాడ్కి భాస్కరుఁడు పూర్వాద్రిన్
వెలింగెన్ రహిన్ -5 ఆ. 37

బౌద్ధమతస్థులు వర్ణవిభేదము లేదని అంతయు ఒకేవర్ణమని నక్షత్రములనే మాటలచేత ప్రకటన చేయుచుండగ, వేదస్వరూపుడైన సూర్యుడు ఆగ్రహించి వారి ప్రయత్నములను మాన్పుటకు, ద్విజుల నుద్ధరించుటకు కోపముతో వచ్చినట్లు ఎఱ్ఱని రూపములో సూర్యుడు తూర్పుకొండపై నుండెనట.

ఆనాడు ఎంపికైన సొగటాలాట కోలాటము బంతులాటలు, దొంగలాట పూలబంతులాటలు మొదలగునవి ప్రసిద్ధమైన ఆటలుగ కనిపించుచున్నవి సొగటా లాట దుగా, బార, తీ, పంచాయిత్తిగ, దచ్చి, చక్కా, సత్, చౌ, పంచీ, పది, తొమ్మిది అను సంఖ్యావాచకములతో ఆడెడివారు (1-115) నాడు మల్లయుద్ధము విశేష ప్రాచుర్యములో నున్నది (1-166)

పునుగు, జవ్వాది, పచ్చకర్పూరము కస్తూరి, పన్నీరు, గోరోజనము మొదలైన సుగంధద్రవ్యములను ఆ కాలమువారు విరివిగ ఉపయోగించెడివారు కొందఱు స్త్రీలు వక్షస్థలముపై కర్పూరమును, గంధమును పూసికొనెడివారు చెక్కిళ్ళపై కస్తూరిని దిద్దుకొనెడివారు తాంబూలము నందు కర్పూరము విధిగా వాడెడివారు (1-142) ఉద్యానవనమున కేగినపుడు రాణి సకియలు పచ్చరాతితో చేసిన మొసలివాయి కలిగిన అడపమును చేతియందు ధరియించి మేలికెంపుల భరిణలో ఆకుమడుపులు పెట్టి సిద్ధముగ నుంచెడివారు రాణి సన్న చేయగనే ఆకు మడుపులను అందించెడివారు (3-132) ముఖ్యపనుల కార్యక్రమములకు ఎవరికైనా పంపించునపుడు తాంబూలచందనవస్త్రాభరణాదు లిచ్చుట కనిపించు చున్నది (3-25)

ఆనాటి స్త్రీలు ఆహ్లాదకరమైన వెన్నెలలో బొండుమల్లెవిరుల మీద పొరలుదురు, పన్నీరు చల్లుకొని పూదోటల యందు విహరించెడివారు ద్రాక్షపందిరి నీడల యందు నడచుటకు ఇష్టపడెడివారు చెఱుకుతోటలలోని చెఱుకును ముక్కలుగ ఖండించి చంద్రునకు అర్పించెడివారు ద్రాక్ష, ఖర్జూర మొదలైన ఫలములను తినుచు రమణీయమైన పాత్రలలోని ఘుమాయించు వాసన గల మాదకద్రవ్యములను సేవించెడివారు సౌధముల చివర పాలరాతితో తయారుచేసిన లోపలి గదుల ముందు గల ముంగిళ్ళ

యందున్న అరుగులను అలంకరించి విహరించెడివారు మద్యమును ఆ అరుగుల మీదనే తమ యిష్ట దేవతలకు సమర్పించి తర్వాత సేవించి మత్తకాశినులు విటులతో క్రీడించెడివారు కొందఱు యువతులు కర్పూరపు చప్పరముల క్రింద తమ పాతి వ్రత్యముయొక్క గుట్టు చెడకుండ తాము కోరిన ప్రియులను శృంగార చేష్టల కై మట్టుపఱచి పూలపాన్పుల యందు తార్చెడివారు మఱికొందఱు గృహ కార్యము లను తీర్చుకొని పెద్దలు నిద్రించిన తరువాత వారికి తెలియకుండ తెల్లని వస్త్రము లను, బొండుమల్లెలను, ముత్యాలహారములను, వజ్రాభరణములను ధరియించి, కర్పూరగంధములను శరీరమునకు పూసికొని దంతపు బొమ్మల వలె సంకేతస్థలము లకు ఏగెడివారు అచటనున్న ప్రతి పొదను అన్వేషించి నాదులను కానక కన్నీరు కార్చుచు పునరన్వేషణము కావించెడివారు చివరకు పతిపత్ను లిరువురు పొదరిండ్ల సమూహముల యందు సుఖానుభూతిని పొందెడివారు విటవిటజనులు అనేక రతి క్రీడల యందు అలసి సొలసి ఇరువురి శరీరములందు అలదుకొనిన కర్పూరచందన వాసనలు మందగించువరకు క్రీడించెడివారు (5–7)

నాటి స్త్రీలకు జలక్రీడా విహారమునందు కూడ ప్రవేశము కలదు ఈత యందు వీరికి ప్రావీణ్యమున్నట్లు తెలియుచున్నది (4–94) జలక్రీడ సమయమున జిల్గు పావడలు కట్టెడివారు (4–93) జలక్రీడానంతరము జరీవస్త్రములను కట్టి, వెంట్రుకల తడిని పోగొట్టి, కొప్పుపెట్టి, వాసనలు గల పూవులను కొప్పు లందు అందముగ ముడుచుకొని, పరిమళ ద్రవ్యములను కలిపిన చందనమును మేనునకు పూసికొని రత్నాభరణములను అలంకరించుకొనెడివారు (4–104) నాడు రాచస్త్రీలు ఉద్యానవనముల యందు తురంగి ఆకారముతో నుండిన గద్దెమీద కూర్చుండి వీణ వాయించెడివారు (3–127)

వస్త్రాలంకరణ యందు, పుష్పాలంకరణ యందును, ఆభరణాలంకరణ యందును స్త్రీపురుష లిరువురును మక్కువ చూపించెడివారు రాజకుమారులు కత్తి సాధన కేగునపుడు తెల్లని వస్త్రములను ధరియించి, దానిమీద ఎఱ్ఱపట్టు వస్త్రమును చుంగులు జారు విధముగ కట్టి కుళ్ళాయి ధరించెడివారు 'జిలుగుం జెంద్రిక దట్టి మీఁద మెఱుఁగుం జెంగావి (హొంబట్టు) దువ్వలువన్ జుంగులువాఱఁ గట్టి జిగి జాళ్వాద్రాఁలె కుళ్ళాయి యొదలమించన్' (1–167) వివాహసమయమున పెండ్లి కుమారునకు ఎఱ్ఱపట్టు రుమాలును కట్టెడివారు (5–52) స్త్రీలతోపాటు పురుషులకు కూడ నిడుదజుట్టు ఉండెడిది వారు కూడ సిగ చుట్టుకొని పూవులను ధరించెడి వారు వాసనగల పూవులు, మరువముతోపాటు వాసనలేని కనకాంబరములనుకూడ అలంకరించుకొనెడివారు (5–52) విరహతాపోపశమనమునకు కర్పూర, గంధము లనేకాక, తామరలను, చిగుళ్ళను కూడ వాడెడివారు (3–51, 5–31) ఆనాటి యువతులకు పుష్పలతాపోషణము, పుష్పాపచయము వినోదక్రీడలు నాటి స్త్రీలు

కనుబొమలు మొదలగునవి దిద్దుకొనుటకు నీలికారసమును (నీలిమందు) వాడెడివారు (3-92) పెండ్లి సమయమున వధూవరు లిరువురు కస్తూరి తిలకమును పెట్టుకొనెడివారు. స్త్రీలు కాటుకలు లత్తుకను ధరించెడివారు.

ఆనాడు స్త్రీ పురుషు లిరువురు పాదాది శిరావధి సుచిరస్థలములయందు నవరత్నములు పొదగిన సువర్ణాభరణములు ధరించెడివారు. రాజకుమారులు వింటిసాధనకు పోవునపుడు గుజ్జికెంపులతో తయారుచేసిన డాలును ధరించి కట్టాణియొంట్లసరి, జాళువాగొలుసును అలంకరించుకొని బంగారు తళుకుల పాపోసులను కాళ్ళకు వేసికొనెడివారు (1-168) స్త్రీలేకాక పురుషులు కూడ కర్ణాభరణములను ధరించెడివారు (5-52) సంపన్నకుటుంబములోని పురుషులు వజ్రములతో చేసిన హారములను, వజ్రాలపతకమును, పచ్చల పతకమును, వజ్రాల కంకణములను, పచ్చపుటుంగరములను, ముత్యాల హారములను ఉత్సవ సమయము లందు అలంకరించుకొనెడివారు. క్షత్రియ వివాహ సంప్రదాయము ప్రకారము రాజవంశములోని పెండ్లికుమారునకు కటియందు కెంపులతో తయారుచేసిన అందమైన పిడిబంతెను అలంకరింపచేసెడివారు (5-53)

పురుషులే ఆభరణములను ధరించినపుడు అలంకరణప్రీతి గల స్త్రీలమాట వేరుగ చెప్పనవసరములేదు. సమంతమున ముత్యములతోను మణులతోను తయారుచేసిన పాపిటబొట్టును ధరించెడివారు (5-65) నీలమణులతో తయారుచేసిన పలకవంటి ఆభరణమును తల యందు అలంకరించుకొనెడివారు (5-62) చెవులకు ముత్యాల బుగడలను, దంతముతో తయారు చేసిన తాటంకములను, ముత్యములు రత్నములు మణులు చెక్కిన కమ్మలను పెట్టుకొనెడివారు (3-32, 39, 5-63) ముక్కుకు ముత్యములతో తయారుచేసిన ముంగరను ముంగర చివర ముత్యము ప్రేలాడునట్లు ధరించెడివారు (5-33, 66) కంఠము నందు తెలుపు ఎఱుపు కాంతులు కలిగిన మణిహారములను, ముత్యాల హారములను అలంకరించుకొనెడివారు. చిలుకను వర్ణించినపుడు రతీదేవియొక్క కెంపుల ధమ్మిలో నుంచిన పచ్చరాయి తాళి వలె ఒప్పినదని (4-66) చెప్పుటచేత ఆనాడు పచ్చరాయి తాళి వాడుకలో నున్నట్లు తెలియుచున్నది. భుజములకు కేయూర కంకణములను, చేతులకు ఇంద్రనీలకంకణములను, 'మరకత మాణిక్య కురువింద వలయాంశుపటలంబు (5-77)ను ధరించెడివారు. వక్షోజములకు ముత్యాల హారములను మొల ప్రదేశమందు బంగారు గజ్జెలను, నవరత్నములతో తయారుచేయబడిన మువ్వల ఒడ్డాణమును, మేలి యొడ్డాణమును, నవరత్నములతో, వజ్రములతో పొదగబడిన కాంచన మేఖలను అందముగ అలంకరించుకొనెడివారు. పాదములకు పాదభూషణములను, పసిడి అందెలను వజ్రపు టందెలను, కెంపు మట్టెలను ధరించెడివారు

ఇతని కాలమున సాహిత్య, సంగీత నృత్యములకు మంచి ప్రవాహము కలదు వివాహోత్సవమును 'సరససాహిత్యసంగీత నిరుపమాన సత్కవినికాయ గాయక సార్వభౌమ నటనటీముఖ్యులు' (5-98) తిలకించిరి అని కవి తెలుపుటచే ఆనాటి రాజసభల వైభవము స్పష్టము

## ఉపసంహారము

గ్రంథకర్త పదునేడవ శతాబ్దివాడు చారుచంద్రోదయ రచనాకాలము సూలముగ క్రీ శ 1650 కవి నందవరీక బ్రాహ్మణుడు పెమ్మసాని పెదవిక నృపాలుని మంత్రి వైష్ణవభక్తుడు కావుననే తన కావ్యమును మానవాంకితము చేయక మాధవాంకిత మొనర్చి పోతనామాత్యునివలె తన జన్మను ధన్యత గావించు కొనిన మహాభక్తుడు తన భక్తికి నిదర్శనముగ శ్రీకృష్ణుని పుత్రుడైన చారు చంద్రుని జననమును, అభ్యుదయమును ఇతివృత్తముగ స్వీకరించి సమగ్రభావ భాసురమైన చారుచంద్రోదయమహాప్రబంధమును సృష్టించినాడు

రాయలయుగము ఆంధ్రసాహిత్యమునందు ప్రబంధయుగముగ పేరు గాంచినది ఆంధ్రప్రబంధ యుగమునకు మార్గదర్శకమైన ప్రబంధము 'మను చరిత్ర' ఇది ఆంధ్రకవితాపితామహుడైన అల్లసాని పెద్దన కృతి విశిష్ట ప్రతిభా సంపన్నుడైన రామరాజభూషణుడు పెద్దనను అనుసరించినను, వర్ణనాత్మకమై, ప్రతి పద్యచమత్కారశోభితమైన శ్లేష కావ్యమైన 'వసుచరిత్ర'ను రచించి ఆంధ్ర ప్రబంధములకు వైశిష్ట్యమును సమకూర్చినాడు రామరాజభూషణుని అనంతరము కవిత్వము చెప్పగల కవు లందరు ఆయనను అనుకరించుటకు పూనుకొనినారు కావుననే తరువాత వచ్చిన పెక్కు ప్రబంధములు పిల్లవసుచరిత్రలుగ పేరు పొందినవి వసుచరిత్ర వలె స్వల్పమైన కథను తీసికొని వర్ణనలకు, శ్లేషకు ప్రాధాన్యము నిచ్చి రచించిన గ్రంథములను పిల్లవసుచరిత్ర లందురు ఇట్టి కావ్యములలో కనుపర్తి అబ్బయామాత్యుని 'కవిరాజ మనోరంజనము' ప్రసిద్ధి కెక్కినది

కల్పితకథను ప్రబంధేతివృత్తముగ స్వీకరించుటకు నిరసించుచున్న సమ యమున పింగళి సూరన కళాపూర్ణోదయమును సృష్టించి సంచలనము తెచ్చినాడు ఇతని ప్రభావతీప్రద్యుమ్నమునందలి శుచిముఖి పాత్ర ఆంధ్రప్రబంధములలో ఒక అపూర్వసృష్టి కథానిర్మాణమునకు, పాత్ర పోషణకు పింగళి సూరన సిద్ధహస్తుడు అటులనే ప్రబంధయుగమున పదునారవ శతాబ్దిలో వర్ణనావైదుష్యమునకు, శ్లేషాంతర్గతమైన చమత్కారమునకు రామరాజభూషణుడే ప్రథముడు వీరిరువురు అసాధారణ ప్రజ్ఞావంతులై తమ తరువాత ప్రబంధకర్తలపై ప్రగాఢమైన ప్రభా వమును ప్రసరింపచేసినారు

చారుచంద్రోదయకర్తయైన చెన్నమరాజుపై పీరియపురి ప్రభావము కన్పట్టు చున్నది శుకిముఖి వలెనే చారుచంద్రోదయమునందు త్రికాలవేదియను చిలుక ముఖ్య పాత్రధారియై యున్నది బూత ఖండవలయను వాక్చాతుర్యము, కార్యధురీణత, మితభాషిత్వము అను లక్షణములను ఆ పాత్రయందు కవి చక్కగ పోషించినాడు అంగాకర్షణాదిమంజుకళలందు నేర్పరిగ నిరూపించినాడు మిగిలిన ప్రబంధముల లోని చిలుకల సృష్టికన్న చెన్నమరాజు చిలుక సృష్టి మణిపుసుటమై ఒప్పినది ఉత్కృష్టమైన యీ పాత్రను పోషించుట యందు పింగళి సూరనకు దీటుగ నిలిచి నాడు ఈ చిలుకను పుష్కరసంహారము కుముద్వతీపరిణయము అను రెండు విభిన్నమైన కథలను వారధిగ నిలిపి, ఒక వినూత్నమైన పొందతో విశిష్టమైన కథా నిర్మాణమును కవి చేసినాడు

పదునేడవ శతాబ్ది యందు వెలసిన ప్రబంధము లన్నియు ఒకే మూసలో పోసినట్లు తయారయినవి కావ్యత్వసంపాదనకై సృష్టించిన వర్ణనముల వలన కథావేగము కుంటుపడుచున్నది కాని చెన్నమరాజు 'కవయతీతి కవిః అనునట్లుగ లన వర్ణనలను సమయోచితత్వము, కథానుకూలత, ఔచిత్య సంపద, సంక్షిప్త ముండుటలను ఆపాదించి ప్రత్యేకమైన కల్పనాచాతుర్యమును ప్రకటింపచేసినాడు దానివలన అతని వర్ణనలు సజీవచిత్రములై ప్రత్యక్షీకరణముతో భాసిల్లినవి వర్ణన సమయమున శ్లేష, చమత్కారమును పాటించుటయందు రామరాజభూషణుని అనుసరించి తన కావ్యమునకు మనోహరత్వమును సంపాదించుకొనినాడు మను చరిత్ర, రాజశేఖర చరిత్ర, శ్రీకాళహస్తి మాహాత్మ్యము, చంద్రభానుచరిత్రముల లోని పద్యముల అనుకరణ కూడ కలదు

చెన్నమరాజు సంస్కృతప్రౌఢి యందేకాక పదలాలిత్యము నందును అచ్చ తెనుగు నుడికారము నందును సరిసమానమైన అభినివేశమును చూపినాడు ప్రసిద్ధ మైన ప్రబంధకవుల మాదిరిగ నాయికానాయకుల పాత్రలను సృష్టించుటయందు కృతకృత్యుడు కాలేకపోయినను, పరస్పర పదమైత్రి కలిగిన శయ్యాసౌభాగ్యముతో, అర్థగాంభీర్యము కలిగిన పదజాలముతో ఇతని శైలీమాధుర్యము మనోజ్ఞమై కావ్యా ద్యంతములను ఆసక్తితో చదువునట్లు చేయును ఈ ప్రబంధము నందు వసుచరిత్ర యందలి ప్రౌఢి, విజయవిలాసము నందలి సరళత కనిపించుచున్నది

చారుచంద్రోదయము అముద్రితమై ప్రకాశము కాకపోవుటచేత ప్రబంధముల యందు స్థానము సంపాదించుకొనలేకపోయినది కాని యిది అన్వర్థనామము కలిగి మహాప్రబంధలక్షణశోభితమైన విశిష్టమైన ప్రబంధమని చెప్పవచ్చును

# రెండవ భాగము

## కావ్యపరిష్కరణము

### ప్రతుల వివరణ

అముద్రితగ్రంథమైన చారుచంద్రోదయమును పరిష్కరించుటకు ఉపయుక్తములైన ప్రతులు ఆరు ఈ ఆరు ప్రతులయందు నాలుగు ప్రతులు తాళపత్ర ప్రతులు మిగిలిన రెండును కాగితపు ప్రతులు అవి—

1 ఆంధ్రవిశ్వకళాపరిషత్ గ్రంధాలయ తాళపత్ర ప్రతి
2 ఆంధ్రసాహిత్యపరిషత్ గ్రంధాలయ తాళపత్ర ప్రతి
3 మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార తాళపత్ర ప్రతి
4 మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార కాగితపు ప్రతి
5 మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార కాగితపు ప్రతి
6 ఆంధ్రప్రదేశ్ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార తాళపత్ర ప్రతి

ఈ ఆరుప్రతులు వరుసగ క,చ,ట,త,ప,గ అను సంకేతములతో గ్రంధమునందు పరిష్కరణ సౌలభ్యమునకై సూచింపబడెను ఆయా ప్రతులకు సంబంధించిన విశేషాంశములు క్రింద వివరింపబడెను

క విశాఖపట్టణములోని ఆంధ్రవిశ్వకళాపరిషత్ గ్రంధాలయము సంచిలి తాళపత్ర ప్రతి సంఖ్య ఎస్ నెం 1668-బిటి 87 పత్రములు 69 తాళపత్రము పొడవు 16 అం , వెడల్పు 1 1/2 అం॥ పత్రముల ఇరువైపుల పుటకు ఎనిమిది పంక్తుల చొప్పున వ్రాయబడెను సమగ్రము వ్రాలు మంచిది ఇంచుక శైధిల్య మున్నప్పటికిని మొత్తముమీద ప్రతి బాగుగనేయున్నది ఈ ప్రతియందు అచటచట పాదములు, పద్యములు అసంపూర్ణముగ నున్నవి మధ్యలో కొన్ని పద్యములు పూర్తిగ లోపించినవి లేఖకుడు కొన్ని స్థలములందు పదములు లోపించినచోట లు పెట్టి అసంపూర్ణముగ వదలినాడు వ్రాయసగాడు

'శ్రీవిఘ్నమస్తు' శుభమస్తు' శ్రీ శారదాం
బాయైనమః చారుచంద్రోదయం'

అవి మొదలుపెట్టి గ్రంథాంతమున-

వ్రాలా శ[్రి]బలు తప్పులు
చాలా గలవు శబ్దసంగతు లెరుగన్
గేలింబెట్టక నవ్వక
పోలాంగ్గా దిర్చరయ్య బుదజనులారా।

అని కలదు

చ  కాకినాడలోని ఆంధ్రసాహిత్యపరిషత్  గ్రంథాలయములోని తాళపత్ర ప్రతి సంఖ్య 46/3 పత్రములు 97 పొడవు 18 అం  వెడల్పు 15 అం ఇరువైపుల పుటకు ఆరు పంక్తుల చొప్పున వ్రాయబడినది  సమగ్రము  వ్రాలు మంచిది  శైథిల్యమంతగలేదు స్పష్టముగనున్నది  మిగిలిన ప్రతులలో లభింపని పద్యములు ఈ ప్రతియందు కలవు  సాధుపాఠములు ఈ ప్రతియందు ఎక్కువుగ లభించెను

ట  మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని  తాళపత్ర ప్రతి సంఖ్య డి 513 పత్రములు 166  తాళపత్రము పొడవు 15 1/2 అం॥ వెడల్పు 1 1/8 అం॥ పుటకు ఏడు పంక్తుల చొప్పున వ్రాయబడినది  సమగ్రము వ్రాలు మంచిది  తప్పులుగలవు  శైథిల్య గ్రంథపాతములు మిక్కుటముగ గలవు ఈ ప్రతియందును కొన్ని పద్యములు లుప్తము

గ్రంథము మొదలు 'శుభమస్తు। అవిఘ్నమస్తు। శోభనమస్తు। చారుచంద్రోదయము' అని కలదు  చతుర్థాశ్వాసాంతమున—

వ్రాతా శ[్రి]భలు తప్పులు చాలాగలవేను శబ్దసంగతు లెరుగన్
గేలింబెట్టక తిట్టక పోలంగా దిర్చరయ్య బుధజనులారా

అని యున్నది  గ్రంథాంతము నందు—

ధరలో విళంబి సంవ
త్సరమున మటి చైత్రశుద్ధ షష్ఠిదినమునన్
హరి కర్పణగా హరికథ
సరసత లిఖియించెఁ జారుచంద్రోదయమున్

అని లేఖకుడు చెప్పినాడు

త  మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని కాగితపు ప్రతి సంఖ్య డి 512 డి 380 ఇది బ్రౌన్‌దొర సేకరించిన వ్రాతప్రతి పుటలు 194 ప్రతి పుటయందు పదునెనిమిది పంక్తులు  కలవు  అసమగ్రము

పంచమాశ్వాసము కడపటలోపించినది వ్రాతమంచిదే తప్పులుమెండు శైధిల్యము లేదు గ్రంధపాతములుగలవు ఈ కాగితపు ప్రతి అంతమున బ్రౌన్‌దొర స్వదస్తూరిలో పెన్సిలుతో ఈ విధముగ వ్రాసినాడు "At this place the book breaks off, the last pages being destroyed"

వ ఇదికూడ మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని కాగితపు ప్రతియే సంఖ్య డి 515 ఇదియును బ్రౌన్‌దొర సేకరించిన వ్రాత ప్రతియే పుటలు 46 పుటకు ఇరువది పంక్తులు కలవు అసమగ్రము రెండు ఆశ్వాసములు కూడ పూర్తిగలేవు వ్రాత మంచిది తప్పులుమెండు శైధిల్యము లేదు గ్రంధపాతములు కలవు ప్రధమాశ్వాసము 168 వ పద్యము నుండి లేఖకుడు మారినాడు అచట నుండి తప్పులు మిక్కుటముగనున్నవి ఇందులో కూడా బ్రౌన్ దొర స్వదస్తూరిలో వ్రాసినాడు

"This poem is transcribed from a ma nuscript in my own collection compared with one in the Mekenzie Library at Madras Both are very imperfect The author name is Chennamaraju."

గ. హైదరాబాదులోని ఆంధ్రప్రదేశ్ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము మఱియు పరిశోధనాలయములోని తాళపత్ర ప్రతి సంఖ్య Acc No 3825, Call No – T 3 274 పత్రములు 38 పత్రము పొడవు 16 అంII వెడల్పు 1 1/2 అంII పత్రముల కిరువైపుల పుటకు పదునొకండు పంక్తుల చొప్పున వ్రాయబడినది శైధిల్యములేదు గ్రంధపాతములు తక్కువ. గ్రంధము మొదలు

శ్రీసంగమేశ్వరాయనమః
శ్రీహయగ్రీవాయనమః
శ్రీవేదవ్యాసాయనమః
చారుచంద్రోదయం

అని కలదు గ్రంధాంతమున లేఖకుడు – 'క్షయనామ సంII అధిక జేష్ఠ ౧ ౨౦౦ బుధవారం మూడు యామాలకు మాతృకాప్రకారం చూచి వ్రాసినాను పాట్లు వుండెనా అపరాధం క్షమించి తీర్చవలశినది శాలివాహన శకం ౧౭౮౮ శ ౧౭౭౮

సాలు చుమహా మొహరం ౧౨౮౩ హిజిరి శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ' అని వ్రాసినాడు
ఈ ప్రతియందు పెనపద్య పాదమును రెండు పాదములుగ విరిచి వ్రాసినాడు

ఇంకను మదరాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందు మఱియొక కాగితపు ప్రతి కలదు సంఖ్య డి 514 ఈ ప్రతి అతిశిథిలమగుటచేత పరిష్కరణకు ఏమియు ఉపయోగపడలేదు

'౨' ప్రతిని చిత్తుప్రతిగ తీసికొని మిగిలిన ప్రతులను దానితో పోల్చి పాఠాంతరములను సరిచేసితిని అన్ని ప్రతులలో 'చ', 'గ' ప్రతులు పరిష్కరణమునకు ఎక్కువ ఉపయోగపడినవి

# చారుచంద్రోదయము

## ప్రథమాశ్వాసము

శా॥ శ్రీమత్కౌస్తుభ [1]దీప్తి నన్యవనితాశ్లేషాంగరాగంబుగా
భామారత్నము రుక్మిణీరమణిలో [2]భావించి [3]వీక్షింప నీ
పై [4]మద్భావఘనానురాగమిదె పైఁ [5]బాటిల్లునంచున్[6]నయ
స్థేమన్ వేడ్కయొనర్చియేలుకుశలున్ శ్రీకృష్ణుసేవించెదన్ 1

సీ॥ ఏ రామ కుచసీమ శౌరి [1]చక్షూభవ
నిమ్మిహిరచంద్రావృత్తి రహి వహించు
నే యింతి ముఖకాంతి యాయత [2]హరినాభి
జలజాతముకుళనాకలన నెఱపు
నే తల్లి తనువల్లి [3]హేమాచఁ విశాల
భుజమధ్య [4]నికషాశ్మమునఁ దనర్చు
నే నాతి దృగ్గీతి దానవాహితమహా
శృంగార రసకేళి రంగుమీఱు

---

1 ప 1 క – ౦త్నదీప్తి, ట ప–౦త్నదీప్తినన్య, 2 క, చ, ట అ గ – భావింపు గ–భావింప 3 క, ట, త ప – వీక్షింపు గ – వీక్షించి, చ–నీక్షింపు 4 క ట ప – మద్భావమ 5 ఎ, త – వాటిల్లె, ట, గ – వాటిల్లె ప–వొటిల్లె, 6 క ప–నీయ

2 ప 1 త – భవమిహిర గ – చక్షుర్భవ, 2 క – వారినా, చ – హారినా, ట, ప – వారినాభి, 3 క, చ, ట, ప గ – హేమచేల, 4 గ – నిశాష్మ

గీ॥ నట్టి కలశాబ్ధిజాత [5]దయాసమేత
నిఖిలనిగమాంతకాంతామణీవతంస
పాదజలజాతపోషితభక్తజాత
సిరులు [6]కరుణించి మమ్ము రక్షించుగాత 2

ఉ॥ హరికిని మా కభేదమని యందఱికిన్ బ్రకటించు వైఖరిన్
బరమసుదర్శనాయుధము భవ్యహరిద్వసనంబు మత్తకుం
జర [1]వరదాంకమున్ విబుధసన్నుతదైత్యపురప్రహారవి
స్ఫురణముఁ గల్గు శంకరుఁ బ్రపుణ్యవశంకరు నే భజించెదన్ 3

చ॥ [1]అలిగినచో నొకింత [2]నతుఁడై హరుఁ డంజలి సేయ నీసటల్
సలపకు నీకు దండమని సాంజలి యౌచుఁ దదీయమౌళి యం
దలి దెలి[3]నీట నీడఁగని నవ్వి సపత్నియు నే తదర్ధ మం
జలి యొనరించెనంచు మదిసంతసమందు
భవాని [4]నెంచెదన్ 4

ఉ॥ [1]శౌరి యుదారనాభిజలజాతమునన్ బొలిచెన్ జతుర్ముఖీ
హారిసువర్ణభృంగ మరుదంచుఁ గనుంగొను తద్భుజాంతరా
గారనివాసినిన్ జననిఁ గన్గొని [2]యెంతటి ముగ్ధ యంచు వి
స్మేరముఖాబ్జుఁడైన సరసీరుహగర్భుని నే భజించెదన్ 5

---

5 క – పయోసమేత, త – దయాసమాన, 6 క, చ, ట, త, ప – గరుణించి

3 ప 1 క, చ, ట – వరదానమున్ ట–వందానమున్, గ–వరదాభమున్

4 ప 1 క – అడిగిన, 2 చ – నతండై, ట – నరాతుండై, 3 క, చ – నీట నీడు, ట, త, ప – నీటనిండు, గ – నీలనీడ, 4 గ – గొల్చెదన్

5 ప 1 క, ప – వార, 2 క, చ, ట, త, ప, గ – యంతటి

ఉ॥ మానసవీధి నెంచెద సమగ్రరసోర్మినిగుంభనధ్వనిన్
శ్రీ నిరవొందఁ జేసి సరసీరుహబృందమరందమాధురీ
మానితరీతి మత్కృతి చమత్కృతిఁ గూర్చుటకై కవీంద్ర సం
తాననిరంతరావన [1]విదానవిలాసవతిన్ సరస్వతిన్ 6

ఉ॥ అనయం బద్రిసుతామనోహరుఁడు నెయ్యంబొప్ప
లాలింపుచున్
దనపై నెక్కుడు వేడ్కఁజూపఁగ సముద్యల్లీల వర్తించు ధ
న్య నహీనోత్కట దానశాలి ఘనతుండున్ సాధు పక్షోజ్జ్వలున్
వినతానందకరున్ వినాయకుని భావింతున్ శుభావాప్తికిన్ 7

సీ॥ రామభద్ర శ్రీ [1]మహామార్గభారతో
న్నతి [2]సవరించిరే [3]తతమనీషు
లనవద్యతరపదార్థాను [4]సామగ్రినిఁ
బ్రేమఁ గల్పించిరే పృథుగుణాఢ్యు
లత్యుపమా [5]లంక్రియాసువర్ణఘన
సూత్రముల్ గూర్చిరే శుభచరిత్రు
లకలంకభాస్వదంశుక [6]పదాభరణాప్తి
నామోద మొసఁగిరే యతులమతులు

గీ॥ దమ విరాజితనయవృత్తిఁ దప్పకుండ
శారదాంబిక వాల్మీకి శక్తి పౌత్రు
దండి భారవి కవి కాళిదాసు వామ
ముని మయూరుని భవభూతి నుతియొనర్తు 8

---

6 ప 1 త – నిధాన

8 ప 1 గ – మద్రామాయణ, 2 త – సదరించి, 3 త – నంచిత 4 క – సాధుశ్రీ, 5 క – తక్రియా, ట, త, ప – లక్రియా 6 గ – పరా

సీ॥ ప్రకృతికృదవ్యయప్రత్యయసుప్రతి
షాధను శబ్దశాసను భజించి
సరసమౌళిప్రియంకరపదాలంకార
వృత్తిసాంద్రుని కుండలీంద్రు నెంచి
సర్వజ్ఞగణమన[1]స్సంప్రీతికరకవి
త్వవిలాసు నల శంబుదాసుఁ బొగడి
బహుముఖప్రఖ్యాతమహితశయ్యా విశే
షసనాదు శ్రీనాదు [2]సంస్తుతించి

గీ॥ యధికలక్షణసంపన్నులైన తనర్చు
[3]భైరవు ననంతు బీమునిఁ బ్రణుతి సేసి
పృదివి నెంతయు వాణీధురీణులైన
[4]యద్యతనసత్కవీంద్రుల నాత్మఁ దలఁతు 9

ఉ॥ తప్పులు లేనిచో వెదకుఁ దప్పులె యప్పర మేష్ఠి నేనియున్
జప్పఁగఁ జూచు గావ్యసరసత్వ మెఱుంగఁ డొకింత పద్యమా
చెప్పఁగ నేరఁ డూరక కుచేష్టలఁ బోవుచు [1]వట్టి ప్రజ్ఞలే
తప్పక చూపు దుష్కవిః బుదప్రకరంబులు వాని [2]మెచ్చునే
10

9 ప 1 గ – సంప్రీతు సుకవిత్వదాసు నినల, 2 క, ట, త, ప– సన్నుతించి,
3 గ – భైరవుని భీమునందిని ప్రణుతిజేసి, 4, గ – యార్య

10 ప 1 క – రట్టి, త, ప – నట్టి, 2 గ – మెత్తురే

వ॥ అని ¹[యిట్లు] యిష్ట దేవతా ²[పాదక]నమస్కరణంబును
[³సుకవిజనతానుతి సమాచరణంబును కుకవి నిరాకరణం
బును] గావించి సుదారసమాధురీ ధురీణనవరసాభ్యుదయం
బును నిఖిలవిద్వత్కవివతంస ⁴సంసత్పయఃపయోనిధాన
సంపూర్ణపూర్ణిమాచారుచంద్రోదయంబునుం గాఁ జారుచంద్రో
దయంబను మహాప్రబంధంబు రచియింపఁ బూనియున్న
⁵[సమయంబున] నొక్కనాడు మదీయ స్వప్నంబున 11

సీ॥ పాదుబృందావనోజ్జ్వలవేలనము వాఁడ
విలసితవంశాప్తిఁ జెలఁగు వాఁడ
¹వారసంతానవిశ్రుతచరిత్రము వాఁడ
విజయానుగతవృత్తివెలయు వాఁడ
²సద్ద్వజప్రఘుతభాస్వరవర్తనము వాఁడ
ప్రద్యుమ్నగురుఁ దనంబఱఁగు వాఁడ
³దైవతద్రుమమహాదానసైపుణి వాఁడ
లలితసత్యాసక్తి నలరు వాఁడఁ

గీ॥ ప్రబలభద్రానుభూతివైభవము వాఁడ
సురభి⁴చక్రైకపాలనస్ఫురణ వాఁడ
ననుచుఁ దనచర్యఁ దెల్పి యత్యంత చాతు
రీగరిమఁ బల్కె పురుషవరేణ్యుఁ డొకఁడు 12

---

11వ 1 కి, చ ట, ఆ, వ ప్రతులలో లేదు 2 కి చ, ట త ప-ప్రతులలో లేదు 3 కుండలికృత వాక్యము 'త ప్రతిలోలేదు, 4 కి, చ – సంప గ – వ 5 కుండలీకృత పదము 'తి 'గ' ప్రతులలోలేదు

12వ 1 ఎ చ ట, త, ప – పూర, 2, ఎ చ త ప – సద్వజప్రతి 3 ఎ – దేవదత్త, 4 ఎ – ధక్త్రైకి

కం॥ చెప్పఁగ నేర్తువు రసములు
చిప్పిలఁ గావ్యములు సుకవిశేఖరహితమై
యొప్పఁగ సమస్తభాషల
నిప్పుడమి భవత్సమాను లెవ్వరుఁ దెలియన్ 13

ఉ॥ మేదురమాధురీగరిమ[1]మించఁగ నీ వొనరించు చారుచం
ద్రోదయకావ్యమిమ్ము [2]విబుదోత్తము లెంచఁగ మాకు సుస్థిర
శ్రీ దళకొత్తు నీ కెపుడు చెన్నమరాజ కులాబ్ధి చారుచం
ద్రోదయ • చెన్నమంత్రిమణి • యుజ్జ్వలదీసురదేశికాగ్రణీ•
14

వ॥ అని యానతిచ్చి యప్పురుషవరేణ్యుఁ డంతర్హితుఁడైన[1] [ననంతరంబ]నేనును మేల్కాంచి ప్రభాతసమయసముచిత కృత్యంబులు నిర్వర్తించి సకలవిద్వత్కవిబంధుసందోహం బులరావించి తదీయాశీర్వాదంబులు [2]గాంచియయ్యుదంచిత స్వప్నప్రకారంబు విన్నవించిన 15

సీ॥ సాధుబృందావనోజ్జ్వలఖేలనము వాఁడు
విలసితవంశాప్తి జెలఁగు వాఁడు
శూరసంతానవిశ్రుతచరిత్రము వాఁడు
విజయానుగతవృత్తి వెలయు వాఁడు
సద్ధ్వజప్రణుతభాస్వరవర్తనము వాఁడు
ప్రద్యుమ్నగురుఁ డనం బఱఁగు వాఁడు
దైవతద్రుమమహాదాననైపుణివాఁడు
లలితసత్యాసక్తి నలరు వాఁడు

14ప 1 క, చ – మించుగ, 2, క – విబుధోత్తరులెంచగ, చ – విబుధోత్కరి మెచ్చగ, ట – విబుధూతర మెంచగ, త, ప – విబుధోత్కర మెంచగ, 3 క, చ, ట, త, ప – రాజ

15ప 1 క, చ, ట, త, ప – ప్రతులలోలేదు, 2 చ–గావించి, గ – గురించి.

గీ॥ ప్రబలభద్రానుభూతివైభవము వాఁడు
సురభి చక్రైకపాలనస్ఫురణ వాఁడు
ఘనుఁడు గోపాలకృష్ణుఁ డొక్కరుఁడెగాక
కలఁడె మఱియొక్కఁడీ రీతిఁగల విభుండు 16

మ॥ కలలో నీకల గోపికావిభుఁడు సాక్షాత్కారమున్ జెంది యా
త్మలసద్వైభవమెల్లఁదెల్పి కృతియిమ్మా మాకు నీవన్న య
ప్పలు [1]కెంతేఁ బరికింపఁగా సకలసౌభాగ్యైకసారస్వతా
కలనం దెల్పెడు [2]నీదు పుణ్యపరిపాకం బెన్నఁగా శక్యమే 17

తే॥ నందవర పావనాన్వయోన్నతి వహించి
సంతతాచార[1]నియమనిష్ఠను[2]రహించి
యతిపవిత్రచరిత్రుండ వైన నీకు
నిట్టి భాగ్యంబు దొరకుట యేమి యరుదు 18

సీ॥ వరమొసంగిరి యోగవాగలు పంపుసే
యఁగ నందునకుఁ గాశియందు నెలమి
మోటరావిచిగుళ్లు మొలపించి రత్యద్భు
తంబుగ మంత్రాక్షతంబు లునిచి
చౌడేశ్వరీమహాశక్తి[1]నే [2]దొడితెచ్చి
సాక్షిఁ బల్కించి రాశ్చర్య మెసఁగ
నల నందవిభునిచే నగ్రహారముఁగాంచి
రాచంద్రతారార్కమై రహింపఁ
దత్పురావాసుఁడగు జనార్దను కటాక్ష
మహిమఁ గూర్చిరి సత్కీర్తులహరహంబు
దరణి సామాన్యులే నందవరపురాఢ్య
విప్రవరు [3]లద్భుతమహాకవిప్రవరులు 19

---

17ప 1 గ – కెంతో 2 క ట, ల, ప – నిందు
18ప 1 గ – సాం 2 క ట ప – రచించి, ల, గ – వహించి
19ప 1 ట గ – వె, 2 గ – దోడ్తెచ్చి, 3 క – లంతి చ – వృత, ట – ఘ్నుల గ – ప్రతిలో ఈ పదము లేదు

ఉ॥ ఆ యనవద్యవంశభవులందుఁ బ్రసిద్ధివహించి మించు నా
[1]త్రేయపవిత్రగోత్రుఁడు సుదీనిది [2]యన్మల
చింతలాన్వయ
శ్రీయుతుఁ డర్థికల్పకము చెన్నమరాజు గుణాభిరాముఁడై
[3][దీయు]తుఁడై మహాకవి విదేయకుఁడై విలసిల్లె
నెంతయున్ 20

కం॥ అతనికిఁ గలిగిరి నందను
లతులితమతు[1]లై లమాంబ యందును లక్ష్మీ
పతియును గొండయ్యయు [2]స
న్మతి [3]తిమ్మమయందుఁ గృష్ణమంత్రి[4]యు నాఁగన్ 21

కం॥ వారలలోఁ బెద్దన యా
ధారుఁడు లక్ష్మీపతిప్రధానుఁడు వెలయున్
[1]ధారాళదాననిరసిత
తారాధారాంబురాశిదారాధరుఁడై 22

వ॥ తదనుసంభవుండు 23

---

20ప 1 'గ', 'చ' ప్రతులయందు 2వ పాదము ఈ విధముగా నున్నది
గ – త్రేయకళాసమన్వితుఁడు బంధురనిభ కీర్తిశాలియా
చ – త్రేయమురుద్గవిభియరదివ్యధుని నిభకీర్తిశాలియా,
2 గ – యన్మల, చ – యన్వల,
3 క – రంజ్యతుడై,
చ, ట, త, ప, గ – ల యందు ఈ నాల్గవ పాదము లేదు

21ప 1 క, ట, త – లైవ నల్లమాంబ, గ – లెల్లమాంబ, 2 క, ట, త, ప–
సమ్మతి, 3 క, ట త, ప, గ – తిమ్మయ, 4 గ – యనంగన్

22ప 1 క, ట – ధారాళధార, గ – ధారాభిధాన

ఉ॥ కొండ యభీష్టవస్తువులు కూరిమినే నొసగూర్తు[1] మీకుఁ జే
కొండ యటంచు నర్థులకు గొబ్బున నెంత పదార్థమైనఁ దాఁ
గొండ యటంచుఁ జూడ కొసఁగున్ ధరపై నడయాడు జాళువా
కొండయ చెన్నమంత్రి మణికొండఁడు[2] యెంచఁగ
మంత్రిమాత్రుఁడే 24

ఉ॥ అతనికిఁ దిర్మలాంబయను నంగనయందు జనించి రాత్మజుల్
దృతి జితదేవతాగిరులు తిమ్మన తమ్మనమంత్రిచంద్రు ల
య్యతులితసద్గుణాంబునిధులందుఁ బ్రసిద్ధివహించి మించె ను
ద్ధతరిపుగర్వనిర్వహణ[1]దక్షుఁడు తమ్మన రాజ్యపూజ్యుఁడై 25

సీ॥ ఏ మంత్రిమార్తాండుఁ డేవేళఁ గువలయా
నంద[1]కృద్గుణరేఖ నందమొందె
నేమంత్రి దేవేంద్రుఁ డేవేళ ఘనగోత్ర
రక్షణోదారుఁడై రహి వహించె
నేమంత్రిహిమదాముఁ డేవేళ మితిమీఱు
కళలచే బుధుల నింపలరఁజేసె
నే మంత్రిధూర్జటి యేవేళ నగణిత
ద్విజరాజ[2]సంభృతిఁ దేజరిల్లె

గీ॥ నతఁడు సామాన్యుఁడే మహాద్భుతచరిత్రుఁ
డనఘదాత్రీశనుతసద్గుణౌఘహారి
నందవరవంశభవసదానందకారి
మంత్రి[3]కొండయ తమ్మనామాత్యశౌరి 26

---

24వ 1 క - మించు 2 క - యంచన, గ - నెంచగ
25వ 1 గ - దక్షత
26వ 1 క, చ, త ప - కృద్గణ, 2 గ - సంతతి 3 గ - కొండన

సీ॥ శ్రీరంగరాయధాత్రీతలాధ్యక్షద
క్షిణభుజాదండమై చెలఁగినాఁడు
కరమొప్ప నతనిచేఁ [1]గరివాహనాందోళి
కాసితచ్ఛత్రముల్ గాంచినాఁడు
రమణ[2]వెంకటదేవరాయేంద్రుఁడు నుతింపఁ
బటుకార్యదక్షుఁడై ప్రబలినాఁడు
దునియదారులఁ [3]దెచ్చి ఘనత నాతనికి పా
దాక్రాంతులుగఁ జేసి యలరినాఁడు

గీ॥ బోట కర్ణాట లాట కాంభోజ మగధ
గౌళ[4]నేపాళ మాళవ చోళ సింధు
నృపవరాస్థానముల మంతు కెక్కినాఁడు
మంత్రిమాత్రుఁడే తమ్మయ మంత్రిమౌళి 27

తే॥ అతని పినతండ్రి సంశోభితాభిమాన
రాజరాజు కృష్ణమరాజు రాజమాన
దానవిద్యాపరాభూయమాన వార్ని
దానసంతానభూజుఁడై ధరణి వెలయు 28

సీ॥ తావిమోపరిదిండి[1]దాయ తత్తడి[2]రౌతు
పానుపు నిగనిగల్ పరిహసించి
మినుకుఁగ్రొవ్విరిబోణి మిన్నయొక్కడు మేలి
తేజీల ధళధళల్ దిలుపఱచి
[3]వలినేలతాల్పురాకలికికూతుఁఋ జేని
తెలిమేని మిసమిసల్ ధిక్కరించి

---

27వ 1 గ–గజ, 2 క, ట, ప – వెంకటరాయదేవేంద్రు, గ – వెంకటరాయ రాజేంద్రు, 3 గ – మెచ్చిచెలతరి నతనికి, 4 గ – మాళవనేపాళ

29వ 1 క, ట – వాయ, త, వ – హయ, 2 క, ట – కాడు, 3 క – వలినేల దువాల్పు మాపుతు మానతిని, చ – వలినేల తాల్పు రామా పుతురురేని, ట – వలినేల తాల్పురా కలికికూతురు లేని, త, ప – వలినెలదాల్పురా కలికి కూతురులేని గ – వెలినెలదాల్పు రా కలికికూతురు రెని,

తెఱగంటి మూఁక పెందెరువు కేళాకూళి
తరగ చాల్[4]దగిదగల్ తారసించి
గీ॥ సకలభువనైకభవనపాళికి నసూన
మౌక్తికవితానమై తన సుహితకీర్తి
వెలయుఁ జెలువొందు నయవచోవిభవహసిత
జిష్ణు హితమంత్రి చెన్నయ కృష్ణమంత్రి 29

కం॥ ఆ నయశాలికి బస్వాం
బానీరజగంధి యందుఁ బ్రభవించిరి మే
దానిధి తిమ్మన మంత్రియు
దానమనుఁడు లింగసప్రదానాగ్రణియున్ 30

కం॥ అంద[1]గ్రభవుఁడు తిమ్మన
మందారమహీరుహంబు మహిమను [2]మహిఁ జె
న్నొందె నభీప్సితదానా
నందితసంశ్రయధురీణనానా[3]ద్విజుఁడై 31

సు॥ ద్రువ[1]దానంబున సూర్యసూతి కళలందుం దోయజారాతి బో
గవిభూతిన్ [2]గుదరాభియాతి విలసత్కారుణ్యవిఖ్యాతి దా
నవ సంఘాత విఘాతి[3]లేరు ప్రతియన్నన్ మంత్రులత్యంత భ
వ్యవచోవైభవవిష్ణుశయ్యకును గృష్ణామాత్య
తిమ్మయ్యకున్ 32

కం॥ ఆ మంత్రి మణికి ననుజుం
డై మంతుకునెక్కై లింగనామాత్యుఁడు శ్రీ
రాముని కనుసంభవుఁడై
శ్రీ మెఱయఁగ లక్ష్మణుండు చెలఁగిన [1]కరణిన్ 33

---

4 చ – వక చకల్ గ – ఛళఛళల్

31ప 1 గ – అగ్రజుండు, 2 గ – ధరపై 3 గ – శ్రయుడై

32ప 1 క ను.త ప – గా 2 ఎ ట ప - మధు 3 ట – వేరి

33ప 1 గ – ఛంగిన్

చ॥ విడువక పెమ్మసాని పెదవీరనృపాలుని యందలంబుపై
నడచు నుదారఘోరమదనాగముఁ జేపిడియమ్ముకొద్ది యె
క్కుడు వడిఁగ్రుద్దిపోఁదఱిమె కొంచక లింగనమంత్రిసింహ మిం
[1]పడరెడువేడ్క రాయ లవురాయన నామిడిగేశిచెంగటన్ 34

కం॥ లింగన కీర్తిధరా[1]పా
ళిం గననగు గాంగభంగలేఖ[2]ద్రుశరా
లిం గన కాద్రిధనుశ్శా
లిం గన బలదీప్తిమండలిం గని నగుచున్ 35

కం॥ మనుఁడు తదగ్రజుఁడగు తి
మ్మనకును జనియించి రెల్లమాంబికయందున్
దనయులు వెంకటపతి గుణ
ధనుఁడై తగు శ్రీహరిప్రధానాగ్రణియున్ 36

తే॥ శ్రీహరికి నగ్రజుండయి చెన్నుమీఱి
భద్రములఁ గాంచె వెంకటపతిఘనుండు
శ్రీహరికి నగ్రజుండయి చెన్నుమీఱి
భద్రములు గాంచు నల బలభద్రు కరణి 37

సీ॥ ఎలమి బ్రాహ్మణపల్లె నే మంత్రి నిలిపె గో
పాలదేవునకు దేవాలయంబు
[1]నేడకి పురమున నే మంత్రి తిలకుండు
వనము వేయించె పావనము గాఁగ
నిష్ఠాపరము లొసఁగి యే మంత్రి చెప్పించె
వేదశాస్త్రంబులు విప్రతతికి

---

34ప 1 గ – పలరగ
35ప 1 గ – హి, 2 త – ద్రుసరా, గ – దృసరా, క – ద్దుశరా
38ప 1 గ – నే డకి,

భువనప్రసిద్ధమై [2]పొలుపొంద నే మంత్రి
చెలువుఁ [3]గట్టించె నచ్చెరువు గాఁగ

గీ॥ నతని నుతియింపఁదగు బంధుయాచకద్వి
[4]జాళిసంస్తూయమాననిత్యాన్నదాన
మనుని తిమ్మయామాత్యు వెంకట [5]వరప్ర
దానసంక్రందనుని [6]ధ్యానదనుని మనుని 38

వ॥ తత్సహోదరుఁడు 39

సీ॥ వెనకఁ ద్రొక్కమి దానవిభవంబుననె కాదు
జనులెన్న గణగణ వదువునపుఁడు
బదరకుండుట కార్యభారంబులనె కాదు
వే యుపకారముల్ [1]సేయునపుడుఁ
దడఁబాటులేమి యుద్ధమునందె కాదు రా
జాస్థానముల మాటలాడునపుడుఁ
దుడుపరంబులులేమి కడు బంధురక్షణా
రంభంబుననె కాదు వ్రాయునపుడుఁ

గీ॥ గలుగ వర్తిల్లు దూర్తమార్గప్రచార
[2]భారభాగమాత్యంమన్యపటలచటుల
భూరితరగర్వశైలదంభోళి తిమ్మ
మంత్రిచంద్రుని శ్రీహరిమంత్రిమౌళి 40

---

2 గ – పొలుపొందు 3 గ – వెయించె, 4 క, చ – జాలి ట – జావ, త – జాప గ – జాయ 5 గ – పతి 6 చ ప – హరిధ్యానఘనుని, ట–హరి ధ్యానధనుని, గ– హరి ధ్యాని పరుని

40ప 1 గ–వెలయునపుడు, 2 క–భారభాగమహాత్య మన్నీ పటల చటుల, చ – భాంభాగమాత్యం మన్య పటల చటుల, ట, ప – భారభాగ్యమాత్య మన్నె పటుల చటుల త–భారభాగ్యమాత్య మన్నె పటుల చటుల

చ॥ ఉరుతరభోగశాలి పురుహూతుఁడు వేడ్క శచీతలోదరిన్
బరిణయమై జయంతుఁ గనుమాడ్కి మురాసురవైరి రుక్మిణిన్
బరిణయమై మరుంగనిన బాగున శ్రీహరి పెద్ద[1]మాంగనన్
బరిణయమైకనెన్ రవినిభద్యుతిమంగపతిన్ మహోన్నతిన్ 41

చ॥ కృప నలమేలుమంగపతికిం బ్రతి, యప్రతిమానమంజువా
జ్నిపుణతమై భుజంగపతికిం బ్రతి, శ్రీహరి పాదభక్తియు
గ్వ్విపులమతిం బతంగపతికిం బ్రతి, శ్రీహరిమంత్రిమౌళిమం
గపతి[1]యబంగరంగదధికప్రతిభాకృతి, మంత్రి యెాత్రుఁడే 42

సీ॥ జేజేల కమృతంబుఁ జేకూర్చి యతివల
గతిఁ జాల నుప్పొంగు కడలిజేని
జేజేల కభిమతాశేషవస్తువు లిచ్చి
గంధవంతములైన కల్పతరుల
జేజేల కనిశంబు చేరి వాంఛ లొసంగి
[1]మత్తిల్లు నిర్జరమాన్య సురభి
జేజేలకెల్ల హెచ్చిన వేడ్క కళలిచ్చి
కరము విరాజిల్లు కమలరిపుని

గీ॥ భంగ మొందించి, యాకులపడఁగఁజేసి,
పూరి గఱపించి, మదిఁగందుఁ [2]బొరయఁ జేసి,
ధరణి ధనదానకీర్తులు దనర వెలయు
మంగపతిమంత్రి శేముషీమఘవమంత్రి 43

తే॥ ఇతని జనకుని తాతకు నే మహాత్ము
లగ్రభవులై తనర్చి రత్యనఘసుగుణ

41ప 1 క, చ, ట–కాంగ, త–కాగ
42ప 1 క–దయన్ గరంగ, ట–దయంగ రంగరంగ, త–యనంగరంగ
43ప 1 గ–వర్తిల్లు, 2 క, ట, త, ప – బోర, గ–బరగ

[1]కాండనిధులు లక్ష్మీపతి కొండయాఖ్య
మంత్రిపుంగవు లా మహామహులయందు 44

సీ॥ అన్నదానము చేసి యభ్యాగతులఁ బ్రోచి
పొల్చినాఁ డఘములు డుల్చినాఁడు
వసుధ నర్థులకెల్ల వాంఛితార్థము లిచ్చి
మించినాఁ డురుకీర్తిఁ గాంచినాఁడు
దనదాన్యసంపదఁ దనయింటఁ జాలంగ
[1]నిగిచి నాఁ డాప్తుల [2]నునిచినాఁడు
శ్రీవిష్ణుపాదరాజీవద్వయం బాత్మఁ
బూనినాఁ డానంద మూనినాఁడు

గీ॥ మంత్రిమాత్రుఁడే సుకవిసమ్యక్ప్రబంధ
సారసారస్యవిజ్ఞాన[3]సౌరభాను
బంధబంధురహృదయాబ్జపాళి చెన్న
మంత్రిహేళి లక్ష్మీపతిమంత్రిమౌళి 45

శా॥ ఆ లక్ష్మీపతిమంత్రిచంద్రుఁడు వివాహంబయ్యెఁ జౌడాంబికా
నాళీకాక్షినిఁ దిప్పమాంబయను కాంతారత్నమున్ [1]వేడ్కమున్
ఫాలాక్షుండు ధరాదిరాజతనయాభామావతంసంబు గం
గాలావణ్యవతిన్ వివాహమగు జోకన్ లోకసంస్తుత్యుఁడై 46

కం॥ అందగ్రభార్య చౌడమ
యందున్ జనియించె వెంకటామాత్యుఁడు సం
క్రందన[1]నందనవరహరి
చందనచందనలసద్యశఃకందళుఁడై 47

---

44ప 1 గ-కాంత
45ప 1 గ-నునిచి, 2 గ-మనిచి 3 గ-సౌమ్య
46ప 1 గ-వెడుకన్
47ప 1 గ-నందను హరి హరి

ఉ॥ శ్రీపతి సత్కృపాగరిమచే నుదయించిరి చెన్నమంత్రి ల
క్ష్మీపతి పిన్నభార్యకు విశిష్టగుణాంబకుఁ దిప్పమాంబకున్
రూపవతీ[1]నవీనమదనుండగు చెన్నమరాజు సత్యస
ల్లాపుఁడు రామచంద్రుఁడు కళానిధి తాయనమంత్రి
చంద్రుఁడున్ 48

వ॥ వీరలు క్రమంబున 49

సీ॥ [1]పటునీతి సత్కృపా బాహు శౌర్యంబుల
వాసవగురుఁడు శ్రీవరుఁడు [2]నరుఁడు
దివిశేష [3]ప్రతిజ్ఞా విష్ణుసేవలఁ
గంజసంభవుఁడు భార్గవుఁడు ధ్రువుఁడు
మహనీయభోగ సన్మార్గ దానంబుల
నముచిమర్దనుఁడు శంతనుఁడు ఘనుఁడు
[4]సత్త్వామితైశ్వర్యసౌందర్యరేఖలఁ
గరధృతహలుఁడు శ్రీగళుఁడు నలుఁడు

గీ॥ సాటిగా కన్య లేరీతి సాటివత్తు
రితనికని సత్కవీశ్వరులెన్న వెలసె
నౌర లక్ష్మీపతిప్రధానాగ్రగణ్యు
చెన్నయఘనుండు సద్గుణ శ్రీ[5]ధనుండు 50

కం॥ చెన్నమరాజు లసత్కళఁ
బున్నమ[1]రా జార్యవినుతభూరిమనీషన్

---

48ప 1 క–లలామ

50ప 1 క, చ – పలునీతి, గ–పటునిధి, 2 క, చ, ట, త ప – నలుడు,
3 గ–ప్రజ్ఞశ్రీ, 4 గ–సర్వా, 5 గ–ఘనుండు

51ప 1 గ–రాజన్య

పన్నగరాజతిదృతి సం
పన్నగరా జతనికెందుఁ బ్రతి మఱి గలఁడే 51

కం॥ సన్నుతకవిత్వవిద్యా
ప్యన్నతి శ్రీనాథ సుకవిపుంగవు [1]కరణిన్
జెన్నమరున్ లక్ష్మీపతి
చెన్నమరాజ ప్రదానశేఖరుఁ డెలమిన్ 52

మ॥ దర లక్ష్మీపతి రామచంద్రసచివోత్తంసంబు శ్రీరామచం
ద్రదరసాదీశుఁడె చాకయున్నఁ గనునే తాదేశజిత్కీర్తివి
స్ఫురణంబున్ సుమనోహితప్రదమనః
స్ఫూర్జన్మహామోదమున్
బరమార్యాభినుతైకసద్గుణకళాపాలస్త్యదానోన్నతుల్ 53

సీ॥ హరినాత్మలోనుంచి యధికప్రభావాప్తిఁ
బ్రణుతికెక్కిన మంత్రిభాస్కరుండు
పూని దానమునందె కానీను గర్వంబుఁ
గుందించు మంత్రిసంక్రందనుండు
గురుమహోన్నతిఁ బేర్చి కుంభినిశాలిహృ
ద్రంజనుండగు మంత్రికుంజరుండు
తనదు దర్మగుణంబె దన సౌమ్యుఁగ ద్విజేంద్ర
భృతి కీర్తి గాంచు మంత్రీశ్వరుండు

గీ॥ మంత్రిమాత్రుండె చక్రసమ్మతవిహారి
పరబల [1]విదారిప్రమదశుంభత్ప్రచారి
దీపితార్యానుసారి లక్ష్మీపతీంద్రు
డాయనామాత్య శౌరి మేధా[2]తిహారి 54

---

52ప 1 క, ట, త, ఎ, గ–కరుణన్
54ప 1 క, ట, త, ప–విహారి 2 త గ–విహారి

కం॥ తాయన గుణతతి వెలయు దా
తా యన. [1]సు[శ్రీ] [వి]రాజితా యన. [సు[త్రా]]
తా యన, భూతలజీమూ
తా యన. [2]సీమాతిపూర్ణి తాయన. లీలన్ 55

ఉ॥ అందు సమగ్రభాగ్యనిదియై తగు చెన్నమరాజమంత్రికిన్
పొందుగ భార్యయై మిగుల[1] పొల్పువహించెను బాలకాంబ గో
విందునకున్ [2]రమారమణి వేల్పులరాయనికిన్ పులోమజా
చందనగంది రామనృపచంద్రున[3]కున్ దరణీ
జయున్ బలెన్ 56

కం॥ ఆ జంపతులకు నాత్మజుఁ
డై జలరుహనాభు కరుణ ననుపమతరరే
ఖాజితజిష్ణుతనూజర
మాజుఁడు శేషాద్రి మంత్రిమణి జనియించెన్ 57

సీ॥ తల్లిదండ్రులపేర ధరఁ [1]ప్రసిద్ధికి నెక్క
రహి[1]మీఱ నగ్రహారములుచేసె
రాజాదిరాజులు [2]రాయనౌనని మెచ్చఁ
బ్రజ్ఞాదురంధరప్రౌఢి మెఱసె
బాంధవాశ్రితవిప్రపటలంబు [3]వినుతింప
[4]ననిశాన్నదానవిఖ్యాతి గనియె

---

55ప 1 క–సుశ్రీయుతాయన విజయశ్రీ జిత, చ, గ–యాధిక్యరాజతాయనసుస్రి, ట–సుశ్రీతాయని భూతల జీమతాయన, త–యాధిక్యదాయన సుశ్రీ, ప–యాధిక్య సుశ్రీతాయన భూతల జీమూ, 2 గ–శీమాభి

56ప 1 గ–పొందు, 2 గ–రమామణియు, 3 గ–కా

58ప 1 గ–మీద. 2 చ–రాయతౌ, గ–రాయతా, 3 క, త, ప–నుతియింప, 4 క–వినుతా,

బుంధసత్కవిస్తోమములు నుతుల్ సేయ శా
శ్వతముగా సప్తసంతతులు గూర్చె
౭॥ నితనికి నితండె ప్రతిగాక యితరు లెనయె
యనుచు జనులెన్న వెలసె హృదబ్జమధుక
[6]రాంబకీకృతజైవాత్రృకాద్రి చెన్న
మంత్రిశేషాద్రి పటుధైర్య మందరాద్రి 58
సీ॥ వడఁకు గుబ్బలిరాజు నడయాడ నేరఁడు
కందు వాఁ డెన్నంగఁ జందురుండు
పాదోనిధివిభుండు పాలబుగ్గలవాఁడు
పోలింప పసిబిడ్డ పుడుకుఁ దొడుకు
గట్టు రాయల్లుండు బట్టగట్ట నెఱుంగఁ
డిల గుడ్లలోఁగూన చిలువఱేఁడు
నెఱయాది కూర్మంబు నేలంటు విడువదు
పురుహూత [1]భూజంబు పుట్టు మొలక
గీ॥ యరయ నద[2]నీయఁ బరిభవం బాచరించు
టే కడిమియంచు తనతోడి [3]యీడు వారిఁ
[4]దవిలి వెదకంగనో జగత్త్రయినిఁ దిరుగు
చెన్నఘనశేషమంత్రి సుస్థిర యశంబు 59
౬౦॥ శ్రీమంతుఁడు ఘనుఁడా శే
షామాత్యుఁడు పెండ్లియయ్యె ననుపమలీలన్
రామాంబాసర్వాంబల
హేమాంబరుఁ డిందిరామహీసతుల బలెన్ 60

---

5 క చ ట,త ప-ని 6- గ-రాంకిని.

59 ప. 1 గ-భావంబు. 2 క ట అ పె-నయ్యె. చ-శియ్యె. 3 గ-యాడు.
4 ఎ ట,ప-దవిరి

వ॥ అందు 61

తే॥ జనకునింటికి వన్నియ సంతరించి
యత్తవారింటి కనఘవిఖ్యాతిఁ గూర్చి
యలరె రామాబ్జముఖికి జోడై దరిత్రి
సద్గుణకదంబ శేషయసర్వమాంబ 62

సీ॥ [1] శ్రీమించి యమరదాత్రీజాత మన సువ
ర్తనఁ గాంచు తిమ్మన దండనాదు
శేషాంశభవుఁడు నా శేముషీగరిమఁ గీ
ర్తి వహించు లక్ష్మీపతిప్రదాను
రామచంద్రాకారు రామణీయకమునఁ
బ్రఖ్యాతిఁ గను చెన్నయామాత్యు నిన్నుఁ
గడువేడ్క లక్ష్మణాగ్రభవరాజ్యాధార
మై చెలువందు తాయనసుదీంద్రుఁ

గీ॥ గనియె నలువుర మిమ్ము నందనుల రామ
లక్ష్మణభరతశత్రుఘ్నలలితగుణులఁ
జెన్నయామాత్యశేషాద్రి సిరుల మన్మ
దాంబ కెనయైన యా సర్వమాంబయందు 63

తే॥ శ్రీహరి చతుర్భుజంబుల రీతి [1]గార
కరిచతుర్దంతముల [2][భంగిఁ] గమలసూతి
కలితచతురాస్యముల భాతి ఖ్యాతిఁగాంచి
యెలమి చెన్నొందునట్టి మీ నలువురందు 64

కం॥ తిమ్మన గుణసుమవిసరము
ఘమ్మన మనుజేంద్రసభల [1]ఘనత వహించెన్

63ప 1 గ-శ్రీమించు
64ప 1 క,ట-దౌర, చ,త,వ,గ-సౌర 2 క,ట,ప-నిండి, చ-నిడి, త-నీటి
65ప 1 క,చ,ట,త,ప-గరిమ

పొమ్మన కర్థుల కర్థము
కొమ్మనఁ గల వేల్పుఁ జెట్టుకొమ్మన నెలమిన్ 65

సీ॥ ఎఱుగమినైన నే యెడలఁ జేయఁగఁ బూనఁ
డపకారకారణంబైన పనులు
పరిహాసమునవైన బలుకంగ నొల్లఁడు
పరదూషణాయత్తభాషణంబు
నలవోకగానైన తిలకించి చూడఁడు
పరభామినీజనప్రకరములను
గలలోననైనఁ దాఁ గాంక్షింపఁగాఁబోఁడు
పదిలుఁడై యెన్నడు పరధనంబు

గీ॥ మఱవడేవేళ హరిపదస్మరణమహిమ
యెంత ధన్యుండు ద్వాదశీకృతమహాన్న
దానసంతృప్తభూదేవతావరుండు
శేషమను తిమ్మయామాత్యశేఖరుండు 66

సీ॥ [1]పుణ్యజనానీకముల జీవనములెల్లఁ
గూలంగఁ ద్రోచిన కొదువ యొకటి
సన్మార్గగతి మించఁ జను ద్విజేంద్రునిఁ గ్రింద
పడఁజేసి వర్తించు కడమ యొకటి
తగవేది గోత్రభేదమ తోడఁబుట్టి మ
హోన్నతి యొదిగిన యొచ్చె మొకటి
జగతిఁ గర్హాసహ్యమగు వర్తనం బాత్మ
విడువక మెలఁగెడు వెలితి యొకటి

పరిహరింపఁగ [2]నూహింప భవ్య లీల
నిల జనించు లక్ష్మీపతియే యనంగ

---

టి॥ 1 గ-చెలగి పుణ్య జనైక జీవన చెలగు 2 గ-నూహించి భావ్యలీల

నలరె శేషయామాత్యగర్భాంబునిదిని
శావిభుండు లక్ష్మీపతిసచివవిభుఁడు 67

సీ॥ దండి ప్రియంకరాఖండప్రసన్నత
బూవిశ్రుతమురారి భావకలన
రమణీయకుండలిరాజశయ్యాలీల
సుగుణైకధారవిస్ఫురిత [1]వృత్తి
లలితమయూరకలాపమాదుర్యంబు
వినుతభాస్కరపదవిలసనంబు
బాణాతిశయజైత్రభాస్వదోజఃస్ఫూర్తి
యమరేశపాకమహత్త్వబృతియుఁ

గీ॥ గలిగి యమరవరాన్వయం బలరియుండ
సత్కృతుల్ సేయనేర్చు శేషప్రదాన
విభుని లక్ష్మీపతి రసజ్ఞవిబుదకోటి
యరయ లక్ష్మీపతి కిదేమి యరుదనంగ 68

కం॥ నీ యనుజుండై తనరిన
తాయన విద్వత్కవిప్రతాన స్తవనీ
యాయతనయవాగ్వైభవర
మాయతనముఖారవిందుఁడై విలసిల్లున్ 69

సీ॥ అకలంక గుణదారియగు వంశరత్నంబు
క్షమ మాట నిల్పెడు సత్యశాలి
యార్యానుకూలుఁడై యలరు సర్వజ్ఞుండు
పరవృత్త వైఖరిఁ బరఁగు సుకృతి

68ప. 1 గ-కీర్తి

చేపట్టి బుధులఁ [1]బోషించు సత్పురుషుండు
గురుతరస్వర్ణంబుఁ గురియు ఘనుఁడు
దుష్టతమఃస్ఫూర్తిఁ దొలగించు తేజస్వి
యాశ్రితప్రహ్లాదుఁడగు నృసింహుఁ

గీ॥ డిమ్మహామాత్యజిష్ణు [2]సుధృజ్మనోహ
రాకృతివిలాసు వినుతి సేయంగవశమె
యనుచు [3]జనులెన్న వెలసితి వౌర శేష
శౌరి చెన్నప్రదానయాచకనిధాన 70

సీ॥ వలిగట్టు హైమమేఖలఁ గూర్చెఁ జతురాస్యు
డుదిత సువర్ణంపు మురువుఁ జేర్చెఁ
గలశాంబునిధి యూర్మికలు వెలఁ గీలించె
గగనగంగ యొసంగెఁ గంకణములు
హరుఁడిచ్చె బహుముఖాలైన సొమ్ములు సౌర
సాలంబు కుసుమసరాలుఁ బూన్చె
కమలారి విశదాంశుకంబులు [1]సమకూర్చె
శేషాహి కంచుకశ్రీ ఘటించెఁ

గీ॥ దనర నీ కీర్తికన్యకు దైర్యవాగ్గ
భీరతాశుచిత్వవిభూతి భూరిదాతృ
తాకళాప్రజ్ఞలను వవద్బంధులగుట
సత్యసంపన్న శేషయామాత్య చెన్న 71

---

70ప 1 గ–బుధుల సత్పోషించు పురుషుండు. 2 క,ట సుహృజ్జనమనోహ.
3 క–బుధజనులెన్న

71ప 1 త–రింపుగ గూర్చె

సీ॥ తన లసద్వనలక్ష్మి తన లసద్వనలక్ష్మి
పగిది [1]నాళీవై భవములఁ బూన
[2]తన మహాశయపాళి తన [3]మహాశయపాళి
గతి దానవారి సంగతి [4]వహింప
తన కళావిభవంబు తన కళావిభవంబు
సరణి [5]నబ్జజపరిస్ఫురణ [6]నెఱప
తన విగ్రహస్ఫూర్తి తన విగ్రహస్ఫూర్తి
రీతి దర్పకనిరాకృతి యొనర్ప
గీ॥ నలరు ధాత్రి నే మన్నె మార్తాండుఁ డట్టి
గండరాదిత్య గండరగండబిరుద
దీపితాటోపభయదప్రతాపతీవ్ర
ఘృణికి పెమసాని తిమ్మ [7]భూమీశమణికి 72
తే॥ మంత్రివై నీవు చెన్నయ మంత్రి చంద్ర
ప్రణుతి కెక్కితి వఖిలభూపాలసభల
క్షితి హరిశ్చంద్రునకు సత్యకీర్తి [1]సరణి
దరణి ధరగర్వ[2]భేదికి గురుని కరణి 73
సీ॥ గరుడనారాయణబిరుదధ్వజంబు బం
గారు పువ్వుల చెంద్రగావి పావ
డయుఁ దురాయి గజంబు హయరత్నమును వీర
మలహరి మనకంఠమాలికయును
దాళిచౌకట్లు ముత్యాల కడియములు
గండపెండేరంబు కత్తి[1]కుంచ

72ప 1 చ–నాలీక, గ–నాళీక. 2 క,ట త,ప–మహాయశపాళి. 3 క,ట,త,ప–మహాయశపాళి. 4 చ,ప–రహింప. గ–వహించ. 5. గ–సరణి. 6. గ–జూప. 7 క,ట త,ప,గ–భూమీంద్ర
73ప 1. గ–ధరణి. 2 గ–భేది సద్గురుని.
74ప 1 చ,త,ప–కుచ్చు, గ–కుంచె

వెంకటపతి రాయవిభుని చెంతను దెచ్చి
పెమసాని తిమ్మభూరమణమణికి

సీ॥ నిచ్చి తదనుజ్ఞఁ గైకొంటి వెలమి నీవు
రాయదత్తంబులైన కుళ్ళాయి మీఁది
పాగ దవళశంఖంబులు పల్లకియును
దాళిచౌకట్లు చెన్న ప్రదానచంద్ర 74

తే॥ కుంచ కాళాంజి పట్టించుకొమ్మటంచు
ముదల యిడి రాయలెంతయు మ.దము మీఱ
సకల [1]సన్మానములొనర్ప జగతిఁ గీర్తిఁ
జెన్ను మీఱితి వౌరౌర చెన్నదీర 75

మ॥ శౌరి విదర్భరాజతనుజావనజానన సత్యభామ దే
వేరులు గాఁగ వేడుక మవింగనులీల బుదావనైకవ
ర్యారమ యెల్లమాంగన దయానిధి య[1]క్కమయన్వధూటి దే
వేరులు గాఁగ వేడుక మవింగనినాఁడవు చెన్నదీమణీ 76

శా॥ శ్రీలక్ష్మీపతి [1]పాదసద్భజనదౌరేయుల్ బుధస్తుత్యస
త్యాలాపోజ్జ్వలు లెల్లమాయువతిగర్భాంబోధిచంద్రోదయుల్
లీలాదుర్యులు [2]నీదు కూర్మితనయుల్ శ్రీమంతులై
యుంద్రు గో
పాలామాత్యుఁడు శేషమంత్రియుఁ నయప్రావీణ్య
గణ్యోన్నతిన్ 77

వ॥ ఇట్టి భవత్కుమారరత్నంబులు క్రమంబున 78

---

75ప. 1 గ–సన్మార్గము
76ప. 1 ఓ ట –కమలా
77ప 1 చ త – వంపాచ ట–పదపాద 2 ు ట. ఎ–నిం.ు

శా॥ నాళీకాక్షపదాబ్జసేవనదురానై పథ్యమున్ సత్యమున్
శ్రీలాలిత్యము గల్గి నిత్య సుమూరున్ జెన్నప్రధానేంద్రు గో
పాలామాత్యుఁడు రాజనీతివిలసద్భాషాపరాభూతగో
పాలామాత్యుఁడు బంధురక్షణకళాపాండిత్యసంస్తుత్యుఁడై 79

సీ॥ పాలమున్నీటిలోఁ బ్రభవంబు నొందిన
బాధవృక్షముల తోడఁబుట్టువైన
[1]శివశిరఃస్థలముపైఁ జెన్నొంది నిల్చిన
నాదండఁ జెదలేట నీదుచున్నఁ
గైరవమ్ములతోడఁ గడు మైత్రి చేసినఁ
దనలో సుధారసంబునుచుకొన్నఁ
గరములఁ బ్రాలేయగరిమంబుఁ గైకొన్న
వరుసఁ జుక్కలకెల్ల [2]స్వామియైన

గీ॥ నల మృగాంకుఁడే గతి సాటి యార్యసుకవి
గణమనఃపంకజానందకారియగుచు
నెన్నదద్భుతకరుఁడైన చెన్నమంత్రి
చంద్రు గోపాల సత్కీర్తిచంద్రు[3]తోడ 80

సీ॥ శ్రుతిబాహ్యుఁడను నిందసోకక [1]యే వేళ
నడత చక్కనగాఁగ నడిచెనేని
[2]ముడుఁగు [3]ముందల రీతి నుడగక [4]విస్ఫూర్తి
నెటి నరేంద్రుల దండ నిలిచెనేని
వసుమతీ [5]భృద్ధర్మ వక్రతాహేతువై
పొరలఁ జొచ్చుటలేక పొలిచెనేని

80ప 1 గ-ఎదల సుస్థలముని చెన్నొందుచుండిన, 2 గ-వరుదు, 3 క, చ, ట, ల - దొప్ప

81ప 1 కి, ప, ఎ త, ప, గ - నె! 2 క, చ ట, త, ప, గ - ముడిగి, 3 క, ట, త, ప, గ-ముంపుల, వ-ముంచుల, 4 గ-నొకరీతి, 5 క, ట, ప - బలి

సంతతంబు భుజంగసాంగత్యరహితుఁడై
మహివరుసై మంత్రిచే మనియెసేని

గీ॥ యెంచఁ బ్రతివచ్చు శేషుండు మంచినడక
జననుత ప్రజ్ఞ నుపకారసుసమనీష
సవ్యసాంగత్యమును గల్గి జగతి వెలయుఁ
జెన్నమను శేషయామాత్యశేఖరునకు 81

మ॥ కుముదాయత్తకళావిరాజుఁ డరివక్షుర్భీకరాలోకవి
భ్రముఁడ క్రాంతఖుదావన ప్రవణ[1]రారాజద్గుణాధారుఁ డ
య్యు[2]మహిం జెన్నయశేషమంత్రిమణితో సుధ్యత్వభాశాలితో
సమృతాంశుండెసరాడు తా భువనజాతాసహ్యుఁడై
యుండుటన్ 82

తే॥ అనుచు జనులెన్న నవలందు నదికకీర్తిఁ
బఱఁగు గోపాలమంత్రిశేఖరుఁడు శేష
యాఖ్యమంత్రియుఁ బుత్త్రపౌత్త్రాభివృద్ధిఁ
గలిగి వెలయుచునున్నారు వెలయఁగలరు 83

సీ॥ తాడిపత్రీపురస్థలిని గోపాలకృ
ష్ణప్రతిష్ట యొనర్చినాఁడ వెలమి
సేయించినాఁడవు చెలువంబు మీఱ నా
హరికిఁ గిరీట పీతాంబరములు
పూని యేడకి చెంత కోనేరు గట్టించి
వనము వేయించి నా వనఘ లీల

82వ 1 ఏ బ ర ఽ—రారాజ గ—తారాజ 2 క ఒ ర — మెడిం 3 ..
వ, ట ప— రా

[1]నలరఁజేసితి వగ్రహారంబు తల్లి పే
రను సర్వమాంబాపురంబు [2]నాఁగ
మఱియుఁ జేసితి వఖిల ధర్మములు మిగుల
నిన్నియును సఫలంబులై చెన్నుమీఱఁ
జెన్నయామాత్యమణి నీవుచేయు కావ్య
మొనర గోపాలకృష్ణున కొసఁగు మనిరి 84

వ॥ అనిన విని ప్రహృష్టాంతరంగుండనై 85

సీ॥ వసుదేవనృపగర్భవారాశికి విధుండు
నందభార్యకు మహానందకుండు
వల్లవీనేత్రాబ్జవనికిఁ బద్మాప్తుండు
పూతనాసుసమీరమునకుఁ జక్రి
యుగ్రసేనతనూభవోగ్రదంతికి హరి
[1]రాధామ్రలతికకు మాధవుండు
వనదావహాలహాలంబునకు నబ్దధరుండు
వందారుతతికి ముకుందమూర్తి

గీ॥ మురనరకచైద్యచాణూరముఖ్యవైరి
రాజఫణిఫణంబులకు విరాట్స్వరూప
మే ఘనుం డట్టిరుక్మిణీహృదయసంచ
రిష్ణు గోపాలకృష్ణు సహిష్ణుఁ దలఁచి 86

---

84ప 1 గ-నరయ, 2 గ-గాగ

86ప 1 గ-రాధాతిలకపు మాధవుండు, ప-రాధామ్లలతికకు

## షష్ఠ్యంతములు

కం॥ ఏతాదృశహాస్య[1]దసం
ఖ్యాతా[2]సమసుగుణమణికి హస్తీకృతస
[3]త్త్యాతరుణీమణికిఁ జరణ
మాతాహతకాళియోరగగ్రామణికిన్ 87

కం॥ గోపాయితబుధతతికిన్
గోపాయితనూజవిజయ[1]గుంఫనమతికిన్
జాపలతారూప[2]నతా
గోపహితాత్మాఢ్యబలిసుతోద్ధతిహృతికిన్ 88

కం॥ [1]దీపితయమునా[2]విహరణ
గోపవధూవసనహృతికిఁ గుదరోద్ధృతికిన్
గోపాగత[3]గోపాయిత
గోపాహితహరణనిపుణగుణసంభృతికిన్ 89

కం॥ గేయార్యబంధునకుగో
పాయితయమునానదీశుభకబంధునకున్
శ్రీయుతభద్రావృతిశు
ల్కాయితమనసత్త్రభద్రికాబంధునకున్ 90

---

87ప 1 క,ట పా-దసు, త-రసం 2 గ-సుమ 3 గ-త్యాతరుణికి ఎదకటసం
88ప 1 క,ట,త,ప-గుంభిత 2 గ-లతా
89ప 1 క,ట,త,ప-గోపిత 2 క,ట ప-విహారా చ-విరహ త-విహార, గ-విరహాత్ 3 క,ట ప-గోపాయుత

కం॥ వార్షదవర్షాతురగో
వర్షపభీపరిజిహీర్షుబావోద్ధృతదు
ర్ధర్షాచలతాకలితో
త్కర్షాలాలునకు గోపికాలోలునకున్ 91

వ॥ సమర్పితంబుగా నా యొనర్పంబూనిన చారుచంద్రోదయం
బను మహాప్రబంధమునకు కథాక్రమం బెట్టిదనిన 92

శా॥ శ్రీ నింపొందెడు నైమిశాఖ్యవనధాత్రిన్ శౌనకాది[1]వ్రతీ
శానుల్ సూతునిఁ జూచి శౌరిసుతసంజాతంబులో నే ఘనుం
డానందం బొనరించె వేల్పులకు దైత్యధ్వంసియై తత్ప్రతా
పానూనోదయుఁ దెల్పవే యన నతండత్యంతసంతుష్టుఁడై 93

తే॥ చారుచంద్రుండు శౌరికుమారులందు
బుధవినుతిఁ గాంచె దైత్యుల పొంక [1]మణఁచి
శుకుఁడు నీ యర్థ మభిమన్యుసుతున కాన
తిచ్చె నది మీరు వినుఁడని యిట్టులనియె 94

సీ॥ చంద్రశాలాశరచ్చంద్రబింబాననా
సంస్మారితామరసముదయంబు
గగనాబ్జగేహినీకటికింకిణీభవ
ద్గాంగేయ వప్రశృంగవ్రజంబు
వియదవేళామరుద్విభుచాప[1]భావనా
ప్రౌఢరత్ననిశాంతబంధురంబు
హరిదశ్వతాంతవాహప్రియంభావుకో
దారగోపుర[2]కేతుమారుతంబు

---

93ప 1 క,ట,వ–ప్రదీ చ–ప్రతి, ల–ప్రతి
94ప 2 క,ట,త వ–మణచె, చ–మడచ
95ప 1 క,ట,ల,వ,గ–చావన, 2 క,ట,త–సేతు

తే॥ త్రిదశకల్లోలినీజాలపదకలాప
లాపనదురీణమణిహర్మ్యలాస్యకార
కీరవాణీవతంససంక్రీడదంఘ్రి
నూపురం బొప్పు ద్వారావతీపురంబు 95

ఉ॥ స్థిరతరసత్త్వశ్రీవాళములఁ జెన్నగు కొమ్మల సందువెంబడిన్
వరుసఁ బతంగమండలము వారి చరింపఁగ నంటనంటుచున్
పరిఘ మహాలవాలముగ బంధురకాంచనసాల మప్పురిన్
బరఁగు నరాతిజాతిమదుపప్రకరాతిభయంకరాకృతిన్ 96

ఉ॥ అగడితనీటఁ దేలి యుడు[1]ప్రాప్తిఁగరంగెడు [2]లేటి తాల్పు రా
నిగరపు వీటికోట డిగునీటికి [3]జేరే వెదురెక్కి వేల్పుటా
వగ మగమీలఁ గూడుదురు పైకొని వాగపతిన్ సజేశులన్
బెగడక నిద్రఁబుచ్చి యల పేడిసకోడి బటారి గుబ్బెతల్ 97

కం॥ వాసిగల కోట పొడవా
[1]కాసెడునయ్యే యెఱుఁగు. నగర్తల లోతున్
భాసురమలయసమీరము
[2]మేసెడునయ్యే యెఱుంగు మేదినిలోనన్ 98

మ॥ కనుఁగీఁటుం దిమిరారి సారదికి శృంగశ్రేణికావక్రత
ఘనవప్రోపరివీదిఁ దేరుఁ దఱుమంగాఁ గంపమానాలక
స్తనభారాదిమనోహరాంగనిబిడచ్ఛాయా స్వయంగ్రాహ మో
హనతన్ గైకొని చొక్కుటల్ మరిగి ప్రాహ్ణనంత
రాహ్ణంబులన్ 99

---

97ప 1 క చ,ట,త – వాప్తి. వ – ప్రాప్తి. 2 క,ట,ఎ,వ – రేటి. చ–తేటి.
3 వ–దానెబ

98ప 1 క,చ,ట త,వ,గ–కాసెడయ్యే 2 క చ,ట అ,బ,గ–మేసెటయ్యే

కం॥ కట్టని పూడగు లచ్చటఁ
గట్టిన మాడగులు సుర[1]శిఖామణిపురికిన్
[2]పెట్టని కోట సురాదిప
పట్టణమున కచటి కోట పరికింపఁగన్ 100

చ॥ విచికలగండులందుఁ దెలివెన్నెలరే లమరాద్రితోఁ గచా
కచిఁ బచరించు [1]మేడల సుఖస్థితి [2]నా రతితేసి పాడఁగా
నచటి కళానిదుల్ గరఁగు టబ్బురమే? మిహిరారసోర్మికా
నిచయమిషంబునన్ గరఁగు నింగి కళానిది వేయు
నేటికిన్ 101

మ॥ వరవై డూర్యమసారశోణమణి [1]దివ్యత్పా [ధ] పాళీ నిరం
తరకేళీకమృగాక్షులం గలఁప నాత్మంబూని యవ్వీటికిన్
దురగంబెక్కదు. కల్వతమ్మి బెడగన్ దూపుల్ మొనల్
జూప వం
చు రహిం దూళి మనోభవుండు మది గాంచున్ సిగ్గు
నాశ్చర్యమున్ 102

చ॥ తొలికలు పుట్టు రా[1]కొణిగతో జతగూడిన [2]గట్టి పుట్టు రా
తళుకు బెడంగు గూండ్ల బకదారి మిటారి [3]తుటారి పావురం
బుల రొదనేర్చి రాఁజిలుక బోద లెగాదిగ నుగ్గడింపఁగా
కిలకిలనవ్వు యౌవతము కేళిమణీమయసౌదవీధులన్ 103

---

100ప 1 గ-శిఖారతికిన్, 2, క,ట,త-పెట్టిన
101ప 1 క,ట త,ప-సౌఖ్యసుఖసం. 5 క ట,త ప-నాళతిసేసి
102ప 1. క ట,ప-దీపాళీసుఖాళీ
103ప 1 క,చ,ట,త,ప,గ-కొణిగె, 2 గ-యట్టి, 3 క,ట త,ప-మిటారి

ఉ॥ గెంటనివేడ్క నప్పురము చెంగలుల మేడలఁ గ్రీడ సల్పు వా
ల్గంటు లలందుచో[1]సతత సంచి ద్విజాదిపుఁడౌటఁ దొల్తఁ[2]జే
నంట నలందఁ బోలు సముదారతరంగమదంబుఁ గానిచో
నంటినఁ గందు నిందు సమ్మృతాంశుఁ గళంకము
చెందనేర్చునే 104

కం॥ నికట[1]రటదభ్రసింధు
ప్రకటసరోజాతజాతపంచరనిపదం
బకలంకసౌధవీధిన్
పికవాణీగానసకలశ్రుతి పఠియింపన్ 105

ఉ॥ బంధురచర్మహర్మ్యములపై విహరించు [1]నితాంతతాంతవ
ష్పందయ[2] జాలనీలకచభారల చెంపు ఘటించు దేవతా
సింధుజశాంతపంచసరసీరుహబృందమరందబిందుపా
ళింధమమందరామరపనీయము లందిలగంధవాహముల్ 106

ఉ॥ సారెకు నింద్రనీలమణి సౌధతలంబున రేలు తారకల్
తోరణగండ్ల మార్గములఁ జొచ్చి ప్రభూతకపోతపాలికల్
చేరఁగఁబోఁ కపోతములు చెంత నిజాండములంచుఁగప్పఁబోఁ
గా రమణుల్ గనుంగొని పికావికనవ్వుదు రప్పురంబునన్ 107

కం॥ మిన్నులమిన మేడల వెలి
మిన్నుల మినమిసలు పురిఁ దమిస్రలయందున్

---

104ప 1 క,ట ఎ ప-సరుల 2 గ-చె 3 గ-గంధి ఎం ఎ సమ్మృతాంశు
105ప 1 కి చ ట త,ఎ-కిట
106ప 1 గ-రతాంత 2 గ-నీల

వెన్నెలలై పాయువు
[1]వన్నెలు బింపిళ్లు గురియుఁ [2]బఱపుచునుండన్ 108

ఉ॥ మేలిమెఱుంగు మానికపు మేడలపై యపరంజికుండ లు
ద్వేలరథావరోధ మొదవించిన వాజుల సందుసందులన్
దోలెడు సూర్యసారథిఁ గనుంగొని కుండలలోన గుబ్బపొల్
దోలెడునంచు నవ్వుదురు తొయ్యలు లచ్చటఁ గేలి
[1]సేయుచున్ 109

సీ॥ తమ బ్రహ్మ[1]నామంబుఁ [2]దలపింపఁ బంకజా
తాసనస్థితిఁ దనరారువారు
తమ విప్రవరరీతిఁ దలపింప వివిధాగ
మవిహారముల చవుల్ [3]దవులువారు
తమ బాడబఖ్యాతిఁ దలపింప సుగుణ ర
త్నాకరస్ఫురణచే [4]నమరువారు
తమ యుగ్రభవభంగిఁ దలపింప సహజసం
భావనీయనిరూఢిఁ బఱఁగు వారు

తే॥ సారతరశాస్త్రగతిఁ గడతేఱువారు
[5]గిర హంకృతి నురగేంద్రుఁ గేరువారు
పూరితరనీతి గీష్పతి పేరువారు
మెఱయుదురు వీట ద్విజు లింపు మీఱువారు 110

---

108ప 1 క,చ,ట,త,ప,గ–కన్నెలు, 2 గ–గరుపుచు,
109ప 1 చ,గ–సల్పుచున్
110ప 1 గ–ఘాయంబు, 2 క,చ,ట,త,ప,గ–దలపించ 3 గ–మగులు,
4 గ–దనరు, 5 క,ట,తస,–సంజినిరయ, చ–నిర

సీ॥ విగ్రహంబందు [1]వెల్వెలఁ బోక పటుశరా
సారసంప్రాప్తికి నోరసిలక
తమమీఁద నిలనరుండు మఱెక్కడను రేక
[2]యహరీశ [3]పదయోగ మాసపడక
పరపంకజాప్త్యానుబావంబు గోరక
గోత్రనిర్వ్యథనంబు గుఱు తెఱుఁగక
మహాత్మ ఘనవ్యపాయము [4]సహింపక సదా
[5]చరణక్రమంబున జడను గొనక

తే॥ వరణి సంప్రాప్త పక్షపాతంబు వదలి
మానస మహోద్ధతాది సంబంధమెడలి
పురవరంబున నధికవిస్ఫూర్తి మెఱయు
సాద్భుత గుణంబు రాజహంసవ్రజంబు 111

కం॥ వెండియుఁ బైఁడియు నొక్కొక
కొండగ నుండుదురు గిరిశకులిశాదీశుల్
కొండల కోట్లవి తమకొక
కొండాయని నవ్వ వైశ్యకుల మువ్వేటన్ 112

కం॥ రాజితధరణీధరవి
భ్రాజితవివిధైకధాన్యరాశుల మీఁదన్
బూజని సురనదికలువలఁ
బూజింపుదు రచటి హాలికపుంగవు లెలమిన్ 113

సీ॥ చికిలి బింకపుఁజన్ను పికిలి పూ నునుఁజెండ్లఁ
బొంకమౌ మకరాంకు సంకులనఁగఁ

111సీ॥ 1 గ-వెమ్ముల 2 గ-నవార్పిం 3. క ట త ప-వతి
4 గ-సహింపగలేక. 5 గ-చరణ

బటువు నిద్దపుఁ జాయ పలు గుబ్బకాయల
కొమరుమీఱిన ప్రవాళములనంగ
సమసమున్నత కుచ స్తబకసంప్రాప్తిచేఁ
జకచక లీను వల్లికలనంగ
గురుతర స్తనయుగ్మకోరకస్ఫూర్తిచే
మినమినల్ గులుకు పద్మినులనంగ

తె॥ పరహృదయభేదనక్రియాపటిమఁ బలుకు
సోయగంబును బల్లవస్తూయమాన
వరవిలాసంబు నామోదవైభవంబు
వెలయ వెలయాండ్రు మిగుల నవ్వీటనుండ్రు 114

శా॥ పంచారించిన గుబ్బచన్నులు చలింపన్ గెంపు రాదిన్నెలన్
మించుంబోడుల గుంపుసొంపు మదిలోమించన్ దుగా బార త్రి
వంచా యిత్తిగ దచ్చి చక్కు సత చౌవంచీ పదీ తొమ్మిదీ
యంచున్ బల్లవరాజితోడ సొగటాలాడున్ బురివీధులన్ 115

సీ॥ అడిగితి విరవాది [1]నదియు కావలసిన
నరయంగఁ దగినది విరులయందు
ననవిల్తు జగడంబున రసస్థితులుఁ జూపఁ
గలదానిగా ననుఁ దలఁచికొనుము
కనుగొనఁ జొచ్చితిచ్చనుబంతు లడుగుమా
నీ మది నున్నట్ల నే నొసఁగెద
వలపున నలరు [2]బొందుల నిల్పునే యంటి
వనుభవంబున నీవె కనియెదోయి

116ప 1. క,ట,త,ప-కవియ. 2. గ-బొంతుం

నయముగాఁగ మా సుమనోగుణంబు దెలిసి
భోగవాంఛ మమ్మడుగంగఁ బూనివచ్చు
జాణలీరంచుఁ బ్రమదంబు సంఘటించు
ఏటుల కవ్వీటి పుష్పలావీజనంబు 116

ఉ॥ వలనొప్పన్ గడికొమ్ముపై యచటి మావంతుల్ పిడేనుంగు గు
న్నలపై నెక్కి నొకింతనిక్కి శశిలోనన్ గప్పు బల్మ్రి ని
ప్పలు[1]తుండింపఁగఁ [2]గానలేక యునికిన్ శాఖోపశాఖోన్నతిన్
దళమై యూడలుఁ బారి ఒుంచుకొనదే తారాది
రాణ్మండలిన్ 117

ఉ॥ ఎలసితరత్న[1]వేదులగు వీదుల నప్పురిఁ[2]జూడఁ దోడునీ
డలు [3]పురిదంతులంచెడనెడన్ బిడెముల్ గొని యంకుశాహతిన్
గలఁగని మస్తుటేనుఁగులఁ గ్రమ్మరుపం దరమే కటిస్థలీ
గళదురుదానధార తెరగాఁ బ్రతిబింబముఁ గప్పకుండినన్
118

చ॥ విడువక పిచ్చుగుంటె దిగి వెంజరువన్ జను భానుకాండముల్
కడువడి వారిదిం గడిచి గ్రక్కునఁ [1]బాఱఁగలేని కాండముల్
తడయక చివ్వునన్ శరదిదాటు సమగ్ర జవాతిరూఢిమై
నడరెడు మాకు నీడెయని యాడుఁ బురీతురగ
ప్రకాండముల్ 119

---

117ప 1 గ-దుంచ్రింపగ, 2 క చ ట,త ప గ-గాక
118ప 1 గ-సంఘటిత వెదుల 2 గ-జాతదెహించు
3 కి చ,ట త ప గ-ప్రతి
119ప 1 క ట త ప-జారగ

కం॥ అరిభయదమండలాగ్ర
స్ఫురితోదయ రదికగరిమఁ బురి యరదంబుల్
పరిభవ మొనరించు విభా
కరసమధిష్ఠితశతాంగకలితస్ఫూర్తిన్ 120

సీ॥ ఎదిరించి పైవచ్చు [1]మదపుటేనుఁగునైన
వెరవెక్కి కొమ్ములు వెరకఁగలరు
గరళకీలలు గ్రక్కు కాలసర్పమునైన
గ్రక్కున నడుగంటఁ ద్రొక్కఁగలరు
గురుసమున్నతి [2]మేరు గిరిరాజునైన ను
వ్వెత్తుగ నొకకేల నెత్తఁగలరు
హాలాహలసమానమౌ దవానలమైనఁ
బొంగుచు నలవోక మ్రింగఁగలరు

తే॥ జాగ్రదుగ్రసేనోదయోదగ్రవైరి
హరణచాతుర్యధుర్యులై యలరఁగలరు
శూరకులవర్యులగుట విస్ఫారసార
పౌరుషోద్భటు లవ్వీటి వీరభటులు 121

సీ॥ [1]పాటలాంఘ్రిపరమప్రాగ్భారకలనంబు
రంభా[2]తరూరువిజృంభణంబు
తుంగ [3]భూమిజఘనాభంగురాభ్యుదయంబు
చంచల్లతామధ్యసౌష్ఠవంబు

121ప 1 క,చ,ట,త,ప–మదము నేనుగు, గ–మదమేనుగును, 2 చ,గ–బేర్చు
122ప 1, క,ప–పాటలాంఘ్రీవర, త,ట–పాటలాంఘ్రీవరమా, గ–పాటలాంఘ్రి రమ, 2 క,ట,త,ప–తరూప 3 క,ట,త,ప–భూజఘనాను.

స్వర్ణాగపృదులకుచశ్రీవిలాసంబు
క్రముక [4]రాజగళసద్గౌరవంబు
పవ్యజపాదరోద్భవ [5]రాగవిభవంబు
మదనబాణాలోక [6]మంజిమంబు
తే॥ కుందకుసుమయదంతాళికువలపాళి
పాళితరసాలశాసనప్రకటరేఖ
దనర వనితల మరువు నపనితలపులు
[7]నరవయశ్శుబ్బ్రార్తిఁ జెన్నొందుఁ బురమునందు 122

ఉ॥ లలితంపున్ ఫలితంపుఁ గప్రపుటనంట్లన్ జిల్కపూఁదేనె చి
క్కల ద్రాక్షా విలసత్ఫలాసవములన్ [1]జొబ్బిల్లు పుప్పొళ్ళ కు
ప్పల శాలుంబడి చాలఁ జాయుకొనుచున్ బాటిల్లు తీనీటి కా
ల్వల నుక్కారు పలించు సప్పురము క్రేవన్
శాలికేదారికల్ 123

సీ॥ వెలవన్నె శాంద్ర చెందిరిక పూదుపటీల
రాలు బుక్కా దుమారములె కాని
దొరల గాపులు రాసి తొరుగు నన్నువమిన్న
రవణాల నున్న [1]వారడులె కాని
యలవోకఁ బౌలయు నొయ్యారి కత్తియల కొ
ప్పులఁ జెందు విరుల పుప్పొళ్ళెకాని
బిరుదు బాబాజాళెగురిజల జాళువా
లాలంపు [2]కెందూళి చాలెకాని

4 పి వ-రాజగలద్గౌరిధంబు ట త - రాజీగలద్గౌరిధంబు, గ-రాజిల సద్గౌరవంబు, 5 గ-నాగ 6 గ-మంజులంబు 7 గ-పుర
123వ 1 గ-జొప్పిల్లు
124వ 1 పి వ-రావడులొకాని వ-రాజమకాని ట-రావకుమెకాని, త-రారడుమెకాని, 2 క ట త,ప-కెంపూళి,

తక్కిన పరాగములు పన్నిదమునకై నఁ
గలుగ వనిశంబు నవనిశాకాంతకాంత
[3]ధట్టఘట్టితకుట్టిమ[4]స్థలకలాప
దీపితములైన యచటి [5]ఘంటాపథములు 124

కం॥ ఆ పురమున కధిపతియై
గోపాలుం డలరు దనుజకోటీవధూటీ
దీపితనయనాంజనతిమి
రాపహపటుశౌర్యసారసాప్తోదయుఁడై 125

కం॥ శరణాగతులఁ బురందర
శరణాగతులన్ [1]భరించు సమధిక దర్పా
వరణ[2]మహుల సురతరుణీ
వరణ[3]మహులఁ జేయు [4]నతఁ డవార్యస్ఫురణన్ 126

కం॥ ఆ హరికిం గలరు వరా
రోహామణులెందఱేని రుక్మిణ్యాదుల్
దేహజగన్మోహనరే
ఖాహసితామర్త్యలోక కంజాతముఖుల్ 127

ఉ॥ ఆ నలినేక్షణామణులయందుఁ బ్రసిద్ధియు వాసి వన్నెయుం
[1]బూని మురాంతకుండు దినమున్ [2]జనుమాన మొనర్ప నుండియున్
దానవభేదనస్ఫురణఁ దండ్రినిఁ [3]బోలెడు పట్టిలేమికిన్
[4]మానక రుక్మిణీసతి[5]మనంబునఁ జింతిలుచుండు నయ్యెడన్ 128

---

3 గ-మట్ట. 4 గ-మన. 5. గ- దివ్యాపథములు
126ప 1, గ-భజించు. 2 గ-వహాల. 3 గ-వహాల. 4 గ-నచట
128ప 1 క,ట,త,ప-బోని,2 గ-జనుమాన్య. 3, గ-బోలిన. 4 క-మానిని
5 క-యు మానక, త,ట,ప-మెన

సీ॥ కులుకుంజాయ కనీ దుప్రాంతపని చుంగుల్ జారఁగా దుప్పటిన్
అలవోకన్ వలెవాటువైచి హరి యొయ్యారంబుగా నొక్క నె
చ్చెలి కైదండ యొసంగ [1][హొన్ను] టరిగెల్ చేఁబూని
నెయ్యంపుఁ దొ
య్యలు లిర్వంకల రాఁగఁ జేరె నొకనాఁడా యింతి
శుద్ధాంతమున్ 129

॥ ఇవ్విధంబునఁ జేరి విశ్వవిశ్వంభరావారదొరేయుండగు రమా
విదేయుండు నిగనిగలీను సొన్నానున్న బల్గోడలకుఁ బొడవై
చిత్రంబుగా నయత్నచిత్రంబు సంఘటించు మించులఁ దుళ
కించు పలు వన్నె[1]మిన్నలఁ ఏన్నునగు నున్నతాసనంబున
నాసీనుండై యున్న సమయంబున 130

కం॥ [1]గచ్చువలె మోవి నిగ్గుల్
గ్రుచ్చి నిజాంజలి నఖాలి గోరట [2]నించన్
వచ్చి యొకతె జలకమునకు
విచ్చేయుమటంచు విన్నవించెన్ హరికిన్ 131

కం॥ వనజాక్షుఁ డపుడు మినుకుం
బెను రతనపుఁ జక్కడంపు మేలిమి జాళ్వా
[1]నును నిద్దాగద్దియ డిగెఁ
గనకాంగి యొకర్తుచేరి కైదండయిడన్ 132

129ప 1 క త వ గ—హొూబులు, చ—పోల్లు ట—హైలు
130ప. 1. క ట త వ—వెన్నెల
131ప 1. చ—గుచ్చు 2 క.ట త.వ—నిచ్చన్
132ప 1 గ—వనిమిన్నగు

కం॥ నూపురరావము [1]దురుసుం
గోపులుగొన నూడిగంపుఁ గొమ్మ మెఱుంగుల్
జూపట్టు [2]పసిఁడి ఖురుసా
పాపోసులు యాదవేంద్రు పదముల [3]దొడిగెన్ 133

కం॥ రాణించు మజ్జనపు మేల్
మాణిక్యపుటింటి కరిగి మాదవుఁడచటన్
వీణామఁ దీసి [1]దువ్వట
గోణామొక్కటి మటించి [2]కూర్చున్న తటిన్ 134

సీ॥ ఘనవేణి యొక్కతె వనజలోచనునకు
వలపు గొజ్జఁగి నీట జలకమార్చెఁ
జంద్రాస్య యొక్కతె శకటాసురారికి
వలిపె చందురుగావి వలువ యొసఁగె
రంభోరు వొకతె విశ్వంభరాభర్తకు
నొసపరి కపురంపుటొంట్లుఁ జేర్చె
లతకూన యొకతె [1]నీలఘనా[వయువు]నకు
నెత్తావి [2]విడిపూవు టెత్తులిచ్చె

తే॥ మృగవిలోచన యొకతె లక్ష్మీశ్వరునకు
సొబగు మీఱంగఁ బచ్చి కస్తూరియలఁదె
నతివ లీరీతిఁ బరిచర్య లాచరింప
నవనవంబగు శృంగార మవధరించె 135

133ప. 1. గ–సరసిన్. 2. క,ట,త,ప,గ–పసని చ–పసని. 3. గ– బెట్టెన్
134ప. 1. చ–దుపటపు, త,ప–దుపటపు, గ–దుగటము.
2. క,ట,త,ప–కూర్చున్నంతన్
135ప 1 క–హొయిలుగ నీలమేసువర్ణునకు. చ–నీలఘనావఘునునకు.
ట,ప–నీలమేఘునునకు త–నీలమేఘునకు, గ–నీలఘనాపమునునకు.
2 క,ట త ప–విడిపూవు లెసగనిచ్చె. గ–విడియంపుటెత్తులిచ్చె

కం॥ నరసఖుఁడు భుక్తిశాలకు
నరిగెన్ సరసాన్నబహువిధా[1]మిషవిలస
త్పరిపాకశాకపరిచిత
పరికరవరసౌరభంబు [2]వడివడిఁ [3]బిలువన్ 136

కం॥ [1]అచ్చపు బంగరు గద్దియఁ
దెచ్చి రమావిభున కొక సతీమణి యిడియెన్
[2]మెచ్చైన మెఱుఁగు నిగరపుఁ
బచ్చ జగాపళ్ళెమొక్క పడఁతుక వెట్టెన్ 137

తే॥ తళుకు మణికంకణంబులు గులుకరింప
భోజకన్యక వడ్డింపఁ బొలుపు మీఱ
భోజనమొనర్చె హరి భక్ష్యభోజ్యలేహ్య
చోష్యపానీయముల రుచుల్ చూఱఁగొనుచు 138

కం॥ శీతలమయూఖవదనా
నీతలసత్కనకకుంభనిర్గళితసుధా
శీతలగంధోదకములఁ
జేతులకున్ వార్చె శౌరి చెలువు దలిర్పన్ 139

సీ॥ [1]నిగరంపు మొగరాల ధగధగల్ వలపుఁ గ్రొ
మ్మొగ్గిన వాడి మిసమిసల్ ములుకు లొసఁగ
వలిగెంపు మదనచేతుల జగానిగనిగల్
విడిగెంపు చిగురాకు విల్లొసంగ

136ప. 1. క.ట.త.ప–మిత. 2, క.చ.ట.త.ప–బడివడి. గ–బడిబడి.
3. గ–బరువన్

137ప. 1. క.త.ప–నిచ్చపు. చ–నిచ్చలు; ట–ఇచ్చపు. గ–నిచ్చలపు.
2. గ–మెచ్చుగనొక రమణీమణి. పచ్చ జగారాతి మెరుగు పళ్ళెరముంచె.

140ప. 1 గ–నిగరంపు మగరాల మొగరాల ధిగధిగల్
పొలుపు కొమ్మొన వాడిములుకు లెసగ,

పులుదిండి [2]రాలోవ బుగుడ బల్ చకచకల్
నవమేఁత పెనుమ్రోఁత నారియొసఁగ
నునుఁ[3]బచ్చ బొందె కీలను తమ్మి మినమినల్
చక్కెర కవణంపు [4]జక్కినొసఁగ

తే॥ నించు సింగాణిజోదున కేడుగడయు
నైన కేళీగృహంబున హాళఁది సూర్య
పుటపుఁబఱపును గుంకుమ పూతలాడ
[5]మల్లెవిరిపాన్పుఁగల తూఁగు మంచమునను 140

కం॥ కడువేడ్కఁ జుట్టుఁగైదువు
నొడయుఁడు గూర్చున్న నొక్కయుడిగెపు నవలా
[1]మడుగు నునుజిలుఁగు పావడఁ
దడియొత్తెఁ దదీయపాదతామరసంబుల్ 141

చ॥ అపు డపరంజి కెంపురవ యందవుఁ జెక్కడపున్ బెడంగు చీ
ర్ణపుభరణిన్ మెఱుంగుమగరాబిరడల్ [1]విడఁదాల్చి చొక్కపున్
గపురపుఁదావి ఘుమ్మురనఁగా నొక గుబ్బెతమిన్నకుంజరా
దిపవరదాయికిన్ నెలవతీ యొసగెన్ వినయంబు మీఱఁగన్ 142

కం॥ కనుసన్నను [1]దత్పాళిచేఁ
గనుఁగొననగు మేలికెంపు కళుకుల జాళ్వా
నునుఁబదరము రుక్మిణి గై
కొనియెన్ గైకొనినఁ జూచి [2]కూరిమిసకియల్ 143

---

2 గ-రామోవ, 3 గ-మచ్చ బోదకీలన 4 గ-జిక్కు
5 గ-మొల్ల
141ప 1 గ-మగువ
142ప 1 గ-నెర
143ప 1 గ-తత్తరించగ, 2 గ-కూర్మిని సఖియల్

కం॥ ఒక్కతెయు నిల్వకరిగిరి
గ్రక్కున నవ్వేళ భోజకన్యామణి దా
నొక్కొక మడుపె యొసంగుచు
మక్కువ నిట్లనియె [1]దనుజమర్దనుతోడన్ 144

తే॥ సవతులందఱు ననుఁగొల్వ సవతులేక
సకలవైభవములుగల్గి సంతసిలుదుఁ
గాదవ యొకయింత లేదైనఁ గోర్కి యొకటి
గలదు విన్నపమొనరింతుఁ గంసవైరి 145

కం॥ అని వనజానన యానన
వనజంబున నానదొలఁక వచియింపఁగఁ గొం
కిన మది దెలిసి తదీప్సిత
మొనరఁగఁ గరుణించె శౌరి యుత్సాహమునన్ 146

వ॥ అంత 147

కం॥ నెలమసలె భోజతనయకు
నలసత జనియించె మేన నాంతరసరణిన్
దలకొనెఁ బోరచి కోర్కులు
విలసిల్లెన్ [1]జడిమ ఒగుల వేవిళ్లాదవెన్ 148

మ॥ పలకంబారెను మేనుఁదీవ, కుచకుంభంబుల్ మెఱుంగెక్కె, వె
గ్గలమయ్యెన్ గటిమండలంబు, బలసెన్ గౌనెంతయున్, జిట్టుముల్
దలచూపెన్, గతిమందలీల లతిమందంబయ్యె [1]నీలద్యుతుల్
వెలసెన్ జూచుకపాళి దౌహృదకళావిస్ఫూర్తిమై నింతికిన్ 149

---

144ప 1 చ.ట త.ప –మదనుని

148ప 1 గ–జడియ

149ప 1 గ–నారంతయున్

ఉ॥ ముకురకపోల గుబ్బచనుముక్కుల చక్కని [1]నిక్కినీలపుం
జకచకలాత్మ జక్కవులు చందురు విందు లటంచు నెంచి క
మ్మిక కబళించు [2]లేఁగలువమొగ్గలనిగ్గుల [3]నెగ్గలింపుచున్
వికచబిసప్రసూనగతి విస్ఫుటమయ్యె గభీరనాభియున్ 150

తే॥ మంటిపై నాసచేయు నమ్మచ్చెకంటి
యుట్టిపైవచ్చు పెనుగోప[1]మేపునంగ
శాతమన్యవమణిహారశాతకుంభ
ధగధగాయితమరకతస్థగితమగుట 151

సీ॥ గాఢోపగూహనక్రమముఁ గైకొనరామిఁ
గాంక్షమై వెడవెడ గౌఁగిలించుఁ
బురుషాయితమొనర్పఁ బొసఁగకుండుటఁజేసి
[1]యెదచక్కి నొరఁగి సమ్మదమొనర్చు
వీణానినాదము వినిపింపగాలేమి
సంచున వినిపించు నించుపాట
నొనరఁ బ్రత్యుత్థాన మొనరింప నోపమి
స్వాంతంబుననె తదాచరణ నెఱపు

తే॥ నెలమి మృద్గంధిలాధరం బిడఁగనోడి
ముద్దునునుఁదేఁట మాటలఁ బొద్దుగడుపు
గర్భవతియైన యా[2]సుధాకరనిభాస్య
విభున కెంతయు సంతోష విభవ మెసఁగ 152

---

150ఉ. 1 చి.ట–నీలిరాలపున్. 2 క.చ.ట.త.ప–వే. 3 గ.త–వెగ్గ
151ఏ 1 గ–మెపగ మెపగ
152ప 1 గ–మై చక్కి–. చ–యెద దక్కి–. 2 క.ట.ప–సంధానకరనిభాస్య.
గ–యమకర్త భార్య

కం॥ కాంతుని సంతోషముతో
నెంతయు గర్భాభివృద్ధి యెసఁగుచునుండన్
గాంతామణి వైదర్భికి
సంతసమొదవన్ బ్రసూతిసమయంబయ్యెన్ 153

కం॥ గ్రహములు నాలుగు నొక్కట
మిహిరునిఁ జేరంగఁబోని మేలగువేళన్
రహిమీఱ సుతునిఁ గనియెన్
మహిళామణి భోజకన్య మాదవ్వఁ డలరన్ 154

సీ॥ అతిమనోజ్ఞములయ్యె నప్సరోనృత్యముల్
గాంధర్వగానవైఖరులతోడ
వీనులవిందులై విలసిల్లె బుధనుతుల్
దైవతదుందుభిధ్వనులతోడ
దిగ్గుల స్వచ్ఛతఁ గాంచె జగతి నీరములెల్ల
సకలసజ్జన[1]మనోజ్ఞములతోడ
కడు మందగతిఁజెందె గంధవాహంబులు
మదదైత్యవరవిజృంభణముతోడ
తే॥ సరవిఁ గనుపట్టె సురపురీతరువిశాల
కుసుమధారాళవృష్టి, తాపసవరేణ్య
సముదయాశీర్వచోవిశేషములతోడ
శౌరి కొమరుని యనవద్యజననవేళ 155

మ॥ అవరోధాంగన లొండురం గడచి యత్యంతత్వరన్ డాయుచున్
శ్రవణానందముగాఁ దదీయశుభవార్తల్ పైపయిన్ దెల్పినన్
ధవళాంభోరుహపత్రనేత్రుఁ డల కాంతారాజి కిప్పించె స్వ
ర్ణవిభాస్వ[1]న్మణికీలితాభరణవస్త్రవ్రాతముల్ మెచ్చుగన్ 156

155ప 1, క,చ ట,త,వ-మనోజ్ఞము
156ప 1 క,చ,ట త వ-ర్ణవి

కం॥ వనజాక్షుఁ డంత వేడుక
నొనరిచెఁ బుత్రోత్సవంబు నురుతరభూషా
దనకనకాంబరమణిముఖ
వినుతాభీష్టములఁ బుడమివేల్పులు [1]దనియన్ 157

తే॥ కలువకంటులు తలయంటి నలుగువెట్టి
వలపుగోర్వెచ్చ పన్నీట జలకమార్చి
వేగఁ దడియొత్తి తెలిదమ్మి సోగరేకు
మినుకుపొత్తుల బాలకు నునిచిరంత 158

ఆ॥ [1]గర్గమౌని జాతకర్మంబు విధ్యుక్త
ముగ నొనర్ప శౌరిపుత్త్రమణికి
నరుల నడచి కువలయుం బేలఁగలఁడని
చారుచంద్రుఁ డనెడు పేరొసంగె 159

మ॥ అలఘుస్నిగ్ధపయోవ్రతస్ఫురితపూతాంగంబు సన్మేఖలా
కలనంబున్ [1]దృతముష్టిహస్తయుగమున్. గన్పట్టరాచూలిపు
ష్కలవృత్తిన్ దగుఁ బుష్కరాసురుఁ బశుం గావించి
తాఁజేయఁగాఁ
గల నిర్నిద్ర రణాధ్వరంబునకు దీక్షంబూను చందంబునన్ 160

శా॥ రాజద్రత్ననిబద్ధశుద్ధకనకప్రాసాదభాగంబులన్
జేజేరారతనంపుఁ దొట్లనిడి రాజీవారిపాణిందమ
శ్రీ జాగ్రద్వదనాః కుమారమణి' తంద్రీ' యున్న: నిద్రింపవే
జోజో' యంచును జోలఁ బాడుదురు మించుంబోండ్లు రా
చూలికిన్ 161

157ప 1 క.ట వి.ప-పొగడన్
159ప 1 ట.చ ప్రతులందు 'గర్గమౌని' పేరు లేదు 'క' ప్రతిలో 'అలరు పుత్త్రోత్సవంబైన శౌరి"-అని అస్తవ్యస్తముగా గలదు
160ప 1 చ.ట.గ-కృతి

ఉ॥ ముద్దులగుమ్మ రమ్మ యిటు ముద్దిడుమా యని దాది పల్క నే
ప్రొద్దును నవ్వు నివ్వటిలఁ ద్రొక్కఁడు మాటల నీటుఁజూపుచున్
నిద్దపుమద్దికాయల మణిద్యుతి చెక్కులఁ జిక్కటిల్లఁగా
విద్దెము సేసి రాజసుతుఁడు వేడుకఁదేల్చును దల్లిదండ్రులన్ 162

కం॥ నానాఁటికి బాల్యం బిటుఁ
బోనూకుచు యౌవనంబుఁ బొంపొందుచు రా
జానాథసూనుఁడలరెన్
నానాస్త్రసమానరూపనామెతుఁడగుచున్ 163

చ॥ చివురుకటారికాని బిరుదెంచిన యూ సరపాలబాలక
ప్రవరుని కృత్రిమజాలకవిరాజితమౌ వదనారవింద ము
త్యవిరళకాంతి మించె నవయౌవనలక్ష్మి వహించు నీలపుం
[1]బవరి చొకారపుంజికిలి బంగరు నిద్దపు టద్దమోయనన్ 164

శా॥ సాహోజియ్య పరాకు స్వామి యని సుత్సాహంబునం గంటువి
వ్యూహంబుల్ వలుకంగఁ జెంతల దిగంతోర్వీతలాధీశసం
దోహంబున్ బొడఁగాంచు వేడుకమెయిన్ ద్రోపాడ రాచూలి దా
వాహారోహణ మాచరించి వెడలున్ వాహ్యాళి [1]కేళీగతిన్ 165

చ॥ తనకు సమంబుగా నెదిరి తద్దయు నిల్చిన యెట్టి జెట్టినై
నను నెదురాని రాఁదిగిచి నవ్వుచుఁ బైకొని నొక్కి [1]రక్కొనన్
గనిసి బిగించి మాయనినఁ గెంటి భుజద్వయ మప్పళింపుచున్
జనపతి నిత్యమున్ గరిడి [2]సాధనసేయును ముబ్బులౌననన్ 166

---

164వ 1 గ-బవరి
165వ. 1 ం,ఎ త క-స్వాహ
166వ 1 క,బ,త క-రొక్కొనన్ ఎ-రొక్కొనన్ గ-నొక్కొనన్ 2. గ-సాధుము

ఉ॥ జిలుగుం జెంద్రిక దట్టిమీఁద మెఱుఁగుం జెంగావి [1][హోంబట్టు] దు
వ్వలువన్ జుంగులువాఱఁగట్టి జిగిజాళ్వా వ్రాఁత కుళ్లాయి యౌ
దల మించన్ గరిడింటినుండి వెడలున్ దైత్యారిసూనుండు విం
తలుగాఁజొక్కపుబంగరుంబరజు సానాకత్తి చేఁజిమ్ముచున్ 167

సీ॥ [1]గుజ్జరికెంపు రాగుంపు రాయిడి డాలు
జిలుఁగు రుమాలపై చిందుద్రొక్కఁ
గట్టాణియొంట్లు నిగన్నిగల్ చెక్కుల
నెలనవ్వు సిరులతోఁ జెలిమిసేయఁ
బన్నీటఁ బదనైన పై [2]గోవ కస్తూరి
నికరంపుఁదావి మైఁ బుగులుకొనఁగఁ
దొలకరి పుట్టురా మిలమిలల్ చెన్నొంద
జాళువాగొలుసు కెంగేల మెఱయ

తే॥ నుదిరి తళుకుల [3]పాపోసు లొఱపు నెఱపు
వింత వగమీఱఁగా మునివ్రేళ్ళ మెట్టి
[4]యుంటవిల్లును గపురంపు [5]టుండగములు
పట్టి రాపట్టి యుద్యానపాళి మెలఁగు 168

క॥ ఈరీతి రుక్మిణీసుతుఁ
డారూఢవయోవిలాసియై సుగుణమణీ
శ్రీ రత్నాకరుఁ డనఁదగి
శౌరికిఁ బౌరులకు ముదము సలుపుచునుండెన్ 169

---

167ప 1 క.చ.ట.త.ప.గ–లేమట్టి

168ప 1 గ–గుజరాతి. 2 గ–లప్ప. 3 గ–పావాలు. చ–వాటోసు.
4 గ–యొంటి. 5 క.చ.ట.త.ప–ఉంటగములు గ–టింటిగములు

శా॥ ఆనందవ్రజవాసగుంభిత [1]నితాంతానందవిందానుజా
ధీన స్వచ్ఛమనోరవింద మునిరాడ్బృందారకాధ్యక్షర
క్షా నిత్యోదర యత్యగణ్య [2]ఘనమాషాపుష్యమాణస్ఫుర
ద్దానాదానవిధాన భక్తికలనాదౌరేయ దాత్రీసురా 170

కం॥ ఘన దానవజీవనదా
వనదావాహార గోపవరా వరదా
వనదార్వసువర్ధన దా
వనదాప్తమతాహ్వయావృతమహోఘనదా 171

మాలిని॥ అజముఖసుర[1]గేయా హరిసౌజన్యజేయా
వ్రజయువతివిధేయా వారితామేయమాయా
విజితఖలనికాయా వేదశీర్షాభిధేయా
సజలజలదకాయా సత్యభామాసహాయా 172

గద్య॥ ఇది శ్రీ తాడిపర్తి గోపాలకృష్ణ కృపాకటాక్షవీక్షాసమాసాదిత కవితానూతనభోజ. సంస్కృతాంధ్రభాషావిశేషసారసారస్య పరిజ్ఞానచాతురీధురీణమానసాంభోజ. చెన్నమరాజకులాంభోధిరాజ. సంపూర్ణపూర్ణిమారాజ. శేషయామాత్యతనూజ. చెన్నమరాజప్రణీతంబైన చారుచంద్రోదయంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము 173

---

170ప. 1. గ-నినాదా. 2 క.ట.త:-ఘనపూషా. చ-ఎరవోషం
172ప 1 గ-దేవా

# చారుచంద్రోదయము

## ద్వితీయాశ్వాసము

కం॥ శ్రీభద్రాకుచభద్ర
శ్రీభద్రవిశాలవక్షః సితపద్మాక్షా
[1]యాభీర[2]సభార్థిత [3]తృ
ష్ణా[4]భరణసహిష్ణునందనందన కృష్ణా 1

తే॥ అవధరింపుము శౌనకాద్యఖిల[1]మౌని
[2]జనులఁ గన్గొని సూతుఁ డిట్లనుచుఁ బలుకు
నటుల నల చారుచంద్రుండు యాదవేంద్ర
హృదయహర్షదలీలల నెసఁగునపుడు 2

సీ॥ పగలు బంగరుకమ్మి బలితంపుఁ గమ్మచ్చ
దవగంధవహబంధు ధమనధమని
కలిగొట్టు విరిమొగ్గ గమిరిక్క తుదసంజ
పశ్చిమాశోజ్జ్వల [1]పవనభస్త్రి
పుడమి [2]పెన్మొదవమై [3]బెడిదంపుఁబులిగోరు
పదికయామోపరిప్రళయవార్త

---

1ప 1 క,చ,ట,త,ప–అఖిల, గ–ఆభీల 2 క, ట, త,ప–సపార్థిత, గ–సభావిత
3 క,చ,ట,తి,ప,గ–కృ 4 క,ట ప–భరణ నధిష్ణ, చ– భరణ సధిష్ణ.
గ– భస్వికృష్ణ
2ప 1 ప,ట,ర, ప–షునుల, 2 క, ట, త, ప–అరయ
3ప 1 చ,త,–ల్ప, 2 క ట,ప–వెన్మొదవు, త–మిన్మొదవు, 3 చ–జెడిగంప

చిగురుఁగై దువు రాచపొగరు నిద్దురటెంకి
ఘర్మాంబువృష్టి బేకస్వనంబు

తే॥ గండుకోయిలమూక వాకట్టుమందు
ఖగమృగాంధశ్చరాహారకాళరాత్రి
బొండు[4]మల్లియచూలాంధ్ర ప్రొద్దులనెల
గ్రీష్మ మేతెంచె లోకై కభీష్మమగుచు 3

కం॥ ఋఋుచుఋుఋు చుఋుపమనఁగా
గఋుకుంబీరెండ గాసె గాసిలె జగముల్ 4
[1]నెఱలు ధరఁ గిమ్మతెమ్మెర
విఋవిఋమనుచుం జరిగెను బెరిగెం దినముల్

మ॥ వనవిల్కాఁడను పాదుషా గినుకఁ బాంధశ్రేణిపై నా ఘజా
దనుపన్ మాధవుడన్ వజీరుఁడు నిజోద్యోగోచితస్ఫూర్తి స్యం
దనముల్ [1]మావులు గండనాగములు పున్నాగంబులున్ బూన్చి గె
ల్పునయన్ వేలము వెల్గఁజేసి [2]చను నా హెచ్చైన్ వనీదావముల్ 5

సీ॥ బలితంపుదప్పిచేఁ బరువు [1]లెత్తెడు లేళ్ళ
గములెల్ల ఘనతరంగములు గాఁగ

---

4 చ-మల్లియచూళాంధ్ర ప్రొద్దుల నెల ట త,స-
ప్రొద్దులగుచు గ-మల్లెలనినద వాహారనోవ
4ప 1, గ-నెఱలు
5ప 1 చ-చూపులు 2 క-చనెనా హేచ్చవనీదాహముల్ త-చిక్కినాశించెన్
వనీ దాహముల్ ప-చిక్కి నాశించేన్ ధనిదాహముల్
6ప 1, గ-దప్పెడి.

బంధురలీలమైఁ బైకొన్న పెంధూళి
జలముగ్రోలెడు మేఘచయము గాఁగ
ధగధగమనియెడు దవవహ్నినికరంబు
తురికి నెమ్మోము [2]పెన్నురువు గాఁగ
నక్కడక్కడ సాగి గ్రక్కునఁ బొడకట్టు
సుడిగాడ్పు లెల్లను సుళ్లుఁ గాఁగ

తే॥ నెండదండికి నెంతయు దండి సెడక
నెండమావుల కడలు నుద్దండలీల
నపుడు జగతీతలంబెల్ల నాక్రమించె
నిఖిలజనజంతువితతి గుండియలుఁ బగుల 6

ఉ॥ ఎండకుఁ దాళ [1]కీఱమి వహించిన పందిలిఁ జేరి జాళువా
గిండులఁ దీర్థమాని యెలకిన్నెరకంఠులఁ జూచి పుష్పకో
దండభుజాప్రతాపరవిఁ దార్కొని చల్లని కాయమానముల్
కాండముఁదీర్పలేక పెనుఁగాక వహించెనుబాంధసంఘముల్ 7

శ॥ ఎడనెడ బొండుమల్లెవిరు లేర్పడఁ గూర్చిన సోగలైన కీల్
జడలు నితంబబింబముల చక్కి నటింపఁగ మధ్యభాగముల్
బెడకఁగ జాళువాపసిఁడిబిందెలఁ జల్లని నీ రొసంగుచున్
బడలికఁ ద్రోచి ప్రోచిరి ప్రపాకులపాలిక లధ్వనీనులన్ 8

మ॥ వలి చన్నుం జిగికావి మోవిపసలన్ వాలారు [1]కంజూపులన్
నెలరాగిం డ్లపరంజికెంజలువ మే ల్నీలంపురాగిండ్ల చా
యలఁ జూపట్టఁ బ్రపాప్రపాలికలు [2]సారామోదకర్పూరశీ
తలపానీయముఁ గ్రోలఁజేయుదురు పాంథశ్రేణి నవ్వేసవిన్ 9

2 చ–పెనెరుంపు. గ–పెందెరము
7ప 1 క.చ ట.త.ప–కీరిమి
9ప 1 క.ట.త.ప.గ– లే. 2 క.ట.త.ప.గ– సెర చ–శీర

చ॥ అల వెడిదంపువేసవి మురారి తనూజుఁడు చారుచంద్రుఁ డు
జ్జ్వలతరగంధసారఘనసారధరాజపనీపరంపరన్
జలువ ఘటించు రైవతకశైలము కోసలలో విహారముల్
సలుపఁదలంచి వేడుక లెసంగ హజారము చేరవచ్చినన్ 10

సీ॥ విజయలక్ష్మీవాసవికసితాబ్జంబు నా
హొంబట్టు జిగితలాటంబు మెఱయ
పటువాజిరాజితప్రభవ [2]పక్షంబు నా
కపదొనల్ పార్శ్వభాగముల [2]నలర
పురుషకోద్ధతిలగ్నతరణిబింబంబు నా
నంద్రంపు బంగరు తక్షుటందె దనర
కుళితాహితవర్యకమనీయకీర్తి నా
ముఖమున ఫేనంబు మురువుఁజూప
తే॥ కెంపురవ కెంపు పార్శ్వపుటంబు మెఱుఁగు
[3]పల్లెమును దెల్లఁజల్లులు పసిఁడి మువ్వ
గవ్వదండలుఁ బూన్చి యాఁ ఘనుని యెదుటఁ
దేజి యొక్కటి సాహిణీ దెచ్చి నిలిపె 11

చ॥ అలఘుతరత్వరాకలితయై తగు నత్తురగంబు నెక్కి యు
జ్జ్వలగతి నేఁగి కాంచె నల శౌరితనూజుఁడు ప్రాంతసంచర
న్నలినసుహృత్తురంగమమనశ్రమవారినివారినిర్ఝరీ
జలలహరీమరున్నివహసాంద్రము రైవతకాచలేంద్రమున్ 12

కం॥ కనుఁగొని యగ్గిరి [1]మహిమకు
మనమున, నాశ్చర్యమూని మఱియుట చేరన్

---

11ప 1 క చ.ట.త.ప- పక్షము 2 గ- మెరయ 3 గ-పల్లమును పెల్లపసిడి
మువ్వెలువకవ్వ
13ప 1 చ.గ-గరిమ

జనువేళ ముదముఁ బొదలఁగ
జనతాదాగ్రణికి నర్మసఖుఁ డిట్లనియెన్ 13

సీ॥ శీతలానిలసముద్ధూతనానాప్రసూ
నపరాగములు వితానములు గాఁగ
ఖరఖరాంశుప్రభాదురపగాహములైన
తీఁగెజొంపములు [1]పందిరులు గాఁగ
భరితబంధురగంధపరిపూర్తిఁ గని మించు
సుమగుచ్ఛములు తోరణములు గాఁగ
మృగనాభికాస్రవన్మృగవాభిసేకముల్
కొమరొంది నల్లు నల్లుడులు గాఁగ

తే॥ చటులపాశీంద్ర[2]పాటితోత్కటమదేభ
కుంభమౌక్తికమణులు మిక్కుటము గాఁగ
వనములో దేవతలు నీకు మనతఁ జేయు
విడిఁది యనఁ బొల్చు నీ యద్రివిధముఁ గంటె 14

ఉ॥ ఈ నగమైభవంబు ధరణీశ్వర యేమని యెన్నవచ్చు నే
కోసలఁ జూచినన్ దివిజకుంజము లే చటులందుఁ జూచినన్
భూనుతః కిన్నరీజనమనోహరగానము లెందుఁజూచినన్
సూనసమగ్రసౌరభవిశోభితభూజలతావితానముల్ 15

ఉ॥ ఇక్కడి పారువంపురొద లీ [1]పొద లీ కదళీవనోత్కరం
బిక్కడి చంద్రకాంతదరు లీ తరు లీ వరులీనుసౌరభం
బిక్కడి తావి [2]దీవిమెక మీ పిక మీ శుకవాక్యవైభవం
బెక్కడ నెక్కుడై తగు మఱెక్కడ నిట్టివి లేవు భూవరా • 16

14ప 1 గ-పందిళ్ళు 2 చ-వాటికో
16ప 1 క,ట,ప-కదలీ, 2 గ-రీవి

ఉ॥ గెంటని కెంపు నింప గురిగింజల దండలు పాఱుటాకుప
య్యంటలు శాతమార్గణశరాసనముల్ గని కాక వేల్పువా
ల్గంటులఁ గూడి[1]యాడుచు మెలంగెడు కల్కి మిటారి చెంచు వా
ల్గంటుల నేర్పరించి పలుకం దరమా నృప • యీ నగంబునన్ 17

ఉ॥ చిత్తజు [1]చిక్కటాకులగు చెంచు మిటారుల చేకటారులన్
హత్తి కచాకచిం దొడరి నట్లనె మత్తకరీంద్రవైరులన్
కుత్తుకఁ గోసి తజ్జరఠపంజర[2]మస్తకమౌక్తికావళుల్
దెత్తురు ప్రాణనాదులు భళీ యన నిగ్గిరి [3]శృంగవీథులన్ 18

వ॥ మఱియు నిగ్గిరివరేణ్యం బగణ్యతారుణ్యవర్ణ్యమానతతలతా డోలికాకేళికాధురీణచారణబాలికాకటాక్షవీక్షణంబులంబరతరంగిణీ తరంగంబుల గలయం బర్వి యనూనమీనశంకనంకురింపఁ దదీయతటసముత్కటత్రిదశనిష్కుటాటవీవిటపరుూటంబులలో నటునిటు నాడి తటాలునం దుముకి కానక నకనకలొండు లకుముకులం గనుంగొని వికవిక నవ్వు నుత్తుంగశృంగ విహరమాణ గంధర్వకంబుకంధరాసందోహంబుల వలనను, పాఱుటాకుఁ జిగురుఁబయ్యెదలు పేరెదలం జెదరఁగుచ [1]శాతకుంభికుంభద్వయీశుంభద్రోచులు దళారున నెగసి యంబరాంబోజాక్షునకుఁ బీతాంబరత్వంబు మటింపఁ జెలఁగు పేఁక వింద్లెక్కిడి గుణారావంబులు దిగ్గజంబుల చెవిసోఁకఁ

---

17ప 1 క ట,ప-యొద్దిమ

18ప 1 చ-చిక్క-దేరు ఎ-చిక్క-పారు. 2 గ-మంజుల 3 త-సానుభూముల్

19ప 1 క ట,ప- శాఖలమాటునఁ బొంచి నిజాభ్యంచిత.

దిగిచి నికుంజ[2]పుంజంబుల మాటునఁ [3]బొంచి నిజాభ్యంచిత సంకుమద [4]పంకాంకితసౌరభంబున గాలివడిఁ జివుక్కన మింటికి నెగురు పొగరు దసర మేటి లేటికొదమల వెడఁద వాతి తూఁపునఁ దెగనేసి కో యని యార్చి పేర్చి తత్సమీప సంచరచ్చంద్రబింబమధ్యశంబరడింభంబునకు భయం బాపాదించు చెంచు మించుఁబోఁడుల వలనను, రమణీయమణి శిలాతలంబులఁ [5]బొంకంబగు సొంకవంబునఁ దలలంటి విశాలనిశాకరకాంతాకాంతాలవాలసలిలంబులఁ బంకిలంబులగు సమీరచలితకలితశాఖాసంఘసంఘర్షణపతత్పటీరపాదపరజఃపటలంబున నటఁ గలివెట్టి గొజ్జఁగి పూఁబొదలఁ బ్రభవించి పొదలి కదలి నిశ్చలంపుఁ బచ్చరా రతనంపుఁ దొనలు నిండి [6]వెడలఁబాఱు పన్నీరంబున మజ్జనంబై భూర్జపత్రపటంబులు కటిం గట్టి బెట్టిదంబులై పెంపొందిన మధ్యందినదినకర కరంబు[7]ఁ గరఁగి, కసటు దొఱఁగు రంగద్ఘనసారసాలమూలంబుల నంటి గసికట్టినతట్టు పునుఁగు మై నలఁది ద్రాక్షాఖర్జూర నారికేళపనసరంభాఫలంబులు మధురమధురసంబులఁబొరలించి కర్పూరతరుఫలాశద్రోణికల నించి నేదిష్ఠపరిభ్రమత్పద్మబాంధవరథసైంధవకంధరాబంధురఘంటాగణగణారావములు పూజాసమయసముచితఘంటానినాదంబులుగా వనదేవతాసమర్పణంబు సేసి భుజియించు సిద్ధసాధ్యమిథునంబులవలనను, మహనీయవాసనాపేటికలగు వనవాటికల ధళధళనీరేరుహామందమరందస్యందనసమున్నిద్రకూల[8]ద్రుమవ్రజప్రచార[9]శూరకాసారనీరపూరతీరతరంగప్రధానమరుత్కిశోర

2 త–కుంజంబు, 3 చ–జొచ్చి, 4 చ–పంకాలేప, గ–పంకాతేశ,
5 చ–టొక్కంబగు, గ–పొంకంబులగు, 6, గ–వెలి 7 గ–నికరంబుల,
8 క,చ,ట,త, ప–ముద్రుజ, గ–ద్రుజ, 9 క,చ,ట త,ప–సూర, గ–సార,

వారంబులఁ బులకితశరీరులై కదియ గమకించి తమకించినిజ వల్లభు లదిరిపాటునవలువలొలువ జ్ఞాభరంబునఁగబరీ భరంబులు వదలించి యాపాదమస్తకం బాచ్ఛాదించిసవిధ నిశ్చంచలచంచలాగర్భితనీలా భ్రభ్రమమాపాదన పాండిత్య ధురీణలై చిమ్మటిగొను తద్వల్లభులఁ గిలకిలఁ గేరు విద్యాధర వధూమణులవలనను చరణమంజీర మంజుల శింజానవిస్వ నామోదంబు నొందుచు విస్ఫుటస్ఫటికోపలంపు నెత్తమ్ము నంటిన యావకపంకాకితంబు లగు నడుగుమొత్తమ్ములు గెందమ్ములని వెనువెంట గెంటని నంటు ననంటి పఱతెంచి తెఱఁగంటి రాయంచ[illegible]కంబుల డంబు విడంబించు తమ గొప్ప కొప్పుల నిగ[illegible]ల యు[illegible]బ్బల [illegible]బ్బులని వె[illegible] [illegible] గగనంబున [illegible]యు తొలు[illegible] కలంకపుఁ బులుఁ[illegible]లఁ [illegible] ప్రతీకాశంబు ల[illegible] హాసంబులు ప్రకాశింపఁజేసి [illegible] రప్పించు ప్రౌ[illegible]కిన్నరీ నివహంబులవలనను. నభిరామంబై గజాదిపోన్నతగ్రావభాసురంబయ్యును నగజాదిపోన్నత గ్రావభాసురంబై. భంగరంగత్కేళికాసరస్ఫురితంబయ్యును నభంగరంగత్కేళికాసరస్ఫురితంబై. హరిశమండలసమాసాదిత శృంగారంబయ్యును నహరిశమండలసమాసాదితశృంగారంబై గురుమంజులతామేతంబయ్యును నగురుమంజులతాసమే తంబై కనుపట్టి యుత్తుంగసారంగసమూహంబులు నున్నిద్ర వాజిరాజవ్యూహంబులు నుత్తాలస్యందననికరంబులు నుద్భట వ్యాఘ్రము [10]సముత్కరంబులుఁ గలిగి తన దరాధిరాజత్వంబు సార్థంబుగాఁ జెన్నొందుచున్నయది [11]విలోకింపుము 19

10 చ.త గ-సముత్కటంబులు. 11 గ-విలోకనంబు శేయుము

తే॥ హరిపదనమీపసంస్థాయి యగుటఁజేసి
నారదశుకాదికద్విజనాయకాన
వరతసాంగత్యమునఁ బరిస్ఫురణఁ గాంచె
నిన్నగస్వామి యున్నతి యెన్నఁదరమె 20

కం॥ అని సఖుఁడు దెల్ప మురరిపు
తనయుఁడు తురగంబు డిగ్గి తత్కేళినగం
బనుపమగతి నెక్కి మనో
జనితానందంబు మీఱఁ జని చని యెదుటన్ 21

సీ॥ గంధర్వభామినీగానమాధురి మఱల్
గరఁగి నీరై జాలుగాఁ దొరంగి
యలరుఁదేనియసోన బలిసి గొజ్జఁగి నీటి
సెలయేళ్ళఁ గ్రేళ్ళుబ్బ దళముఁ గొనుచు
[1]మగరాల పాయ లొయ్యఁగఁ గోయు నయ్యేటి
యిరుచక్కి చొక్కమై సిరులఁ బెనఁచు
తమ్మిపుప్పొడి కప్పు లిమ్ముగా [2]నెమ్మి త
నర్చు కప్పురపుటనంటి తరుల

తే॥ నల్లుకొను కన్నె సురపొన్న మల్లె మొల్ల
జాది విరవాదు లీరీతి చాలు నెనసి
చల్లనై నితాంతలతాంత సరసవాస
నానిగుంభితం బగు నొక్క కోనఁ గనియె 22

మ॥ కని డాయం జని చారుచంద్రధరణీ[1]కాంతుండు సోపానపం
క్తిక్కి నెటిన్ బైపయి నంతటంతటను దంతెల్ తంతెలై
యున్న బల్

22 1 గ మగరాయ. 2 క,చ,ట,త,ప–నొమ్మె
23 1 గ–పాలుండు.

మొనరా చల్వల వెంబడిన్ సవిధసంభూతాతి [2]విస్ఫారపం
దనశాఖాలతికాపరంపరల యూఁతం డిగ్గి [3]మోదంబుఁగన్ 23

చ॥ ఇరుగడ దట్టమై యిరుల నీను పటీరరసాల [1]దాడిమీ
కురవకపాటలీవిటపకోటిఁ బెనంగొని మేటి చల్వ చ
ప్పరముల రీతిఁ జాలఁ గనుపట్టిన యట్టి ప్రసూనవల్లికో
త్కరములు ఘుమ్మనన్ వలఁచు దారిఁ గ్రమంబున నేఁగి
యొక్కచోన్ 24

ఉ॥ అరవిరి ముత్యపుంజల్ చిగురుటాకుల కెంపులు తేటి నీలముల్
హరువుగఁ జెక్కినట్టి యొక యందపుఁ బూఁబొద
గుమ్మటంబులో
గరసమరందబిందువులు చల్లుచుఁ జల్లని కమ్మదెమ్మెరల్
కిరిగెడు నున్న పూరజపుఁ దిన్నె పయిన్
వసియించి యున్నెడన్ 25

సీ॥ నునుబూది రవపూఁత నెనయు నెమ్మొనితో
జనవశీకర [1]విశేషకము తోడ
నిడునాగబెత్తాన ముడిగొన్న జడలతో
సలిలపూరిత కమండలువు తోడ
పులితోలి యొడ్డాణము బిగించు కౌనుతోఁ
గలితకేదారకంకణము తోడ
పేరెదఁ గనుపట్టు పెను యోగపట్టెతో
వసిత గుంబితకక్షపాల తోడ

---

2 గ-విస్తార. 3 గ-మోదంబునెన్
24ప 1 గ-వారితో
25ఁ 1 గ-మెందు దుండువున్
26ప 1 క.ట.గ-విశేషంబు. చ-విశేషముల

తే॥ శోణ పంకజ నిభనేత్ర [2]కోణరుచులఁ
గెంపు నిద్దంపురవ చెక్కడంపు సొంపుఁ
జూపు నెలజూతి కామాక్షి జోడు తోడ
నిద్ధతేజోధికుం డొక సిద్ధవిభుఁడు 26

ఉ॥ వచ్చి [1]తటాన నిల్చి యదువల్లభనందను సమ్ముఖంబునన్
మెచ్చగు జాళువా మెఱుఁగుమేని ధళాధళ లెల్లదిక్కులన్
నిచ్చలమైన వన్నియలు నింపఁగఁ బెంపగు నాలదిండితోల్
వచ్చడపున్ [2]ఝళాఝళలుఁ బర్వ మహాద్భుత
మావహిల్లఁగన్ 27

కం॥ ఈ రీతి నెదుట నిల్చిన
యా ఋషికులసార్వభౌము ననుపమమణిపీ
ఠారూఢుఁ జేసి భక్తి
శ్రీ రాజిలఁ బూజ సల్పి క్షితిపతి పల్కెన్ 28

కం॥ ఇచ్చటికి మీర లిప్పుడు
విచ్చేయుటఁ జేసి నేఁ బవిత్రుఁడనైతిన్
పిచ్చుకగుంటుపయిపయి వి
యచ్చరనది వచ్చినట్టులయ్యె మహాత్మా॰ 29

ఉ॥ అంచితభక్తి, శైలతనయాహృదయేశు భజించి. చాల మె
ప్పించి. తపఃప్రభావమున భీకరమృత్యువు బెట్టదల్చి. ని
ర్జించి. సమస్తలోకములచే నుతి గాంచి. మునీంద్రకోటిలో
మించిన. యాదిసంయములు మీరలు. మిమ్ము
నుతింప శక్యమే 30

---

2 గ—శోణ

27ప 1 గ—తటాలునందు. 2. క.ట.త.ప.గ—బెళాబెళలు

ఉ॥ ఎచ్చటినుండి మీ రెచటి కేఁగుచు నిచ్చటి కేఁగుదెంచినా
రెచ్చట మీ మహాశ్రమమహీస్థలి, మీ శుభనామ మెద్ది, మా
కచ్చెరు [1]వైనదిట్టి భవదా[2]గతికిన్ గతమేమి, యింతయున్
మచ్చికఁ దెల్పవే యనిన మౌని యదూద్వహసూతి
కిట్లనున్ 31

కం॥ జననాథ, శాంతభూషణుఁ
డను పేరు వహించి కాంచనాచలనిభమై
పెనుపొందు మానసోత్తర
ఘనభూధర మాశ్రమంబుగా వసియింతున్ 32

మ॥ అసురద్వేషికృపాకటాక్షమున దైత్యశ్రేణిచే బాధ లే
క సురానీకము మౌనిలోకము సమగ్రంబైన యానందమొం
ది సుచేతఃస్థితినుండి యిన్నిదినముల్, నేఁడేమి వాక్రువ్వఁగా
వసమే పుష్కరదైత్యు బాధలివి దుర్వార[1]ప్రతాపోదయా 33

సీ॥ [1]కలచు నొక్కొకమాటు చెలరేఁగి, త్రిషవణ
స్నానకుండము [2]లనచ్ఛములు గాఁగఁ
గెడపు నొక్కొకమాటు కెరలి యద్వరనికా
యశ్రేణి మూలతో హాని గాఁగఁ
గూల్చు నొక్కొకమాటు కుపితుఁడై యాశ్రమ
క్ష్మారుహంబులు చాపకట్టు గాఁగ
విఱుచు నొక్కొక్కమాటు విడువ కాషాఢ [3]రం,
భంబు లెల్లను సయూపములు గాఁగఁ

---

31ప 1 గ-వయ్యె. 2 గ-కృతికిం
33ప 1 గ-ప్రభావోదయా
34ప 1 క చ ట,త ప-కలయ, 2 క చ ఠ కుండలము లచ్చట నివారసుం
గ కుండలము నిచ్చలము ట,ప-కుండలము లచ్ఛములు
3 క చ,ట,త,ప గ-రా

తే॥ గొల్లలాడు నొక్కొకమాటు కుటిలవృత్తి
నవ్యసాన్నాయ్యములు. నకనకలు వడుచు
దైవతకులంబు చెల్లాచెదరులు గాఁగ
నేమి చెప్పుదు నా రాక్షసేంద్రు బాధ 34

కం॥ వెంపరలాడెడు ఏౌనిప
రంపర సొంపఱఁ బరంపరాకమునకు మున్
[1]జంపుదు పశుసమజము నని
[2]పంపించు పటాళి న[3]తఁడు ప్రతిదినము నృపా 35

తే॥ నరవర॰ పణీశయక్షకిన్నరవితాన
గరుడగంధర్వగీర్వాణ[1]నరులలోన
వరుస వానికి వెఱవని వానిఁ గాన
హరుని యాన రమామనోహరుని యాన 36

ఉ॥ రావణదైత్యసంతతి పరాక్రమశాలి. యతండు సంగర
క్ష్మా [1]విపులోగ్రశక్తి శితికంఠుఁడు వాని కొసంగె. [2]వాఁడు నా
నావిధశస్త్రవేది. కదనంబున వాని జయించువాఁడు లే
డీ వసుధన్. విరోధిధరణీశభయంకర! రాజశంకరా! 37

సీ॥ పలలాది యీ రీతి ప్రబలంగ బలభేది
బ్రహ్మపాలికిఁ బోయి ప్రణుతిఁ జేసి
రత్నపురం బాత్మరాజధానిగ [1]నిల్చి
పుష్కరుఁ డను దైత్యపుంగవుండు

---

35ప 1 గ-పంపును. 2 క,చ,ట,త,ప-పెంపెసగు. 3 గ-ఎపుడు
36ప 1 చ,త గ-వరుల
37ప 1 గ-క్షావనియుగ్ర. 2 గ-నాడు
38ప 1 గ-జేసి.

పటు²పలోద్ధతవృత్తి బాదింపఁగఁ దొడంగె
లోకముల్ హల్లకల్లోలములుగ
జన్నముల్ గబవౌట సాన్నాయ్యములు లేమి
నాదితేయులు బాడిపేదలైరి

తే॥ దీనికి నుపాయమొకటి చింతింపుఁ ³డనిన
హరిసుతుఁడు చారుచంద్రుఁ డయ్యసుర నడఁచు
నతని కెఱిఁగింపుఁ డని బ్రహ్మ యనియె ⁴నింద్రు
నింద్రుఁడును నన్ను నివున్న యెడకు ననిచె 38

కం॥ ఇది రథమొక్కటి నీకున్
ద్రిదశ ¹ముహేంద్రుండు పనిచె ²తృణతానిశిత
ప్రదరసమేతము దీనిన్
గదనంబున నెక్కి జయముఁ గైకొను మదిపా 39

తే॥ చండ¹కరమండలాగ్రతేజః ప్రభావ
²పుష్కలంబగు పుష్కర ³స్ఫురణ మడఁచి
కువలయముఁ బ్రోచితేని శూరవర నీకు
చారుచంద్రాభిదానంబు సార్థమగును 40

చ॥ అనిన దరస్మితంబు వదనాంబురుహంబునఁ జెంగలింప న
మ్మనుజవిభుండు దైత్యుఁ బరిమార్చెదఁ గూర్చెదమౌనిదేవతన్
జనుమని సంయమీంద్రహితసంయుతుఁడై రథమెక్కి యేఁగి త
ద్దనుజపురీ¹వరోపవనధారుణి ²నిల్చె మహారణోద్ధతిన్ 41

2 గ-మహోద్ధత 3 గ-మనిని 4 గ-నెపుడు.
39ప 1 గ-వరేణ్యుండు. 2 గ-ల్పటితా
40ప 1 క ట.త.ఎ-తర. 2 గ-పుష్కలంబగు. 3 క.ట.వ -ప్రభవ
41ప 1 గ-వనోప 2 క.ట.వ-నిల్వె

వ॥ అప్పు డప్పురమునందు 42

సీ॥ నముచిసూదనుఁ డంపె నందనమహిజాత
పలలతాంతమ్ము లేర్పడఁగఁ జూడు
జలజాప్తసుతుఁ డంపె మలయభూధరరాజ
గంధ సారాగరూత్కరముఁ జూడు
వారిదీశ్వరుఁ డంపె క్షీరాబ్ధిసంభూత
కమనీయ రత్నసంఘములుఁ జూడు

తే॥ విమలభోగవతీజాతకమలజాత
శీతల[1]మరందపూరంబు శేషుఁ డంపెఁ
జూడు [2]మని కంచుకుఁడు దెల్ప సుర[3]విరోధి
యర్థిఁ బేరోలగంబుండు నవసరమున 43

శా॥ పౌరుల్ బెగ్గిలి యేమివార్త లనుచున్ బైపై తనుం బల్కఁగా
ధారాళశ్రమవారి మేన నిగుడన్ దట్టంపు నిట్టూర్పుతోఁ
జారుం డొక్కఁడు చేరవచ్చి దనుజస్వామిన్ విలోకించి ర
క్షోరాజారితనూభవాగమనమున్ సూచించె సూచించినన్ 44

చ॥ పెటపెట పండ్లుగీఁటి పటుభీకర ఖడ్గము [1]సారెఁ జిమ్ముచున్
గటముల ఘర్మబిందువులు [2]గ్రందుకొనన్
జటులాక్షికోణముల్
[3]జొటజొట విస్ఫులింగముల సోనల నీనఁగ నట్టహాసము
త్కటముగఁ జేసి యాప్తులఁ బ్రధానులఁ గన్గొని
దర్పమేర్పడన్ 45

43 ప 1 గ – మయూర. 2 క ట. త. ప – మను పల్కులను. 3 గ – వరాభియాతి

45ప 1 గ – కీల. 2 గ–గ్రమ్ముకొనన్. 3 గ–బొటబొట

మ॥ అహహా [1]బాలిశమైన కుచ్చితపుమాయల్ గాని[2]కా వన్యముల్
మహిపై నన్నెదిరించి యుద్ధమొనరింపన్శక్తుఁ డౌ మానవుం
డహహా వెన్నకుఁ బండ్లుఁ జెచ్చె[4]నవుగా కా చారుచంద్రున్మహా
గ్రహవృత్తిన్ గబళింతు రాహుగతిలోకంబెల్ల మూర్ఛిల్లఁగన్ 46

కం॥ అని పలికి కన్నుదోయిన్
వెనుగెంపు [1]జనింప భ్రుకుటిభీషణముఖుఁడై
పెనుకన్ బుష్కరరాక్షసుఁ
డనికిన్ రథమెక్కి కదలె నతివేగమునన్ 47

సీ॥ దానాంబు[1]దారార్చ్యమానసింధుగజేంద్ర
ఘంటికాఘణఘణక్వణన మెసఁగ
మారుతవైరాయమాణాశ్వగళకింకి
ణీరుణంరుణమంజునినద మొదవ
పటునేమికార్భటీ [2]బాభజ్య[3]మానోగ్ర
రథకేతుపటపటారావ మొనర
నన్యోన్యఘర్షణ[4]జన్యమానభటౌఘ
తరవారిఖణిఖణీధ్వాన మమర

తే॥ నలినజాండోపరిస్థలి నానటత్ప్ర
టహపటుడమండమండమఢాంనినాద
మడర సంగ్రామకౌతుకావాప్తి నలరి
యపుడు దనుజేంద్రఘోరసైన్యములు నడచె 48

46ప 1 క, ట లి, ప–పాలిత, చ–పాదిత గ–పారిత 2 ల–రా గ–వై,
3 గ–దే 4 గ–అహహా

47ప 1 గ–వహింప

48ప 1 ం,ప–ధారాచ్యమాన చ,ట త–రారచ్యమాన గ–ధారాభ్యమాన, 2 క,చ
ట త ప గ–బంభజ్య 3 చ గ–యానాద్రి, 4, క ట త,ప గ–జంఝన్య
మాన చ–జంజన్యమాన

ఉ॥ శౌరితనూజుఁ డయ్యసురసైన్యముఁ గన్గొని దివ్యసాదనా
ధారధరాధరాహితరథం బధిరోహణ మాచరించి ది
గ్వారణకర్ణదుర్భర[1]నిగాఢధనుర్లతికోగ్రటంక్రియా
వారితధైర్యవార్యధృతివైభవుఁడై నిలిచెన్ మహోద్ధతిన్ 49

కం॥ అనఘుండు శాంతిభూషణ
మునియున్ నృపతికి సహాయముగ యోగశ్రీ
జనియింపఁజేసె గజవా
హనరథముఖ్యంబులగు మహాసైన్యములన్ 50

కం॥ ఘనసైన్యధూళి నప్పుడు
వనజాప్తుఁడుఁ బొదువఁ బడియెఁ బడి[1]నం బడు వీ
రనికాయము [2]బగలించునొ
తన తనువని కత్తళంబుఁ దాల్చె ననంగన్ 51

క॥ హలహలిక నుభయ[1]దళములు
[2]కలయుండి పోరఁదొడఁగె ఖడ్గాఖడ్గిన్
బలజనితధూళి నడఁపుచు
బలితంబై [3]రక్తనదులుఁ బ్రవహించి వెసన్ 52

మ॥ శరజాలప్రవిభిన్నమత్తకరిమస్తస్రస్తముక్తా[1]వళుల్
ధరపై [2]రాలుచుఁ జూడఁబొల్చె దివిషద్గంధేభయానాసము
త్కరముల్ తద్వరవీరపుంగవులమీఁదన్ జల్లుగాఁ జల్లు వి
స్ఫురితామర్త్యతరుప్రసూనకళికాస్తోమంబు చందంబునన్ 53

---

49 ప 1 గ-సగాధ
51 ప 1 గ-నసుబడు, 2 క,ట,త,ప-అగురించు, చ-అగరించు, గ-అగలించు
52 ప 1 క,ట,త,ప గ- బలములు, 2 గ-కలగం, 3 గ-రక్తధారలతిప్రభ
వించెన్
53 ప 1 క,చ,ట,త, ప-మణుల్, 2 గ-రాలగ

ఉ॥ రౌతును [1]బల్లముం దురగ[2]రత్నముతోడ నెలారుగాఁగ వే
శాతకృపాణిచే నడఁచి చయ్యన దాటెడువారు దంతిసం
ఘాతకఠోరదంతకరకాండము లొక్కటఁ [3]దున్మి పేరు వా
రై తెగి పోరి రుద్ధతి సురారి నరాధిపవీరు లత్తఱిన్ 54

సీ॥ ప్రళయకాలాభీలజలదరూపంబులై
శరములుఁ బిడుగులుఁ గురియువారు
కంఠీరవంబులై కహకహధ్వనులతొ
గందేభములమీఁదఁ [1]గవయువారు
వ్యాఘ్రరాజంబులై వాలంబు లల్లార్చి
తురగసంఘములపై దుముకువారు
విస్ఫులింగంబులు వినువీది రాయంగ
నెఱమంట[2]లై మీఁది కెగయువారు

తే॥ [3]వికటఝంఝూసమీరణవేష మూని
మేటితేరులు మింటికి మీటువారు
నగుచు బయదాహవ మొనర్చి రసురవరులు
మనుజసైన్యంబు నృపమౌళి వెనుక కరిగె 55

ఉ॥ మాతలిఁ జూచి యాదవకుమారకుఁ డప్పుడు తేరు వోవ ని
ర్మాతతవేగ[1]లీల నని యాగ్రహవృత్తి నిశాటుసైన్యమున్
శాతశరప్రహారములఁ జక్కులు చేసి తదీయమాయ లు
ద్యోతితశౌర్యుఁడై తొలఁగఁద్రోయఁగ నంత
నిశాచరేంద్రుఁడున్ 56

54ప 1 గ-బల్లములన్, 2 గ-రత్నమున్, 3 చ గ-హాలనేయువా
55ప 1 గ-గవియు 2 గ-వినువీధి, 3. గ-వీకి
55 ప పద్యముతో 'ప' ప్రతి సమాప్తము
56ప 1 క టం-మే నడప

కం॥ తన సైన్యం బఖిలంబును :
దనుజాంతకతనయబాణదహనార్చులలో
మునుఁగుటఁ గన్గొని డగ్గఱి
కనుఁగవ రోషారుణాగ్నికణములు దొరుగన్ 57

కం॥ ఓరీ మనుజకులాధమ •
పోరికిఁ దాఁ బెద్దసేసి పురుహూతుఁడు నిన్
బ్రేరేచి తెచ్చెఁ దొలఁగక
భూరిభుజాప్రౌఢి [1]నిల్చి పోరుము [2]నాతో 58

మ॥ అని తోడ్తోడఁగ [1]ఘోరభీషణధనుర్జ్యావల్లరీటంక్రియా
ఘన [2]ఘోషంబుల రోదసీకుహరమార్గంబెల్ల ఘూర్ణిల్లఁ ద
త్తనువున్. గేతనమున్. శతాంగమును. రథ్యవ్రాతమున్. మాతలిన్.
మునుఁగన్ వ్రేసె నిశాతమార్గణములన్ బుంఖాను పుంఖంబుఁగన్ 59

మ॥ జననాదాగ్రణి వాని నన్నిటిని శస్త్రశ్రేణిచేఁ ద్రుంచి. కాం
చనవర్మం బగలించి. మౌళితటచంచద్రత్నకోటీరమున్
దునియల్గా నొనరించి బాహుయుగమున్ దుంద్రించి వే మించి. త
ద్దనుజాగ్రేసరు మూర్ధమున్ దునిమె నుద్యద్బాణరాజంబునన్ 60

వ॥ ఆ సమయంబున 61

58వ 1 గ–మెసి, 2 గ–నాతోన్

59 వ 1 క. ట–తోర, చ. గ–రోర, త–తొద 2. గ–రావంబుల

ఉ॥ కూడిరి దైత్యరాజుఁ జెఱగొన్న సురాంగన లాత్మనాథులన్.
పాడిరి కిన్నరుల్ మణివిపంచిక లల్లన మీటి, [1]మాటుఁగా
నాడిరి దేవతాసతు లుదారతఁ దూర్యరవంబు మీఱఁగా
వాడిరి దానవుల్ ద్విజవర్యులు వీడిరి భీతి నెమ్మదిన్ 62

సీ॥ అంత నిర్జరరాజు సంతుష్టహృదయుఁడై
యేతెంచి య య్యాదవేంద్రుఁ గాంచి
చారుచంద్రనరేంద్ర! సకలలోకైకబా
ధకుఁడైన పుష్కరదైత్యుఁ ద్రుంచి
విజయంబుఁ [1]జేకొంటివి జగత్త్రిప్రియముఁ గాఁగ
నీదు శౌర్యంబు వర్ణింపఁ దరమె
యని చాల [2]వినుతించి యమలితాంబరరత్న
భూషణంబు లపారముగ నొసంగి

తే॥ కీర మొక్కటిఁ జూపి యా కీరరాజ
మంజనాకర్షణాదృశ్యమంజుకళల
వెలసియుండుఁ [1]బేరు త్రికాలవేది యండ్రు
శుభముఁ జేకూర్చు [2]నిది మది సొంపు మీఱ 63

కం॥ అని దాని నొసఁగి యచటికి
ఘను మాతలి దెచ్చినట్టి ముఖ్యరథంబున్
గని యెక్కి చనియె నింద్రుం
డనిమిషసంఘములు గొలువ నమరావతికిన్ 64

---

62 ప 1 క చ,ట,త–మిటుగా
63 ప 1 గ–గై కొంటివి జగద్ధితము 2 గ–నుతియించి
63 ప 1 గ–త్రికాల సంవేదియగుచు 2 చ–నీకిది

తే॥ శాంతభూషణముని యప్డు చారుచంద్ర
భూభుజుని శౌర్యవైభవంబునకు మెచ్చి
తన మహాశ్రమవనికిఁ దోడ్కొనుచు వచ్చి
లాలితాత్మీయయోగబలంబు కలిమి 65

కం॥ నానావస్తుసమగ్రము
గా నొక మణిమందిరంబుఁ గల్పించి యవే
శానందముగ నచట ను
ర్వీనాయక నందనునకు విందొనరించెన్ 66

వ॥ ఇవ్విధంబున నమ్మునిసంక్రందనుం డొనరించు విందునకు నానందంబు నొందుచు నమ్మణిమందిరంబున జాంబూనద వితర్దికాతలంబున సుఖాసీనుండై సునాసీరసంలబ్ద[1]సుభగ వర్ణతావిరాజమానకీరరాజంబును జీరి కరాంబోజంబునఁ గీలించి తత్కదితకథావిశేషంబు లాలించి యిట్లనియె 67

శా॥ అర్ణోరాశిపరీతభూభువనచర్యల్ నీకుఁ బ్రత్యక్షముల్
కర్ణానందములైన సత్కధలకున్ గాణాచి నీ జిహ్వ వి
స్తీర్ణాశేష[1]కళల్ కరస్థితములై చెన్నొందు నీయందు నిన్
వర్ణింపం దరమా సుధాతిరుచి[2]హేవాకీరమాకీరమా 68

కం॥ నీవు త్రికాలజ్ఞానివి
నీవలనం దెలియవలయు నిఖిలార్థంబుల్
భావించి తెల్పు మా కొక
భావిశుభం బిపుడు సరసభాషాప్రౌఢిన్ 69

---

67వ 1 క,ట–సుబలవర్ణతా, చ,త–లబ్ధవర్ణతా

68వ 1 క,ట,త–కథల్, 2 గ–హేవాణీ

చ॥ అనిన శుకంబు పల్కు మనుజాధిప! విష్ణువరప్రసాద సం
జనితపురంగచైత్ర కుచశైలపయోధర కుంజరేంద్రగా
మిని [1]కులిశాశ్మదంతగణమేచక[2]కేశ కుముద్వతీసమా
ఖ్యను జెలువొందు నొక్క నృపకన్యక నిన్ను వరించు
వేడుకన్ 70

కం॥ అన విని హరితనయుఁడు త
ద్వనితామణి విష్ణువరమువలనఁ గలుగుటన్
వినిపింపుమనినఁ గీరం
బనుపమగంభీరపణితి నతనికి ననియెన్ 71

అసమానసీలశైలసమానగందేభ
రాజకం బార్యవిరాజకంబు
ప్రాకారకత్న[1]దీప్తాకార[2]శృంగాగ్ర
గోపురం బున్నతగోపురంబు
[3]సౌధాకరగ్రావసౌధాకలితచిత్ర
కేతనం బతులనికేతనంబు
రాజహంసాలీనరాజహంసకుమార
సముదయం బశ్రాంతసముదయంబు

తే॥ సైంధవాశ్వోపమానేకసైంధవంబు
నందనవిజిత్వ[4]రారామనందనంబు
తనరు నిద్ధాత్రి రత్నకేతనపురంబు
పృథులతరవింధ్యసవిదసుశ్రీకరంబు 72

---

70. 1 చ-కులిశాయుదాశ్మగుణ త కులిశాయుదాశ్మగణ గ- పలిశాయుధాత్మ మణి, 2 చ.త-కైస్య గ-కైశ్య.

72ప 1 క ట.త-దిక్రాప్రకార, చ-దిప్రాకార, 2 చ.గ-శృంగాంత 3 గ-సౌధ కిర 4 క.చ.ట.త-రామేయ

ఉ॥ నూఱువిధంబులన్ గవిజనుల్ తమ బుద్ధిచమత్క్రియన్ [1]బురిన్
మీఱిన ఖేయసాలము లమేయము లంచిల [2]నెంతు రెంచనీ
మూఱెడు గాని, వే కమరముల్ గల చోటి కగడ్తనీటికిన్
బాఱెడు గాని లే దమరభామల చెట్టకుఁ [3]గోటకట్టకున్ 73

చ॥ గగనతరంగిణీనిబిడకాంచనపద్మపరాగసంగతిన్
దగఁ బసుపాడి మేఘమునఁ [1]దాసిక [2]దట్టముఁ గట్టి రిక్కరా
మగువల కుత్తికం ట్లిడి హిమద్యుతి నద్దముఁజూచుచున్ బెడం
గగు మణిసౌధలక్ష్మిఁ దనరారుమహోన్నతినప్పురంబునన్ 74

కం॥ ఆ పట్టణమున కధిపతి
యై పద్మాకరవసుంధరాధిపుఁ డలరున్
చాపాహిత రోపాహిత
[1]భూపాలవరాహిరాశిభుజగాశనుఁడై 75

కం॥ అతని ప్రతాపాగ్నిశిఖా
తతికిం గరఁగునని కాదె తపనీయమయా
కృతియైన యజాండంబున
కతులజలావరణశరణ మజుఁడు సృజించెన్ 76

కం॥ ఆ రాజునడుగు లాతప
వారణ చిహ్నితములయ్యె వసుధాధపకో
టీరతటీరత్నద్యుతి
ధారల పేరన్ వహించు తరుణాతపమున్ 77

---

73ప 1 క,ట త–ఘవిన్, 2 క,ట,త–నెంచ, 3 క,ట–కాటగుట్టకున్

74ప 1 క,చ,ట,త, –దాసుకి, గ–దాసికి, 2 క,ట–దక్కగ, త–దట్టుగ

75ప 1 క,చ,ట–భూపాల తరఃకిరాసి, త–భూపాహి వరఃకిరాశి, గ–భూహిపా తరఃకరాసి

ఉ॥ దండితశత్రుం[1]డవ్వివుండు ధర్మము హస్తగతం బొనర్చి యా
మండల మేలఁగా విదిత [2]మర్మ మదర్మము తద్ధరిత్రిలో
నుండఁగ నోడి కాదె దన కూరట యౌనని నిల్చె దూరపుం
గొండల కాపు లుండు రిపుకోటుల హస్తములన్ సుఖస్థితిన్ 78

సీ॥ ఓజఃప్రసాదసంయుక్తిచే రవణిల్లి
బహుళార్థసామగ్రిఁ బరిఢవిల్లి
సందివిగ్రహభేదచాతుర్య ముడివోక
పరదురా[1]క్షేపముల్ సొరఁగనీక
లోకాభివర్ణితశ్లోకసంగతిఁ గాంచి
సరసపావస్ఫూర్తిసరణి మించి
వడిఁగల్గి ప్రాసంబులెడఁ గౌశలము హెచ్చ
[3]సమితినెంతయు ధీరసమితి మెచ్చ

తే॥ సకల[4]జనములు నితఁ డెంత సుకృతి యనఁగ
ధాత్రి యేలె నితంబినీనేత్రమీన
వలన కలనాతిగణ్యలావణ్యరసశు
భాంగపద్మాకరుండు పద్మాకరుండు 79

మ॥ ఒక నాఁడా నృపలోకమౌళి విభవానూనస్థితిన్ గెంపు మా
నికపుం బోదియ తమ్మి క్రొమ్మొగడ వన్నెల్ పైరిణీ మేలుక
ట్లకుఁ జెంగావి బెడంగు రంగు వెదచల్లన్ మొల్లమౌ నీలజా
లకరోచుల్ కఱకంచునించఁదగు జాళ్వాకొల్వుకూటంబునన్ 80

---

78ప 1 గ-డౌ, 2 గ-ధర్మ
79ప 1 క చ,ట త-పేక్ష 2 క,చ ట త-పరిణ, 3 గ-సుమతి
4 గ-ఘునిసుతులి

సీ॥ కర్ణాటమేదినీకాంతావతంసంబు
వినతుఁడై కార్యములు [1]విన్నవింప
మాగదకుంభినీమండలాధిపమౌళి
పలుమాఱు కైవారములు ఘటింప
కాశ్మీరచూధవగ్రామణి నెఱతావు
లిడి కుంకుమంపుఁ బావడ యిడంగ
సింధుపార్థివమౌళి చికిలినిద్దాహురు
మంజి చెక్కడపుఁ గాళాంజిఁ బూన

తే॥ ధీరు లొకవంక నొకవంక వీరభటులు
సుకవు లొకవంక నొకవంక లికుచకుచలుఁ
గొలువ నవరత్నకీలితోజ్జ్వలమహోన్న
తాసనంబునఁ గొలువుండు నవసరమున 81

సీ॥ హంసాదిపతి గాన నానీతకమలకో
రకము నా సలిలకుండిక చెలంగ
జటి గాన నాపాదసముదంచితప్రమో
హములు నాఁ బటు జటాసమితి [1]యొనర
వనవాసి గావున ఘనకౌస్తుభప్రభా
పటలి నాఁ గాషాయపటముఁ దనర
ద్విజరాజు గావున భజియించు తారకో
త్కరము నా స్ఫటికాక్షసరము మెఱయ

తే॥ నంటుఁ బాయని తన తొంటి నంటు కతన
వేడ్క నేతెంచె నమ్మహీవిభుని కడకు

---

81ప 1 గ-వి స్తరింప
82ప 1 క.చ.ట. త-యనగ. 2 గ-లోక.

మానసాలానచిత్కకాంమానిబద్ధ
కంజదృక్కంజరుండు [3]కపింజరుండు 82

కం॥ ఆ యతి శుభసూచకమగు
నాయతి హరిణాంక రాక నతికుతుకసుధా
తోయధి మది నుప్పొంగఁగ
నా యదిపతి వినయ గౌరవాన్విత మతియై

తే॥ అతని కెదురేఁగి సాష్టాంగ మాచరించి
యర్ఘ్యపాద్యాది విధుల సం పలరఁజేసి
స్వామి నేఁడు గదా కోర్కె సఫలమయ్యె
ననుచుఁ జైదండ యిచ్చి తోడ్కొనుచు వచ్చి 84

కం॥ జిగిరా దాఁచిన నీలపు
జగరా నడియుంచు కందు చందము నొందన్
తొగరావగ రాజిల్లెడు
మగరా గద్దియను నిలిపి మౌనికి ననియెన్ 85

మ॥ అనఘస్తుత్యచరిత్ర మౌనికులతారాదీశ! మీ యాశ్రమం
బనపాయంబె? నిరంతరాయవిధులన్ యజ్ఞంబు లీడేరునే?
దనుజానీకము బాధఁ జెందక నిరాతంకంబునన్ సంతసం
బున వర్తిల్లునె యాగముల్ జపతపంబుల్ హోమముల్
నేమముల్ ? 86

ఉ॥ నావుడు పారికాంక్షి సురనాయకుఁ డన్నరనాథుఁ బల్కె నో
భూవరచంద్ర! యో సుగుణభూషణ! యో జగదేకవీర! నీ

3 క చ ట – కంకుంజరుండు త–కాపింజరుండు

భావము రక్షణాంచదనుభావము గాన మదాశ్రమంబు నొం
పొవహిలున్ మదీయుల సురావళి [1]యావళిఁ గాన
[2]రెన్నఁడున్ 87

ఉ॥ అరాళబాహుఁ డాదియౌ నిశాటకోటిఁ ద్రుంచి నీ
కరాళబాహుశక్తిఁ బ్రోవఁగాఁ గదా, క్రతుక్రియల్
నిరంతరాయవృత్తిఁ గాంచి నిర్వహించి మాదృశుల్
నిరంతరాయవృత్తిఁ బూని నిన్ను నెంతు రెంతయున్ 88

కం॥ అని మఱియు మౌని యిట్లను
ననఘుండగు రాజు సేమ మరయుట యెందున్
మునుల కుచితము గావున
నొనరఁగ నీ సేమ మరయుచుండుదు మదిపా 89

మ॥ సుపథంబై భవదీయరాజ్యము [1]సిరిన్ పొంపొందునే? ప్రేమ సిం
ధుపరీతావనిఁ గల్గు నెల్ల మహికాంతుల్ నిన్ను సేవింతురే?
యుపదాదానవిధా[2]వధానమతులై యున్నారె నీ బాంధవుల్
విపులన్ దామరతంపరైన సుజనాళిన్ [3]హేళిఁ
బోషింపుదే 90

కం॥ [1]ధర్మముఁ దప్పక కొండెము
లర్మిలి వినఁబోక ప్రజల నరయుదె నీతిన్
గర్మరనుతమతిదహరాం
తర్మహి నిల్పుదుగదా గదాధరు [2]నెపుడున్ 91

---

87ప 1 గ–హేళి, 2 గ–మొనర్తున్
90ప 1 గ–సిరుల్, 2 గ–నిధాన, 3 క,చ,ట,త,గ–హేళి
91ప 1 గ–కర్మము, 2 గ–నేవేళన్

తే॥ అనిన నా రాజమూర్ధన్యుఁ డతని కనియె
వినుఁడు [1]మి కృప నేమిట వెలితి లేదు.
వెలితి యొక యింత గలదు నేఁ దెలుపనేల.
మునికులోత్తమ [2]మీ చిత్తమునకె తెలియు 92

మ॥ అనినన్ ధ్యాననిమీలితాక్షియుగళుండై మౌని యాజాని నె
మ్మనముం గాంచి సమంచితాదరమునన్ బల్కెన్
నరేంద్రా • సుధ
ర్మనితాంతస్థితి మంతు కెక్కి బుధులన్ రక్షించు కారుణ్యవీ
క్ష నిరూఢిన్ గను నీకుఁ గల్గు టరుదా సంతాన
సౌభాగ్యముల్ 93

ఉ॥ అహిరాజశయనుఁ డుండఁగ
[1]మహికాంతుఁడ నీకు నింతమాత్రమునకుఁ గా
తహతహ యీలా గేలా?
యిహపర సౌఖ్యముల కతఁడె హేతువు గాఁడే 94

కం॥ అడుకుం గైకొని [1]పుడుకుం
[2]దొడుకు వలెన్ సిరు లొసంగు [3]దొర నీ మది తుం
దుడుకుఁ గడతేర్చి చక్కని
కొడుకుం గూఁతురు నొసంగుఁ గూరిమి ననుడున్ 95

శా॥ అయ్యా మౌనికులాధినాథ కమలాయాయిన్ పవిత్రాగ్రామణీ
శయ్యా[1]శాయి సజాదియోగి జనతాసాధ్యుండు నా విందు నే
నయ్యబ్జాక్షుని నే యుపాయమునఁ బ్రత్యక్షంబు గావింపనౌ
నియ్యర్థం బిపు డానతిచ్చి కృప నన్నీడేర్చి రక్షింపవే 96

---

92ప 1 క.ట.త-నీ. 2 క చ.ట.త.నీ
94 ప 1 చ త. గ—మహికాంత యిదెంత
95ప 1 గ-పుడుకుల్, 2 గ-దుకుకు, 3 క.చ.ట. త- దోరని
96ప 1 గ-సాది

కం॥ నా విని సిద్ధాశ్రమవ
న్యావనిఁ దప మాచరింపు మభిమత మొసఁగున్
శ్రీ వనితాపతి యనుచుఁ ద
పావని కతఁ డరిగె రాజపుంగవుఁ డనుపన్ 97

వ॥ అంత పద్మాకరమహీకాంతుండు శుద్ధాంతనిశాంతంబునకరిగి, ప్రియకాంతయగు కలభాషిణి నత్యంతసంతానాభిలాషిణిఁ గనుంగొని యిట్లనియె. 98

ఉ॥ వింటివె వాలుగంటి • కడువేడుకతో [1]జడదారి రాచ ము
క్కంటి కపింజరుండు. ననుఁ[2]గన్గొన డెందమునం దలంచి నే
డింటికి నేఁగుదెంచి మది నే ననపత్యతఁ గాంచు ఖేదముల్
గెంటని దివ్యదృష్టిఁ బరికించి యపారకృపారసోన్నతిన్ 99

కం॥ అమరనుతంబగు సిద్ధా
శ్రమభూమిన్ గౌశికీతరంగిణి చెంతన్
గమలాక్షుఁ గూర్చి నిష్ఠన్
సమధికతప మాచరింపు సంతతి యొదవున్ 100

కం॥ చింతింపకు మని యమ్ముని
యంతఁ దపోవనికి నరిగె నాశ్రితజనతా
సంతానము హరి యొసఁగెడు
సంతానము మనకు నిఁక విచారం బేలా 101

సీ॥ వెలఁదివెన్నెల దార తళుకు దీవి బిడార
మేలువాఁ డల లచ్చి మేలువాఁడు
పొలదిండి బలుతెంపముల పెంపు [1]దలఁగింపఁ,
జాలువాఁ డడుగుపెం జాలువాఁడు

99వ 1 క, ట-జపదారి, 2 గ-గన్గొని

చిలువరా తెలిగూటి కలరు పుల్గుల మేటి
దాలువాఁ డెడఁ గెంపు దాలువాఁడు
వెలుఁగు రెంజిగి [2]పెట్టు గలుగు [3]రే మొనచుట్టు
వాలువాఁ డెపలేని వాలువాఁడు
తే॥ చె ఁగి [4]గిలకొట్టు ఒుప్నెట మెలఁగువాఁడు
చెలువమ్ముఁప జాఒవావన్నె వలువవాఁడు
ననుచు వేడుక నందఱ మనుచు వాఁడు
వెన్నుఁ డరయంగ పున యిలవేల్పు గాఁడె 102

కం॥ అటు గావున ఘన ఘఘటన
ఘటనాపాటవసనాదుఁ గపులానాదున్
జటిచోదితగతిఁ గొల్వక
కుటిలాలక మన ఒునంబు కొరిక లగునే 103

ఉ॥ ఎల్లి యవశ్యమున్ వనికి నేఁగి మహోగ్రతపం బొనర్చి సం
పల్లలనామనోహరు కృపన్ వరలాభముఁ గాంచివత్తు నీ
యుల్లమునన్ బ్రమోదము సముల్లసితంబుఁగ నిండు నిల్వమో
పల్లవపాణి యంచుఁ బ్రియభాషల భూవిభుఁ డాదరించినన్ 104

కం॥ కలభాషిణి యపుడు సమా
కులభాషిణి యగుచుఁ బలుకఁ గొంకిన ధరణీ
తలనాధవతంసం బా
యెలనాగ తలంపెఱింగి యిట్లని పలికెన్ 105

---

102ప 1 క ట, చ-డలగింప, గ-దుళకింప 2 చ, త-తొట్టు గ - దొట్టు,
3 క చ ట,త, గ-పె 4 చ-గిలిగొట్టు

సీ॥ తేనియల్ గురియు వీణానినాదము గాదు
చటులఝిల్లీరావపటలి గాని
ఘుగఘుగల్ దులకించు నగురు ధూపము గాదు
[1]రగులుకొన్న [2]దవంబు పొగలు గాని
[3]మురిపెమ్ము నెఱపు పెంపుడు మెకంబులు గావు.
శరభశార్దూలకేసరులు గాని
చెలువంబుఁ జిలుకు రా చిలుక బోదలు గావు
గండభేరుండసంఘములు గాని

తే॥ కేళివనపాళి గాదు కరాళకంట
కాళిభీకరమైన కాఱడవి గాని
విఘువు ఘూర్ణక నీకు నీ గొడవ [4]వలదు
సకియః యదియునుఁగాక యింకొకటి గలదు 106

చ॥ *జడలును నారచీరలను [1]జింక మృగాజిన మూని మౌనినై
యడవికిఁ బోఁ గడంగి లలితాంగిః నినుం గవగూడి చన్నచోఁ
దడయక మాయదారి జడదారి యితండని యుండనీక నా
నడవడిఁ జూచి కేలిఁగొని నవ్వుదు రవ్వనిమౌనిపుంగవుల్ 107

కం॥ అన విని తొంగలి ఱెప్పల
నునుసిగ్గు దొలంకఁగాఁ గనుంగొని దీనా
ననయై వినయైకోక్తుల
జననాయకతిలకమునకు [1]సఖి యిట్లనియెన్ 108

---

106 ప 1 క.చ.ట.త.-రవలు, గ-రవులు, 2 గ-తపంబు, 3 క.చ.ట.
త-మురిపెంపు, గ-మురిపెంబు, 4 గ-యేల

* ఈ 107 వ పద్యము మొదలు 113 వ పద్యము వరకు క.ట. ప్రతులందు
లేదు 'చ', 'త', 'గ' - ప్రతులందు గలదు

107వ 1 చ-జింక

108 ప 1 త-సతి

కం॥ అలరున వలపునఁ జలమునఁ
జలువయు రతనమున మినుకు జాబిల్లిని వె
న్నెలయు బలెఁ గలసిమెలసిన
మెలఁతను ననుఁ బాయు నాయమే నీ కనఘా॥ 109

సీ॥ దినదినంబు నరుంధతీసువాసినిఁ గూడి
నిష్ఠఁ గైకొనఁడే వశిష్ఠమౌని
యహరహంబును నహల్యాసహాయతఁ గాంచి
ఖ్యాతిఁ గన్పట్టఁడే గౌతముండు
ప్రతిదివసంబు లోపాముద్ర నెడయక
మనత వర్తిల్లఁడే కలశసూతి
యనువాసరంబును ననసూయఁ బాయక
పెనుపొందఁడే యత్రి[1]మునివరుండు

తే॥ మహిత చారిత్రు లమ్మహామహులఁ దలఁపఁ
దక్కిన తపోధనుల కన్నఁ దక్కువైరె
కటకటా॥ నీవు నా మీద కరుణ లేక
[2]యానతిచ్చిన నే మనుదాన నదిప 110

వ॥ అని వనిత వనంబునకుఁ దానునుం గదలి వచ్చెద ననుచు
మనంబు గనంబడఁ బలికిన 111

పం॥ మిటారి పల్కు లాలకించి మేదినీ విభుండనుం
గటాకటా॥ యిటాడనేల కాంత॥ యెంత వెఱ్ఱివే?
నిటాలనేత్ర పద్మగర్భ నిర్జరాది పూజ్యులౌ

---

110 ప 1 గ-పుంగవుండు, 2 చ,త, గ-నాన

ఘటాఘటీలు వారు వారిఁ గా దనంగ శక్యమే 112

ఆ॥ పడతి యెల్లప్రొద్దుఁ బుడమి రా జవరాంధ్ర
గములు గూడి యూడిగములు సేయ
నటనఁ గాంచు నీకు నటవీవిహారంబు
తరము గాదు సులభతరము గాదు 113

ఆ॥ అనుచుఁ బెక్కుగతుల నోఁ గా దనక యుండ
నుచితవాక్యసరణి నొప్పఁ జెప్పి
నేర్పు బెరసి భర్త నెయ్యంబు దళుకొత్త
చెలువ నచటనుంచి చెలువుఁ గాంచి 114

ఉ॥ అంతిపురంబు వెల్వడి మహావనికాగమనాభిలాష భూ
కాంతశిఖావతంసము జగా గుజరాతి మెఱుంగుఁ గెంపురా
సంతన గల్గుటాకుల హజారమునన్ గొలువుండి శాత్రవా
రుంతుదనీతి నూతనగురున్ సచివాగ్రసరున్ గళాధరున్ 115

ఉ॥ కట్టికవారిఁ బంచి సముఖంబునకుం బిలిపించి వేడ్కమై
నిట్టు లనున్ గళాధరన్॰ సమిద్ధకళాధర॰ పౌరకోటికిన్
గిట్టిగ నీవు నా యటులఁ గావున నే నిటు వచ్చునంతకున్
బట్టణమున్ సునీతిఁ బరిపాలన నీ వొనరింపు పెంపునన్ 116

ఆ॥ అనుచు ననుచు వేడ్క నఖిలసామ్రాజ్యాధి
పత్య మొసఁగి పురి నమాత్యు నుంచి
పౌరజనుల నాప్తబంధుల రావించి
కరుణ నాదరించి గరిమ మించి 117

కం॥ వార్తామాత్రపలాయిత
దూర్తారి యతండు మతిఁ గుతూహల మొదవన్
గార్తాంతిక[1]నిర్ణీతము
హూర్తంబునఁ గదలి చనియె నుగ్రాటవికిన్ 118

కం॥ చనియ[1]జ్జనపతి మజ్జ
జ్జనతాఘనతాపచక్రచక్రాంగఘన
స్తనితజనిన్ బనితవనిన్
వినతమునిన్ గౌశికీధునిన్ గనుఁగొనియెన్ 119

సీ॥ దరిదొట్టి కనుపట్టు విరిదమ్మి [1]తెట్టువల్
కాషాయవస్త్రమనీషఁ గొలువ
మించు[2]దిబ్బల విశ్రమించు నంచలపట్టు
[3]స్ఫటికాంబుకుండికాభ్రాంతిఁ [4]దెలుప
[5]వెలిదమ్మి వలగొన్న బలు తుమ్మెదల బారు
పద్మాక్షమాలికాభ్రమ ఘటింప
నీరింకు నెడల [6]నెండిన నాచు జొంపంబు
కృష్ణాజినాశంకఁ గీలుకొలుపఁ
జేరి చేకొనఁ బఱతెంచు పారికాంక్షి
పట్టభద్రులఁ గని పకాపకను నవ్వు
నా తరంగిణీ లహరికాఘాతజాత
నూతనఘుమంఘుమారావకైతవమున 120

---

118ప 1 గ–నీనేత
119ప 1 గ–నరపతి
120ప 1 గ–దొట్టువల్, 2 క ట–దీవల, త–దీబం, గ–దీవుం, 3 గ – స్ఫటికంబగు 4 క చ,ట గ– బెనుప, 5 గ–తెలిదమ్మి, 6 గ–నిండిన

కం॥ [1]లోకానీకమహౌఘని
రాకరణధురీణతానిరంతరకీర్తిన్
శ్రీకలితపేనయుతమగు
నా కౌశికిఁ గదిసి యతఁడు హర్షితమతియై 121

సీ॥ సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసె నే మునిభర్త
పటుశక్తి నింద్రుతోఁ బ్రతిఘటించి
జన్నంపుఁ బసియైన జటిసూను నే మౌని
పతి గాచెఁ గ్రతుపూర్తి ఫలమొసంగి
మాలిన్య మెడలించి [1]మఖము సేయించె నే
సంయమీశ్వరుఁడు త్రిశంకునృపుని
శ్రీరామభద్రదేశికుఁ డయ్యె నే [2]మౌని
దివ్యాస్త్రమంత్రోపదేశకలన

తే॥ నట్టి జడదారి జగజెట్టి యనుఁగుఁదోడు
ముక్తిరమ జోడు చిరసౌఖ్యములకు వీడు
మేటి మున్నీటి బోటి యీ యేటి చెలువ
చెలువ మలవియె పొగడఁ బ్రాఁజిలువకైన 122

కం॥ ఇన్నది కెనయగు నది నే
విన్నది [1]కన్నదియు లేదు వివరింపంగా
విన్నదియును దమ్ములు చెలి
గన్నదియును వీని కెన జగన్నుతమహిమన్ 123

---

121 ప 1 త–లోకాలోక, గ–లోకానేక

122 ప 1 త–సుఖము, గ–మఘము, 2 క,చ,ట, త–యతి

123ప 1 క, ట– కన్నయది

వ॥ అని యనేకప్రకారంబుల నయ్యేటి నభినుతించి 124

మ॥ "హర పాపాని మమాఖిలానిచ తపస్యా సిద్ధమంత్రాశ్రమే
కురు మే కౌశికి కౌశికాది సుమనః కోటిస్తుతే త్వాం భజే
శరధిద్యోయుజ్ఞ ఖాంబుజే"యని నమస్కారంబుగావింపుచున్
నిరతిన్ దత్తటినిన్ వినిర్మలమనోనిష్ఠన్ గృతస్నానుఁడై 125

కం॥ జటలు ధరియించి వల్కల
పటముం గటిఁ గట్టి మిగుల భాసిలె నృపదూ
ర్జటి వైరించనవరసం
మటితజటి[1]తఁ గాంచి మించు కౌశికుఁ డనఁగన్ 126

వ॥ ఇట్లు మునివేషంబు దరియించి ముందట 127

సీ॥ చిలుక బోదలఁ జేరఁబిలిచి వేదార్థంబు
సరహస్యముగఁ దెల్పు సాళువములు
కోడె[1]నాగుల గూర్చి కూర్మితో నుపనిష
త్పటలి వక్కాణించు బర్హిణములు
నెలుక[2]పిల్లలకు బుద్ధులుసెప్పి యోగంబు
సాంగంబుఁగా నేర్పు ముంగిసలును
సింగంపుఁ గొదమల చెక్కిళ్లు వడివెట్టి
సాంఖ్యంబుఁ జదివించు శరభములును
తే॥ గలిగి యలిగీతి[కా]హేతుకలితతిలక
వికచలికుచపరిస్ఫుటముకుళవకుళ

---

126ప 1 గ-వహించి

128ప 1 క,చ ట అ-నాగువుంకు, 2 త-పిల్లులకు

పరమపరిమళకేళికాభవనపవన
విశ్రమగతశ్రమమగు సిద్ధాశ్రమంబు 128

ఉ॥ కన్నుల పండువై యలరఁగాఁ దిలకించి యనూనమోదసం
పన్నమనస్కుఁడై నృపతిబాస్కరుఁ డచ్చటి సంయమిచ్ఛటా
చ్ఛన్న తపఃప్రభావములు సన్నుత భక్తిమతిన్ నుతించి త
త్సన్నిధి యానతాంగణవసన్నిదిఁ[1]జేరి కృతప్రణాముఁడై 129

ఉ॥ ఓ ఋషిచంద్రులార! సుగుణోజ్జ్వలులార! యపత్యకాంక్షమై
సారసనేత్రు భక్తసురసాలముఁ గూర్చి తపం బొనర్పఁగాఁ
జేరితి వాంఛితార్థములు [1]చేకురఁ జేయు భవన్నివాసకాం
తారము మీ రనుజ్ఞ యిడి నన్నుఁ గృతార్థు నొనర్చి
ప్రోవరే 130

మ॥ అనినన్ సంయమిచక్రవర్తులు నృపాలాగ్రేసరుం గాంచి యో
మనుజాధీశ్వర! భక్తవత్సలుఁడు పద్మాభామినీభర్త నీ
కొనగూర్చున్ గృపఁ గామితార్థము మహాయోగీంద్రు
లశ్రాంతమున్
వినుతింపన్ దప మాచరింపు మిచటన్ నిష్ఠాగరిష్ఠుండవై 131

కం॥ మును మీ మాతామహుఁ డీ
వ్వనిఁ దప మొనరించి గాదె వైదర్భమహీ
జనపతి రిపుహృతధరఁ గై
కొనియెన్ మనియెన్ జగన్నికుంభితకీర్తిన్ 132

129ప 1 క. ట-కేగి, త-కేః
130 ప 1 గ-జేకొన

సీ॥ పరికింపు మిచ్చోటు బ్రహ్మర్షి భావంబు
గాధేయుఁ డజునిచేఁ [1]గనిన చోటు
తిలకింపు మిచ్చోటు దివిజసామ్రాజ్యంబు
గోత్రారి మగుడఁ గై కొనిన చోటు
దర్శింపు మిచ్చోటు తతనిష్ఠ రతిదేవి
మగనిఁ గ్రమ్మఱఁ గూడి మనిన చోటు
వీక్షింపు మిచ్చోటు వేవెల్గుదొరజోడు
తన తనూరుజ వీడుకొనిన చోటు

తే॥ మనుజనాయక యిన్నిఁ [2]జెప్పఁగ నేల
యివ్వనంబున నెవ్వ రేమేమి గోరి
తప మొనర్చిన సిద్ధించుఁ దత్ఫలంబు
గావున ఘటించు నిచట నీ కాంక్షితంబు 133

చ॥ అనుడు మహాప్రసాదమని యయ్యనవద్యమునీంద్రకోటిచే
ననుమతుఁడై పునఃప్రణతు లాయతభక్తిఁ దలిర్పఁజేసి ని
ర్జనమగునొక్కచొక్కమగు చక్కి వసించి[1]సునిశ్చలాత్ముఁడై
యనుపమయోగలీల [2]దహరాంబుజపీఠి హరిన్
[3]భజింపుచున్ 134

కం॥ నృపసంయమి యష్టాక్షరి
జపియింపుచు నచ్యుతాంఘ్రిసంగతమతితో
నుపరతనిఖిలేంద్రియుఁడై
తప మొనరించెన్ దపస్వితతి నుతియింపన్ 135

---

133వ 1 గ-గన్న, 2 గ-గై కొనంగ
134వ 1 చ త-సునిశ్చితాత్మడై 2 గ-హృదయ, 3 గ-దలంపుచున్

సీ॥ జటి యౌటనో సముత్కటజటా[1]సంఘాత
కృతనీడములఁ బక్షివితతిఁ జేసె
శమి గావుననొ ఘనజ్వాలికామాలికా
ఖీలమై తల చిచ్చు పెచ్చు విరిగె
కలితకుండలియైన కతననో తను[2]వల్లి
వితతవల్మీకసంగతిఁ [3]దనరెచ్చె
జగతీవరస్థాణు వగుటనో చాంచల్య
రహిత[4]భావోన్నతి రహిఁ వహించె

తే॥ ననుచు ననిశంబు నిచ్చ సన్మునులు మెచ్చ
యమనియమముఖ్యవిఖ్యాతి నదిగమించి
శమ[5]దమస్ఫూర్తి మించి రాజన్యమౌళి
యుగ్రతప మిట్లు గావింపుచున్న [6]యంత 136

సీ॥ నవశిరీషలతాంతనివహసౌరభజాల
మాసరం బతిదీర్ఘవాసరంబు
ప్రాలేయసంఘాతభద్రసింధురఘటా
పాకలం బతిగర్వితైకలంబు
తరుణీకుచద్వయద్వయసాంబునీరేరు
హాకరం బాతపభీకరంబు
గజరాజగామినీఘనపయోధరభాగ
శీతలం బతితప్తభూతలంబు

తే॥ పాటలీఝాటలీనాంశుపాటలోగ్ర
హేతిసంఘాతఘన[1]వనీవీతిహోత్ర

---

136వ 1 క–సంఘట, చ–సంఖాత, ట – నంఘాట, 2. చ–వెల్లి, త–వెల్లి
3 క, ట–యొనరెచ్చె, 4 త–భాగోన్నతి, 5 క–హిత, 6 గ–వేళ

137వ 1 గ–దవ

ధూమసమధామకోచ్చ్చల ధూళిచయము
గ్రీష్మ మేతెంచె నతిభీషణోష్మమగుచు 137

ఉ॥ నాలుగు దిక్కులం గనకనద్ద్యుతిహేతులు మింట నంటఁగాఁ
గ్రాలుచునున్న వహ్ని లమరన్ నయనద్వయ
పా॥గ[1]దీప్తిమై
గీలుకొనంగఁ జేసి నృపకేసరి సేసెఁ దపంబు తన్మహా
భీలనిదాఘవేళ శిలఁ బేర్కొనఁ జెక్కిన బొమ్మకైవడిన్ 138

వ॥ తదనంతరంబ 139

సీ॥ ఆలోకనీయ శంపాలతాజాలాతి
రోహితంబు నిరూఢరోహితంబు
చాతకజీవాతుజలబిందులలితావ
నీరజంబు నిరస్తనీరజంబు
నైచికీసంఘాతనవపయఃపరితుష్ట
గోపకంబు దితేంద్రగోపకంబు
ధారాధరాచటాంతర్భూతశీతపా
దారుణంబు వియోగదారుణంబు

తే॥ పఱఁగె బంధురకేతకీప్రసవగంధ
వాసితంబు మయూర[1][కా] వాసితంబు
కలితమకరందబృందతుందిలమిళింద
రాగనీపాగమంబు వర్షాగమంబు 140

---

138ప 1 గ-దీప్తమై
140ప 1 చ,త- రా గ-ర

ఉ॥ తోరపు వేడుకన్ బొదలె, దోయజసంతతి యుక్తిఁ జంద్రికా
హారము లేకయుండియు నహర్నిశముం బరిరంభసంభ్రమో
దారవధూమధూపమసుధామధురాధర సింధుపూరమున్
గోరికె మీఱఁ గ్రోలుచుఁ జకోరక[1]పంక్తులు సంతసిల్లఁగన్ 141

శా॥ నానాఁటన్ [1]దరదాదిగా బడలి డెందం బంబుదధ్వాన శం
పానీకంబులు విన్నఁ గన్నఁ బ్రమదం బందన్[2]గ్రమోద్వాసిత
గ్లానిన్ నైజజలంబు చాతకపుమూకల్ చల్లఁ గ్రోలన్ దదీ
యానందాశ్రుకణాళి తొల్చినుకులా నంభోధరశ్రేణికిన్ 142

చ॥ అలరఁ బయోధరాటనము హంసకముల్ గదలంగ. వేణికో
చ్చలనము మించఁ గంకణపుసందడి హెచ్చఁగ. రోదసీవధూ
తిలకము వారిదాయనపతిన్ రతిఁ బైకొని క్రీడ సల్పఁగా
జలజల [1]రాలు హారమణిసంతతి నాఁ గరకాళి భాసిలెన్ 143

కం॥ తళు తళుకు తళుకు మనఁగాఁ
దొలి మించులు మించ నంచ తొలఁగెన్ మలఁగెన్
[1]జలముల యుబ్బుల మబ్బులు
ఫెళపెళమని యుఱిమె జల్లు పెల్లునఁ గురిసెన్ 144

సీ॥ ననబోడి నిడువాలు కనుడాలు సరిఁబోలు
తొగగుంపు జిగి పెంపు దొలఁగఁజేసె

---

141ప 1 చ.ట.త. గ–వారక మద్దినంబులన్.
142ప 1 గ–శర, 2 గ–ప్రమో
143ప గ–రాల
144ప 1 క.ట. త–జలజలములుబ్బు

నవచంచలాంగి రే నడు మెంచు మెలయించి
`ంచపోదల గంచు మించఁజేసె
కోడెగుబ్బెత మోపు తోడు [1]నీడనఁ గవాడు
హరిణాంకు జలధ [2]రాంతరితుఁ జేసె
లతకూన కటితటోన్నతి తీరుఁ గని మిఱు
పులినవైఖరి నీటఁ [3]గలయఁజేసె

తే॥ నకట ప్రాణేశ్వరీ జ్ఞాపనానురూప
వస్తువీక్షాసుఖంబు దైవంబు కంటి
కింత ప్రేఁగయ్యనే యని వంతనొందె
ప్రావృడాగమపరిపాటి పాంథకోటి 145

చ॥ పనివడి నాదుఁ గానక, తపఃస్ఫురణన్ గృశియించు నిమ్నగా
వనరుహపత్రనేత్రలఁ, బ్రవాహసమేతులఁ జేసి మేఘుఁడ
వ్వనని దిఁ గూర్చె జీవనము వారక మించె నటంచు నెచ్చటన్
[1]ఘనునకుఁజేసినట్టి యుపకారము మిన్నక పోవనేర్చునే 146

చ॥ [1]తిరుపులు గట్టి క్రొందళుకు తీరగు తీవమెఱుంగుబోణి యం
బరమునఁ గాలమార్దళికమౌళి ఘనాఘనమర్దళంబు వే
మొరయఁగఁ జేయఁ దత్కుచసముజ్జ్వలనూతనహారమౌక్తికో
త్కరములు రాలినట్లు కరకల్ దరమీఁదనురాలె నెల్లెడన్ 147

145ప 1 గ-నీడగజేయు, 2 గ-రాంకులితు 3 గ-మునగ
146వ. 1 చ,గ-ఘనులకు
147ప. 1. గ-తెరు.

సీ॥ నటదర్జునాపాంగపటలవిస్ఫుటపింఛ
రింఛోళికారుచిశ్రేణు లనఁగ
నవచపలా[1]జాలన ర్తకీకరపద్మ
లాలితరత్నశలాక లనఁగ
ఘనఘనాఘనమహాగంధసింధురవర
శ్రీకరవరభ క్తిరేఖ లనఁగ
ప్రావృ[2]డాగమమహీపాలకులాదిశ
బంధురకేతనప ఙ్క్తు లనఁగఁ

తె॥ జదలు కల్మిపడంతి పార్శ్వములఁ [3]బొల్చు
నిడుద నెఱిమించు వన్నెపావడ లనంగ
సకలజనులకు లోచనోత్సవము లగుచు
వఱలు నప్పుడు రోహితావళులు మింట 148

సీ॥ కాదంబవితతియుఁ గాదంబవితతియుఁ
బరువును మురువుముఁ బరిచయింప
వనశిఖిజాతంబు వనశిఖిజాతంబు
జయమును లయమును సరవినొంద
హ్రాదినీకాండంబు హ్రాదినీకాండంబు
కలిమియు బలిమియు గలిగి చెలఁగ
నర్జునపాళియు నర్జునపాళియు
పసిమియు రసిమియు నెసఁగి పొసఁగ

తే॥ నీపములును బలాకాకలాపములును
బ్రసవముఁ బ్రసవమును గాంచి పరిఢవిల్లఁ

148వ 1 గ-తత. 2 గ-షా. 3 గ-మొదలు

దనరె [1]నంతంతఁ బాంధులఁ దరిమి పోరు
సూనశరు మేటి దుముదారు వానకారు 149

ఆ॥ పార్థివోత్తముండు పద్మాసనస్థుఁడై
[1]యట్టి వర్షవేళ బట్టబయట
గురుతపంబొనర్చె గోవర్ధనోద్ధారిఁ
బరమపురుషు మదిని బదిలపఱచి 150

వ॥ అంత 151

సీ॥ బంధూకఘనవిభాప్రభవసంధ్యాశయు
శ్లథవధూపరిరంభచక్రకంబు
పునరుద్యదంబుదధ్వనిబుద్ధదమదేభ
ఘీంకృతిశ్రుతినటత్కేకికులము
కాశప్రభాడంబకౌముదీపానసం
భ్రమకుహూచరచకోరవ్రజంబు
మణిధనుఃకలితాభ్రమతిక్రుత్సుమచ్ఛద
చ్ఛవి[1]శారదాయాతచాతకంబు

తే॥ వికచకమలపుటీరజోన్వితకర్ణి
కాభ్రమప్రదషట్పదగ్రాహిరభస
చలిత[2]సన్ముఖసందష్టచంచుచకిత
మదమరాళంబు శరదాగమంబు దనరె 152

149ప 1 గ-నెంతెంత
150ప 1 గ-యిట్టి
152ప 1 త-శార. 2 చ,త-తన్ముఖ

సీ॥ పతితారుణిమపాత్రబంధూకసుమపత్ర
సముదాయ మింద్రగోపములు గాఁగఁ
బంకజమకరందపానమత్తమిళింద
ఝుంకృతుల్ గర్జితస్వనము గాఁగ
* శారదప్రతివార[1]సందర్భకర్పూర
ఖండముల్ వడగండ్లు మెండు గాఁగఁ
గరటిచ్ఛటాసూన[2]కటనిర్గళద్దా
పూరంబు వర్షాంబుధార గాఁగఁ
తే॥ బ్రావృడాగమభూమికాపటిమఁ బూని
నటన మొనరించు నల శరన్నర్తకునకు
వలపు దొరయించు చలువల పొలుపుఁ దెలిపెఁ
గాశవనదీప్తు లాశావకాశములను 153

సీ॥ నిదుర మేల్కొను శౌరి పదముఁ జేరెడి వేల్పు
గముల వజ్రపు విమానము లనంగఁ
గమ్మఁ దెమ్మెర పైకిఁ జిమ్మ నాకసమంటి
విప్పైన కవురంపు లప్ప లనఁగఁ
గలక దీఱిన తమ్మి [1]కొలను నీటఁ జరింప
నవని కేతెంచు రాయంచ లనఁగ
వినువాక ప్రతిఫలించిన దండు[2]సన [3]నుండు
రా[4]పిండు వెలి గుడారము లనంగ

---

153ప. 1 క,ట–సరదర్ప చ,త– సరదచ్ఛ,
* గ శారద ప్రతివాస శరదచ్ఛ ఖండముల్
వడగండ్లు మెండుగా వలపుగాగ
2 త–గళ
154ప 1. క,చ,ట,త,గ–కొలకు 2 క,చ,ట త–జన, 3 క,ట–పిండు,
4 గ – జాల

తే॥ నల నభోలక్ష్మికై సమయంపుఁ జాకి
చలువ లొనరించి మిన్నేటి కెలన నార
నిడిన దువటంబులగు స్వాతి మడుఁగు లనఁగ
మినుకు లీనుచు వెలిమబ్బు తునక లెసఁగె 154

కం॥ మొగులు [1]విడి యెండ వేడిమి
బెగడొందక తపమొనర్చెఁ బేర్చి నిరాహా
రగతిం ధరణీవల్లభుఁ
డగిధరు మది నిల్పి యల [2]ఘనాత్యయవేళన్ 155

కం॥ అంతం గనుపట్టెను హే
మంతము [1]శీతార్తిజనమాదృతి[2]తతవా
సంతము తుహి [3]నపిహితభా
స్వంతము దుర్దాంతశైత్యపంతం బగుచున్ 156

కం॥ ఏ మనవచ్చున్ హరిహరి
హైమనదీఘనతతిన్ మహాహిమమహిమన్
హైమనగం[1]బనఁ బొడమెన్
హైమ[2]నగభ్రమ నబశ్చరాళికి నెల్లన్ 157

మ॥ గరిమన్ రెండొకటైన యట్టి [1]కరటిన్ గాడోప[2]గూఢక్రియా
దరణోద్వృత్తి విటీవిటాళి గలయం దార్కొన్న నీహార[3]ని

---

155ప 1, క,గ,ట–నిరి చ త–విరి 2, క,చ,ట త–ఘునా,
156ప 1 క వ ట,త–సితాళు 2, క ట–తతమహా చ–వహ, త–తతహా,
3 క ట–నాహిత, ల నాగత గ–నావృత
157ప 1 చ,గ–బున 2 గ–నగంబన
158ప 1 క,చ,ట త,గ–కరుణన్ 2 క చ,ట,త–గూహ, 3 గ–దు

ర్భరవేళన్ గళదఘ్నతోయమున దీరస్వాంతుఁడై రాజశే
ఖరుఁ డెంతేఁ దపమాచరించె మునిలోకస్తుత్యచారిత్రుఁడై 158

ఉ॥ హారితరవ్రజాంతరవిహార! మహారణవీరసాల్వభూ
దారమదాపహార! సముదారతరౌఘవిదార! దారదా
ధారకుచద్వయీ[1]భరితదైత్యసతీహరసార! ఘోరచా
ణూరమురాసురాదిసుమనోరిపుభంజన! భక్తరంజనా! 159

కం॥ కృష్ణాపత్పరిహరణా!
కృష్ణాభ్రనిరాకరిష్ణుపృథురుచికరణా!
కృష్ణా! శతాంగభరణా!
కృష్ణద్వైపాయనాదికీర్తితచరణా! 160

కవిరాజ విరాజితము॥

సలలితలక్షణ! చంద్రదరవీక్షణ! సామజరక్షణ! చారుదయా!
జలజజశంకర! శక్రవశంకర! శత్రుభయంకర! చక్రశయా!
హలధరసోదర! యార్యజనాదర! హరి[1]గుహోదర!
యబ్ధిశయా!
విలసితకేతన! విశ్వనికేతన! వీక్షితపూతన! వీతభయా! 161

---

159వ 1 చ,గ-భయద.
161వ 1. గ-మహో

గద్య॥ ఇది శ్రీ తాడిపర్తి గోపాలకృష్ణకృపాకటాక్షవీక్షాసమాసాదిత కవితాసూతనభోజ సంస్కృతాంధ్ర భాషావిశేషసారసారస్య పరిజ్ఞానచాతురీదురీణమానసాంభోజ, చెన్నమరాజకులాంభోధి రాజసంపూర్ణపూర్ణిమారాజ శేషయామాత్యతనూజచెన్నమరాజ ప్రణీతంబైన చారు చంద్రోదయంబను మహాప్రబంధంబు నందు ద్వితీయాశ్వాసము 162

# చారుచంద్రోదయము

## తృతీయాశ్వాసము

కం॥ శ్రీ రుక్మిణీవధూమణి
చారుతరాస్యకమలహరిః సాత్యవతేయా
క్రూరస్తుతగుణలహరీః
ఘోరాఘమహాచలహరిః గోపాలహరేః 1

తే॥ అవధరింపుము శౌనకాద్యఖిలమౌని
జనులఁ గనుఁగొని సూతుఁ డిట్లనుచుఁ బలుకు
శుకము వెండియు హరితనూజునకు ననియె
నృపతి తప మట్లు సేయుచోఁ [1]త్రిదశపురిని

సీ॥ తెలిమేని గిబ్బ రాతేజి యెక్కుడు రౌతు
విలుదబ్బ యెవ్వాని వీడుపట్టు
[1]మడుగు చూ లడుగుఁదామర మాయవడుగు[illegible]చెం
దొవచుట్ట మెవ్వాని తోడబుట్టు
[2]పుడుకుఁ గేల్జడదారి యొడయని [3]విడియమ్ము
మిన్న యెవ్వని కేల మెఱయు [4]వాలు
గాడ్పుమేతరి మేలి ఖాణంపు[5]టొయ్యారి
వార్వంపు సామి యెవ్వని దణాయి

2వ 1 గ-త్రిపురపురిని

తే॥ యట్టి యమరాధినాయకుం డనుపమాన
భవ్య నవరత్నమయసభాభవనసీమ
సకలసురవర్యు లిరువంక సరవిఁగొల్వ
నిండు వేడుక నోలగం బుండునపుడు 3

కం॥ చారుం డొక్కఁడు గునకునఁ
జేరంగా వచ్చి దివిపశేఖరుతోడన్
ఘోరంబుగఁ బల్కె స రా
గారంబునఁ గల్గు నమర[1]గుణము దలంకన్ 4

తే॥ దేవతాధీశ· యేమి యర్ధించినాఁడొ
చండతేజుండు పద్మాకరుం డనంగఁ
దనరు నొకరాజు కౌశికీ[1]తటమునందు
నుగ్రతప మాచరింపుచునున్నవాఁడు 5

సీ॥ తొలుఁబల్కు కన్నంపు దొంగ గొంగని బొడ్డు
నన బిడారంపు బాపని తపంబు
ఆటకూఁకటి పిట్ట [1]హరిబి తేజి దువాళి
సరదారుఁ గన్న దేవర తపంబు

3ప 1. క,ట–నుగుడునో 2 త,ట–పుఱుగు, చ త–పుడుగు 3 క,ట త–
నిడియంప, చ–నిడియను గ–నడియంప. 4 గ–వాడు. 5 క,చ,ట,త–
వయ్యారి 6 గ–మేయ

4ప. 1. క చ,ట–గసులు

5ప 1 క.చ,ట,త–తటిని తటిని. చ–తటినివేటిని

6ప 1 క.చ,ట,త–హరిజి

[2]పిడుగుఁగ్రైదువు దారి పడుపుగుబ్బెత కాన్పుఁ
[3]దొడరాడఁ దగు [4]జోగిదొర తపంబు
పుడమిచేడియ కొల్వు టడుగుఁదామర మించు
[5]మఱుగుజ్జు తాఁటదమ్మని తపంబు

తే॥ చారణామరగంధర్వసాధ్యసిద్ధ
యక్షరక్ష స్తపంబులు నచటనచటఁ
జూచితిమి కాని కాన మెచ్చోట నిట్టి
యఖిలలోకాతిభీకరం బైన తపము 6

ఆ॥ అమ్మహానుభావు నతిభయంకరతపం
బహహ యింక సఫలమయ్యెనేని
నిర్జరాధినాధ నీకేడ రాజ్యంబు
సౌరపురికి పుట్టు చూరవచ్చు 7

కం॥ [1]అన గుండియ ఝల్లురుమన
ననిమిషలోకైకనాథుఁ డవ్వాక్యంబుల్
విని [2]యదవదయై పదిపది
మొనకైదువు నేలవైచె మోచిన భీతిన్ 8

తే॥ కొలువు చాలించి నగరి లోపలికి నరిగి
మగుడి యంతస్థునకు వచ్చి నగవిబేది
గురునిఁ బిలువంగ నొక [1]వేత్రధరుని [2]బనిచె
వేగ చని వాఁడు దోడ్తెచ్చె విబుధ[3]గురుని 9

2 క.చట.త–నుడుగు, గ–నపుగు 3 క.ట.త – తొడదారిదగు చ–తొడ దారిదగు. 4 గ–భోగి. 5 గ–మరుగుట్టు

8ప 1 గ–పెను. 2 గ–యదబడితా

9ప 1 గ–దంత. 2 గ–బిలిచి 3 క,చ,ట.త–వరుని.

శా॥ కృత్యాకృత్యవిచారధుర్యుఁడగు నా బృందారకాచార్యునిన్
ప్రత్యుత్థానపురస్సరంబుగ మణిభద్రాసనాసీనుఁగా
నత్యాసక్తి నొనర్చి కార్యము తెఱం గాద్యంతమున్ దెల్పి త
త్ప్రత్యూహప్రశమ మానతిమ్మనుచు జంభద్వేషి
ప్రార్థించినన్ 10

శా॥ చింతింపం బని [1]యేమి యిందులకుఁగా శీఘ్రంబె నీ వప్సరః
కాంతారత్నములన్ [2]సగంధపవనుం గంతున్ వసంతున్ నిశా
కాంతున్ రాజతపోవనంబునకు జోకం బంపుమో యింద్ర గో
రంతాలస్యము గొండయుంత పని చేటౌనండ్రు
మేధానిధుల్ 11

సీ॥ విటపాళిఁ గూర్పరే వివిధాగమామ్నాయ
హారియౌ శాండిల్యునంతవాని
వలలఁ జిక్కించరే వనవాసివిఖ్యాతి
నలరు భరద్వాజునంతవాని
తమిరేగఁజేయరే యమితలోకానిష్ట
హంతయౌ [1]కౌశికునంతవాని
నడుగుఁబట్టించరే యచలయోగారూఢ
నతిశయిల్లెడు భృగునంతవాని

తే॥ విను శచీకాంత నృపమాత్రుఁ డనఁగ నెంత
వెఱవ కిటు వాలుతెరగంటి తెఱవచాలు
సుడిసినంతనె గంపక కడవలెత్తు
[2]ద్రవను విడనాడి జడదార్ల తపములెల్ల 12

11ప 1 గ-లేదు యిందుకునికన్ 2 గ-సుగంధవహునిన్.
12ప 1 క,చట త-శౌనకు, 2 అ గ-తపము

కం॥ అని గురుఁడు దెల్పి నది యౌ
నని యనిమిషకేతుముఖుల నచ్చరవిరిబోం
డ్లను నొక్క వేత్రధరు చే
[1]ననిమిషపతి పిలువఁబనిచె ననిచిన యంతన్ 13

ఆ॥ రమ్యవై భవమున రంభోర్వశీశశి
రేఖ లాదియైన లేఖసతులు
మదనమధుమృగాంకమలయసమీరణు
లింద్రసభకు వచ్చి రెలమి నపుడు 14

సీ॥ నీలనీలవిలాసనిబిరీసకబరికా
ఘనలక్ష్మి ఘనలక్ష్మి నినుమడింప
* సురుచిరక్రముకాగ్ర[1]సుషమాంగకంధరా
దరరేఖ దరరేఖఁ బరిహసింప
సముదారగజకుంభసంరంభగురుపయో
ధరలీల ధరలీలఁ [2]బరిభవింప
మధురసోపమవచో మాధుర్యమాధుర్య
తతరీతి తతరీతిఁ [3]బ్రతిఘటింప
తే॥ గరిమ నిల్చిన [4]గళ [5]హస్తకాయమాన
[6]మానితను [7]ఫాలరేఖావమానితాతి
చారు [8]శశిరేఖ శశిరేఖఁ జేరఁ బిలిచి
పలికె సురపతి [9]మాధురీభవ్యభణితి 15

---

13ప 1 గ-తను విలువగ బనుప తతవ్రతచ్ఛయువారల్

15 1 గ-సుషామోగ్రమ, 2. గ-దరహసింప, 3 గ-నతకరింప 4. త- గత, 5 క,చ,ట,త-హస్తి, 6 క,చ,ట,త-మానితని, గ-మానతాతి. 7 క, చ,ట-వాల, త-పాల. 8 క ట,గ-తరరేఖ. 9 క,ట త,గ-మాధుర్య

మ॥ వనజాతేక్షణ॰ కౌశికీతటిని క్రేవన్ మించు సిద్ధాశ్రమం
బున< బద్మాకరుఁడన్ [1]ధరాదిపతి యేమో ఘోరవృత్తిం
దవం
బొనరం జేయుచునున్నవాఁడఁట తదీయోదారదుర్వారని
ష్ఠ నివారింపుము నేఁడు చూడవలె నీ చాతుర్యమున్
ధైర్యమున్ 16

సీ॥ జటిలకౌశికుఁ [1]గళాశాస్త్ర దేశికుఁ గాఁగ
శిక్షించినది యీ మృగాక్షి గాదె
క్రతుసంయమి కపారరతిబంధములు దిద్ది
[2]రవిణ యిచ్చినది యీ మిటారి గాదె
బకదాల్భ్యమౌనికి బకదారి పల్కులుఁ
బలుక నేర్పినది యీ కలికి గాదె
శాండిల్యునకుఁ బుష్పకాండోపనిషదర్థ
మానతిచ్చినది యీ [3]చాన గాదె

తే॥ యిపుడు వీరలు నీవును నేకముఖము
గాఁ బ్రవర్తింపుచోఁ జెట్టుకాయఁ ద్రుంచి
నటుల కార్యంబు సేకూరు నదియుఁగాక
మదనుఁ డున్నాఁడు నీ కెవ్వ రెడ రు చెపుమ 17

తే॥ ఘనతరంబైన యనివార్య కార్యకాంక్ష
ననవలయు మాట నీతోడ నంటిఁగాక
పుడమిఁ బద్మాకరాంతర స్ఫూర్తిఁ నడఁచు
పటిమ శశిరేఖ నీ కెంతపని [1]గణించ 18

---

16వ 1 గ-ధరాపతి
17వ 1 త-గాన, 2 క ట-ప్రవిణ, చ త-రవిణ గ-బవణి 3 త-మగువ
18వ 1 క,ట-గటింప

వ॥ అని పలికి క్రమంబున 19

కం॥ ఆ మదిరాక్షీజనచూ
డామణికి సహాయులై కడంగుటకును సు
త్రాముఁడు కాముని సోముని
నామనిదొర ననిలుఁ జూచి హర్షం బెసఁగన్ 20

చ॥ తిలసుమనాస కౌనున సదృశ్యతఁ గాంచి తదీయవక్త్రకుం
డలయుగ శోణఘర్షణకనన్నిశితేక్షణబాణవర్షమున్
బలుమరుఁజూపి యా నృపతపస్వి మనోంబుజనిష్ఠ
నెంతయున్
దలఁగఁగఁ జేయు రూపసదనాః మదనా, యద
[1]నాదరింపుచున్ 21

చ॥ వనిత మెఱుంగుగుబ్బ నెలవంకల నీ యల[1]వోక పొంకమున్
దవరఁగ హారకాంతి చిరునవ్వులతోఁ గలయంగ వెన్నెలల్
దనుకఁగఁ జేసి నిర్మలకళానికురుంబక సాంద్రః చంద్ర'త
ద్ఘనతరదైర్యనూత్నశశికాంతము వేఁ గరగంగఁ
జేయుమీ 22

చ॥ జలజదళాక్షి మేని జిగిసంపెఁగలున్ వెదచల్లి కాకల
గ్గలముఁగఁ జూసి యా మునిశిఖామణి [1]డెందపు జాజి వాసిగా

21వ 1 గ–నాదరింపకున్
22వ 1 క,చ ట,త,గ–వంక
23వ 1 గ–డెందము.

[2]సిలి యుడివోవఁజేసి యతిశీఘ్రము పల్లవకోటిఁ గూర్పు మీ
చలము దలిర్ప నేర్పున వసంతు వెదూళి వసంతమాడుచున్ 23

చ॥ అలికచ మందయానముల యందము చక్కని మేలుబంతిగా
నెలకొని మందమందగతి నేరిచి యూర్పుల వెంటనంటి త
త్కలితమనోజ్ఞకోరకము గ్రక్కున [1]లీలఁగఁజేయు మచ్చుటన్
మెలఁగ సమీర నీదు పస మీఱఁగఁ [2]జేయుము
సారెసారెకున్ 24

మ॥ అనుచుం జాలఁ బ్రియంబుఁ జెప్పి దివిజాద్యక్షుండు
తాంబూల చం
దనవస్త్రాభరణాదు లిచ్చి పనుపన్ మత్స్యధ్వజుండున్మధుం
డనిలుం డంబుజశాత్రవుండు శశిరేఖాద్యప్సరఃకామినుల్
సని రా రాజతసౌ[1]వరావనికి రాజద్వైఖరుల్ మీఱఁగన్ 25

సీ॥ చెలరేఁగి యా రాజశేఖరుం డిటమీఁదఁ
జంద్రరేఖాసక్తి సలుపకున్నఁ
దవిలి యా పురుషరత్నంబుఁ దా నిటమీఁద
హేమాన్వితస్ఫూర్తి నెసఁగకున్న
నలరి యా హరిణసమాఖ్యుఁ డిం కిటమీఁద
హరిణీరతిక్రీడ నలరకున్న
వలఁచి యా భూమిభృద్వల్లభుం డిటమీఁద
మేనకాసంసక్తి మెఱయకున్న

2 గ-సిలయదిబోవ

24ప 1 గ-ప్రేలగ. 2 గ-పీక సమీర నెర్పునన్

25ప 1 క ట-వరా చ త గ వనా

తే॥ నకట యేలాగు మన లాగు మకరకేతు
డాఁగువాఁడన నేతెంచె వేఁగువాఁడు
హా విధీ యని వగచిరి [1]యబల లపుడు
[2]గములు గూడి ప్రియానుషంగములు [3]విడిచి 26

శా॥ ఆ రీతిన్ మదనాదు లచ్చరలతో నయ్యాశ్రమక్షోణికిన్
జేరంబోయి మహాతపఃస్ఫురణచేఁ జెన్నొందు పద్మాకరున్
ధారాళాశయరాజమానపరమాత్మధ్యానధౌరేయని
ష్ఠారూఢుం గని తద్భయంకరతపస్యావిఘ్ననిఘ్నాత్ములై 27

వ॥ తమ తమ విజృంభణంబులు చూపఁదొడఁగి రప్పుడు 28

మ॥ అణుమధ్యం బసియాడ గుబ్బ[1]లొరయన్ హారాళి నర్తింప నీ
క్షణముల్ చిందులుఁ ద్రొక్క వేనలి చలించన్ గింకిణీకంకణ
క్వణనంబుల్ మునిచిత్తవృత్తముల నాకర్షింప[2] నుత్కర్షఁ బే
రణి యొక్కర్తు నటించెఁ దాళగతి [3]సారస్యంబు
గన్పట్టఁగన్ 29

ఉ॥ [1]చొక్కపు మోవిపండు చవిచూడ వదేటికి. రామతమ్మః యా
యొక్కల మేలరా. కులికి ముద్దిడరా. విడరా చలంబు నా
చక్కని ముద్దుగుమ్మ యని సారెకుఁజిల్కను బల్కనేర్పి మై
నొక్క మిటారి గేరి సరసోక్తుల నవ్విభు నాడె వేడుకన్ 30

---

26ప 1 చ.ట.త.గ–యజ్వల. 2 క.ట.త.గ–గుములు. 3 గ–వీడి
29ప 1 గ–మెఱయన్. 2 గ.చ–నొయ్యార. 3 గ–స్వారస్యంబు
30ప 1 గ–చొక్కపు

చ॥ తళుకుఁబసిండి యందెల రొదాళముతోఁ గవగూడి కెంపు మ
ట్టెలు రవళింపఁగా, ఘనకటీరతటీరమణీయకింకిణీ
కలకలముల్ మనోజసుమకార్ముకటంకృతి ధిక్కరింపఁగాఁ
గలికియొకర్తు నేర్పమరఁ గందుకకేళి యొనర్చె వేడుకన్ 31

శా॥ తాటంకద్యుతి గండభాగముల మీఁదన్ జిందుఁ ద్రొక్కన్ గటీ
శాటీహాటకకింకిణీధ్వని రహించన్ జంచదక్షిప్రభా
ఝూటంబుల్ నవచంచలాచకిచకల్ చాయన్ విడంబింపఁ గో
లాటం బాడిరి కొంద ఱిందువదనల్ హర్షంబు రెట్టింపఁగన్ 32

సీ॥ జలజల కపురంపుఁ బలుకు లొల్కఁగఁ బల్కి
కలయు వాసించె దిక్తటుల రంవ
జోరన నవసుధాధార లూరఁగఁ బాడి
చట్రాళ్లు గరఁగించెఁ జంద్రరేఖ
చంగున వాల్జూపు చౌకళింపఁగఁ [1]జూచి
తేటతేనియకాల్వ దాటె హరిణి
[2]బోరున నచలశృంగారసంగతిఁ జూపి
సొనురక్తి మెలంగె మేనకాఖ్య

తే॥ మఱియు [3]నొఱపులు నెఱపిరి మెఱసి పెక్కు
తెఱఁగులను జెప్ప విప్పిరి మెఱుఁగుబోండ్లు
గుంటిక్రియ నున్న రాచముక్కంటి యెదుటఁ
దుంట విలుకాఁడు దమకుఁ జేఁదోడు గాఁగ 33

వ॥ అప్పుడు 34

33ప 1 గ-జూపి 2 గ-బాగుగాశృంగారభావ, 3 గ-నేర్పులు

సీ॥ తన సామి సిగమీఁదఁ దఱుకు సంపెఁగదండ
[1]కమ్మని క్రొత్తావిఁ గ్రుమ్మరింపఁ
దన పయోధరపాళి దర్పసారపటీర
ఘనసార'వాసనల్ గ్రందుకొనఁగఁ
దన గండతలముల దళమైన సొంకవ
పంకంబు నెఱతావి [2]పౌజుఁదీర్ప
దనదు వీడెపు రీవి పెనగొన్న నిశ్వాస
పవమానముల తావిఁ బైకొనంగఁ

తే॥ బొసఁగఁ దావులఁ జేసిన బొమ్మ యనఁగ
యెలఁత రూపగు కస్తూరి మెక మనంగ
[3]నిఖిలశృంగారముల కెల్ల నిలయమనఁగ
నెసఁగి శశిరేఖ నృపమౌని యెదుట నిలిచి 35

సీ॥ తుంబీఫలంబుపై తోరంపుబిగి గుబ్బ
నిగ్గులు బంగారునీరు నింప
బింబాధరంబుపైఁ బెనగొన్న లేనవ్వు
నవసుధారసధార నారుకొల్ప
కటకమణిప్రభాపటలంబులు ప్రవాళ
మిగురించెనో యన సొగసునింప
వీక్షణాంబుజలోలు పేందిందిరశ్రేణి
వితతగానములకు శ్రుతి ఘటింప

35 ప 1 క చ ట త ఘ-నఁమ్మని గ్రొత్తావి, 2 క, ట-రాజు, చ-వాజు గ-పంజు.
3 గ-నఖిల,

తే॥ మలయపవమాను లింపార మొలకినట్లు
కేతకీసూనవాసనల్ గెరలినట్లు
రక్తిమై యింపుసొంపులు రహి వహింప
వీణ వాయించె బాల ప్రవీణలీల 36

తే॥ సరవి నీ రీతి శశిరేఖ సఖులుఁ దాను
బహువిధవిలాసవిభ్రమప్రౌఢి నెఱపి
చలనమొందని నృప [1]మౌని చందమెంచి
విబుధపతి సేయు సమ్మానవిదము నెంచి 37

శా॥ ఏ రీతిన్ గరగింతు రాజహృదయం బే రీతి వారింతు దు
ర్వారంబైనది యీ తపంబనుచు భావంబందు నూహించి నే
ని రాజన్యునిమీఁద మేలుపడిన ట్లింతే గలంగన్ జెలుల్
దూరం బూనుదు రట్టి యా రవళిచేఁ దూలుం దపో
నిష్ఠయున్ 38

వ॥ అని నిశ్చయించి నెచ్చెలిం జూచి 39

సీ॥ జడగుంపుఁ బూనినపుడె యింత యొయ్యార
మోరఁగా సిగవైవ నుండకున్నె
పులితోలు దాల్చినపుడె యింత నెఱనీటు
నిండువన్నెలుఁ బూన నుండకున్నె
భూతి బలూపిత యప్పుడె యింత సోయగం
బొడలఁ గుంకుమ నించ నుండకున్నె

---

37 వ 1 గ-మౌళి

యల దర్భపీఠి నున్నపుడె యింత విలాస
ముదిరి గద్దియ నిల్వ నుండకున్నె

తే॥ యహహ మునివేషధారియైనపుడె యింత
యొరపు నృపవేషముననైన యుండకున్నె
కలువ చెలికాఁడు వలఁతేఁడు నలుఁడు వీని
కాలిగోరుకైనను బోలఁగలరె 40

సీ॥ ఒడలి భూతిస్నాన మెడలించి పన్నీరు
వుల ముంప నెన్నఁడు గలుగునొక్కొ
మంత్రాక్షరావృత్తి మఱపించి మణితముల్
పలికింప నె న్నఁడు గలుగునొక్కొ
మారుతాహారంబు [1]వారించి మోవి తే
నె లానంగ నెన్నఁడు [2]గలుగునొక్కొ
యోగాసనాసక్తి నుడిగించి రతిబంధ
ములు నేర్ప నెన్నఁడు గలుగునొక్కొ

తే॥ మౌనము వదల్చి రతులనన్ బూని యాడ
గా నొనర్చుట యెన్నఁడు గలుగునొక్కొ
స్వామికార్యస్వకార్యముల్ సంఘటిల్ల
గౌరవముఁ గాంచుటెన్నఁడు గలుగునొక్కొ 41

మ॥ సుకుమారాంగకళాకళాన్వయవయఃస్ఫూర్తుల్ విచారింప రం
భకు నాకున్ సరియయ్యు నయ్యువిదకుం బ్రాణేశుఁ
డయ్యక్షరా
జకుమారుం డగుటన్ గదా మదము తత్సరంభమింకించు న
మ్మకరాంకోపమమూర్తి వీఁడు రతులన్ మన్నించి
నన్నేలినన్ 42

41 ప 1 గ-మరపించి, 2 గ-నొనరు

తే॥ అనుచు నంతంతకును మోహ మినుమడింప
[1]నొగి వియోగాగ్నిఁ దూలి తా నట్లుండె [2]నతివ
భళిర వలపింపఁబోయితా [3]వలచె ననుచు
వేల్పుజవరాండ్రు తను వికావికను నవ్వ 43

వ॥ ఇవ్విధంబున [1]నయ్యిందువదన దురాపంబగు మదనతాపంబు సైరింపనోపని సూటిఁ [2]దటపటాయింపుచుఁ బన్నీటి పెన్నీటి కాలువల చాలు వలనఁ గెలన నవనవంబగు [3]నివంబు వెద చల్లు మొల్లంపు మొల్ల పూఁబొదలఁ బొదలు మవ్వంపుఁ గ్రొవ్విరుల కదంబంబునఁ [4]గవంబించు కపురంపుటనఁటి గుంపు నడుచక్కిఁ జొక్కటంబగు చుక్క రాచ రానున్న తిన్నెపైఁ బవ్వళించియున్న శశిరేఖఁ గాంచి యయ్యెంచు బోఁటి డెందం బారాజకందర్పుని యందంబునఁ [5]దగులు వడుటగాఁ బరికించి కించిదంకురితహాసవిలాసభూషామంజూష లగు మంజుభాషల మంజుఘోష యిట్లనియె 44

సీ॥ వలపించెఁగాక తా వలచెనే నీ రీతి
మేనక గాదేయమౌనిపతికి
భ్రమయించెఁగాక తా భ్రమసెనే నీ [1]లీల
ప్రమ్లోచ కణ్వతపస్విమణికి
మరగించెఁగాక తా మరగెనే నీ మాడ్కి
చేరి యూర్వశి యా పురూరవునికిఁ

43 ప 1. గ–నొక. 2 గ–మగువ 3 గ–వలచినట్లు.
44 ప 1 గ–నయ్యింమవదన దూపంబగు. 2 గ–జటపొటాయింపుచు.
3 క,ట–నీరంబు. 4 గ–గదలించు. 5 గ–గోలు
45 ప 1 త,గ–రీతి

గరగించెఁగాక తాఁ గరఁగెనే నీ దారి
రంభ గౌతమపరివ్రాజకునకు

తే॥ మన కులాచారధర్మంబు మైలపఱిచి
వలచి నినువంటి తెఱగంటి వాలుగంటి
యక్కటా! యొక్క నరునకుఁ దక్కియున్న
బోటి! మా కెల్ల సిగ్గుల చేటు గాదె 45

సీ॥ అసురక్తి [1]కలితయౌవనరేఖ నెలరించు
సిద్ధపల్లవకోటిఁ జెల్లుగట్టి
యతులభోగాసక్తి నాడుమన్నటు లాడు
త్రిదశభుజంగాళి నిదురఁబుచ్చి
వరసుమనస్స్ఫూర్తి వలపు గైకొని మించు
నల యక్ష[2]విటులను నడవిఁ గలిపి
యెంతేని సరసత నంతికోర్వి వసించు
గరుడకుంభశ్రేణిఁ గాకఁబెట్టి

తే॥ వేల్పుదొర కొల్వు కటకటా! పీటఁబుచ్చి
జోడుఁ బాయని మముబోంట్ల పీడనాడి
మా పురానకు రాక యిమ్మనుజపతికిఁ
గాపురానకు నుండెదే కంబుకంఠి 46

సీ॥ మొగచాటు దోఁచెనో భుగభుగల్ దుళకించు
వేల్పురామానికాల్ [1]విరులు దుఱుమ

---

46 ప 1 క.ట.త-కలికి. 2 క.ట.త.గ-విటువుల, చ-విటువుల.
47 ప. 1 చ.త.గ-క్రొవ్విరులు.

నరుచి జనించెనో యల నం[illegible]
వాటీసమాటీకవై భవముల
కంటి కిం బొదవదో మింటి[తోవరి [2]యావు
పాలఁ గాఁచిన యానవాలుఁ గ్రోల
నప్రియం [3]బెసఁగెనో యమరరాజతనూజ
సురతకేళీకళాపరిచయమునఁ

తే॥ గటకటా! స్వర్గసౌఖ్యంబుఁ గాలదన్ని
కుడిచి కూర్చుండి యిట్లు మేల్వాడి త్వదీయ
[4]రేఖ యువగణ్య [5]లావణ్యరేఖ యేల
నేలపాలుగఁ జేసెదవే లతాంగి! 47

తే॥ నల నలినబాణ[1]నాసత్యనగవిరోధి
నందనాదుల కన్న నెన్నంగ వీఁడు
చక్కఁదనమున నెక్కుడె చక్కఁజూడు
మేల యీ జాలి చాలు విశాలనయన 48

ఉ॥ నా విని యా వినీలకచ నర్మసఖిం బరికించి పల్కె న
య్యో వనజాక్షి! నీ వెఱఁగియుండియు నోరెటులాడె నీ క్రియన్
భావజరాజరాజసుర[1]నాథతనూజుల నెన్న వారియం
దీ వరరూప మీ యొఱపు నీజిగి యీ చెలువంబు [1]నున్నదే49

2 క,ట త-యాప్తు, 3 గ-బొదవునో, 4 క,ట త,గ-లేఖ,
5 క,ట-తారుణ్య

48 ప 1 క,ట-నాసక్తి

49 ప 1 త-రాజ, 2 గ-లున్నవే,

కం॥ తుది నితనికి నలకూబర
మదనజయంతులకు హస్తిమశకాంతర [1]మౌ
మదిరాక్షి॰ వారి నూరక
చదువకు నా యెదుట నింకఁ జాలుంజాలున్ 50

మ॥ అని యా వేలుపుఁగొమ్మ నెమ్మది నఖంగానంగతాపాగ్ని మూ
ర్ఛ నెటిం జెందినయట్ల సత్యమగు మూర్ఛం జెందుచో బోటి [1]నా
టిన భీతిన్ [2]గపురంపుఁగట్టనిడి పాటీరాంబుసారంబు చ
ల్లని పన్నీరముఁ గూర్చి పైఁ జిలికి చెల్వం దేర్చి తా నిట్లనున్ 51

ఉ॥ అక్కట మిక్కుటంపు విరహంబున నీ గతి నేల దూలెదే
చక్కెరబొమ్మ॰ నీ [1]తలఁపుచందము పొందుపడంగఁ జేసెదన్
నిక్కము మాఱు పల్కనిఁక నిర్జరవల్లభుపాద మాన నా
దిక్కటుఁ జూడుమా నెగులు దీర్చెద భూవరుతోడఁ గూర్చెదన్ 52

---

50 వ గ—మో

51 వ 1. క.ట.త.గ—నాడిన. చ—నాదిన. 2 క.ట—గపురంబు గట్టడిని. చ.త.గ గపురంపుగంటనిడి

52 వ 1 గ—వలపు.

ఉ॥ * రమ్ము లతాంగి మారుని శరమ్ములకున్, రవతేటిరా[1]డమా
రమ్ములకున్ [2]మరాళనికరమ్ములకున్ నెఱతావి పువ్వు టీ
రమ్ములకున్ సుధాకరకరమ్ములకున్ శుకశారికామయూ
రమ్ములకున్ సరోజ విసరమ్ములకున్ భయమంద నేటికిన్ 53

కం॥ అని తోకొని చని నిష్ఠా
ఖని నమ్మనుజేంద్రముని నకల్మషతేజో
[1]ధనిఁ గని యల యెలజవ్వని
వనిత సుధామధురచాటుఫణితిన్ బలికెన్ 54

శా॥ ఓ లావణ్యవతీరతీశ, భవదీయోద్వృత్తసూవిభ్రమం
బాలోకించి, యకించిదంకురితమోహావేశయై యాశయై
కాలీఢంబగు కాక నున్నయది మా యబ్జాక్షి దీనిం గృపా
శ్రీలన్ మించు కటాక్షవీక్షణసుధాసేకంబునం దీర్పవే 55

సీ॥ నిద్దంపు [1]ఒద్దంబు నిగనిగల్ [2]నిగుడించు
నెమ్మోము ముద్దాడి నిమురుమయ్య

---

53 వ 1 క ట-కమా, 2 క,ట-వసంత పవనంబులకున్

* గ-రమ్ములతాంగి మారుని శరమ్ములకున్ నెఱతావి పువ్వుటీ
రమ్ములకున్ సుధాకరమ్ములకున్ శుకశారికామయూ
రమ్ములకున్ పికాది విసరమ్ములకున్ వరశారికాప్రసా
రమ్ములకున్ సరోజ విసరమ్ములకున్ భయమంద నేటికిన్

54 వ 1 క ట-పని, చ-త-వని

56 వ 1 క,చ,ట త,గ-టద్దంపు 2 గ-దులకించు,

[3]పగడంబు [4]జగడంబుఁ దెగడు చక్కెరమోవి
పానకం బొక్కగుక్కెఁ డానుమయ్య
క్రొమ్మించుఁ గ్రమ్మించు కొమరుఁబ్రాయపు మేను
సొంపు మీఱఁగఁ గౌఁగిలింపుమయ్య
కీరంబు బీరంబుఁ గేరు [5]తియ్యని పల్కు
లాలించి లాలించి యేలుమయ్య

తే॥ కడఁగి వెడవిల్తు రూపంబు పుడికిపుచ్చి
కొన్న కైవడి నున్నావు నిన్నుఁ జూడ
నకట నిను బోటి కేటికి వికటనియతి
యతివ కవఁ గూడి రతుల నోలాడుమయ్య 56

కం॥ రావంగడమునఁ గలుముల
చేవం గరముట్టి కీర్తిఁ జేకొంటి వయో
యీ వేడబంబు లేటికి
నీ వేడ తపంబు లేడ నృపవంశమణీ 57

సీ॥ చక్కెర కెమ్మోవిఁ జవిచూచి చవిచూచి
[1]మునివంటఁ [2]జిఱుకెంపు లునిచి యునిచి
[3]తేటచెక్కుల గోరు నాటించి నాటించి
చెలఁగి మోమున మోము చేర్చి చేర్చి
బిగియారు కౌఁగిటఁ బెనఁగొని పెనఁగొని
కోడెగుబ్బల ఱొమ్ముఁగ్రుమ్మి క్రుమ్మి

---

3 క,చ,ట,త–పగడంపు. 4 క,చ,ట,త–జగడంపు. 5 గ–తిన్నని.
58వ 1. క,ట,త–మునిబంట, చ–మొనబంటి గ–మొనగెంపు. 2 గ–నునుగెంపు.
3 గ–నాతి

రతికేళి కెలయించి రాకొట్టి రాకొట్టి
కళ లూరఁ బలుమారు గలసి కలసి

తే॥ యొదవు నలసత యురముపై నొరగి యొరగి
తెలిసి పుంభావసుఖలీలఁ దేల్చి నిన్ను
నతను సామ్రాజ్యవైభవాధ్యక్షుఁ జేయఁ
జాలు నీ కొమ్మ దయఁగ్రమ్మ నేలుకొమ్మ 58

కం॥ ఒడలెల్లన్ వెడలాఁగున
బడలించెద నదిప॰ తపముఁ బండిన పిదపన్
జడలేలా యీ వేలుపుఁ
బడఁతుక నీ వలలఁ బడుట భాగ్యము గాదే 59

కం॥ అని మంజుఘోష పలికిన
ననువందఁగఁ దక్కినట్టి యచ్చరలెల్లన్
ఘనముగఁ దమతమ నేర్పులు
గనఁబడఁగాఁ [1]బలికినృపునిఁ గలకల పలుకన్ 60

కం॥ సాక్షాదనంగహరుఁ డన
వీక్షింపఁగ రాక దుర్నిరీక్ష్యతపస్యా
దక్షుండై క్షోణీతలా
ధ్యక్షుఁడు చలియింపకుండె నతులితనిష్ఠన్ 61

వ॥ అంత శశిరేఖ తనతోడి లేఖయువతులఁ గనుంగొని యిట్లు
నియె 62

---

60వ 1 చ.త గ-బల్కి- కలకలంబొదవింపన్.

కం॥ నీచునకుఁ జేయు నుపకృతు
లై చెవిటికిఁ బట్టు శంఖులై సుప్తపదా
సేచనమైరిత్తగు నిలు
పోచిళ్ళై మన యుపాయములు వృద యయ్యెన్ 63

కం॥ ఇటమీఁద వీనిఁ బైకొని
యటు నిటు చేష్టింపఁ బోయినపుడ యెటుపో
[1]యెటువలె వచ్చునొ యని యు
త్కటమగు ఖేదంబు మదిని దలకొననుండెన్ 64

చ॥ హరిణి చలించె. రంభ హృదయంబునఁ బూనె జడత్వ
మెంతయున్
గరఁగె ఘృతాచి హేమరుచి గాసిలి నిల్చెను జంద్రరేఖయున్
సెరగునఁ బూనుచుండె నెద చిక్కిన కందలచిత్రరేఖ నే
ర్పుఱఁ దగెఁ జిత్రరూపమున నయ్యెడ నా నృపమౌని
చెంగటన్ 65

సీ॥ చలనమొందె సగంధమలయగంధవహుండు
ధరణీశుకుండలి స్ఫురణమునను
వెలవెల్లనయ్యె రేవెలుగు వేలుపు [1]జోదు
బూవరు నుత్తమభావగరిమ
విచ్చుమొగ్గై జాజి వేగ [2]మామనిఱేఁడు
భూమివల్లభు తపఃస్ఫూర్తివలన

---

64ప 1 గ-యెటువచ్చునోయనుచు నము

66ప 1 గ-చాయ. 2 చ,గ-నామని, త-గామని, 3 గ-కలవ.

కడు నిరాకృతిఁ [4]జెందె వెడవింటి నెఱజోదు
క్షితినాధు నచలసంస్థితిక [5]కలన

తే॥ ననుచు వచియింప నేలనో యదిప మదమ
యూరయానలు చక్రకటీరతటలు
[6]ముదితనీలకచలు. భృగుమధురకుచలు
నైన యచ్చరల్ భీరువులై రనంగ 66

కం॥ ఈ చందంబున భీరువు
లై చని రచ్చరలు దివికి నా యుఱుముల కా
యీ చినుకు లనుచుఁ దముఁ గని
ఖేచరవిటకోటి పీటఁ గిలకిల నవ్వన్ 67

చ॥ హరిహయుఁ డప్పు డా నృపకులాగ్రణిఘోరతపఃప్రభావ మ
చ్చరల ముఖంబునం దెలిసి సాధ్వస మొంది వియచ్చరాళితో
నరిగి సుదాబ్ధివాసియగు నంబుజనాభునిఁ గాంచి సన్నుతుల్
వరమతి నాచరించి తన వచ్చిన కార్యము విన్నవించినన్ 68

శా॥ శ్రీ లావణ్యవతీవిభుండు దివిజశ్రేష్ఠుం గిటాక్షించి నీ
కేలా యింత విచార [1]మింత పనిలే దీ వేళఁ బద్మాకరుం
డాలోకాద్భుతమూర్తియై తపమపత్యాకాంక్షమై సల్పెడున్
నీ లోకంబునకేఁగు మీ వని కృపన్ వీడ్కొల్పి శీఘ్రంబునన్ 69

---

4 గ-నొందె 5 క ట-కళలన, త-వలన 6 గ-ముదిత వరనీలకచలు
69వ 1 చ త-మింద్ర

సీ॥ నవరత్నకీలితోన్నతకిరీటంబుతో
మొసలి వాతమ్మంట్ల మురువుతోడ
శంఖచక్రగదాసిశార్ఙ్గచాపములతో
జిలుగు సొన్నా నున్న చేలతోడ
కంకణాంగదహారకటకకాంచికలతో
కడలి పుట్టువు మానికంబుతోడ
బాహుమధ్య మనోజ్ఞపాథోధికన్యతో
వలుద పొక్కిలితమ్మి నలువతోడ

తే॥ సూర్యకోటిప్రభాతివిస్ఫూర్తితోడ
ననుచు చిన్నారి మోము లేనవ్వుతోడ
వచ్చి ప్రత్యక్షమయ్యె భూవల్లభునకుఁ
గృత జగద్రక్షణుండు పద్మేక్షణుండు 70

వ॥ ఇట్లు ప్రత్యక్షంబైన పుండరీకాక్షునకు సాష్టాంగ దండ ప్రణా మంబు లాచరించి యప్పద్మాకర ధరాధినాయకుఁ డిట్లని వినుతించె 71

కవిరాజ విరాజితము॥
జయజయ పాండురసైంధవ [1]బాంధవ సర్వసుపర్వ
సుపర్వకరా
జయజయ [2]నిత్యసభాజనఖాజన. శార్వరదుర్వహగర్వహరా
జయజయ చంద్రవిలోచనలోచన సారదయారసపూరధురా.
జయజయ సామజపాలన ఖేలన [3]చక్రధరానుత చక్రిహరీ 72

72వ 1 క గ ట–బాంధవసర్వ సుపర్వకరా. 2 గ–మర్త్య. 3 చ.త.గ–చక్రి హరిదితచక్రిహరీ.

దండకం॥ శ్రీమద్రమా మానసాంభోజహంసా నినంసా(?) పరస్వాంత వీథీరిరంసానృశంసాహవాభీలమాంసాదను (?) ధ్వంసన ప్రక్రియాధుర్యశౌర్యావతంసా ప్రశంసార్హనానా మహాయోగి సంసన్మనీషాకురంగి[1]వితంసా ప్రశంసాధన ప్రౌఢకాకుత్స్యసంరక్ష్యమాణా మరోత్తంసహంసాశ్వవిశ్వంభరాస్యందనుల్ నిన్ను వర్ణింప లేరన్నచో నున్నవా రెంత వారల్ గృపారక్షితప్రాప్తరూపా జగద్రూప మానత్రయీ స్తేయ లీలాచరిష్ణున్ [2]మదాందీభవిష్ణున్ పయోరాశి మద్యేపయః పూరవర్తిష్ణు దృష్ణున్ సుధా [3]జీవనాజేయు దైతేయు మీనాకృతిం బూని ఖండింపవే. [4][సొంపు లోకైక నిర్మాతకున్ దాతకున్] పూర్వగీర్వాణగీర్వాణబాహాసమాకృష్యమాణాస్ఫుటా భృద్గుణభ్రామ్య దభ్రం లిహాదభ్రకూటాగ్రమందానభూమీ ధరాధారమై నిల్పవే కూర్మమై. [5]కూర్మిమై భర్మపాంచాలికా మోహనాకారరేఖావనీవంచ్యమానామరారాతివై [6]నాతి హర్షికృతదోశ్చరజ్యోతివై పంచి యీవే సుధన్ నాతివై. నాతి వేళాతివేలాబ్ధినిర్మగ్నసర్వంసహన్ గొమ్ముననన్ గ్రమ్మి పై కెత్తవే మొత్తవే యా హిరణ్యాక్షు నక్షీణకోలంబవై. శంబవైరాయమాణోగ్రదోస్తంభఘాతిన్ హతాభీలకాలాయస స్తంభ దంభప్రచారిన్ హిరణ్యాక్షపాచారి నుద్యన్నఖాగ్రంబులం జీరి నా యూథపుం సారదిద్గౌరకాయాదవుం బ్రోవవే మర్త్యసింహంబవై. యంబవైక్లబ్యముం బాయ నాక్రాంత లోకత్రయీకుండవై పొల్చి [7]ప్రాధ్వంకృతోదార

---

73వ 1 గ-వతంసా 2 క-మదాందా, చ-మదాందం త-మదోద్ధం, గ-మదాదం 3 చ-జేమనా 4 క ట తలలో ఈ పంక్తిలేదు చ-గ-ప్రతులలో మాత్రముకలదు. 5 గ-కూర్మిచే. 6 క ట త-సాతి. 7. గ-ప్రౌఢ

వింధ్యావళీనాథ దైత్యుండవై నిశ్చలశ్రీ [8]సుచేలీభవత్వా కభిద్వర్ణితప్రౌఢిఁ బెంపొందవే వర్ణివై. యర్ణవైకావృత క్షోణీ రాణించు రాజన్యవారంబులన్ సంప్రహారంబులన్ ఘోర కౌరారధారాప్రహారంబులన్ లీల ముయ్యేడుమాఱుల్ విదారింపవే జామదగ్న్యుండవై చండవైరోచనద్యోతవిద్యోత మానాతితీవ్రప్రతాపంబు మీఱన్ [9]హరిన్నాథ [10]హర్యాత్మ జాదిప్లవంగావళిం గూర్చి హర్యాది నానాహరిన్నాథు లెంచన్ సమిత్థారుణీన్ లోకవిద్రావణున్ రావణున్ గూల్పవే [11]యాజమానుండవై దండివై పొంది యత్యాహితాపాదనోద్ధం డులై యుండు దుష్టాత్ములన్ ముష్టికాది ప్రభూతాసుర [12]శ్రేష్ఠులన్ బట్టి మర్దింపవే ధాత్రి సౌనందివై. నందివాహా శయానందివై దుర్నివారత్రిపురాద్యన క్తంచరాద్యక్షసామర్థ్య ముల్ దారతద్దార సౌశీల్యవై పల్యసంధానచాతుర్యమున్ జూపవే బుద్ధసన్మూర్తివై కీర్తివైరించనాడంబునిండన్ గిరాత ప్రకాండంబు [13]నస్వారసక్రూర నిర్ఘాతపాతాయమానాంఘ్రి ఘాతంబులన్ [14]జక్కఁగఁ [15]జక్క ద్రొక్కించు వీఁకన్ వినో దించవే కల్కివై యిట్టి నీ నిల్కడల్ లోకరక్షావిధాకౌశల శ్రీకి నూహింపఁగా నిల్కడల్, మీ కృపాపాంగమున్ నా పయిన్ జేర్పవే వాంచితార్థంబు లీడేర్పవే చిత్తసంతాపముం బాపవే పాపవేదండ రాట్పఙ్క్తికంఠీరవా. చాపటంకార సంఛన్నగర్జారవా. తాపకృద్ఘోర దైత్యచ్ఛటాభైరవా! తాపసేంద్రావనోద్యద్కృపాగౌరవా. దేవదేవా నమస్తే నమస్తే నమః 73

8 క చ.ట.త-సుచేతీ. 9 చ.గ-హరిన్నాధ. 10 ట-హర్యోత్మ. గ-హారాత్మ. 11 క.చ.ట.గ-యాజఖానుండవై. 12 గ-శ్రేణిజాలంబులం. 13 క.చ.ట.త-శ్వోరస. గ-నశ్లోక్యష. 14 క.ట.గ- జక్కగా 15 క ట-జిక్క. గ-చక్ర. త-జాకి.

తరలము॥ అని మహీవిభుఁ డిత్తెఱంగున నాచరించిన సన్నుతుల్
విని ప్రమోదము నొంది యాగమవేద్యుఁ డాద్యుఁడు సజ్జనా
వనకృపావిలసత్కటాక్షుఁడు వారిజాక్షుఁడు విష్ణుఁ డా
ఘను నభీష్టవరం బొసంగి [1]తగన్ దిరోహితుఁడై చనెన్ 74

కం॥ హరి సత్కృప నిట్లభిమత
వరలాభముఁ గాంచి హర్షవ రదిమగ్న
స్ఫురితాంతరంగుఁ డగుచున్
ధరణీపతి పురముఁజేరి తద్దయు వేడ్కన్ 75

కం॥ హితబాంధవమంత్రిపురో
హితసామంతాశ్రితాదు లెంతయుఁ జెలఁగన్
క్షితిపాలన మొనరింపుచు
సుతసంప్రాప్తి కెదురు సూచుచునుండెన్ 76

కం॥ నెల మసలె నల యిలాపతి
నెలఁతకు నంతట తటాన నెలకొనె మేనన్
వెల తళుకుఁ గులుకు [1]వెలి జిగి
యలతయుఁ జిట్టుముల నిడుర యధికం బయ్యెన్ 78

కం॥ నెలరానిద్దపు [1]టద్దము
తళతళల నిరాకరించుఁ దలతలమనుచున్
దలిరాకుబోఁడి చెక్కులు
నిలిచెన్ జనుమొనల నింద్ర[2]నీలము టెక్కుల్ 78

---

74ప 1 గ-కడున్

78ప 1 ట త గ-తెలి

78ప 1 క,చ,ట,త,గ-టద్దపు, 2 క,చ,ట,త,గ-నీలపు.

తే॥ హళఁది హత్తించి నడుచక్కి [1]నలుపు నిలుపు
సొలపుఁ దెలిపెను గలకి దువ్వలువ పైఁట
మిసమిసాయితకుచకుంభమేచకాభ్ర
చూచుక [2]ద్యుతి పైపయి సొగసుఁజూపె 79

మ॥ నవమాసంబులు నిండినం గనియె నా నాళీకపత్రాక్షి రా
జవరేణ్యుం డలరన్ శుభగ్రహము లుచ్చస్థంబులై పద్మబాం
ధవునిన్ డాయఁగఁ బూని యట్టి సుముహూర్తంబందు సౌందర్యభూ
రివిభాశాలిఁ గుమారచంద్రునిఁ గుమారీరత్నమున్ వేడుకన్ 80

మ॥ తనయుండంగజరూపవైభవసముద్యన్మూర్తియైయుండుటన్
గని రేవన్ మకరధ్వజాఖ్య యిడి రంగత్కౌముదీమోదల
క్ష్మ నెసంగన్ దనయావతంసమునకున్ జెన్నొందు పద్మాకరుం
డనఘస్ఫూర్తిఁ గుముద్వతీశుభసమాఖ్యానం బొనర్చెన్ రహిన్ 81

చ॥ అలవి దలిర్ప నంటి తలయంటి నలుంగిడి తేటనీటిచే
జలకమొనర్చి యుగ్గొసఁగి చన్నిడి చల్వల జిల్గు పొత్తికల్
[1]పొలుపున మేలుఁగా బఱిచి తొట్టుల లోపలనుంచి దాదు లిం
పలరఁగఁ బ్రోదిఁ బెంచి రనయంబుఁ గుమారుఁ గుమారికామణిన్ 82

79ప 1 గ-నిలుపు నలుపు, 2 గ-ద్యుయిపై చాలసొగసు జూపా
82ప 1 చ,త,గ-పొలుపొందగా యతిమైత్రి భంగము

సీ॥ లాలి [1]లాలి యటంచు లీలావతులు వాడ
నించుకించుక నాలకించ నేర్చెఁ
బాలబుగ్గలు ద్రవేలఁ బలుమాఱు దడవుచు
నవ్వింపఁ జెలగొట్టి నవ్వనేర్చె
కేలూత యిడి నిల్పి చాల విద్యమటన్నఁ
జెలరేఁగి విద్యముల్ సేయ [2]నేర్చె
నప్పలో విందులో యని బారసాచి పి
ల్చిన వచ్చి వడిఁ గౌఁగిలింప నేర్చె

కం॥ నాఁడు నాఁటికి వింతవింతలుగ మాట
లాడ నేర్చెను జెలులతో నాడనేర్చె
బాల్యవేళఁ గుముద్వతీపంకజాక్షి
తల్లిదండ్రుల హృదయంబు పల్లవింప 83

కం॥ జీవంజీవ సుహృత్కళ
కైవడి నానాఁటఁ బ్రబలి కనుపట్టు వయో
లావణ్యశ్రీఁ గని ధా
త్రీవల్లభసుత కుముద్వతీసతి దనరెన్ 84

ఉ॥ ఆననసీరజంబునకు హాసముఁ గూర్చుఁ బ్రభాతవేళ, నె
మ్మేని పసిండితీవియకు మించులొసంగుమెఱుంగు ఱాయిసౌ
మ్యానక యే యలంకరణమూన్పెడు జాణ మదంబు నాసవం
బానక తార్చునేరుపరి యౌవనమెంతయుఁ బొల్చె నింతికిన్ 85

---

85వ, 1 చ,ట,గ-లాలీయంచు, 2 గ-దొణగె

కం॥ నున్నని చిటితాళంబుల
చెన్నున చిన్నారి భరణి చిప్పల రీతిన్
గన్నులపండువ సేయుచు
కన్నియకుం బాప చన్నుఁగవ [1]గనుపట్టెన్ 86

చ॥ కళ లొదవెన్ ముఖాబ్జమునఁ గన్నులు వీనుల దాటు [1]పూన్కినో
బెళకఁ దొడంగెఁ గ్రొమ్ముగడ బింకపుఁ జన్గవ నాఁడు నాఁటికిన్
బలియఁగనో యొకింత గనుపట్టె కెసంగెను గౌను. వేణి పొం
దుల కొనఁగూడెఁ బింపిఱులు తొయ్యలి శయ్యలఁ బ్రాయపుందరిన్ 87

సీ॥ శిఖిపించమహిమ మించెను గొప్ప నునుఁగొప్పు
విధుమహాభిఖ్యమై వెలసె మోము
కమలాంబిక గురుత్వగతిఁ గాంచెఁ గన్నులు
బిందంబు రేవఁ జెన్నొందె గళము
గిరిసమున్నతిఁ బూని పఱఁగెను జనుదోయి
భుజగాతిశాయియై పొలిచె నారు
ఘనచక్రవిస్ఫూర్తిఁ దనరె నితంబంబు
గజముచే సన్నుతుల్ గనియెఁ దొడలు
తే॥ ప్రపదములు కూర్మరూపంబు పదయుగంబు
శ్రీనివాస [1]భావనఁ దాల్చెఁ జెలియ యవయు

86వ 1 త–జూపట్టెన్
87వ 1 త–పున్నెనో, గ–పూన్కినే
88వ 1 చ–భావము, గ–భావంబు.

వంబు లారూఢవరవయస్కంబు [2]లగుట
నీదృశవిలాసంబు వింతలే యనంగ 88

సీ॥ అలికంపు టపరంజి పలుక వ్రాసిన వ్రాలు
గానోపు నల లతకూన కురులు
ఫాలభాగమృగాంకు మేలిమై లాంచనల్
గానోపు నల లతకూన కురులు
నుదురుఁ దామరరేకు తుదమొదల్ తుమ్మెదల్
గానోపు నల లతకూన కురులు
నిటలస్మరార్ధ చందిర బాణపులకాళి
గానోపు నల లతకూన కురులు

కం॥ తేటయగు మౌని జనహృత్కవాటవాటిఁ
బాటితము సేయు నవ[1]శరాభ్యాసమునకు
నొసలు[2]టద్దంబు పై నిల్పి నసమశరుని
[3]గుఱులు గానోపు నల లతకూన కురులు 89

తే॥ ఫణిమహాహీనజాతి దే పాటి యనుచు
నగు విషధరత్వమైత్రి కార్మొగులు మిగుల
నందులకుఁ బూనసెంత లే దప్రకాశ
మని తెగడు దాని శుకవాణి యలఘువేణి 90

2 క చ ట–లెయట గ–లిచట
89 ప 1 క ట–రసా 2 క ట–ట్టంబు త–దట్టంపు చ గ–టద్దంపు,
3 క–కురులు చ–గురుని, ట,త,గురులు

తే॥ శైవలద్యుతు [1]లొలయించు చంచరీక
చాకచకి నించు వికచమేచకసరోజ
వైభవముఁ గాంచు నల కీరవాణి వేణి
యమున నిద్దంపు వేణి కేమౌనొ కాని 91

చ॥ ఉవిద వెడందకన్నులకు నొక్కటికొక్కటి సాటి గాక యీ
భువనములందు నొండొకటిఁబుట్టునె యంచు విరించి మించఁగా
నవవిధనీలికారసమునన్ లిఖియించిన యక్కటుల్ సుమీ
యివి యన నుల్లసిల్లు మదిరేక్షణకున్[1]గడివంకకన్బొమల్ 92

తే॥ వదనవిధుఁ [1]గొల్వ నిరువంక వచ్చి నిలుచు
నంచితశ్రీలు నా వీను లలరెఁ జెలికిఁ
దత్కర[2]స్థంబులగు తెలిదమ్మి [3]కమ్మ
మొగడలో నాఁగ ముత్యాల బుగడ లమరె 93

మ॥ ఘనసారం బను పేరిటన్ జగతిపైఁ గన్పట్టినన్ బట్టి ని
మ్మనఁటిన్ బుట్టిన గప్పురంపుఁ బలు కాహా యుద్దిగా నేర్చునే
జనదృగ్భూషణదంతిదంత [1]కులిశచ్ఛాయానికాయంబుతో
బెనఁగన్ జాలువధూకపోలములకున్ [2]బెళ్కొండ్లుచింతించినన్94

చ॥ కలువలు వాలుగల్ మొదలుగాఁ గలవాని జయించి మించు నీ
పొలఁతి వెడందకన్నులకుఁ బోలిక పుష్కరసూన మంచు న

---

91ప 1 క,చ,ట,త-లాలయించుక
92ప 1 గ-నెలవంక,
93ప 1 గ-గెల్వ, 2, క,చ,ట-స్థలంబులగు, 3, గ-కన్న
94 ప 1 గ-విశద, 2 గ-బెళ్కొమి

న్నలువ వచించె గాన నిజనామము పుష్కరసూన మంచునో
జలజము బోటి కన్నుఁగవసాటికినూల్కొనుమాటిమాటికిన్ 95

కం॥ ఆ హరిణనయన నయనము
లూహింపఁగ నెట్టి ఘనములో. కాని తటి
ద్వ్యూహములఁ [1]గొలిపి బాహా
బాహిం బెనగింపఁదొడఁగెఁ బ్రాభవ మలరన్ 96

తే॥ తమ్మితొగ వాలుగలఁ బ్రసిద్ధత వహించు
తగఁ గురంగం బసమ్మతధర్మ మగుచుఁ
గానఁబడు కామినీమణి కన్నుదోయిఁ
బోల్ప నుపమాన మొకటింకఁ బుడమిఁ గలదె 97

కం॥ రమణీమణి యధరామృత
మమృతముఁ దులఁదూపఁ జులుకనై దివిమొగమై
యమృతంబు ననియె గౌరవ
మమరంగా నిలిచె నచట నధరామృతమున్ 98

సీ॥ మొలకనవ్వుల పేరఁ జిలుకదే రేయెండ
కువలయోల్లాసి వైభవము గాదె
యధరమాధురి పేర నలమదే యమృతంబు
కమనీయలక్షణాకరము గాదె

96ప 1 గ-గెలచి

గురుహావరుచిపేరఁ గురియదే వలిమంచు
పరిపూర్ణతర[1]సుధాకరము గాదె
యుదుటు క్రొవ్వెదపేర నొరయదే ఘనరాజి
నిగనిగతార[2]కాన్వితము గాదె

తే॥ [3]నిద్దమగు చెక్కుటద్దంబు నీడ పేర
బింబము వహింపదే ప్రసన్నంబు గాదె
కంటి కుత్సవమగు [4]కలకంఠకంఠి
మోము నెఱచందురుఁడు గామి కేమి గతము 99

మ॥ అమృతాబ్ధిం జనియించె నబ్జయుగళంబయ్యబ్జయుగ్మంబులోఁ
బ్రమదారత్నము మోముఁ [1]దమ్మి తనమున్ బ్రాపించె దంతాబ్జరా
గమణీహారము లూనె నొక్క డొకఁడా కాంతాగళంబై మనో
రమముక్తాసరముల్ భజించెఁ దగదే రత్నాకరోద్భూతికిన్ 100

సీ॥ కమలకోరకములు గాఁబోలుఁ గాకున్న
భుజమృణాళికలతోఁ బొత్తుగనునె
కలికి జక్కవకవ గాఁబోలుఁ గాకున్న
సతతమానసయుక్తి నతిశయిలునె
కరికుంభతలములు గాఁబోలుఁ గాకున్నఁ
జలువ మిన్నలకును నెలవులగునె

99ప 1 చ-కలాభవము, గ-కళాధరము, 2 గ-కోల్లాసవైభవముగాదె, 3. క,ట-నిద్దముగ, చ-నిక్కముగ, 4 గ-నీల
100ప. 1, చక్క-దనముం,

ఘనసుమస్తబకములు గాఁబోలుఁ గాకున్నఁ
బత్రవల్లినిరూఢిఁ బరిఢవిలునె

తే॥ చవులఁ గ్రీడించు రతిమనోభవుల పాలిఁ
గేళిభూధరయుగళి గాఁబోలుఁ గాక
యున్నఁ [1]జంచత్త్వభారుఝరీయుతము లగునె
యువతిజనసార్వభౌమి పయోధరములు 101

ఉ॥ వేమఱు కంఠదఘ్నజలవేణి వసించియుఁ గంకణంబులన్
దామరసంబు లంట వవి తామరసంబులు సాటియే రస
శ్రీమహనీయకంకణగరిష్ఠములై తగు మా కటంచు న
క్షోమలి కేలుఁదమ్ములు నగున్ నఖరాంశుకులచ్ఛలంబునన్ 102

ఉ॥ చెందొవ విందుచే కళలుఁ జిందఁగ ముద్దుమొగం
బొనర్చుచున్
గందు పయోజగర్భుఁడు దిగంజన నొత్తిన గబ్బి [1]గుబ్బలన్
సందునఁ జెంది మందగతి జాఱఁగనైన తదీయరేఖ నా
నందము మిఱు నిందుముఖి యారు మిళిందపు బారుఁ
గేరుచున్ 103

తే॥ పంచభూతాత్మకంబుగాఁ బడఁతిఁ జేయు
సమయమున నల్వ [1]మిక్కిలి జాణగానఁ

---

101వ 1 గ–చంచద్ఘన
103వ 1 క చ,ట,త,గ–గుబ్బనున్
104వ 1 గ-చక్కని

గానరాకుండఁ జెలి కౌను గగనమునను
ఘననితంబంబు ధరణిచక్రమునఁ జేసె 104

కం॥ వనితాజఘనమహోన్నతిఁ
గనియెదనని సైకతంబు ఘనహంసాప్తిన్
వనవాసియయ్యెఁ గలదే
యనఘజఘనగౌరవము జడాశయగతికిన్ 105

చ॥ [1]కలితశుభోరు[2]వైఖరి దగన్ విధి వ్రాసిన భాగ్యరేఖ ను
జ్జ్వలకరభంబు లెంతయును సాటికి వచ్చిన వచ్చుఁగాక పైఁ
గల పొర తీసిపోఁ గదళికాతరుకాండము లుర్వి నెంత యా
కులగతిఁ జెందెనేనియును కోమలి యూరులసాటివచ్చునే 106

కం॥ కాంచనరంభాయుగళము
పంచాననరాజమధ్య పటువగు తొడపై
పంచకరభద్రదంతి స
మంచితకరరేఖఁ గెలిచి యడగించెఁ [1]బగన్ 107

చ॥ నిరతము కంటకప్రతతి [1]నించుక కొంచక పొట్టఁ [2]బెంచినన్
మురిపెముమీఱఁగా నృపతిముఖ్యులముందఱ సారె మ్రోసినన్
గరువపు శాలిగర్భములుఁ గాహళముల్ సరిఁబోలు టెట్లు నూ
పురబిరుదంబులై తగు నభోనిభమధ్య మెఱుంగుజంఘలున్
108

106వ 1 గ-కలికి, 2 గ-రీతికి
107వ 1 గ-దగన్
108వ 1 గ-నెంచక, 2 చ-బెర్చినన్ గ-జొచ్చినన్

చ॥ సమదమతంగజప్రకట[1]సంగచరన్మధుపావళీసమా
క్రమణము [2]రేఁగి లేచి [3]విడఁగానక జీవన మందుటెంత మా
త్రమని పయోజముల్ సతిపదద్వయమై జనియించినిశ్చలున్
సమధికహంసకాప్తిని నెసంగెఁ బురాహరి పాదసేవలన్ 109

సీ॥ కందుఁ గుందును లేని యిందుఁ జేయఁగఁ బూని
చెలి మోముఁ గల్పించె జలజభవుఁడు
గగనారవిందంబుఁ గల్పింపఁగాఁ బూని
చెలి నాభిఁ గల్పించె జలజభవుఁడు
నిలుకడ గల మించు నిర్మింపఁగాఁ బూని
చెలి మేనుఁ గల్పించె జలజభవుఁడు
సొగసుకెంపుల చాయ సుధ యొనర్పఁగఁ బూని
చెలి మోవిఁ గల్పించె జలజభవుఁడు

తే॥ తలిరుఁద్రాయంపు [1]బెళుకని తలిరుగుంపు
సొంపు మీఱంగ నజుఁడు సృజింపఁబూని
వనజముఖి పాణిపదపల్లవములుఁ జేసెఁ
గాకయుండిన నాశ్చర్యకరము లగునె 110

ఉ॥ తేనియ బావి మోవి సుధ తేటలు [1]మాటలు కమ్మవిల్తుకై
[2]కానుక తూపుచూపు జిగి గల్గిన [3]వెన్నెల క్రొవ్వు నవ్వు మీ
[4]దౌవను గెల్పు[5]వల్పు వినుమా యనుమానములౌను దేంట్లకున్
వేనలి చాయ దాయ. యలవే యల. వేదినితంబ నెంచఁగన్ 111

---

109వ 1 చ-సంగటచెర గ-సంచరతన్. 2 చ త-వేగి, గ-గల్గె, 3 గ-వడి
110వ 1 గ-చితుకని
111వ 1 క.ట-నీటులు, 2 క చ.ట.త-కానికె 3 చ.త-వన్నెల. 4 క-డానను చ-టానను, గ-టౌనను 5 గ-బొల్పు

సీ॥ కదళులో [1]కాక పంకజపాణి యూరులో
కరిచేతఁ [2]గాని నిల్కడకు రాదు
బింబమో కాక గుబ్బెత యోష్ఠబింబమో
శుకముఖంబునఁ గాని సూటి [3]గాదు
జలజమో కాక చంచలనేత్ర వదనమో
రాజుచేఁ గాని నిర్ణయము [4]లేదు
చిలువయో కాక కోకిలవాణి వేణియో
శిఖిచేతఁ గాని [5]యీ చింత వోదు

తే॥ భద్ర[6]వంశ సముద్భూతిఁ బఱఁగి యతను
బలసమున్నతిఁ గని కళాకలనఁ దగి ఘ
నోదయస్ఫూర్తిఁ దనరు నీయొద్దఁ గాక
నాతి రుచిరాంగ[7]రీతి విఖ్యాతిఁ గనునె 112

చ॥ కలికిమిటారి లేనడల కంతుని పట్టపుదంతి ముద్దు ప
ల్కుల వలరాచతేజి జిగి కుందనపుంబని కీలుబొమ్మ వె
గ్గలమగు తావి కస్తురిమెకమ్ము చొకాటపుగుమ్మ నవ్వు వె
న్నెల నెలసోగ యా చెలువ నీక తగున్ నరపాలశేఖరా 113

కం॥ ఆ చంద్రవదన నెచ్చటఁ
జూచితివని యడిగితేని సురవరు వెంటన్
నీ చెంతకు వచ్చుచు దృ
గ్గోచరమగు వింధ్యశైలకూటములందున్ 114

112 ప 1 గ-లేక, 2 గ-నిల్కడగానిరాదు, 3 గ-రాదు, 4 గ-రాదు, 5 గ నిశ్చయతరాదు, చ-యీ చింతగాదు 6 గ-పుంజ, 7 గ-విభవాతిఖ్యాతి

కం॥ మరకతపల్లవపరిమళ
భరితసువర్ణప్రసూనబహురత్నఫల
స్ఫురితంబై వన మొక్కటి
యరుదై కనఁబడియె లోచనానందముగన్ 115

శా॥ ఆ పజ్జన్ నిగరంపుఁగెంపుగమి కోనావంక పూనీటి [1]కా
ల్వాపొంతన్ సలతాంతకేసరచయం బా [2]చెంత సంతానవా
టీపర్యస్తపరాగ వేదిపయిఁ గంటిన్ గంటికింపైన శం
పాపాటింధమచారుగాత్రలతికన్ పద్మాకరేశాత్మజన్ 116

వ॥ అని కుముద్వతి వృత్తాంతం బాద్యంతంబు తెల్పిన ప్రహృష్టాంత
రంగుడై రుక్మిణీతనూజుండు కీరరాజంబు నాలోకించి 117

సీ॥ శుకసార్వభౌమ! నీ శుభకరాలాపముల్
వింటిమి వీనులవిందు గాఁగ
పద్మాకరక్షమాపతిపుత్త్రి నీక్షింప
గాఁ గోరుచున్నది కన్నుదోయి
తత్కన్యకామణి దర్శనోత్సవలాభ
మొదవునే మాకు నిన్నుండి గాక
యని ప్రియం బొనరింప నవి యెంతపని మీరు
రత్నకేతనపురప్రాంతవనికిఁ

116 ప 1 క.చ.ట-వంకా గ-సంకా, 2 గ-దంత

తే॥ గదలి విచ్చేయుఁ డచటి కా కంబుకంఠిఁ
గౌశలమున నాకర్షించి [1]కనఁగఁ జేసి
ముద మొనర్చెద [2]నీదు నెమ్మదికి ననుచుఁ
జిలుక యెంతయు ముద్దులుఁ జిలుకఁ బలికె 118

కం॥ జనపాలమౌళి యందుకు
మనమున నామోదమూని మౌనివరుని వీ
డ్కొని రాజకీరదర్శిత
ఘనపద్ధతి సఖునితోడఁ గడువడి మెఱయన్ 119

తే॥ చని యనేకవనాద్రి దేశములు గడచి
రత్నకేతనపురవరప్రాంతవనము
నందు నొక గుజ్జులేమావి క్రింద నిలిచె
నిలిచిన శుకంబు తన మాయ కలిమి నపుడు 120

ఉ॥ బంగరు ఱెక్క చొక్కటపుఁబావుర మొక్కటి యగ్రభూమి ప్రా
లంగ నొనర్చె యాదవకులప్రవరుండును దానిఁ జూచి వే
గం గొనిరమ్మటంచుఁ జెలికానిఁ బ్రియుంబునఁ బంచె వాఁడు వే
డ్కం గమకించిపో నది తటాలున దవ్వుగఁ దీసె నాతనిన్ 121

శా॥ ఈ రీతిన్ విజనం బొనర్చి శుక మా హేమాంశుకాత్మోద్భవున్
సారాదృశ్యకళన్ గనంబడకయుండన్ నిల్పియా [1]భవ్యలీ

118వ 1 గ-కలుగ. 2. గ-నీకు
122 వ 1 గ-భాగ్య.

లారామంబునకున్ బయోరుహనిభాస్యన్ నూత్నలావణ్యరే
ఖారమ్యాంగఁ గుముద్వతీయువతి నాకర్షించెఁ
[2]జిత్రంబుగన్ 122

వ॥ ఇట్లాకర్షించిన 123

మ॥ తళుకుంజెక్కుల చాకచక్యములు దంతచ్ఛాయలన్ దెల్ప గు
బ్బలసౌభాగ్యము కుంభవిభ్రమముఁదెల్పన్ బాదభూషాఝుళం
ఝుళనిక్వాణము లంఘ్రిలగ్ననిగళస్వానంబులం దెల్పఁ దొ
య్యలి వచ్చెన్ విడివడ్డ మన్మథుని మాద్యద్దంతి
చందంబునన్ 124

సీ॥ సహజసాంకవపంకసౌరభంబుల తావి
యలరుల కినుమడిఁ గలుగఁ జేయ
వీనులతో రాయు వెడఁదకన్నుల డాలు
కలయంగ భృంగ [1]సంఘముల నీనఁ
దళుకుమేని మెఱుంగు లలమి బంగరురంగు
లలరుఁ దీవెల కెల్ల మొలవఁజేయ
కలికి చెక్కుల మీఁది తళతళల్ మాధూక
కళికానికాయ మగ్గల మొనర్ప

తే॥ వచ్చి యచ్చెలి చెలులతో వనముఁ జొచ్చి
తియ్యమామిడి క్రొం[2]బండుతేనె [3]చేతఁ
బచ్చిగట్టిన వలరాచ పాదుషాహు
చిలుకసాంబ్రాణి వైఖరి చెలువ మెచ్చి 125

2 గ-చిత్తంబునన్

125 ప 1 గ-సంగతుల, 2 క,చ,ట,త-బంటి, గ-బట్టు, 3 గ-తోడ

చ॥ దళముగఁ బొన్నలన్ ననలు దార్కొన గోఁగుల దావి
క్రొవ్విరుల్
వెలయ వినోదవైఖరుల వేమఱుఁ బల్కుచుఁ గేరి నవ్వుచున్
మెలఁగి మెలంగి కొంతలసి మెల్లని చల్లని కమ్మఁదెమ్మెరల్
వొలయు రసాలసాలవనభూమి నొకానొక [1]క్రేవ వీవఁగన్ 126

శా॥ సొన్నా చెక్కడపున్ బెడంగడర మించుల్ గుల్కు బ్రాఁగెంపురా
క్రొన్నిద్దంపుఁ దురంగిగద్దియపయిన్ గొల్వుండె మై ఝాళువా
మిన్నల్ దిక్కులకెల్ల వన్నియలిడన్ మీనాంకు వాల్గంటి రే
ఖ న్నానావిధ తానమానములెసంగన్ వీణ వాయింపుచున్ 127

మ॥ గొనబుందావులు ఘుమ్ముఘుమ్మురనఁగాఁ గ్రొవ్వాడికప్రంపుఁబ
ల్కునఁ బద్మాకృతిగాఁ [1]మలంచి పయిరేకుల్ చక్కఁగా
[2]దీర్చి నే
ర్పునఁ గావించిన పైరిణీసురఁటియంభోజాస్యయొక్కర్తు దా
ల్చి నిశాకాంత సమేతరోహిణి యనన్ చెంతన్ వసించెన్
రహిన్ 128

చ॥ అలఘుకళాతిభవ్యమగు నంబుజలోచన మోముఁదమ్మికిన్
దలఁకి మహాద్భుతంబుగఁ బునఃపునరానతు లబ్జవైరి దా
సలుపుచునున్నవాఁ డనెడుచందముదోపఁ గనొక్కయింతి మే
ల్వలపుల నీనఁ బూసురఁటి వైఖరిగా విసరెన్ లతాంగికిన్
129

126 ప 1 క-క్రేవరీవనను, చ-క్రేవరివగను, ట-క్రేవరీవగను, త-క్రేవదీవిగన్
128ప 1 క,ట-దలంచి, 2 క,చ,ట,త-దీర్చ

కం॥ [1]చెలినడలఁ గెలువ బూనిన
తెలియంచున్ గెలిచి పట్టి తెచ్చె ననంగా
నెల చలువ యంచ గిండిన్
[2]బొలుపుగ ధరియించి యొకతె ముంగల నిలిచెన్ 130

చ॥ కనకశలాకికా[1]కలితగాత్రలు గొందఱు వేడ్కతో వినూ
తనతరవిద్రుమ ద్రుమలతాపరికల్పితవేత్రయష్టివ
ర్తనములు మీఱ సారెకు బరాబరి సేయఁగఁ గోపులందుఁ జ
య్యనఁ జెలువెల్ల నిల్పిరి ప్రియంబు నయంబు భయంబు
శోభిలన్ 131

చ॥ [1]వలనగు పచ్చరామొసలివాయడపంబు కటిన్ ఘటించి చె
ల్వలరెడు జిల్కుపావడ భుజాగ్రమునన్ సవరించి మేలి [2]కెం
పుల బవరంబు హస్తమునఁ బూనియొకర్తు వసించెఁ జెంగటన్
బొలుపగు తెల్లటాకు మడుపుల్ కనుసన్న నొసంగుచున్
రహిన్ 132

వ॥ ఇవ్విధంబుననవ్వధూలలామం బభిరామశుభారామసీమంబున
ననన్యసామాన్యవై భవంబునఁగొలువున్న సమయంబున 133

ఉ॥ రాజకులాగ్రగణ్యుఁ డల రాజముఖీమణిఁ జూచి తద్వయో
రాజితరూపదర్శన నిరంతర హర్షపయోధిమగ్నుఁడై

---

130ప 1 క ట–చలగినడ 2 గ–బొలుపున
131ప 1 గ–కనక
132ప 1 క,ట–వలనుగ పచ్చమేలి నలిచెంబు కటిస్థలి సంఘటించి.
2 గ– కొవ్వల

రాజిలుచుండె నంత శుకరాజము నవ్వనితాసమీపవి
భ్రాజితచూతభూరుహముపై నటు వ్రాలి విచిత్రవైఖరిన్ 134

తే॥ చక్కఁజ యొసంగవే యో విశాలనయన
ముద్దుపెట్టవే యో జగన్మోహనాంగి
తియ్యని ఫలంబు లియ్యవే తీపబోఁటి
యనుచు నొయ్యనఁ బలికె నెయ్యమున నపుడు 135

కం॥ కలకంఠకంఠి దానిం
జెలు వలరఁగఁ జూచి ముద్దుఁ జిలికెడు చిలకన్
జెలులార! కంటిరే యని
యలఘుతరాశ్చర్య మాత్మయందుఁ దలిర్పన్ 136

మ॥ భళిరా యీ శుకసార్వభౌము సరిఁ జెప్పన్ జూపఁగాఁ గల్గునే
యల వాణీకరకంజమంజుశుకమో యార్యాసరోజాక్షి యిం
పుల వేమాఱును ముద్దుసేయు శుకమో పుష్పాస్త్రు నెయ్యంపుఁ దొ
య్యలిచే మన్నన గన్నయట్టి శుకమో యంచున్ వితర్కింపుచున్ 137

చ॥ కొటుకొటు రామతమ్మ యిదె కొమ్మని కమ్మనితావి[1]మోవి చొ
క్కటపుఫలంబు జూపుటయుఁ గ్రమమణీమయకంకణోర్మికా
పటలవిరాజమానమగు పంకజలోచన కేలుపై సము
త్కటమతి వ్రాలె రాచిలుకతత్సమయోచితకార్యకాంక్షయై138

138ప 1 క ట.త-మావి. చ-మాటి.

ఉ॥ ప్రాలిన చిల్కఁ జూచి యల వారిజలోచన చోద్యమంది యు
ద్వేలమనోనురాగమున వేమఱు ఱెక్కలు చక్కదిద్దుచున్
జాల నవాతు చొక్కటపుఁ జక్కెరమేపుచు మేనుదువ్వుచున్
లాలనఁ బల్కెఁ గోకిల [1]కలధ్వనిజిత్వరవాక్యయై ఖరిన్ 139

తే॥ ఎచట నే రాజు గృహసీమ నెలమి [1]నుందు
విచటి కిప్పుడు రాఁ గత మెద్ది నీకు
నీదు విధమెల్ల వివరింపు నెమ్మితోడ
సుతనురుచిజితమరకతాంశుకమ ' శుకమ ' 140

వ॥ అని యాదరంబున నడిగినఁ గుముద్వతీలావణ్యవతిం గనుం గొని విజనం[1]బుఁ గావించి శుకంబు కంబుకంధరాశిరోమణి' మున్ను తారకుఁ డను దానవాగ్రేసరుఁ గదనరంగంబునఁ గేకి తురంగుఁడు మెఱుంగు వాలమ్ములఁ ద్రుంచిన మెచ్చి వియచ్చరభర్త దేవసేన యను నిజకన్యకామణి నతనికిఁ బరిణయం బొనరించి హరునికడకుఁ దోడ్కొని చని యతని చేత సత్కృతుఁడై [2]మఱలి వచ్చునపుడు హిమధరాధర తనయ పౌలోమిఁ బిలిచి [3]యొసగిన నన్ను నింతకుమున్న [4]దుష్కరశౌర్యుఁడగు పుష్కరాసురవర్యుఁ బరిమార్చిన హర్షంబునఁ [5]జేర్చి యింద్రుండు రుక్మిణీసతీగర్భ దుగ్ధార్ణవ[6]పూర్ణిమాపూర్ణచంద్రుఁడగు చారుచంద్రునకు నన్నిచ్చె

---

139ప 1 గ-మధుధ్వని

140ప 1 క.చ.ట.త-నందు

141ప 1 గ-బొనర్చుమనినం బెంచుబోడియునట్లే యొనర్చిన శుకంబిట్లను. 2 గ-మరలునపుడు. 3 గ-నన్ను నొసంగె నచట నేనుండ. 4 గ-అతిదుష్కర పర్యుండగు. 5 క.ట.త.గ-జేర్చి. 6 గ-పౌర్ణిమా సంపూర్ణ.

నే నతని సౌందర్య ధైర్యభుజాశౌర్యాది గుణంబుల కలరి యాతని[7]కిఁ దగిన కన్యారత్నంబు నెల్లలోకంబు లన్వేషించి కానక యోగదృష్టిఁ జూచి విష్ణువరసముత్పన్నవగు నిన్ను నవ్విభుని[7]కిఁ దగిన [8]కన్యవని యెన్ని యిచ్చటికి వచ్చితి నదృశ్యాంజనాకర్షణాది విద్యలన్నియు నాకుఁ గరతలామలకములై యుండు త్రికాలవేది యను నామంబునఁ బ్రవర్తిల్లుదు నీ వతనిఁ జూచెదవేని రహస్యంబున నేఁ జూపెదఁ జూడుమని యంగీకరింపఁజేసి తదీయ నయన కంజంబుల దివ్యాంజనంబుఁ దీర్చిన 141

ఉ॥ కుందనపుం బసిండిరవ గుప్పెడు మోహనకక్షదీధితుల్
పొందుగ గుబ్బచంటికి నపూర్వరుచిం దళుకొత్తఁ జేయఁగాఁ
గుందరదాలలామ నెటిగొప్పుఁ గరంబునఁ జక్కదిద్దుచున్
గందళితానురక్తి మహీకాంతునిఁ జూచె మిటారిచూపులన్ 142

మ॥ నవముక్తానికరంబులై విమలకుంచశ్రేణులై చంద్రికా
నివహోద్యద్రుచికేతకీదళములై నీరేజసంఘంబులై
కువలవ్రాతములై మెఱుంగుగమి టెక్కున్ బిక్కటిల్లన్ రహిన్
నవలాచూపులుఁ బర్వె రాజుపయి విన్నాణంబు రెట్టింపఁగన్
143

కం॥ ఆ చక్కి టెక్కు పక్కెర
రాచిల్క పటాణి నూఁకి రామేయుఁడు ని
ద్దా చాయల లేఁజిగురు [1]క
రాచూరి జరీనఁ బెటికి రమణిన్ నరకెన్ 144

7-కీ. 8. గ-కన్యక
144ప 1 గ-కటాచూరి

చ॥ చెలువుఁడు నోడి యక్కలికి చిత్రపుగా నృపుఁ జూచి[1]చూడ్కితో
వలెనె కవుంగిలించి మొనపంటను దియ్యనిమోవి నొక్కి చ
న్నులు సెదఁ గ్రుచ్చి [2]కన్నుఁగవ మూల్కొన నేమియొ యుగ్గడించు [3]బా
గలవడ నుండె నింతుల మనోంబుజ[4]వృత్తి మెఱుంగవచ్చునే 145

కం॥ ఇతరం బెఱుఁగక మతి నీ
గతిఁ బద్మాకరతనూజ గనుఁగొనుచుండన్
జతురవచోనిధి కీరం
బతులగతిన్ మఱలి చనియె హరిసుతు కడకున్ 146

ఉ॥ అంతఁ గుముద్వతీరమణి యాదరమొప్పఁగఁ [1]జూచి చూచి య
త్యంతకుతూహలా[2]శ్రుజలధౌతశుకప్రతిపాదితక్షమా
కాంతనిధానదర్శనజగద్వినుతాంజనయై తనూరుచిన్
గంతుని నవ్వు నవ్విభునిఁ గానక చింతిలుచుండె నెంతయున్ 147

తే॥ అపుడు సఖులెల్లఁ జేరఁగా నరుగుదెంచి
తామరసనేత్ర యుండు విధంబుఁ జూచి
చిలుక పోయిన మదిలోనఁ జిన్నఁబోయి
యున్న దీ కన్నె యని చాల నూహ చెసి 148

---

145ప 1 క.త–చూడ్కిలో, ట–చూడ్కియో 2 చ.త గ–పీనుగవ. 3 గ–చో, కలవరమందె 4 గ–వృత్తులె

147ప 1 త–గాంచి 2 గ–స్యయయి

ఉ॥ ఎక్కడ వచ్చె రాచిలుక యేల కనుంగొనె దాని నింతి పం
డొక్కటి చూపినంతటనె యెయ్యన నేటికి వచ్చి వ్రాలెనో
యక్కట యేల పోయెనదియబ్జముఖిన్ వెతఁబెట్టి యంచులోఁ
జొక్కుచుఁ గొమ్మఁ దోడ్కొనుచుఁ బోయిరి కాంచన
సౌదవీదికిన్ 149

మ॥ సముదంచత్కటిభాగహైమరుచి వాసక్షౌమ' సక్షౌమ[1]దం
తిమహానీలప యోధరద్యుతికనన్నీలాంగ' నీలాంగనా
రమణీయేక్షణకై రవద్వితయరారాజ దుద్యద్రమా
ర్యమకోటిస్ఫురణాసహిష్ణురుచిపూరాదారః రాధారతా ః 150

కం॥ అక్రూరమహోదరదర
చక్రధరధరాజహరనిశాతశరశర
ణ్యక్రమపరపరమప్రతి
వక్రేతరతరణినిచయవరరుచిరుచిరా • 151

స్రగ్విణి॥ సత్యభామామనస్సారసాహస్కరా'
నిత్యగోపాంగనా[1]నీకహృత్తస్కరా'
నిత్యవిస్ఫూర్తిరంగిభవన్మస్కరా!
దూత్యకృత్యాద్రిజిత్యూనుతేజస్కరాః 152

గద్య॥ ఇది శ్రీ తాడివర్తి గోపాలకృష్ణకృపాకటాక్షవీక్షాసమాసాదిత
కవితానూతనభోజ సంస్కృతాంధ్రభాషావిశేషసారసారస్య
పరిజ్ఞానచాతురీధురీణ మానసాంభోజ చెన్నమరాజ కులాంభోధి
రాజ సంపూర్ణపూర్ణిమారాజ శేషయామాత్యతనూజ చెన్నమ
రాజప్రణీతంబైన చారుచంద్రోదయంబను మహాప్రబంధంబు
నందు తృతీయాశ్వాసము 153

---

150 ప. 1 చ,గ–కాంతి, త–వంతి,
152ప 1 చ, గ–నీతి

# చారుచంద్రోదయము

## చతుర్థాశ్వాసము

కం॥ శ్రీహేమవతీవల్లభ!
సాహాయ్యధురీణ [1]విమల [2]శయహృతినిపుణా!
మాహేయ[3]ప్రహరణచణ
బాహావిక్రమణ! సత్యభామారమణా! 1

తే॥ అవధరింపుము శౌనకాద్యఖిలమౌని
జనులఁ గన్గొని సూతుఁ డిట్లనుచుఁ బలుకు
నటులఁ బద్మాకరనరేంద్రు ననుఁగుఁబట్టి
యాత్మపురిఁ జేరినట్టి యనంతరమున 2

ఉ॥ ఆయతబుద్ధిశాలి శుక మా హరిసూను నదృశ్యభావముం
బాయఁగఁజేసి, లేఁదలిరుఁబ్రాయపు గుబ్బెతమిన్నఁ జూచితే
కాయజరూప! నీకుఁ దగు కామినియౌఁగద యంచుఁబల్కినన్
బాయని వేడ్క నవ్విభుఁడు భాసురహాసవిలాసవ[1]క్త్రుఁడై 3

చ॥ సకలకళాభిరామ! శుకచంద్రమ! నీ వటుఁ బల్కినట్లనే
సుకరముగాఁగఁ జూపితివి చొక్కపుఁజక్కదనంపు జవ్వనిన్

---

1 ప 1 త,గ-బాణ. 2 గ-బాహాశయ. 3 చ-ప్రకరహరణ
3 ప 1 గ-రత్నశోభి

ప్రకటభవవన్మహామహిమఁ బ్రస్తుతిసేయఁ దరంబె యెట్టి వా
రికినని యెన్నుచుండెడు తఱిన్ సఖుఁ డల్లన వచ్చి
చెచ్చెఱన్ 4

గీ॥ పార్థివకులేంద్ర! బంగారు పావురంబు
విధము కడువింత యేమని విన్నవింతుఁ
బట్టి తేఁబోవ [1]నలయించి పట్టుబడక
మాయమై పోయె [2]నమ్మటుమాయ పులుఁగు 5

చ॥ అన విని చారుచంద్రుఁడు సఖా! యది యెక్కటి వింత
యౌనె కా
విను మొక వింత యీ చిలుక విస్మయమైన యదృశ్యవిద్యచే
ననితరలక్షితాంగుఁడగునట్లుగ నన్నొనరించి చూపె మా
కనుపమరూపయౌవనశుభాకృతి నొక్క వధూటి నిచ్చటన్ 6

సీ॥ చెలువంపు నెఱివేణి చికిలితేఁటుల దాఁటు
[1]దాఁటుఁబో సుధ [2]నీటు తేట పాట
పాటలాధరలక్ష్మి పవడంబు నెలయించు
నించువిల్తుని తూపు మించుఁ జూపు
చూపుల పంతమై శోభిల్లుఁ గంధర
ధర పెంపుఁ గటి సొంపు దఱిమి తెగడు
గడుసు గుబ్బలు భద్రకరికుంభనిభములు
భములఁ గేరు నఖాళిప్రభ తెఱంగు

5ప 1 క,చ,ట–నెలయించి, 2 క,చ,ట,త, గ–నమ్మట
7ప 1 గ–నమరు, 2 క,చ,ట–నీటి,

తే॥ రంగు బంగరు మేని విభ్రమము నవ్వ
నవ్వ పసమీఱు వెన్నెల క్రొవ్వ తీరు
తీరు గల ఝూరు తుమ్మెద బారు నలమ
నల మనోభవు రమలీల నలరుఁ జెలువ 7

కం॥ మీలా కన్నులు చీమల
చా లా నూగారు తేనె జా లా పలుకుల్
శ్రీ లా వీనులు సీలపు
రా లా చెలి కురులు బొంగరా లా కుచముల్ 8

సీ॥ బలు గుబ్బ లలరు వంతలను బెట్టని చిఱు
నవ్వ వెన్నెల [1]వేగ [2]నవ్వ టెట్లు
తళుకుఁ బెందొడ లనంటులఁ [3]గూలపని నడల్
కరటి మదమడచు కడిఁది యెట్లు
వెడఁద కన్నుల తమ్మి విరిరేకు మదవతి
నెమ్మోము సోముఁ గుందించు టెట్లు
కెంపు మోవి చిగుళ్ళు ద్రుంపని ముద్దు మా
టలు పికంబుల [4]తా వెడలుచు టెట్లు

తే॥ వింత యని యెంతు రిది యేమి వింత దెలియ
ఘనచికుర గాదొ హరిమధ్యగాదొ॰ రాహు
[5]రోమలతగాదొ॰ రామాభిరామగాదొ
నవ్యసౌందర్యధామ కాంతాలలామ 9

---

తే. క.చ.ట.త-పవర

సీప 1 చ త-నెగ. 2 చ త-నెలుపు. 3 క.ట-గూలిర్పలే, చ-గూల్పనిలే, గ-గూల్చనిలే. 4 గ-రావెడమ చ-తావెడచు, త-లావడంచు 5 క.ట-కోమ, త-రామ

కం॥ దర మా గళము సుధానో
దర మా నెమ్మోము నీరధర మా జడ మం
దర మా చనుఁగవ కాకో
దర మా నూగారు పొగడఁ దరమా చెలియన్ 10

చ॥ వెలఁది వెలంది [1]న వ్యతనువీరమనోహరకీర్తి భామినీ
తిలకము కెంపువాతెఱ రతిప్రభ నూతనదోఃప్రతాపకం
దళము లతాంగి రోమలత దర్పకశాతకృపాణధార తొ
య్యలి [2]నెఱిగెంపుఁ గొ ప్పమరు నైంద్రశిలామయ
ఖేటకం బగున్ 11

సీ॥ సమదేభకర మహాహమికఁ దీర్చునటన్నఁ
గదళీతరుశ్రేణి కథ యదెంత?
కార్తికచంద్రమస్ఫూర్తి మించునటన్న
వనజాత[1]వారంబు వార్తయెంత?
పటుకేకినికరంబు పరిభవించునటన్నఁ
బాటింప నీలాహి మాట యెంత?
శుకతుండరుచి వికావిక[గ] నవ్వునటన్న
ఔగ సూను బింబంబు సుద్ది యెంత?

తే॥ యనఁగ సతికొప్పుఁ గరభమోహనవిలాస
ధారు లూరులు చీఁకటిఁ దఱుము తుఱుము
కులుకు [2]నిద్దంపు టద్దంపు గోము మోము
ఔంచు తేనియ బావి బొమ్మంచు మోవి 12

---

11వ 1 క.చ.ట.త–నవ్య. 2 గ–మెరుగొప్పు
12వ. 1 క,చ,ట,త గ–జాతంబు 2 క,ట,త,గ–టద్దంపునిద్దంపు

సీ॥ కమలంబు నెమ్మోము గాకున్న వీక్షణ
 [1]భృంగపంక్తులు సారెఁ బెనచుటెట్లు?
ఘనఘనాఘనపాళి పెనుఁగొప్పు గాకున్న
 శృంగారరసము [2]వర్షించుటెట్లు?
సౌదామనీలత మైదీవె గాకున్న
 [3]కనుఁగవ మిఱుమిట్లు గొనుటయెట్లు?
సుధమీఁది మీఁగడ యధరంబు గాకున్న
 కోరిన యపుడు నోరూరుటెట్లు?

తే॥ గగన మతిసూక్ష్మ[4]తరమైన కలికి కౌను
గాకయుండినఁ జూచినఁ గానరాదెః
యింతి చెలువంబు చెలి యంద మింతయంచు
వర్ణనలు సేయ నలువకు వశము గాదు 13

తే॥ తుఱుము దఱుమును నీలంపుసరుల సిరుల
నారుగేరును దుమ్మెదబారు తీరు
మొగము నగఁజాలుఁ గలువల మగని జిగిని
చెలువ చెలువంబు రతిదేవి [1]పొలుపుఁ దెలుపు 14

సీ॥ తాఁబేలు గమినైనఁ దా బేలుపడఁజేయు
 [1]వల్లకీపాణి మీఁగాళ్ళ దిరుగు
సింగమ్ము నడుము వాసిం గమ్ముకొని నవ్వు
 బిసరుహారినిభాస్య యసదు గౌను

---

13వ 1 గ-భంగ 2 క చ ట త,గ-వర్షించు, 3 చ-కనుగొన, గ-కనుగొను
4, గ-మైనది

14వ 1 క,ట,త-వలపు

చిగురాకునకు సారెఁ జిగురాకు [2]గట్టించు
శంపాలతాగాత్రి కెంపు మోవి
చంవమామకు వింత చందమామను జేయు
భామాశిరోమణి మోము గోము

అలరు నలరున [3]కొసఁగు మైవలపు వలపు
మెఱుఁగు మెఱుఁగుల నునుమేని మించు మించు
నాతిరేఖావిభూతి యీ రీతి యనుచుఁ
గల విధంబెల్ల వర్ణింప నలువ కలవె? 15

ఉ॥ కన్నుల కల్కి లేనగవు కమ్మని వాతెఱపై నటింపఁగాఁ
గ్రొన్నన తాపి బొక్కరనఁ గ్రొమ్ముడి జార మిటారి చూపువాల్
మిన్నలు సూనసాయక శిలీముఖ పఙ్క్తులఁ [2]గ్రమ్మరింపఁగా
పొన్నల నీడలన్ మెలఁగు పొంక మదేమనవచ్చు నెచ్చెలీ! 16

చ॥ తొడ లనఁటుల్ మొగంబు నెల తోయజముల్ కనుదోయి లేఁజిగు
ళ్ళడుగులు పల్కు గప్పురము హస్తయుగంబు బిసంబు నాఁచు క్రొ
మ్ముడి తరఁగల్ వళిత్రయము మోవి సుధారసధారనిక్క మా
పడతి నురంబుపై నిడక పాయునె కాయజుతాప మక్కటా! 17

---

15 1 గ-పల్లవ. 2 క.ట.త-గ ఘటించు. 3 గ-కనుగు.
16వ. గ-ఘటింపగా. 2. గ-గుమ్మరింపగా

చ॥ అని చెలికానితోఁ బలికి హాళి నఖర్వ[1]వరాళి ముర్వీదో
ర్వినుత[2]శరాళికిన్ దలఁకి విన్నఁదనంబు వహించి యున్న వె
న్నుని సుతుఁ గాంచి కీరము మనోహరరూప తలంకనేల నె
మ్మనమున వాంఛితార్థము రమాపతి నీ కొనగూర్చు
నెంతయున్ 18

కం॥ నా వాక్యము నిక్కంబుగ
భావింపుమటంచుఁ [1]బలికి పంకజశరవీ
రావరజు ద్వారవతికిన్
వేవేగమె తెచ్చి నిలిపె విస్మయ మొదవన్ 19

వ॥ ఇట్లు నిలిపిన నయ్యాదవేంద్రనందనుఁడు 20

చ॥ కొనకొని భోజకన్య యనుఁగుం జెలు లెంతయుఁ బిల్వఁ
బిల్వ నె
మ్మనమున కింపుగామి నొక మార్గమునన్ జలకంబొనర్చి కుం
దనపు మెఱుంగు చేలఁ గటిఁ[1]దాల్చి విరుల్ సికఁ జుట్టి
మేనఁ జం
దనము నలంది భోజన మొనర్చి విహారగృహాంతరంబునన్21

తే॥ మవ్వమగు పువ్వుఁబాన్పునఁ బవ్వళించి
యల కుముద్వతి మదిలోన నలవరించి

---

18వ 1 కి ట–పరాల 2 క,ట త–కరాళి
19వ 1 చ,ట త, దెలిఎ, గ–దెల్పి.
21 వ 1 చ, గ–దార్చి, 2 క, చ ఠ, త – మేలి

పలుమఱు తదీయరూపమై భవము నెంచి
యెదుటఁ గనుపట్టినట్టైన నెలమిఁగాంచి 22

ఉ॥ దిగ్గన లేచు లేచి సుదతిన్ నలుదిక్కులఁ జూచుఁ జూచి తా
నగ్గజయానఁ గన్గొనమి హా యనుచున్ మఱలంగ వ్రాలు లో
బెగ్గిలు నట్టిటుం బొరలుఁ బ్రేమఁ దలంచు మనంబులోపలన్
వెగ్గలమైన సూనశరవేదన [1]బెగ్గిలమై నలంపఁగన్ 23

వ॥ ఇవ్విధంబున మదనతాపంబునఁ బొరలుచు నవ్విభుండు
తనలోన 24

మ॥ తళుకుం గ్రొవ్విరిపాన్పుపై రతుల వింతల్ మీఱఁగాఁ గూడి చె
క్కిలి యొక్కించుక నొక్కి మోవి సుధ కోర్కిం
జొక్కుచున్ గ్రోలి యు
య్యలివేణీమణి గుబ్బచన్నుఁగవపై హాయంచు నిద్రింపఁగాఁ
గలికీ! నా కలనైనఁ గల్గిన రహిం గన్పట్టవే భాగ్యముల్ 25

మ॥ మినుకుం గుబ్బమొనల్ భుజాంతరము గుమ్మల్ వోవఁగా
నాట మో
హనబాహాయుగళిన్ బిగించి మధురం బైనట్టి కెమ్మోవి చుం
బన మింపూనఁగఁ జేసి రెండొకటియై పాటిల్లినట్లుండ హా
యనిశం బా కలకంఠి నన్గలయు భాగ్యం [1]బింక
నాకెన్నఁడో 26

23వ 1 చ.గ–వేదన
26వ 1 గ–బొందుటం

సీ॥ చిగురాకు గెలిచెనో చెలియని కెమ్మోవి
రత్నాభిషేక విభ్రమముఁ గాంచె
చంచల [1]నొంచెనొ సఖియని నెమ్మోము
మణి[2]మాలికాజాలమహిత మయ్యె
దుర్గాధిపత్యంబు [3]దొడఁగెనో తరుణిని
ఘనకుచంబులు రాజకళ వహించె
సుడి వంతఁ బెట్టెనో సుదతిని పొక్కిలి
తొడిఁబడ మురికి లోఁబడకి మెఱసె

తే॥ ననుచు గర్భోక్తి చాతురిఁ దనర నాడు
చెలుల నిడువాలు [4]చూపుకోపుల నదల్చి
బాలికామణి గాఢాంకపాళిఁ దేల్చి
ప్రోడఁ గావించుటెన్నఁడు [5]పొసఁగునొక్కొ? 27

తే॥ అనుచుఁ జింతిల్లునంత నమ్మనుజపతికి
రాజకీరంబు సముచితక్రమసుధాతి
శీతలోక్తుల నొకకొంత సేదఁ దేర్చి
కథలు వినుపించి ప్రొద్దులు గడుపుచుండె 28

కం॥ అట రత్నకేతనంబున
దిట [1]మేది కుముద్వతీసతీమణి ఘృణిమ
త్పటుచారుచంద్రవిరహో
త్కటుచింతాసంజ్వరాతితప్తాశయయై 29

---

27ప 1 క,త-బెంచనో. 2 క,ట-వాలికా. 3 చ-దొరకెనో, గ-దొరకునో.
4 చ-కొప్పుచూపుల, క ట,ల-ప్రతులలో ఈ పంక్తిలేదు. 5 గ-బరగు
29ప 1 గ-మెడలి

కం॥ వెడవిల్తుని తూపుల¹తోఁ
బడి విన్నఁదనంబు నొంది ప్రతివాసరమున్
బుడుత వడిగాడ్పు ²పొలయక
గడగడ వడఁకున్ నిజాలికలనం బాయన్ 30

శా॥ వాదోడైన శుకాంగనామణులఁ బిల్వంగాఁ గచశ్రేణికిన్
సైదోడైన మదాళిగీతి చెవి పజ్జం జేర్పఁగా నెప్పుడున్
జేదోడైన మణీమనోహరవిపంచిన్ ¹లీలఁ బల్కింపఁగా
సౌదామన్యభిరామ రామ గడు వేసారున్ మరుం డేచఁగన్ 31

చ॥ కలఁగు ¹హృదంతరంబున శుకప్రమదాళి మదాళిమాలికా
కలరవగానవైఖరులు గ్రక్కున వీనుల సోఁకినంతనే
తలఁకొను దాల్పఁగాఁ జిలుక తాళియుఁ దుమ్మెద త్రాళిబింబకో
జ్జ్వలసుఘనోరసాధరరసాధరసారపయోధరంబులన్ 32

చ॥ అలరుల వింటివాఁడు కుసుమాస్త్రనికాయ మొకప్పుడేనియున్
నిలుకడ లేని కోపమున మించెఁ దదీయపరాగజాలముల్
దళముగ నంతటం గలయఁ దార్కొనెనో యనఁ గొమ్మ
నెమ్మెయిన్
నెలకొనెఁ జంద్రికా ¹ధవళనిర్మలకాంతులు వెగ్గలంబుగన్ 33

చ॥ చకచకదచ్ఛకాంతిచయసంవృతతప్తసువర్ణకుంభముల్
వకవక నవ్వు నవ్వికచపద్మదళాక్షి పయోధరంబులన్
సకియలు చల్లఁగా నిడిన సారసపల్లవ ముల్లసిల్లెన
మ్మకరపతాకు తూపులకు మాటుగ నిల్పిన ఖేటకం బనన్ 34

---

30వ 1 గ-లో. 1. గ-నలయిక
31వ. 1 గ-జేర్చి; క,ట,త ప్రతులలో ఈ పాదములేదు
32వ 1. క,ట-హృదంతరంగమునగల్గు శుకప్రమదాళిమాలికా
33వ 1 గ-దళవి; క,ట,త-లలో ఈ పాదములేదు
34వ. 1 గ- రద్వయిన్

మ॥ తనలో మించు వియోగసంజనితసంతాపంబునన్ పువ్వుఁబో
న్పున వేమాఱును నట్టిటున్ బొరల నప్పూవొడి పైనంటి కిం
దిన తత్పూనదళంబు లింపలరె నెంతేఁ గంతు బాణాలికిన్
దనరన్ బూనిన బల్కి సీసపుఁదపుత్రాణంబుచందంబునన్ 35

చ॥ చెలి జలకంబు వేళ మయిఁజెందిన శీతలవారిపూరముల్
సలసలఁ గ్రాఁగి తుంపురులచాలు చురుక్కన మేను [1]సోఁకినన్
కలఁగుదు రూడిగంపుఁ జెలికత్తియలెల్ల నటన్నచో మదిన్
దలఁపఁగ శక్యమౌనె వనితాసుమచాపదురాపతాపముల్ 36

చ॥ తనరె వసంత మంతట నితాంతలతాంతనిశాంతమీనకే
తనరణతాంతకాంతవనితాజనతాతనుతాపరూపభం
జనచణసారసౌరభవిసారసమీరకిశోరవారన
ర్తనదళదంబుజాతమిలితభ్రమరభ్రమరీతరంగమై 37

చ॥ జలదము పొదునీటఁ దపు సంతతమున్ మును పుచ్చుకొన్న య
ప్పులకయి యడ్డగింప ఫలపుష్ప లయ్యెడ నేమి లేమి వా
టిల గతి లేక పత్రము లిడెన్ దరుకోటి యనంగ సంతతా
నిలహతి పండుటాకు గమి నిండె నభోంగణసీమ నామనిన్ 38

సీ॥ క్ష్మా[1]జాతఫణిరాజశాఖాపణవ్రాత
సముదగ్రతరమణీసముదయంబు

---

36వ 1 చ,గ-పొక్కనన్
39వ 1 త-రాజ,

ఘనపాదపానీకకందర్పకుంభీంద్ర
గురుధాతుచర్చానికుంభనంబు
వసుధారుహవ్యూహవనదేవతాభవ్య
సౌధపట్టపటధ్వజవ్రజంబు
బంధురానోకహప్రావృషేణ్యపయోద
నిర్నిద్రసౌదామనీచయంబు
తే॥ వర[2]వయోహృద్యనిరవద్యవల్లరీవ
ధూసమాశ్లేషమోదనాభాసమాన
విటపటుకుంకుమాలేపవిలసనంబు
తలిరు జొంపంబు వనుల నెంతయుఁ దనర్చె 39

చం॥ అళికలభేంద్రనీలమణిహారములున్ సుమమంజరీకుచం
బులు చలియింపఁగాఁ జివురుఁ బొంకపు బింకపుఁ గేలు ద్రిప్పుచున్
మలయసమీరనర్తకుఁడు మాటికి మాటికి హెచ్చరింపఁగాఁ
దలిరు మిటారి ప్రాయపు లతావనితల్ నటియించి [1]రింపునన్ 40

మ॥ సొబగొందన్ సుమశీధువాని తనువున్ సోలాడఁగా లాహిరిన్
జబురై పుప్పొడి [1]పచ్చతాపుతకచాల్ సంజ్ఞాకముల్ సేసి వే
డ్కఁ బడిన్ జిల్కల వాసు లంచులను రాదార్మించఁగా మాఱు బల్
హళిసీరౌతు లనంగఁ దుమ్మెదలు సొంపారెన్ వనీవీథులన్ 41

2. క,ట-వయో.

40వ 1 క,చట-రింపులన్, గ-రింపుగన్,

41వ 1. క,ట-సచ్యతాపురక.

సీ॥ [1]తమి పువ్వు తేనియల్ తనివి తీఱగఁ గ్రోలి
చెలరేఁగి గానముల్ సేయు నళుల
నతిసౌరభాంకురం బాకంరముగ మెక్కి-
క్రొవ్వి కూకలు వెట్టు కోకిలముల
లలితమాధుర్యసత్ఫలరసంబులు ద్రావి
కలకలములు సేయు చిలుకగముల
చాయాతరుచ్ఛాయజలదమాలిక యంచు
సారె నర్తించు మయూరతతుల
తే॥ నవనవామోదభరితనానాప్రదీప్త
భూజరాజసుమమరందరాజరాజి
మలయనిలయానిలాంకూరమహితవిహిత
నిత్యశైత్యావనులు వనుల్ నెగడెనపుడు 42

క॥ తన తేజి పండ్లు గొరకున్
నన గొరకన్ గలికి యురము నడుచక్కి-క చి
క్కు-నఁ [1]గ్రమ్మి కమ్మవిల్తుఁడు
మొన జిగి చిగుఱాకు పట్టెమున వడి నరకెన్ 43

కం॥ మదన శరవృష్టి పైపైఁ
బొదలిన [1]దన వేడి చెడక పొంగారి కడున్
సుదతీమణి విరహానల
మది యదికస్ఫూర్తిఁ [1]బ్రబలె నద్భుత మెసఁగన్ 44

---

42వ 1 క ట-తన, చ,త-తని
43వ 1 గ-గుమ్మి
44వ 1 గ-మరి, 2 గ-బొదలె

తే॥ కుసుమకోమల విరహాగ్ని [1]విసిగి విసిగి
యుసురుపై యాస యెంతయు నోసరించి
యతనుబలముల నాబీలమైన ఎనికి
నరుగఁ దన కోర్కి యీడేరునని తలంచి 45

కం॥ తనలోని తెగువ యింతయుఁ
గనఁబడఁగానీక బోటికత్తెల నెల్లన్
గను బ్రామి వనికి శుకవా
హనసాహాయ్యమున నరిగి యవ్వనవాటిన్ 46

సీ॥ పాంథశోణితపానపాటలాననములఁ
గీరముల్ వేమాఱు గేరు చోటఁ
బోతరంబున మొగంబులు బిగించుక సితా
పాంగముల్ పురివిచ్చి యాడు చోటఁ
ప్రసవాసవము లాని పలుమాఱు మ్రోయుచు
పఱచు తేట్లి[1]గిరాడీ పడెడు చోట
శ్రీఖండగిరివరాశీవిషాననవాంత
మరుదంకురంబులు మలయుచోట

తే॥ సారసహకారకిసలయాంకూరచయము
దంటలై మ్రింగి [2]కనుఁగొన మంటలొలుకఁ
కడఁగి పికములు బెడబొబ్బ లిడెడుచోట
నిలిచి విధి దూఱె కలభాషిణీకుమారి 47

---

45ప. 1 క.ట-విసివిదిశివి, చ.గ-విసివి విసివి- త-విసికి విసికి
47ప 1 గ-నిగాడు. 2 చ.గ-కనుగవ

సీ॥ మినుకుఁ గేదఁగిరేకుపైమీఁనమీఁదఁ బడఁజూచు
నెద కాన్పుదొర వక్క యిది యటంచుఁ
గంకేలి గుచ్ఛసంపము డాయ గమకించు
మదనప్రతాపాగ్ని యిది యటంచు
గంధబంధురమైన గొజ్జుంగ నెదిరింప
మదిఁగోరు [1]మరుదంతి యిది యటంచుఁ
గదిసి పూఁదీవె ద్రొక్కఁగఁ బూను రతిపతి
హృదయేశు భుజగాస్త్ర మిది యటంచు
నటదఖిలపాంథ[2]పటలఖండాయమాన
దీప్యమానప్రవాళకాంతిప్రవాళ
కలితకుంజాంతరము దూరఁ గలఁచు చైత్ర
హితుని వాడి కత్తులపోనె యిది యటంచు 48

ఉ॥ బాలికఁ గేలికాకలితభర్మగృహంబునఁ గాన కయ్యెడన్
జాలి ప్రమోదముం దునుమఁ జాలి హృదంతరవీధి మించఁగా
హా లలితాంగి! యెంటి సకటా యెటు పోయితివమ్మ
యంచు వే
చాలఁగఁ దత్పదాబ్జముల జాడబడిన్ బఱతెంచినెచ్చెలుల్ 49

ఉ॥ వీడిన కొప్పుఁగప్పు నెఱివీడిన తాల్మియు బాష్పవృష్టిచే
వాడిన మోముఁ దమ్మికయి వ్రాలిన చూపులు గుబ్బ
చన్నులం
గూడిన జిల్గు పయ్యెదయుఁ గొంచెపు టెల్గును గల్గియున్న యు
చ్చేడియ నంతికోపవనసీమఁ గనుంగొని లోఁ గలంగుచున్ 50

---

48ప 1 గ-మద క,ట- ప్రతులయందు ఈ పాదముతేదు, 2 గ-పలల

కం॥ ఈ లీల నొంటి వత్తురె?
బాలా! హాలాహలాభపరభృతభృంగీ
కోలాహలహలహలికా
లీలావనవాటి కేము లేమా? [1]తేమా! 51

సీ॥ నూతనసహకారజాతాంకురచ్ఛేది
పరభృతప్రకరంబు బలిసి కూయ
ద్విజరాజతేజంబు తివిరి పానము సేయు
మదచకోరకులంబు [1]లెదుర నిలువ
సరసులజీవనం బురవడిగాఁ గ్రోలు
చక్రాంగచక్రముల్ సందడింప
సుమనఃప్రకాండసారము వేగ హరియించు
మధుపాయినికరంబు మూఁకొనఁగ

సూనబాణుని కత్తుల బోను [2]కరణిఁ
దనరు వన మొంటిఁ జొత్తురే? వనరుహాస్య
లధికతరసాహ[3]సోద్ధతస్వాంత లనుట
నిక్కమయ్యెను నిన్నుండి నీరజాక్షి! 52

సీ॥ గిరికుచ! యిచటి కే కరణిఁ జేరితివమ్మ
యిది దేవపల్లవోజ్జృంభితంబు
ఘనవేణి! యిచట నె ట్లునికిఁ జేసితివమ్మ
యిది గంధవహకేళిసదనభూమి

51ప 1 చ,త,గ-లేమా
52ప 1 చ-లేటుజూప త-మాటుజూప, గ-నుమటుజూప, 2 గ-పగిది:
3 గ-షోద్గత

హరిణాక్షి! యిచట నే సరవి నుండితివమ్మ!
యిది పుండరీకసమృద్ధికంబు
గజయాన! యిచట నే గతి మెలంగితివమ్మ!
యిది మత్తహరిసంఘకృతరవంబు
మృదులరంభోరుకాండ! మ మ్మొఱఁగకుండ
దంటతనమున [1]వెరవేఁకి నొంటి వచ్చి
యే సరణిఁ ద్రిమ్మరితివమ్మ! యివ్వనంబు
ప్రకటపున్నాగసంబంధబంధురంబు 53

తే॥ అనుచు నీ రీతి పలుమాఱు నతివ దూరి
మృదుతరోక్తుల మది గొంత [1]కుదురుపఱిచి
వనవిలాసాభిదర్శనవ్యాజమునను
బ్రొద్దుఁ గడపంగఁ దలఁచి యప్పొలఁతు లనిరి 54

కం॥ ప్రమదాళీజలకేళీ
సమదాళీ చక్రచక్ర సరసిజరేఖా
సుమధూళీసుమధూళీ
సమదాళీకాంత మివ్వసంతము చెలియా 55

శా॥ ఈ లీలా[1]చల మీ సరోవరచయం బీ పద్మినీసౌరభం
బీ లోలభ్రమరీకిశోరనికరం బీ మల్లికావల్లికా
జాలైలాలతికాసితాబ్రకదళీజంబీరసందోహ మా
హా! లావణ్యవతీలలామ! మది కింపై యున్న దీక్షింపుమా 56

---

53ప 1 క ట–నదిలేక చ–వెరలెక త–వెరవక, గ–నొరలేక
54ప 1 గ–పదిల
56ప 1 గ–చయమీ

సీ॥ ఇది కందళితకుంద మిది నందవనబృంద
మిది నందదరవింద మిందువదన!
యది తుంగతరతుంగ మది సంగతలవంగ
మది యంగ జతురంగ మణువలగ్న
యిది [1]జంభలకదంబమిది బింబనికురుంబ
మిది శంబరకదంబ మేణనయన!
యది వంజులనికుంజ మది మంజులకరంజ
మది గుంజదళపుంజ మనుపమాంగి
తే॥ యువిద యవి తామరకొలంకు లవి జవాది
వలపులకెలంకు లల్లవి చలివెలుంగు
చలువ రాటెక్కు వీక్షింపు సరవితోడఁ
గనులకుం [2]బండువై చాలఁ గనఁగనయ్యె 57

మ॥ అకలంక ద్విజ[1]వన్యవృత్తి వనమధ్యక్షోణి వర్తింపుచున్
ప్రకటప్రక్రియ నాగమాత పరిచర్యాధుర్యతన్ మించి రా
మకథావైఖరు లుగ్గడించి ఫలసంప్రాప్తిన్ విజృంభింపఁగా
శుకనామంబు ఘటించెఁగా యజుఁడు మించుంబోఁడి
రాచిల్కకున్ 58

శా॥ శుంభన్నూతనబంధుజీవ[1]నికరాస్తోకాగ్నిలో బంభరీ
డింభాచ్ఛధ్వనిదంభమంత్రపరిపాటిన్ దా మరందాహుతుల్
సంభావ్యంబుగ వేల్చి కాంచె నది పున్నాగంబు రంభావరీ
రంభారంభసుఖంబుఁ జూచితె శరద్రాజీవపత్రేక్షణా 59

57ప 1. గ-జంబిల, క.చ ట.త-జంబల, 2 గ-చాలపండువై
58 ప 1 క.ట.త-నస్య. చ-నవ్య. గ-నన్య
59 ప 1 గ-నకరంస్తోమా

శా॥ ఆమూలాగ్రవికస్వరప్రసవరమ్యంబైన యీ సంపెఁగన్
భామా! చూడు మనోభవుండు[1] దిలకింపన్ జైత్రుఁడన్శిల్పికా
గ్రామీణుం డొనరించె వహ్నిమయచిత్రస్ఫారయంత్రంబు నా
నామోదం బొనరించె నేతదభిరామారామసీమంబునన్ 60

మ॥ వనితా! చూచితె భృంగపంక్తు లెసఁగెన్ వన్యాసరిద్బంధురా
త్తనయాలోలనిరీక్షణంబులయి తద్ద్రాఘిష్ఠవేణీవినూ
తనకాంతిచ్ఛటలై తదీయవిలసత్పాదాబ్జమంజీరమం
జునగారాతిశిలాకలాపజనితాస్తోకాంశుజాలంబులై 61

మ॥ తళుకుం గెదఁగి రేకు బాకు మొన మీఁదన్ తేటి లేబోటి లాఁ
గులు వేలాగులఁ జూప[1] మెచ్చి సుమనఃకోదండభూపాలుఁడున్
నలినాక్షీనికరావతంసకనకస్థానంబు [2]గావించె వె
గ్గలమై జాలు పరాగసూతనపరాగశ్రేణులన్ జూచితే 62

చ॥ గురుకుచకుంభికుంభ! కనుఁగొంటె వనీరమ చెంత వింతగా
సరవిరి మెట్ట దమ్మి బిరు సామని పేరిటి కారకుండు తె
మ్మెర [1]సమవరిఁగూర్చ నలిమేదురనాదపుమ్రోఁత[2]బోరనన్
బొరిపొరి మిన్ను ముట్టె నవె పుప్పొడి పేరిటి
విస్ఫులింగముల్ 63

---

60 ప 1 గ-విలసింపన్
62 ప 1 క,త-చూప, 2 గ-లాడించ
63 ప 1 క,చ,ట,త,గ-సర, 2 గ-ఘోరనన్

మ॥ అలరుంబ్రాఁగొవ్విరిగుత్తి భృంగభరితంబై బంతియై మించఁ జూ
త. లతాఖ్యానటీవధూటివనపద్మా[1]కాంత [2]చెంతన్ మహా
బలుఁ డాయొయ్యయ్యఁ బరాగపుందెరఁదెరల్పన్‌బల్లవాంచత్కర
మ్ములఁ బుష్పాంజలి సంఘటించె విగళత్పుష్పాళి
[3]దంభంబునన్ 64

ఉ॥ పుష్పొడి మట్టిఁబూసి [1]పికపోతనినాదపు ఘాతఁ జేసి మైఁ
జిప్పిలు తేనె నెత్తురులుఁ జింద మిళిందపు జాళ్లు తాళ్లుగా
నొప్పఁగ శాఖికాకరమహోద్ధతిఁ బోరెడు చెట్లు [2]జెట్లు నాఁ
గప్పురగంధిః గంధవహకల్పితఘర్షణకైతవంబునన్ 65

తే॥ చివురు జొంపంబు లోపలఁ జిలుక వలుకఁ
దనరె నీక్షింపు చంద్రికాధవళనయన
మ్మరుని జవరాలు [1]కెంపురాభరణిలోన
లీల నుంచిన పచ్చరాతాళి యనఁగ 66

కం॥ ముకురాభవదన• కంటే
రకమగు చిగురాకుపైఁ బరాగము దనరెన్
జికిలి యొనర్చిన [1]దెస నా
మకరాంకుఁడు పసిఁడి యొఱ [2]యమర్చిన [3]లీలన్ 67

---

64 ప 1 క,ట–శీక, 2 క,ట–చాతన్, 3, క,చ,ట త–డంబంబునన్
65 ప * ఈ పద్యము క, ట ప్రతులందు లేదు, 1 చ–లుక, గ–బక,
2 త–చెట్లు
66 ప 1 క,ట కొప్పు
67 ప 1 క,ట,త–దననా, గ–నా, 2 గ–యొనర్చిన, 3 గ–భంగిన్

మ॥ తరుణీ యీ యెలమావి లేఁజిగురు మీఁదన్ మందమందానిలం
బు రహిన్ సోఁకిన గిఱ్ఱునన్ దిరుగు నీ పూబంతి కేళివనీ
సరసీజాతనికేతనాకరసరోజాతాంతరాళంబునన్
దిరమై కూర్కు మెఱుంగు [1]బొంగరము రీతిన్ బొల్చు
నీక్షించితే 68

కం॥ వాలిక [1]తీవియ చుట్టును
బ్రాలి కనద్భృంగరాజివనదేవతచే
నీలాల కడియమో యన
నీలాలక దనరె దీని నిలుకడఁ గంటే 69

మ॥ ఇభరాజ[1]ప్రతిమానయాన [2]యదె వింటే కుందమందారసౌ
రభ[3]లోభాగతబంభరీకులగరుద్రావంబు మీనాంకు దుం
దుభిగంభీరనినాదలీల దనరెన్ దోడ్తో విజృంభించె న
వ్విభు జైత్రాంచిత [4]కాహళారవము రీతిన్ గోకిలారావముల్ 70

కం॥ ఉదిరి వెలిదమ్మి మొగడం
బొదివిన యీ తేఁటి [1]దాఁటు పొలఁతుక కంటే
[2]మదనుఁ డల బొమ్మరమ్మున
గదియించిన నిలి జాలె కైవడి [3]నమరెన్ 71

68 ప 1 చ-బొమ్మరము గ-ముమ్మరము
69 ప 1 క,చ ట త-తివియం
70 ప 1 చ-ప్రథ ట,గ-ప్రభ, 2 ట-యది గ-యిది, 3 గ-మోహాయత, 4 క,చ ట త-కాహళి
71 ప 1 గ-వాటి, 2 క,చ ట,త గ-షదను 3, క,ట-నడరెన్ త,గ-దనరెన్

తే॥ అని వనవిలాస మివ్విధంబునను దెలిపి
తత్క్రముద్వతీయువతిరత్నమును దాము
సరససల్లాపపరిహాసగరిమ మెఱయ
సఖులు కుసుమాపచయకేళి సల్పి రపుడు 72

సీ॥ గుజ్జు లేమావి గై కొనెఁ గీరసల్లాప·
యటుఁ [1]బోవకమ్మ బింబాధరోష్ఠి·
వలపుఁ గ్రొవ్విరి గొమ్మ [2]వచ్చె సింధురయాన:
యటుఁ [3]బోవకమ్మ పద్మాయతాక్షి·
కేళికానగము చక్కి వసించె ఘనవేణి:
యటుఁ [4]బోవకమ్మ యో హంసగమన:
యలమె గేదఁగి గుంపు లహిరాజరోమాళి:
యటుఁ [5]బోవకమ్మ యేణాంక[6]నయన:

తే॥ యని యొక గయాళి నవ్వ జవ్వని యొకర్తు
సాంకవామోదలార· పంచముఖమధ్య
లార: పావనచారిత్రలార: చక్ర
వరపయోధరలార: పోవచ్చుననియె 73

[అయత్న దోహదాదులు]

73 ప. 1. క.చ.ట–బోకువమ్మ. గ–బోకుమమ్మ. 2 త–వంచె.
3 క.చ.ట–పోకువమ్మ. గ–బోకుమమ్మ.
4 క.చ.ట–పోకువమ్మ. గ–బోకుమమ్మ.
5 క.చ.ట–వోకువమ్మ. గ–బోకుమమ్మ. 6. క.చ.ట.గ–వదన

చ॥ పడఁతుక యోర్తు పాట తన పజ్జ వినోదము గాఁగఁ బాడినన్
గడుసుమనఃప్రసన్నతను గాంచి ప్రియాళము గప్పెమేలి పు
ప్పొడి జిగి జాళువా జిలుఁగు పుట్టము తద్గజరాజయాన పై
నడరు మదాళిఝుంకృతుల నౌర భళీయని సన్నుతింపుచున్ 74

చ॥ వనిఁ గల చిల్కలం గని యవార్యగతిన్ దన చేతి చిల్కఁ గ్రొ
క్కున యెలమావినోగ సెలకొమ్మను వ్రాలిన నొక్క హంసగా
మిని వడి డాయఁగా నరిగి మెల్లన నెక్కుటకై కరాబ్జ మూ
దినఁ బొలుపొందెఁ దత్కుజము తీవ్రతరప్రసవైకసంపదన్ 75

చం॥ వనిత యొకర్తు తీవ జిగి [1]వాలికె యుయ్యెల నూఁగు చుండఁ జ
య్యనఁ జరణంబు దాఁకి కుసుమాన్వితమయ్యె నశోక మప్పుడం
చున నొక యింతి నీ పద మశోకతరున్ జెలి దాఁకె ప్రొక్కవే
యని చతురోక్తులం బలుక ప్రాంతనమేరువుఁ జూచెఁ గ్రక్కునన్ 76

మ॥ కొమ యొక్కర్తు సుగంధలుబ్ధమధులిట్కోటి [1]సమాక్రాంతిమో
ము మఱల్పంగ నగంబుఁ బూచెఁ గెలనన్ బ్రోద్యత్తదీయ ప్రసూ
నమహాసౌరభభీతదావదళిసంతానంబు [2]నీక్షించి యా
రమణీరత్నము నవ్వినన్ ననిచె నగ్రక్షోణి గోఁగెంతయున్ 77

76 ప. 1. గ-వాలిక.
77 ప. 1. క ట-రమా 2, గ-వీక్షించి, 3. క,ట,త-నిలిచె, చ-నిచె

చ॥ ఒక యలినీలకైశిక [1]వయోమదలక్ష్మి [2]నహంకరించి కొం
చక వదనాసవం బుమియ సారెకుఁ దేఁటుల ప్రోఁతఁదిట్టుచున్
వకుళము సీధుకై తవమునం బ్రతిగా నుమియన్ దొడంగె నో
ర్చుకొనఁదలంతురే పటుతరుల్ మది నన్యకృతావమానముల్ 78

చ॥ చెలిఁ గను మాటి మాటునకుఁ జేరి కుచంబులు రాయ నొక్కతొ
య్యలి నిలువం దలిర్చి సమదాళి [1]సభాతిమిరంబు లంతటన్
దళముగఁ బన్నె యా వికచతామరసాక్షినిఁ గాఁచెఁ గ్రోవి త్రా
వులు గల వారలెందును దవుల్ గలవారలఁ బ్రోవకుందురే 79

క॥ లలితవనీపై భవ మటు
తిలకింపుచు వచ్చి వచ్చి తేట మెఱుంగుం
దెలి చూపుల నాకలలనా
తిలకము వీక్షింప నలరెఁ దిలకం బెలమిన్ 80

తే॥ పూవు బంతుల [1]వేట్లాడి పొలఁతి యొకతె
[2]యలసి నిట్టూర్పు నిగుడింప నఱుత మున్న
సిందువారంబు మకరంద బిందులహరి
చింది [3]యయ్యింతి బడలిక డిందు [4]పఱిచె 81

చ॥ లలన [1]పెనంగఁ గ్రోవి. నవలా నగ గోఁగు మిటారియార్పు వా
విలి సఖిదన్ను వంజులము ప్రేంకణ మంగనతోడుఁ బొన్నతొ

---

78 ప 1, క,ట–పయోరుహ, త–పయోరుద, 2, క నలంకరించి.
79 ప, 1. క.చ.ట.త–విధా.
81 ప, 1,క.ట–నెట్లాడె. గ–నేట్లాడి, 2. గ–యలమి. 3. క.ట–యొకయింతి.
4. గ–పడియె.

య్యలి పలుకంగ, మావి సతియంటఁగ సంపెగలేమ [2]మోమిడన్
జెలి ముఖ[3]శీధు వీఁ బొగడ చెల్వ గనం దిలకంబుఁ
బూచినన్ 82

రగడ॥ పొద పొద [1]పొద చెలి పూలెంత మగము
చిదుమఁబోకు మది చిత్తజు తమగము
విధుబింబాః న వింటివె పొసగెడు
మధుపనినాదము మది కింపొసఁగెడు
గునుకు లేటికే కుసుమావళులకు
వెనుక మోసమగు వెఱచెద వళులకు
గుంటిఁ బెట్టెదవు కొఱగావలసిన
వెంట రాఁగదే విరి గావలసిన
పరి పరి [2]విధపుల పలముల [3]నలరుచు
లరసి మెచ్చె నది యామని నలరుచు
నను బోటికిఁ [గొ] న[ ]న యీ కలిగెడు
నెన్ని లేవు [4]మది 'కేలా గలిగెడు
నంబుజాక్షి యల్లది నా కదలిక
వెంబడించకుము విడు నీ కదలిక
మసలనేల [6]నిట మావుల పడమట
పసగా వలరులు వడి దలపడ మట
చిందెడు నీ మెయి చెమటల నిలుకడ
మందటి వేడుక మలయానిలు కడ

82 ప. 1. గ–పొసంగ. 3. క.చ–నోరివిందన్, 3. క.ట.త–సింధు.

చిగురుబోడి ముఖసీధువు చినుకులు
పొగడ కొసఁగె రతి భూషణు చిలుకులు
వడినే యూర్చిన వావిరి ననలకు
వడి వడిఁ జూచితె వనజాననలకు
వారకుఁ బొడువుము వంజుల మడుగున
తీరెడు బడలిక తేనియ మడుగున
మావుల [?]కేవల మానిని కరమిడు
దావుల పూవులఁ దానిదె కరమిడు
మనలఁ బ్రియాళము మదనుని పదములు
విని పూజించెను [7]విరివిడి పదములు
అలికచ మంజుల మానితి వలపున
నలఁతఁ దీర్చెఁ గద యలరుల వలపున
నగుచు నెదుర్కొను నవరాగములను
జిగి గోఁ గలరించెఁ బరాగములను
గనుఁగొను పొన్నల కడ నీ నుడుగుల
ననచిన మొగడలు నగియెడు నుడువుల
బెలఁగి చంపకము చెలి నీ వెదిరిన
నలరులు వెయ్యా రబ్బావె యెదిరిన
విరు లిడె కన్నుల వేడిన తిలకము
పురుడు గాన మిది భూరుహతిలకవుః
అతివరొ మన మిఁక నలరుల [8]గాత్రమె
యతులితశక్తిని నంగజుఁ [9]గె[?]త్రమె

అనుచు సుమాపచయవినోదంబునఁ
దనరిరి సతులందరు మోదంబున 83

కం॥ ఈ లీల నీలవేణులు
కేళీవనవాటి విరులు గిల్లుచునుండన్
నాళీకమిత్రబింబం
బాలోఁ గనుపట్టె మింట నటఁ [1]గెం పెసఁగన్ 84

సీ॥ అతను ధర్మచ్ఛేదమని విచారించియో
కుసుమకోమల విరుల్ గోయఁడయ్యె
పల్లవగోష్ఠి యొప్పదటంచుఁ దలఁచియో
కిసలయోష్ఠి చిగుళ్లు గిల్లదయ్యెఁ
గడు రాజసప్రవృత్తి గాదనియొ పరాగ
సితహాస పుష్పొడిఁ జెనకదయ్యె
ఫలభంగములు సేయ పాపం బనియొ దాడి
మీఫలస్తని పండ్లు మీటదయ్యె

తే॥ ననుచు రోలంబపికములు ననిలశుకము
లను [1]దయాంచితదృష్టిఁ గన్గొని మదాళి

---

83 ఎ 1 గ–బో. 2 చ–తెంగుల. 3 గ–నమరుచు. 4 చ.త.గ–మన.
5 క ట–కేరా. చ–త –కిటురా 6 గ–మిక. 7 క చ.ట.త–
విరువిడి. గ–విడుఏడు 8 క–గెల్తమె. 9 చ ట.త.గ–గొల్తమె

84 ప 1 చ.ట త.గ–సగమింటన్

వరచికురకోకిలాలావ, సురభినిశ్వ
సిత, శుకీవాణి [2]యనియె నా సుదతులకును 85

ఉ॥ కోయకురే విరుల్ కుసుమకోమలవిగ్రహలార! పండ్లకున్
దాయలు గాకురే లికుచతాళఫలస్తనులార, మాటికిన్
డాయకురే చిగుళ్ళకు వనంబునఁ బల్లవపాణులార! పు
ష్పాయుధు నాన యెవ్వతె సుమాపచయం బొనరించె
నేనియున్ 86

కం॥ అన వనజాక్షులు పువ్వులు
దునుముట చాలించి ఘర్మతోయార్ద్రికన
త్తనులతలై జలకేళీ
జనితామోదంబు పూని చని చని యెదుటన్ 87

మ॥ జలజాతోద్భవదివ్యమందిర, రమాసాధ్వీమణీసౌధశి
ల్పి, లతాంతాయుధకేతురక్షి, మధుపాళీపానగేహంబు శీ
తలభానుప్రియభోగినీజన[1]జనిస్థానంబు, చక్రద్విజో
జ్జ్వల[2]తంత్రావసథంబుఁ గాంచి రొక కాసారంబు
దూరంబునన్ 88

వ॥ కాంచి యుదంచిత కేళీవనసంచారసంజనిత సమధికశ్రమా
పనోదార్థంబు [1]శీతలాతిభువనభవనాగతలగు [2]తమకు జలాధి
దేవత లత్యున్నత్యుత్తమము క్తాఫల[3]స్ఫూర్తనిస్తులస్వస్తి
కాధిక విచిత్రతరహరిణ్మణిమయారాత్రికాపాత్రికల చందంబున

85 ప 1 గ-మదాంచిత, 2 చ,ట,త,గ-యని యప్పుడతివలనిరి
88 ప 1 గ-జనా, 2 క,చ,ట,త-సంత్రావ, గ-చక్రావ,

నందంబగు ననేకవిధామందోదబిందుసందీపితోపరితల వర్తు లారవిందపత్రంబుల [4]డంబునకుఁ బ్రమోదంబు నొందుచు. మధుకరనికరదూమంబును మహితపరాగవిస్ఫులింగస్తోమం బును మహనీయద్విజ [5]రావమంత్రవితతికంబును మకరంద ఘృతామతికంబును మరుత్కలితామోదంబును మహాజాతి హింసనసమాసాదనంబునుంగా మధుమాసయాజకుండొనరించు సారసవనవైభవంబు నిరీక్షించుచు [6]వరుణకుటుంబినీ నివహం బుల లక్ష్మీనిలయజాలావర్త మానవిర్యత్కటాక్షవ నమ్ములో యనఁ గనుపట్టు బెళుకు [8]బేడిస మీల ధాళధళ్యంబులకు నుల్లసిల్లుచు నుత్తుంగతరంగఘుమఘుమారావంబులు మృదంగనినదంబులు భృంగఝుంకారంబులు సంగీతప్రసం గంబులై చెలంగ రసజ్ఞద్విజరాజసమావృతరాజహంససాన్ని ధ్యంబునఁ బవమాననటుండు నటింపఁజేయఁ దటస్థమహీజ జనులు శాఖాకరంబులు [9]సాచి యప్పటప్పటికిఁ బుప్పొడి జిలుగు [10]దువ్వటంబు పొసంగు లొసంగ నెసంగు మకరంద ఘర్మ [11]కణంబులు చిందు విధంబున నటించు పద్మినులఁ గనుంగొని యుప్పొంగుచు విలసన్ముఖబిసప్రసూనంబులు విపులనేత్రమినంబులు భవ్యతరకంధరాదరంబులు భాసమాన కుచరథాంగంబులు కలితనాభికావర్తనంబులు కమనీయ జఘనసైకతంబులు గలిగి [12]మహనీయయౌవనసమృద్ధిఁ దనరు నీ ఘనవేణులు నా సరివారలు వీరలు సన్మానంబు సేయుట యుక్తంబని [13]సరోజలక్ష్మి తమకు వేర్వేర నిడు టకై యేర్పరించి పటవాససంకుమదంబులు నించి యుంచిన రజతమహారజతభాజనమ్ములో యన మించు సమధూళీ మధూళీకాపూర్ణంబులగు ధవళారుణాంబురుహంబుల యుల్లాసం బునకు సంతసిల్లుచు జాంబూనదబిసకిసలయంబులు మెసవి

మిసమిసనై బసని పసిండి ఱెక్కతుదల మినుకు మినుక్కులు దిక్కులఁ బిక్కటిల్ల జాతరూపసైకతంబుల నాత్మీయప్రేయసీవతంసంబులతోడఁ గ్రీడింపుచు తమ తమ మంజుమంజీర శింజారవంబులు ప్రతిహాసక్రేంకారంబులని ఱెక్కలు గగుర్పొడవ నలుదెసలుఁ బరికించు రాయంచమొత్తంబులనవలోకించి చిత్తంబులరంజిల్లుచు చంద్రకిరణంబుల[14]కరణిరమణీయంబులగు కోమలబిస[15]కాండంబులఖండంబులు వెలిదమ్మివెండిగిన్నియల నిండియున్న మధురమదురసంబులఁ బోరటిల్ల నిజచంచూపుటంబులఁ గబళించి సామిదష్టతత్ఖండంబులు ప్రియుల కందించు చక్రవాకిచక్రంబుల విభ్రమంబులకు సంభ్రమించుచు మఱియు నక్కమలాకరంబు కమలాకరంబు విధంబున మహోత్పలవిరాజమానంబై మానవాదీశ్వరు నాస్థానంబు పగిది నగణితసత్కవిరాజమానంబై రాజమండలంబు చందంబున నచ్ఛామృతపూరంబై పురాభియాతిశిరంబు భాతి నదిగతహంసమండలంబై ఎందరాగ్రంబు తెఱంగున నతిశైత్యాధారంబై రహించుటకు నద్భుతావహస్వాంతలై యక్కాంతలు తదీయ వారివిహారాసక్తిఁ దత్తీరంబున నిలిచి తమలోన 89

చ॥ మలయసమీరడింబవలమానవినూత్నతరంగరజ్జుసం
వళితపరిభ్రమద్వికచవారిజశోణతటీవినమ్రకో

89 ఎ 1 క.ట.త–శిలాతి. 2 త–ప్రతిలో ఈ పదములేదు. 3 గ–సూత్ర. 4 గ–డంబులకు. 5 గ–రాజ. 6 క.ట.త–తరుణ, 7 క.ట.త–జాల. గ–ఈ పదములేదు. 8 క–బెడగు. చ.ట–బెడస త–బెడసు. 9 గ–దార్చి. 10 గ–చుప్పటంబు. 11 గ–జలంబుల. 12 క.చ.ట.గ–మహిత, 13 గ–సరోవరలక్ష్మి, 14 గ–పగిది. 15 చ–కాండ ఖండంబుల, క.ట.త–లలో 'కాండ' పదములేదు

మలసహకారపల్లవసమ ప్రదరాసి [1]విఘూర్ణణంబునన్
మొలచెఁ బరాగవహ్నికణముల్ గనుగొంటివె [2]నీరజేక్షణా 90

చ॥ ప్రతిదినమున్ నిజోదయము భావములోనఁ దలంచు పద్మినీ
సతి ముకుళ స్తనిన్ వికచసారసవక్త్రిమదాళి[1]జాలరా
జితకచఁ బాయలేక సరసీరుహబాంధవుఁ డిందుఁజేరి శో
భితరుచి నిల్చె బింబమను పేరఁ గనుంగొను[2]మంబుజాననా 91

మ॥ చెలిమిం బాయక నీరజాతహితుఁడున్ శీతాంశుఁడున్ వేడ్కతో
నలినీకై రవిణీవధూమణుల చెంతన్ నిల్చినట్లంశువుల్
వెలయున్ నూతనబంధుజీవనవమల్లీమల్లికాగుచ్ఛముల్
పొలుపొందెన్ దటియందుఁ జూచితె వెసన్ పూర్ణేందు
బింబాననా 92

ఉ॥ అంచుఁ జెలుల్ వినోదమెనయన్ వచియింపుచు జిల్గుపావడల్
ప్రాంచితలీలఁ గట్టి జిగిబంగరు కొమ్మలుఁ [1]బట్టి మించులన్
మించు నిజాంగదీధితుల మించు నిశారస మబ్జనీర మా
చంచలనేత్రమీఁద వెదచల్లఁగ నల్లన డిగ్గి డిగ్గియన్ 93

చ॥ నిలువున నీదె నొక్క సితనీరజపత్రవిశాలనేత్ర ని
ర్మలవదనంబు [1]వెంబడి సరాళతరాయత నీలవేణి వే

---

90 వ 1 క,త-విఘార్ణవంబునెన్ ట-విషంణ్ణంన్బునన్, 2 గ-నీరజాననా.
91 వ 1 గ-ఘాజ. 2 క,ట,త-వారి
93 వ 1 చ-యుట్టి

తలఁపుచు జారిపోయెడు సుధాకరబింబము వెంట నంటి య
గ్గలికముఁ బోవు రాహు వనఁగాఁ దగి యొంతయుఁ
బొల్పుఁ మీఱఁగన్ 94

చ॥ ఒక కరిరాజయాన కరమొయ్యన సాచి సరోజరాజి కొం
చక పెకలింపఁ బైకెగసె సారె తదీయమరందబృందముల్
ప్రకటముగాఁగఁ గ్రోలు మధుపంబులు మ్రోయుచుఁ
దన్మహోద్ధతుల్
సకలము పద్మమిత్రునకుఁ జయ్యనఁ దెల్పగ నేఁగుకైవడిన్ 95

కం॥ తనుమధ్యలు పై జల్లెడు
వనధారల[1]లోన నొక్క వనిత దనర్చెన్
ఘనవర్షధార [2]లెగసిన
మినుకుం గ్రొక్కాఱు తీవె మెఱుపో యనఁగన్ 96

తే॥ పడఁతి యొక్కతె యొకతె కొప్పూడిసి పట్టి
నెమ్మొగంబునఁ బుప్పొడి నించ నొప్పె
మెఱుఁగుఁ బెట్టఁగ రాబోడి మీఁద నించు
పంచశరు మించుబోడి దర్పణము పగిది 97

తే॥ ఒకతె [1]చేఁదమ్మి విరిమొగ్గ నొకతె నేయ
బిగువు చనుగుబ్బకవ దాఁకి నొగిలి పగిలి
సొగసు జిగిరేకు మొత్తంబు మిగుల నపుడు
రాలె జక్కవకవ యాక [2]రాల్పు కరణి 98

---

94 ప 1 క.ట.త వెంబనవె కాళ
96 ప 1 క-ననగ. 2 చ-లెనశిన. ట-లెకసిన; గ-బెనసిన

తే॥ కొమ్మ యొక్కతె జాళువా తమ్మితూఁడు
బాలశైవాలయుతముగాఁ బట్టి తిగిచె
మేని జిగుఱాకు చాయ గ్రొమ్మించుబోడి
నీర్ష్య మీఱఁగ కొప్పుఁ బట్టీడ్చినట్లు 99

చ॥ కువలయనేత్ర యొక్కరితె గొబ్బున నొక్క పసిండి తమ్మికై
పొవరునఁ బోవఁగా నొకతె వోవఁగనీక భుజాంతరంబునన్
జవమునఁ జేర్చుచో [1]నొఱయు చన్గవ లప్పుడు చూడ
నొప్పె జ
క్కవ కవ లుద్ధతిం గదిసి కయ్యమొనర్చుచు నున్నవో
యనన్ 100

కం॥ [1]కెందమ్మి పరాగమ్మొక
కుందరదామణి యొక ర్తు [2]గుబ్బల నించన్
గుందనపు రవలు చెక్కిన
కందర్పుని [3]బొమ్మరము కైవడిఁ దనరెన్ 101

సీ॥ ఒకచోటఁ గ్రుంకి వేఱొకచోట గ్రక్కున
నగుచుఁ దటాలున నెగయువారు
సముద్రగతటజాతశాఖిశాఖల నిల్చి
తొడరి[1]గుభాలున దుముకువారు
పెక్కండ్రు గుమిగూడి యొక్కతెఁ దెలినీట
రువ్వి [2]కకాపిక నవ్వువారు

98 ప 1 త,గ–కెందమ్మి, 2 గ–రాల్చు ఎగిది
100 ప 1 గ–మెఱుగు
101 ప 1 చ,త,గ–చెందమ్మి, 2, క,చ,ట త–గుబ్బను, 3, గ–బొంగరము

కపురంపుఁ [3]గొమ్ములఁ గమ్మదేనియ నించి
[4]వేచి [5]చటాలున వేయువారు

తే॥ నగుచు జలకేళి యొనరించి యలసి సొలసి
కొలను వెలువడి వెడవింటి బలు వజీరు
పులు కడిగినట్టి పువ్వుఁదూపులొ యనంగఁ
దత్తటంబున నిలిచిరి తరుణు లెల్ల 102

కం॥ సలిలములఁ దడియు వలిపెం
బుల లోపలఁ జూడనొప్పె పొలతుల మేనుల్
నెలరాపని బరిణఁలలో
దళతళమను కుందనంపుఁ [1]దగదుల పగిదిన్ 103

చం॥ పడఁతుక లెల్ల నంత నునుబంగరుచేలలు గట్టి వెంట్రుకల్
తడి సడలించి కొప్పులిడి తావులు గుల్కెడు పూవుటెత్తు లిం
పడరఁగఁ [1]బెట్టి మేనఁ గలయం గలపంబు ఘటించిరత్నపుం
దొడవు లలంకరించి యతినూత్నమృగీమదచిత్రకాస్యలై 104

కం॥ దరినున్న కుముద్వతిఁ గని
సరసిజముఖి యీ వసంతసమయమున సతుల్
మరుఁ గొల్తు రిష్టసిద్ధికి
వరమతి మన మతనిఁ గొల్వవలె నిపుడనుచున్ 105

102 ప 1 గ-గుబుల్లున, 2 చ-కకావక, త-కకావక, గ-వికావిక,
3 చ-బొమ్మల, త-కొమ్మలు, 4 గ-వెత్తి, 5 క,చ,ట,త-చలారున,
గ-తటాలున

103 ప 1 క,చ-తమవుల, ట,త-తగదుల

104ప 1 చ,త,గ-జుట్టి

మ॥ చిగురుంజొంపపు గుజ్జుమావి యుఱుతన్ జెందమ్మి పీఠంబుపై
సొగసుం గెందలిరాకు[1]మేల్పటముపై నూనాస్త్రుఁజిత్రించి పొం
దుగఁ దత్పార్శ్వములన్ రతిన్ మధునిం జంద్రున్
శౌకపై కంబులన్
పొగరుం దేటుల వ్రాసి నిల్పి మరునిం బూజించె
సద్భక్తితోన్ 106

ఉ॥ దారుణశంబరప్రహర ! దండము నీకు జగన్మనోహరా
కార ! జోహరు నీకు గిరికార్ముకధార్యవిలంఘ్యశాసనో
దార ! సలాము నీకు సముద్రగతరేక్షుధనుర్ధరా ! నమ
స్కారము నీకు నీకు నతి శౌర్యనికేతన ! మీనకేతనా ! 107

తే॥ గోపవిభు గొల్లయిల్లాండ్ర చూపుటురుల
[1]చేరు లోనుగఁ జేసె నీ చెఱకువిల్లు
కోడియై కూసె నీ కోడి కుధరవైరి
నీదు శౌర్యంబు మదన ! వర్ణింపఁ దరమె ! 108

వ॥ అని యభినుతించి 109

తే॥ భూరిసౌందర్యసత్కళా గౌరవముల
ధరణిఁ జారుచంద్రుండు నాఁ దనరు వాని
మగనిఁ గావింపుమయ్య మా మగువ కనుచు
నలరు విలుజోదునకు మ్రొక్కి రలరుబోండ్లు 110

106ప 1 త-చెల్వడము, గ-వేల్పటము
108ప 1, క చ,ట,త-చెరుకు

కం॥ సకు లిట్లాడిన యాద్భ
చ్ఛికసూక్తిన్ విభుని పేరు చెవి సోకుటయున్
బికవాణి నెమ్మనంబున
నకలంకతదీయమోహనాకృతి నిల్చెన్ 111

ఉ॥ అంతరవీది నిల్చిన తదాకృతి నిశ్చలదృష్టిఁ గాంచి చే
ష్టాంతర ముజ్జగించి యచలాకృతి నుండు గుముద్వతీసతిన్
గంతుశరాహతిప్రభవగాడవికారిణిఁ గా దలంచి తోఁ
జెంతిలి యింక నిచ్చట వసింపగరాదనియెంచినెచ్చెలుల్ 112

ఆ॥ మధుపగుణము వాని మన మెంత వేడిన
నేల కరుణఁ జూచు నేఁచుఁగాక
యనుచు శిశిరవిధులు ఘనముగా నొనరించి
చెలువ సౌధపాళిఁ జేర్చిరపుడు 113

మ॥ అరిగెన్ బశ్చిమవార్ధి పజ్జ గల పద్మాప్తుండు పద్మాకరా
ఖ్య రసాధీశ్వరమౌళిః నీ వరమునన్ గన్నట్టి యక్కన్యకున్
విరహం బెచ్చెఁ దదీప్సితం బిడి కృపన్ పేప్రోవవేయంచు శ్రీ
హరి నంభోనిధిశాయిఁ బ్రార్థనము సేయంబోవు
చందంబునన్ 114

తే॥ ఘనతమోమూర్తియై మించు కాల మసుర
కంటకు సుదర్శనం బౌటఁ దొంటి పగను
దలఁచియో యన జలజాప్తు జలధి ముంచెఁ
జక్రవాకంబుల వియోగజలధి ముంచె 115

కం॥ సమయపరాశరవరసం
యమి సంధ్యాదాశకన్య నంగజకేళిన్
దమిఁ గలయుచుఁ గల్పించిన
హిమమో యన నంధతమస మెసఁగెన్ దిశలన్ 116

సీ॥ నీరజాప్తుని పగల్ నీఁగితి మని యజాం
డము నిండు నిందీవరము లనంగఁ
దమ తండ్రిఁ గానక ధరణీతలంబున
నెమకు కాళిందీఝురము లనంగఁ
గౌశికసంతుష్టిగాఁ గ్రమోన్నతి జగం
బుల మించిన యుపేంద్రమూర్తి యనఁగ
దినవిరామమున నుద్వేలమై సర్వతో
ముఖ [1]వృద్ధి నెఱపు నంబుధి యనఁగ
గ్రహగణము గొల్వ సాంధ్యరాగంపుఁ [2]జిహ్వఁ
బఱపి సకలప్రపంచ [3]తాపప్రదాయిఁ
బట్టి మ్రింగిన కాళికాభామ యనఁగఁ
గటికి చీఁకటి జగమెల్లఁ గలయఁ బర్వె 117

మ॥ ఘనఘుకాలయమౌ మహా [1]బిలమునన్ [2]గన్పట్టఁగానీక యే
పునఁ దద్దీప్తమణిన్ హరించుట జగత్పూర్ణస్వరూపంబు మిం
చ నతిప్రౌఢి ధనంజయున్ జటులతేజస్స్ఫూర్జితున్ జేయుటన్
గని యూహించిరి కృష్ణమూర్తి యని వేడ్కన్ బుంశ్చలుల్ చీఁకటిన్ 118

117వ 1 గ-నృష్టి, 2 గ-జిహ్వ 3 క,ట-పాప
118వ 1 గ-లయమునన్, 2 గ-గన్పటుటం నత్వరం

సీ॥ తరణి దా నుదయ మౌఁదాక వీఁకటి మూఁకఁ
గలపఁ బంచిన మయూఖంబు లనఁగఁ
బంచమ తత్త్వంబుపై నీర్ష్యఁ బ్రథమత
త్త్వముఁ [1]దాల్చు జ్యోతిరుత్కరము లనఁగఁ
దమ రుచుల్ ద్యుమణి ముందఱఁ గూడక తుడుపుఁ
దల చూపు రత్నకందళము లనఁగ
చెంతఁ జేరఁగనీక సంతమ[2]సాళులఁ
గడకొత్తు కాంచనకళిక లనఁగఁ
దనకుఁ జెలియయ్యు నప్పతి దండ నుండు
[3]కతన గాడ్పు సహింపని యనలకీల
జాలము లనంగఁ బుడమిపైఁ జాల వెలిఁగె
నవశుభావహగృహదీపనివహ మపుడు 119

సీ॥ వేలాచలవ్యాళబాలమహాబిలం
బున నిడ్డ ధవ[1]ళాండపుంజ మనఁగ
సమయకారకుఁ [2]డభ్రసౌరభోజనపాత్ర
కొనఁగూర్చు మడిగాసు తునకలనఁగ
కైరవిణ్యచ్ఛావసగరిమఁ బూచిన భంబ
యను సిందువారము నన లనంగఁ
[3]దమకు రాజుబలంబు సమకూడు నిఁకనంచుఁ
బ్రబలి మిన్నందు [4]కైరవము లనఁగ
నిరులు తొలుకరి మబ్బుచేఁ [5]దెరలి పుష్క
[6]రాచ్ఛమానస మొందు రాయంచ లనఁగ

119ప 1 గ-గాంచు. 2 క.ట.త-సారుల. 3 క,ట- కనకమింపని కీల జాలము లనంగ-పుడమిపై జాల వెలిగె నద్భుతముదోప

విరహతతి నేయ మరుఁ [7]డగ్గి విచ్చి కూర్చ
విరుల గములనఁ జుక్క లవ్వేళ [8]మెఱసె 120

తే॥ ఉదయరాగంబు నెమ్మేన నూని రాజు
యామిని వరింప నిల్చుచో నపుడు నడుమ
దిగ్వనిత లెత్తు వెలిపట్టుతెర యనంగఁ
దనరె నెంతయుఁ దూర్పున ధవళిమంబు 121

చ॥ చిటులని పందికోర[1]దడిఁ జిమ్మని [2]యేనుగుకొమ్ముదుమ్ము పె
ల్లటిల నికేతనాగ్రమెడలన్ [3]గెడలన్ బొడలేని నిర్మల
స్ఫటికశిలాశలాక యనఁ బాయని [4]చూతలతైకశాఖ నా
నటనఁ బ్రధానచంద్రకిరణంబలరెన్ బ్రథమాచలంబునన్ 122

సీ॥ గగనసౌధాధార కల్పిత నూతన
స్ఫటికశిలా స్తంభచయ మనంగ
శార్వరనిరసనోత్సాహియౌ నుడురాజు
[1]గెడపిన [2]చిల్కపావడ లనంగి
నంతికస్థమహేంద్రదంతి కర్ణోపాంత
ఘటితముక్తాదామకము లనంగ
నమృతాబ్ధి తనయమోహమునఁ జంద్రునకు ముం
గలిగ [3]నంపిన తరంగము లనంగఁ

---

120ప 1 క.ట–శాఙ్గ త–శాంశు, 2 క.చ ట త–డజ్జ, 3 గ– తమరాజ సబ
లంబు, 4 క.ట–కొక్కెరము 5 గ–దలరి, 6 క.ట–రాంచ చ–రంచ్చ,
7 క.ట,త–డగ్గిలించి, చ–డగ్గమిచ్చి గ–డగ్గరించి 8 గ–వెలసె

122ప 1 క.చ.ట.త–దది, గ–దరి, 2 క.చ.ట.త–యేనిగె, గ–యేనిక,
3 గ–గడలన్, చ–ఈపదములేమ, 4 గ–బాలరసాల

బతికళానిధి యరుదేఱఁ బ్రమదమందు
రజని కింద్రాశ పేరి పై రంధ్రి ముడువ
నెత్తు విరియెత్తులో యన నిందురుచులు
గగనమునఁ గొన్ని యల్లన నెగయుఁదెంచె 123

చ॥ పొడగనవచ్చు వేల్పు కనుపోలిక [1]పిట్టల [2]మింటఁ బట్టి పు
త్తడి [3]మలహారి [4]రజ్జు తొగదాయము త త్తడిమోముసామికిన్
విడిదల చుక్కగుబ్బెతల విందల యక్కటి లెక్క [5]సున్నపై
విడువఁటి చందమామ తెలివిం దన నిల్కడ చూపెఁ
దొల్కడన్ 124

శా॥ గాంగేయోజ్జ్వలచేలః కాళియభుజంగస్ఫార ఘోర[1]స్ఫటా
రంగాభోగకృతప్రచండనటనప్రాచుర్యః గోవర్ధనో
త్తుంగాహార్యధురాధురీణ విలసద్దోర్దండః గోపాంగనా
రంగద్వీక్షణఖంజరీనివహసంరంభాననాంభోరుహః 125

కం॥ అకలుషశుభవిభవగుణ
ప్రకర ః కరాళాఘమురవిభంగటర ః కరా
గ్రకన దరిచ్ఛిన్నమహామధుర
మకర ః కరాస్యర్జునాబ్జ మధుర మధుకరా ః 126

మ॥త్తకోకిల॥ సింధుజేక్షణ శిష్టరక్షణ సేవకావనవీక్షణా
గంధవారణ దుఃఖవారణ కంసదారణకారణా

---

123ప 1 చ.త.గ-గెడపీచు. 2 చ.గ-జిల్గు. 3 గ-నంటిన

124ప 1 గ-తట్టల. 2 క.చ.గ-మిట్టపంట. ట-మిట్టపంట్టి. త-మింటపంటి
3 చ-మలపారి. గ-మలరారి. 4 ట గ-పంజు. 5 క.చ.ట.త.గ-సన్నపై

125 1 గ-స్ఫుటా

బంధుపోషణ పాపశోషణ పార్థపోషణభూషణా
బంధరూపణ భిన్నరూపణ పద్మభూషణనాపణా 127

గద్య॥ ఇది శ్రీ తాడిపర్తి గోపాలకృష్ణ కృపాకటాక్షవిజ్ఞానమా
సాదితకవితానూతనభోజ సంస్కృతాంధ్ర భాషావిశేషసార
సారస్యపరిజ్ఞానచాతురీధురీణ మానసాంభోజ చెన్నమరాజ
కులాంభోదిరాజసంపూర్ణపూర్ణిమారాజ శేషయామాత్య తనూజ
చెన్నమరాజప్రణీతంబైన చారుచంద్రోదయంబనుమహా
ప్రబంధంబునందు చతుర్థాశ్వాసము 128

# చారుచంద్రోదయము

## పంచమాశ్వాసము

కం॥ శ్రీరాధామధురాధర
సారసుధాస్వాదనాతిశయితాశ! మహో
దార ప్రకాశ నిరుపమ
కారుణ్య[1]నదీశ! గోపికాహృదయేశా!

తే॥ అవధరింపుము శౌనకాద్యఖిలమౌని
జనులఁ గన్గొని సూతుఁ డిట్లనుచుఁ బలుకు
నటుల నుదయించి జలజారి యరుణదీప్తిఁ
దనరె విధుఁడౌట హొంబట్టు దాల్చె ననఁగ 2

చ॥ ప్రమదము మీఱఁ గైరవణి రాజు వరింపఁగ వచ్చి నిల్చె త
త్ప్రమదవయస్య[1]లే యుదయరాగపుఁ బచ్చడమున్ హరింప వే
గమె పయిరాణి[2]శాలు పయిఁ గప్పె మనోహరశుభ్రకాంతి[3]ద
భ్రమునఁ జకోరకద్విజసభాజననేత్రసభాజనంబుగన్ 3

ఉ॥ గంధపుసానపై నెఱయు కస్తురి[1]మండన వెండి [2]తంటలోఁ
జెందిన గంధశైల మను సింధురదంతకరండపాళికన్

---

1 ప 1 గ–నిదీశ

3ప 1 క,చ,ట,త,గ–లే. 2 చ–శాల, గ–చేల, 3 చ,త,గ–దంభమున

గ్రందగు [3]తట్టువున్ గనఁగఁ గప్రపు గిన్నియలోని చాదనఁ
గందు సెలంగె నీలఫలకచ్ఛవినచ్ఛతరేందుమండలిన్ 4

చ॥ పొరిఁబొరి మిత్రుఁడున్ పగలుఁ బూనుచు తేజము మీఱి యక్కటా
యరులనె కూడెఁ దాళవశమా? యసమాన మిదేల రాజుతోఁ
గరకిరి యంచు చీఁకటి దొకారముఁ జొచ్చెనొ కానిచో సుధా
కరుఁడగు చందమామకును గందును గిందును జెందనేర్చునే 5

ఉ॥ చేఁతకు రాని [1]దువ్వటము చేతికి రాని వెలంది యానవాల్
వ్రాఁతకు రాని స్రావ్యసలిలంబును బూతికి రాని పువ్వటిం
తీఁతకు రాని పాలకడ లెక్కఁగ రాని వడంకుఁగొండ మై
పూఁతకు రానిచందనము పున్నమ వెన్నెల పర్వెనుర్వరన్ 6

వ॥ మఱియును తటనికట ప్రకట విటపివిటపరయూటస్మయమాన లతాంతసంతానగలితాసవ [1]కల్లోలినీకల్లోల హల్లోల హాళీసక కమలాకరప్రఫుల్ల హల్లక ప్రకరసుగంధ బంధుర మకరంద పానజనిత గంధ దురంధర వికస్వర పుష్పం ధయ స్తనందయ చలద్గరున్నికర తంతన్యమాన పవమాన ప్లవ మాన విస్ఫుట కైరవంబులఁ బుటం బెగయు [2]కమ్మని క్రొత్తావి ఘుమ్మని జిమ్ము పరాగంబులం బలసి, చిక్కనై చక్కఁ దిక్కరించు మెంచు మించువేలుపు మించుబోడులు [3]బొండుమల్లె విరులఁ బొరలం [4]బొరలు తేనియనీటి తేటలఁ గలయు వెన్నెల పన్నీట మేళవించి కించిద్వికసితకేతకీ

---

4ప 1 వ,ట,త-వందన, గ-పంతన 2 గ-తిట్టులో
3 క-తట్టునంగ్గనక వ-తట్టునసంగకి, ట-తట్టుంగ్గనగక

6ప 1 గ-దుప్పటము

కుసుమకోటరంబులఁ జేరిన వెన్నెల తుటుములు సుగంధ కదళీఫలంబులు గావించి. చంచద్వ్యమానలసమానగోస్తనీ కాయమానంబులఁ దలిరు [5]టెడపులఁ బొడకట్టు వెన్నెల పొడరు పొడలేరి నడవనొప్పఁ గావించి, వికసితాభ్రమహీరుహ ఫలాశాంతరచ్ద్రోణికల ఘనీభవించిన వెన్నెల కోపులు పుండ్రేక్షుఖండంబులు గావించి, నిజకులాదినాయకుఁడగు ద్విజరాజున కర్పించి బంతులు సాగి భుజించు చకోర ద్విజ రాజుల డెందంబులఁ [6]గుట్టి పట్టఁజాలక వెడలి వెల్లివిరియు నమందానందకలశాబ్ధిఁ గలసి బలసెనో యన, మఱియుఁ గొన్ని తావుల పూవుల [7]తీవలఁ బ్రబలవాసనాధౌరేయంబు లగు మైరేయంబులు నిజవదనచంద్రచంద్రికలఁ గురంగ ధర [8]మణిమయ రమణీయ పాత్రికల నక్షయంబులగుటకు సవిస్మయ హృదయులై ద్రాక్షాఖర్జూరాది ఫలంబులు చవి గొనుచు నాకంఠంబుగఁ గ్రోలి యున్నునఁ గన్నుల నిదుర గదుర నెదల పయ్యెదలు జాఱ నిదురించు తఱి వల్లభులు బిగియఁ గౌఁగిలించి బింబాధరంబు లాని గజనిమ్మపండ్ల గిండ్లన గుప్పెగను గబ్బిగుబ్బల ఖరనఖరశిఖరంబులు నాటి చుఱుకుఁ [9]జూపిన నిదురఁ జెదరి పదరి యదయహృదయు లని యేమేమియో గొణంగు నంగనాజనంబుల దశనకోరక నికరంబుల మిసమిసల గసరెత్తెనో యన, మఱియుఁ గొన్ని యెడల వేడుక కడలి కడలుకొన చెదలు రాయు మేడల తుదల నిద్దంపు పటికంపుటోవరుల వరలు ముంగిళ్ళ క్రొత్త ముత్తియంపు రంగుల [10]బెడంగుల యరంగులఁ దురంగ ళించు నింపుల విహరింపుచుఁ దళుకు దివాణంబులగు హరి వాణంబులఁ గాదంబరి నెంచి తదీయాధిదేవతల కర్పితంబు గావించి సగంధంబు సగంబు గ్రోలు దఱి చొక్కు గదరి

తదంతరబింబితేందుబింబంబులఁ జూచి పామ గావున జాబిల్లి తనదు బువ్వంపుఁ బొత్తునకు వచ్చెనని మెచ్చి మురియుచుఁ బింపిళ్లు గురియుచు, సోలుచు విటులపై వ్రాలుచు. మేలంబు లాడుచుఁ జిందులాడుచు యేలలు పాడుచు మదన కదనంబునకు మల్ల చఱచుచు మేను మఱచుచు ప్రియుల గాఢంబుగాఁ గౌఁగిలింపుచు మోవులు నజ్జు గావింపుచు నఖిముఖంబుల శరీరంబు లుర్వరితంబులు సేయుచు వేణీకలాపంబుల వ్రేయుచు ముఖసౌరభలోలబంభరీగానంబు లాలింపుచుఁ గట్టిన వలువ లొసంగుచు నెల తళుకులు దువ్వటంబులని, గైకొను తలంపు లెసంగుచు బహువిధ క్రీడలఁ బ్రవర్తింపుచుఁ మధుమదోన్మత్త మత్తకాశినుల కచనిచయంబుల రయంబునం దొఱగు విరిమొగ్గల నిగ్గులు వెగ్గలంబయ్యెనో యన మఱియు నొక కొన్ని కడల కెడల సన్నవన్నెల పొడల చెలువు కప్పురపు చప్పరంబుల మరుని వాలుగత్తెరల తెరలని యీలువ మేలు వలఁ బొదువుక తనగుట్టు చెడక చెదరక నిల్చిన చెలువలు కలువలఁగోరి వాని చిట్టకాలకు నెట్టకేలకు మట్టుపఱచిన విరిశయ్యలనుం దార్చి బంధానుబంధ నైపుణులఁ బెణఁగి కరఁగిన గతిమై నడరు చెమట జడియుల జడికి జడియుచు కౌఁగిళ్ళు సడలి బడలి కడలి రాయుని పట్టు తళుకులు నయనపుటంబులఁ గఱశింపుచు యువతులు కరకిసలయంబులఁ నెసకమెసఁగ విసరికొను శుభ్రవసనాంచనముల నుదంచత్ప్రభలఁ బ్రబలెనో యన, మఱియు నొక్కదారిగా గృహకార్యంబులు దీరిచి గురుజనంబులు నిద్రితులగువేళ యరసి మెఱసి సరసీరుహారి మెలఁగుటకుఁ గలఁగక నలఁగని తెలిదువ్వటంబులు గట్టి [11]బొండుమల్లెవిరుల సరులు దురిమి గంధసార ఘనసార

పంకంబుల మై నలఁది వెలఁది సుపాణిపేరులు ధరియించి వజ్రనిర్మితభూషణంబులు దొడిగి దంతపుబొమ్మల విధంబున వెన్నెల సోగల తెఱఁగున సంజకడ నొడివిన సంకేత నిలయంబుల కరుగునెడ నెరవులన్నియు వెన్నెల దీవుల [12]దిగుల నుండఁ గని తెలియలేక ప్రతికుంజంబు నన్వేషించి నాథులఁ గానక నకనకలొందుచు బుడిబుడి కన్నీ [13]రొలుక మగుడి మగుడి వచ్చుచుఁబోవుచుఁ బునఃపునరన్వేషంబు గావింపుచుఁ దిరిగి తిరిగి చూచు మెఱుంగు బోండ్లం జేరి కౌఁగిళ్ళకుఁ జేర్చి నికుంజనిలయంబులకుఁ జేర్చి యతను సౌఖ్యంబులకుఁ దార్చి జారనికరంబులకు వీడ్కొలిపిన వారలు క్రమ్మఱిపోవు తఱి నంతంత గాంచి చనునెడ కత్తియల కోవరపుఁ గోపుఁ జూపుల నినుమడించెనో యన మఱియు నొక్క వంక సంకల్పసంభవుఁ డాంతరజాలిక గిరగిర దిరుగ వైచిన బొమ్మరంబు విధంబున గగనంబునఁ దిరుగుచుఁ దదీయకర [14]ఘాతోచ్ఛలిత జాంబూనద కందుకంబు డంబున ధరణిఁ బడి యెగయుచుఁ దమ నెలవగు తమ్మినెలవునకు వచ్చి యచ్చట హృదయేశ్వరుఁ గానక కింజల్కపుంజశుంభ ద్భంభరీడింభసహితంబులై చెన్నొందు చెందొవలు విస్ఫులింగసముత్థానధూమసమన్వితంబు లగు నగ్నికుండంబు లని దుముక గమనిందు రథచరణతరుణి నిరీక్షించి తదీయ మౌగ్ధ్యంబునకు హసించు తెఱఁగున వికసించు కైరవనికరంబుల నిగనిగలఁ బొగరెక్కెనో యన మఱియు నొక్క చక్కి చక్కెఱవిలుకాని కయ్యంబున నెయ్యంబున నితరేతరనఖక్షతాపాదనంబును బరస్పరాదర చుంబనంబును మిథః కచాకర్షణంబును నన్యోన్య[15]గల్ల చపేటా చరణంబునుగాఁ బెనంగి పెనంగి యలసి సొలసి

విటవిటీజనంబు నొండొరుల శరీరంబులయందు నలందు
కర్పూరమిళితచందనగంధంబుల దీధితికందళంబులనమందం
బయ్యెనో యనఁ జొక్కటంపు దాళదళ్యంబున మిక్కుటంబై
యకొ్్ౕౕముదీ సముదయంబు విజృంభించిన 7

కం॥ కేళీగృహవాతాయన
పాళిం బ్రసరించి [1]కమలపాళి [2]వెలుంగుల్
చాల మయి[3]నాడ మదిలోఁ
దాళక దోషాకరుడ్ నితంబిని వలికెన్ 8

శా॥ తాపుల్ గుల్కెడు మేనుఁ దీవకుఁ బరీతాపంబు గావించు నీ
జీవంజీవమనోజ్ఞమూర్తి యకటా శీతాంశువా కాదు శో
భావై రూప్యమునన్ జనభ్రమదమౌ బస్మావృ [1]తానంగతే
జోవైశ్వానరవిస్ఫులింగస సుమీ చూడన్ నిశానాయకా 9

తే॥ ప్రతిపదారూఢవక్రభావంబు నీకు
సహజమౌఁ గదా శార్వరీసార్వభౌమ •
వ్యత్యపథంబైన వృత్తిచే నొనరు నీకు
నకట• ద్విజరాజవిఖ్యాతి యుర్థమగునె • 10

సీ॥ సంధ్యాజపాతిచంచద్రాగ మెడఁబాసి
పరసతీగమనశేఖరతఁ బొదలి

7ప 1 చ-కల్లొల, గ-కల్లోలవినీల కల్లొల, 2 గ-కమ్మ కమ్మని, 3 గ-వొడ్డు 4 గ-తెరయి 5 ఎ-వెంవపులన్ 6 గ-జుట్టి 7 క,ట-తీవుల చ గ-రీవులం, 8 గ-మదిపమిణీయ, 9 గ-జూపెనని. 10 ట,త, గ-చరంగుల వ-చెలంగుల, 11 గ-వొడ్డు 12 క,చ,ట,త-దివ్వుల, గ-రీవుల 13 గ-యల కలగుచు 14 క,చ,ట-మా, త-పా, 15 గ-గళ,

8ప 1 క,ట-గనుల 2 క,ట,త-జలగున్, 3 గ-నాట

9ప 1 గ-సుమా

సారసవన [1]తిరస్కారంబుఁ గావించి
మలినాంతరంగసంకలనఁ గాంచి
సత్సువర్ణా[2]వహస్థైర్యంబు[3]ను హరించి
జేష్టావిహారసంస్థితి వహించి
[4]చక్రద్విజవిభేదనక్రమంబునఁ బొల్చి
మధుపగుణాఢ్యసంబంధ మెనసి
సూర్యతనుసంగతినివసించుటలు మాని
పూని పాశ్చాత్యవృత్తిఁ బెం పూనునట్టి
నీ యెడ ద్విజేంద్రనామంబు నీరజారి
యాజ్యకోశాతకి న్యాయమయ్యె నయ్యె 11

కం॥ అక్షీణదుష్టశిక్షా
దీక్షితుఁడగు శౌరి గాచెఁ దెగటార్పక నిన్
నక్షిగతుఁ జంద్రః రమ పై
పక్షంబున విరహి పావఫల మెట్టిదయో 12

చ॥ హరి యెద నుంచలేక కలశాంబుధి వైచెఁ బయోధినాయకుం
డురువడిఁ బాఱవైచె నల యుగ్రునిమౌళి. నతండువైచెఁ బు
ష్కరమునునందు నిల్వక యెగాదిగఁ బర్వఁగ నేర్చితౌర యా
గరళములీల చంద్రః నిను గన్గొని పద్మను లార్తి
[1]నొందరే 13

---

11ప 1 త,గ-తీరసారంబు, 2 చ-ప, త-స, 3, క,ట,త,గ-నరహించి,
4 క,ట గ-వక్ర

13 ప, 1, గ-జెందరే

మ॥ జడిసెన్ బాంధతతుల్ పరాశను విలాసం [1]బేర్చె. వర్ణంబు లే
ర్పడుటల్ దప్పె సబంగమయ్యెను సముద్రస్వర్ణ
పాద్యంత మి
ప్పుడు దోషాకర' రాజవై కువలయంబున్ నీవు పాలింప. నె
క్కడ నక్షత్రవిభుండు చక్రపరిరక్షాశాలి గానేర్చునే 14

గీ॥ భీకరంబైన శార్వరానీక మెల్ల
కలఁచి చక్రంబు చేపట్టగనె హరించు
కీర్తితమహంబు గల విధుమూర్తి నీవు
బీరువుల నొంపఁ దగునె యో నీరజారి 15

వ॥ అని యివ్విధంబున తుహినకరుఁ దూరి వనితాజనతాపకరుఁ
బంచశరు గుఱించి యచ్చంచలాక్షి యిట్లనియె 16

సీ॥ సుమనఃకదంబయోగము వహించియు మధు
వృత్తిఁ దా విడదు నీ వింటిగుణము
కలితాగమస్థితిఁ గాంచి యుండియు పక్ష
పాతంబు విడదు నీ పటుబలంబు
సర్వజ్ఞమూర్తియై జగతి మించియుఁ బ్రభం
జనతఁ బో విడదు నీ స్యందనంబు
శుద్ధభావస్ఫూర్తిఁ జూపట్టియును ప్రేమఁ
గొమ్మల విడదు నీ ఘోటకేంద్ర
మని వచింపంగ భువనజాతాపహతిక
రాదిమకిరాతశేఖరాద్యంత మైత్రిఁ
బఱఁగు నీవు వర్జింతువే పాంథయువతి
జన వధోద్యోగ మేపారి శంబరారి' 17

---

14 ప 1 చ,త-బెచ్చె

మ॥ హరకోపానలకీలచేఁ జెడక రూపై యున్కి నీ కెన్నఁగా
స్మర! చిత్రంజయబంధనజ్వలనబీష్మంబైన వేళామనో
హరరాజన్యుని పట్టికిన్ బయదవన్యాగందవాహాప్తుఁడా
య రయన్‌బేర్పడ గ్రింగు శ్రీవిభుని కాహా! నీవు
జన్మించవే 18

చ॥ జననికి కీడొనర్చు కలుషవ్రతుఁ డంచును మేనమామ జీ
వనము హరించి మించెను భవజ్జనకుండు జగం బెఱుంగఁగాఁ
గినిసి రమాగృహంబునకుఁ గీఁడొనరించిన మామ చెల్మి వ
ర్తన గల నిన్నుఁ జూచి నగరా వగరా జగరాగ మన్మథా 19

కం॥ అని వగచు మగువఁ గన్గొని
యనుఁగుం దొయ్యలులు సారసాహిత సుమసా
ధన మారుత శుకపికముల
ననిరి మహా విధురతాసమన్వితమతులై 20

మ॥ అరయంగా నిసువందనంబుననె దుర్గాదీశ కోటీర సీ
మ రహిం బాదము వెట్టిఁ జారనికరోన్మాదంబు [1]వారించి భీ
కరమైనట్టి తయో [2]వితానముల వే ఖండించి చెండాడు నీ
కరవిందాహిత మెందు నర్హమె చకోరాక్షివధోద్యోగముల్ 21

మ॥ అరయంగా సితపక్షసద్వ్యహృతి నక్షత్రారోహమత్యంత వి
స్ఫురితంబైన ద్విజేంద్రచిహ్నమును బొల్పొంగానఁ
జెన్నొందు నీ
కరవిందాసనవృత్రజిద్విధుత లాహా యా [1]సుధావాణి నీ
వరరంభోరువు నీ సరోజకర [2]సేవన్ బూన్దురా చందురా 22

21 ప 1 గ–గావించి, 2 గ–వికారములు.
22 ప 1 క,చ,ట–త–సదా, 2 క,చ,ట–నేర్పెన్, గ–నీపం

తే॥ తెలిసి మీతండ్రి హరి మధుద్వేష మూన
మధువుతో నీవు సఖ్యంబు మాన వహహ •
కారణగుణంబు కార్యసంక్రాంతమగుట
మీనకేతన • నిన్నుండి మిథ్య యయ్యె 23

ఉ॥ ఈ యిభరాజయాన నిశితేక్షణముల్ భవదంబకంబు లీ
తోయజపత్రనేత్ర బొమదోయి భవద్వరచాపయష్టి యీ
ప్రాయపుటింతి వేనలి భవద్గుణరాజముఁ బ్రోవఁగాఁ దగున్
ఏూ యెలనాఁగ నీదు బలు మాయల నాగక సూనసాయకా 24

కం॥ అహహ జగత్త్రాణుఁడవై
వహి కెక్కిన నీకుఁ దగునె వనితల [1]నేఁచన్
ముహురుత్కంపితసరసీ
రుహదళమా • గంధగిరిమరుత్కందళమా॰ 25

చ॥ నటన దలిర్ప మందగమనంబున నీ వరుదేర [1]సారె ను
త్కటతరదేవవల్లభనగప్రముఖాగవరంబులెల్ల న
ట్టిటు చలియింపుచున్న యవి యింక వధూహృదయాబ్జముల్ చలిం
చుట యదియెంచనేల?హరిసూనుబలా॰ మలయాచలానిలా 26

ఉ॥ తల్లిదొరంగు లంచు నిరతంబు ముదంబునఁ బెంచిఁ పెంచి మీ
కల్లదనంబు లోఁదెలిసి కాకకులంబులు మిమ్ము గేహముల్
వెల్లఁగఁ ద్రోచి పోఁ దరమె వే పికపోతములార దాడికిన్
తల్లికిఁ గాని వారలిఁకఁ దక్కిన వారికి మంచివారలే 27

---

25 ప 1 గ–మెచ్చెన్
26ప 1 గ–సానుమత్కటమున.

చ॥ కటకట ప్రేలకే చిలుక గామిడి• [1]మామిడికొమ్మ దాపునన్
దిటముగ ముద్దుఁబల్కు- ఉపదేశముసేయుచు నిన్నినాళ్లుపెం
పుటయుఁ దలంపకే గురువు ముందఱనే వివరించి చూచినన్
గుటగుటలన్న చంద మిదిగో నిజమయ్యెను మాటలేటికిన్ 28

వ॥ అని యిట్లు మదనాదు లుపాలంభనము గావించి 29

కం॥ మానిని కనంగతాపము
మానుటకై ప్రొద్దు గడుపుమది కథఁ జెప్పన్
బూని సఖు లనంగ ననం
గా నొకరాజని యనంగా కళవళ మందెన్ 30

తే॥ ఏమి గావింపఁబోయిన నేమి యయ్యె
ననుచు వెఱఁగంది వెఱఁగంది ననుఁగుఁ జెలులు
బిససుమాసవకిసలయవిసరములను
చెలికి శైత్యోపచారముల్ సేసిరపుడు 31

సీ॥ ఒక మదావళయాన వికచ పంకరుహంబు
పద్మిని [1]కనుదోయి పదిలపఱిచె
నొక మధువ్రతవేణి మకరంద రసధార
తరుణి వాతెఱ మీఁదఁ [2]దవులు కొలిపె
నొక కోకిలాలాప చికిలి లేఁజిగురాకు
లతతూన కెంగేల జత యొనర్చె
నొక గంధనిశ్వాససుకుమారసూనముల్
కొమ్మని నెమ్మేనఁ గుమ్మరించెఁ
దరుణి కీ రీతి శైత్యకృత్యము లొనర్పఁ
గందెఁ గెందమ్మి తుకతుక చిందెఁ దేనె.

28వ 1 గ-మేలపు.

పొగసెఁ జిగురాకు చిటపట నెగసె విరులు
శంబరారాతిశిఖిశిఖాడంబరమున 32

శా॥ ఆవిర్భూతమనోభవానలశిఖావ్యాలీఢసర్వాంగియౌ
పూవుంబోడి మెఱుంగుముంగర రహిం బొల్పొందుకట్టాణి పై
ప్రోవై కాటుకనీరు బేరుకొని యూర్పున్ గమ్మలై గాడ్పు నె
త్తావుల్ గ్రోలఁగ వ్రాలి నిల్చిన మిళిందస్వామి రేఖం దగెన్ 33

సీ॥ ఆవేళ నొక[1]యింతి యటకు వేగమె వచ్చి
చెలులార వింటిరే చెలువ ఎలరు
మన కుముద్వతి కేను మహనీయశుభవార్త
దెచ్చినా నేమైన మెచ్చు గలదె
యాదవకులవృద్ధులగు నుద్ధవాక్రూరు
లేతెంచి మనరాజు నెలమిఁ గాంచి
శౌరినందనుఁడైన చారుచంద్రునకు నీ
వరతనూభవ కుముద్వతి నొసంగి

తే॥ శ్రీ లెసంగ వివాహంబు సేయుమనుచుఁ
గడు ప్రియమొనర్చి యియ్యకోల్ గాంచి [2]చనిరి
నేఁటి రాత్రి ముహూర్తము నిక్కమనిన
యది విని నృపాలకన్యక యలరె మదిని 34

వ॥ అంత 35

మ॥ కనుపట్టెం దొలుసంజ తూర్పున నుషఃకాలంబునన్ వహ్ని వీ
డ్కొని యంశువ్రజు నాత్మనాథుఁడగు నర్కున్ జేరు
నాకాంక్షమైఁ

---

32వ 1 గ-చను. 2, క,చ,ట,గ-తావు
34 వ 1 గ-కన్య. 2 చ.గ-నారు

జని తన్మార్గమునన్ దదాగమనిరీక్షన్ నిల్చి చందంబునన్
దనరెన్ దద్విరహంబుచే బలె [1]గృహాంతర్దీపికల్ శుభ్రతన్ 36

మ॥ [1]వ్రతమై బౌద్ధులు మించి తారకనిజ[2]స్పష్టోక్తి వర్ణంబు లు
ద్ధతినిందింపఁ బ్రదయీామయుం డగుటనుద్యచ్ఛ్రోషర క్తాంగుఁడై
ధృతిఁ దజ్జృంభ మడంప సద్ద్విజతతుల్ దీపింపఁగాఁ జేయ[3]ను
ద్యతుఁడై వచ్చిన మాడ్కి భాస్కరుఁడు పూర్వాద్రిన్
వెలింగెన్ రహిన్ 37

మ॥ తనరెన్ దిక్కుల నాకసంబున లసద్వాతూలధూతాంబుజా
తనితాంతోదితసూనరేణుచయముల్ తద్వేళ చెల్వంబుగా
వనజాతా ప్త [1]దినేంద్రరాజ వదనోద్వాహార్థమై పద్మినుల్
మినుకుంబట్టుపటాళిఁ గట్టిరె జగామేల్కట్లునా నెంతయున్ 38

మ॥ శతమన్యూపలనిర్మితోన్నతమహాసౌధాగ్ర [1]వీధీస్థల
స్థితజాలాంతరసంవిశద్విమలరాజీవా ప్తదీ ప్తిచ్ఛటల్
రతి లీలాలసలైన కామినుల నేత్రద్వంద్వ నీరేరుహ
ప్రతతుల్ బోధ యొనర్ప నేఁగెడు గతిన్ రాజిల్లె రాజద్గతిన్
39

కం॥ ఆ యెడ పద్మాకరభూ
నాయకమణి శాసనంబునన్ దీర్పరు ల

---

36 ప 1 గ–గృహస్థ
37 ప 1 క.ట.త–వ్రతమో. చ–ప్రథమో. గ-వ్రతులో.
2 క ట.త–స్వపోన్నక్తి 3 క.ట.త–నుద్ధృతుడై. గ–నుద్ధతుడై
38 ప 1. క.చ.ట.త.గ–దినేంది
39 ప 1. గ–దీప

త్ర్యాయతరధ్యాయతన
శ్రీయుతము పురం బలంకరించిరి వేడ్కన్ 40

సీ॥ మిసమిసల్ వెదఁజల్లు పసగల్గు జంబేటి
కర్దమంబున వేదికలు ఘటించి
కాశ్మీరఘనసారగందసారంబుల
నలికి ముత్యముల ముగ్గులు [1]రచించి
చిలికి బంగరుచాయ వికవిక నగఁజాలు
[2]పసపుటాకుల దళ్ళు పొసఁగఁజేసి
లాలితసుమధామలామజ్జకానూన
రమణీయకాయమానములు దీర్చి
సకలగృహదేహళిప్రదేశములయందు
కదళికాస్తంభయుగళంబు కుదురుపటిచి
మరకతోపలరారచ్యమానమహిత
తోరణంబులు గట్టి రత్యుజ్జ్వలముగ 41

చం॥ నిరుపమచారుచంద్రదరణీధచంద్రకుముద్వతీసతీ
పరిణయవీక్షణాగతసుపర్వకులంబుల [1]కెల్ల నిల్వ బం
ధురవిభవంబు మీఱ విడుదుల్ [2]సవరించిన లీల రత్నభా
సురరుచిఁ బిక్కటిల్ల గురుజుల్ ఘటియించిరి మిన్ను
రాయఁగన్ 42

చ॥ వనజహితేందు లాత్మఘనవంశ[1]జరాజ[2]సుతాతిదివ్యశో
భనవిభవంబుఁ జూడ బహుభంగుల మేనులు దాల్చి వచ్చిరో

41 ప 1 గ-ఘటించి, 2 గ-పసరు
42 ప 1 క ట-నిల్వ నిల్వ, త-కెల్ల నిల్వ, గ-గొల్వ నిల్చి, 2 గ-పొనరించిన

యనఁ గురువిందవజ్రసముదంచితనిర్మలదర్పణాతినూ
తనతరతోరణావళులు దట్టములయ్యెఁ [3]ఖురాంతరంబునన్ 43

ఉ॥ అప్పుటభేదనంబునకు నప్పుడు కృష్ణుఁడు వచ్చె నెమ్మదిన్
ముప్పిరిగొన్న మోదమున ముద్దుఁ గుమారునిఁ
చారుచంద్రుఁ బెం
పొప్పఁగఁ బెండ్లి సేయుటకు నుద్ధవముఖ్యసమస్తయాదవుల్
గప్పక రా విదర్భమహికాంతసుతాదిసతీసమేతుఁడై 44

ఉ॥ ఆ కమలాక్షు రాక తన యాప్తులచే విని సంభ్రమించి ప
ద్మాకరభూమిభర్త చతురంగబలంబులు వెంటగొల్చి రాఁ
బ్రాకటవైభవంబు దనరంగ నెదుర్కొని తెచ్చి నిల్పె నా
కమనీయవస్తుకలనం దగు నొక్క మణీగృహంబునన్ 45

ఉ॥ అంత సరోజలోచనుని యానతి భోజతనూజ యాదియౌ
కాంతలు చారుచంద్రు మణికాంచనపీఠమునందు నుంచి ఫా
లాంతరసీమ దీవనశుభాక్షతరాజి ఘటించి రింపునన్
ప్రాంతమునందుఁ గొందఱు సుధాంశుముఖుల్
ధవళంబు వాడఁగన్ 46

చ॥ కురులు నటింప నెన్నడుముఁగొంత చలింప [1]నురోజహారముల్
వరుసడి చౌకళింప నిటలంబున లేఁజెమ టంకురింప వి
స్ఫురితకరద్వయీవలయముల్ రవళింప మిటారి యోర్తు శ్రీ
హరితనయాగ్రగణ్యునకునందముగాఁ దలయంటె వేడుకన్ 47

43 ప 1 గ–నృపాల, 2 తి–సుతాసమేత, గ–సుతాసుతాతి, చ,ట–సుతాతి
3 క–పురీవరంబునన్, ట–పురాతనంబునన్
47 ప 1 గ–సరోజ.

కం॥ వసుధాపతికిం గుంకుమ
రసమున నలుఁగిడిరి పొసఁగఁ బ్రసవసుగంధుల్
వసగల పసిండిమిసమిస
లొసపరి నెమ్మేన [1]నెసఁగి యొఱపు వహింపన్ 48

కం॥ ఇందుముఖి యొకతె పన్నీ
రందంబుగఁ జిలికి కంకణారవ మమరన్
గంధపు టటకలిఁ బెట్టన్
గందర్పసహోదరునకుఁ గౌతుక [1]మొదవన్ 49

చ॥ తనదు పయోధరంబుల విధంబునఁ జాల మనోహరంబులై
తనరుట యోర్వలేక సముదంచితకాంచనకుంభసార మె
ల్లను సడలించెనో యన విలాసిని యొార్తు పసిండి కుండలన్
గనఁబడు వారి నించి జలకం బొనరించె నృపాలమౌళికిన్ 50

కం॥ కలకంఠి యొకతె సునుఁ దెలి
జిలుఁగునఁ దడియొత్తి మెత్తఁ జెలువందె విభుం
డల కలశాంబుధి పెందెరఁ
దలఁగిన కనుపట్టు [1]నట్టి ధవళాంశుగతిన్ 51

సీ॥ క్రొవ్వాడి మొనగోళ్ళఁ గురులు నున్నఁగ దువ్వి
సిగవైచె యొక్క రాజీవగంధి
[1]యుడివోని నెత్తావి విడిపువ్వటెత్తులుఁ
జుట్టె బాగుగ నొక్క శోభనాంగి

---

48 ప 1. గ–నిమిరి
49 ప 1 క.ట.త–మమరన్ గ–మెసగన్
51 ప 1 చ–పూర్ణ

పొంబొట్టు జిగినిండు బురుసా రుమాలు పొ
ల్పుగఁ గట్టె నొక్క [2]యంభోజవదన
కమ్మతావులుఁ జిమ్ము కస్తూరితిలకంబుఁ
దీర్చె తీరుగ నొక్క [3]తీవబోడి

తే॥ కుందరద [4]యొార్తు కుంకుమగంధ మలఁదెఁ
జెలి యొకతె చంటి [5]యురచట్ట యలవరించె
యువిద యొక్కతె కట్టాణి యొంట్లుఁ బెట్టె
రమణి యొక్కతె కనకాంబరంబుఁ గట్టె 52

తే॥ గంధబంధురసింధురగమన యొకతె
చొక్కటపుఁ గెంపు పిడివంకె చెక్కెఁ గటిని
శుంభదంబోజముకుళవక్షోజ యొకతె
చికిలి మంజాళి రవతాళిఁ జేర్చె నబుత 53

కం॥ పచ్చల పదకము మగరా
నిచ్చలపుం గంకణములు నిర్మలహారం
బచ్చపు మణిముద్రిక లొక
నెచ్చెలి యల చారుచంద్రునికి సవరించెన్ 54

తే॥ అంత పద్మాకరు నసుజ్ఞ నబ్జముఖులు
కొంద రెలమిఁ గుముద్వతీకుందరదనఁ
గనక[1]పీరికిఁ దార్చి దీవన లొనర్చి
నూతనశుభాక్షతంబులు నుదుట నిడిరి 55

---

52 ప 1 గ–ముడిబోని. 2 గ–పంకజ. 3 త–తీగెబోడి. గ–తీగబోణి.
4 గ–యొకర్తు. 5 గ–యొరబెట్ట

55 ప 1 క.ట.త–టారిక. గ–పీరంబు

మ॥ తురు మొక్కించుక జార హారములు చిందుల్ ద్రొక్క నెమ్మోముచం
దురుపై లే నగ వంకురింప బిగిచన్నుల్ సారె నొండొంటితో
నొరయంగా చెయి మార్చి మార్చి [1]కటకప్రోద్యద్ధ్వనుల్ సెల్లఁగా
శిరసంటెన్ నరపాలకన్య కొక రాజీవాక్షి మోదంబునన్ 56

కం॥ పసిఁడి జలపోత నించిన
కుసుమశరాసనుని చేలకోరి యనంగా
బిసరుహలోచన కప్పుడు
పసపున నెలుగిడిరి దవళపంకజనయనల్ 57

కం॥ ఘలుఘలు రని మణికీలిత
వలయంబులు మ్రోయ నెరులు వాలారునఖం
బుల దువ్వుచు జవ్వని కొక
యలికుంతల మలయజమున నటికలిఁ బెట్టెన్ 58

కం॥ సరసిజనయనామోహన
కరగుంభితశాతకుంభకలశాంబువులన్
హరిమధ్య జలకమయ్యెన్
గురుతర [1]వర్షాప్తి మించు క్రొమ్మిం చనఁగన్ 59

కం॥ పారీన[1]నేత్ర యొక్కతె
పైరాణి జిలుంగువలువపై దడి యొత్తెన్

---

56 ప 1 గ–పరియ, 2 చ త.గ–మీరగా

59 ప 1 క–వర్షాబ్ది, చ–వర్షాప్తి, ట–వరుషాబ్ది.

కారిన్యమనోజ్ఞస్తని
మైరీవి కడాని రేకు [2]మై [3]విలసిల్లెన్ 60

తే॥ [1]వలుఁద ముత్తెపు చెఱఁగు జాళ్వా మెఱుంగు
వలువ యొక్కతె యిడఁ దాల్చి వనిత [2]దనరె
తారకా [3]దీప్యమానసంధ్యావిభావ
రీస్ఫురిత [4]శీతలమయూఖరేఖ పగిది 61

కం॥ కాలాగురుగురుధూమ
శ్రీలన్ సమకొల్పి దువ్వి సితకరముఖికిన్
బాలిక యొక్కతె మదనుని
నీలమణీఖేటకంబు [1]నెఱి తురు [2]మిడియెన్ 62

కం॥ కొమ్మకు ముత్తెపుఁబంజుల
కమ్మలు వీనుల నొకర్తు ఘటియింపఁదగున్
[1]నెమ్మోవి తావు లిరు పా
ర్శ్వమ్ములఁ గొలువన్ రహించు శశిబింబమునన్ 63

కం॥ నిస్తులకుసుమాస్త్రధను
ర్న్యస్తాసితజలజశరము [1]నలుపు వహింపన్
కస్తురితిలకం బొక సతి
సుస్తని [2]బొమదోయి నడుమ సొగసుగఁ దీర్చెన్ 64

60 ప. క,ట–నేత్రి, గ–నయన, 2 గ–మాడ్కి–, 3 గ–వెలుంగున్
61 ప 1 గ–చెలువ. 2 గ–యలరె, 3. క.ట.త–దివ్యమాన.
4 క చ.ట.త–తళతళ
62 ప 1 క.చ.ట.త–నెరి, గ–నన. 2 క.ట,త–దడియెన్
63 ప. 1 చ.గ–నెమ్మోము
64 ప 1, గ–నలుగు రహింపన్. 2 గ–కనుదోయి

శా॥ శ్రీ మీఱంగ కురంగశాబనయనాసీమంతము క్తామణి
స్తోమం బింపు ఘటించె నీలజలదాస్తోకచ్ఛటామధ్య వీ
థీమధ్యన్ నవచంచలాలతికరీతిన్ గొప్పపై దండ లెం
తే మించెన్ హరినీల[1]జాలజయకీర్తిశ్రీల చందంబునన్ 65

వం॥ కలువలరాజు భామిని ముఖంబునకున్ బ్రతిరాక సత్కళల్
చెలువము మీఱఁగా ముటిక( జేసి తదీయసరోజగేహ కిం
పొలయఁగఁగొన్క సేసినసమున్నతిచెల్వ యొకర్తుపూన్పఁగా
నలరెను నాసికా[1]భరణ మాభరణమ్ముల కెల్ల మేటియై 66

సీ॥ బిసజిద్భుజాద్వయం [1]బసమాన కేయూర
కంకణవరబిరుదాంక మయ్యె
ఘనకుచాలసవలగ్నము మేలి యొడ్డియా
ణంబు పేరిటి వలయంబుఁ దాల్చె
[2]పంకేజకులసార్వభౌమపదంబులు
తతరత్న నూపురాశ్రితము లయ్యె
సురశైలజైత్రవక్షోజంబు లచ్ఛము
క్తాహారకీర్తిసంగతము లయ్యె

తే॥ [3]స్మరశతాంగరథాంగ[4]విస్ఫురణఁ దనరె
బలితపు పిరుందు కింకిణీ[5]కలితవజ్ర
ఖచితకాంచనమేఖలాకలిత మయ్యె
నమరు సైరంధ్రికా ప్రయత్నమున సతికి 67

---

65 ప 1 గ-నీల

66 ప 1 క,చ,ట,త-చరిణ

67 ప 1 గ-బసుమాన 2 గ-ఎంకజ 3 క-సర గ-మరు, 4 గ-విస్ఫురిత
5, క,ట-లసిత, త-లలిత, గ-సలిల

శా॥ నానాదివ్యమణీవిభూషణగణాంతర్బింబితస్వచ్ఛకాం
తానిర్నిద్రతరాకృతుల్ దనరెఁ దద్రత్నాదిరాడ్దేవతల్
సానందంబుగ నిందుబింబవదనాప్రాంచత్కళారూపవీ
క్షానవ్యస్పృహమూర్తులూ నిరొ యనం గన్పట్టె సంతంతకున్ 68

వ॥ అప్పుడు 69

తే॥ శౌరి కనుసన్న [1]మెలఁగెడు సరసుఁడగుట
సారసహితుండు వడిఁ [2]దత్కుమారమణికి
దివ్య[3]మగు సేసముత్తెముల్ దెచ్చుకొఱకుఁ
జనియెనో యన పశ్చిమజలధిఁ [4]జేరె 70

మ॥ జగముల్ గెల్చు మనీష నెంతయు మనోజాతుండుహోమార్థమై
యెగయం జేసిన వహ్నికీల లనగా నేపార సంధ్యారుచుల్
[1]పొగరెత్తం గనుపట్టెఁ జీఁకటులు తద్భూరిస్ఫులింగాకృతిన్
నెగడెన్ చుక్కలచాలు పుష్కరమునన్ నిర్నిద్రకాంతిస్థితిన్ 71

ఉ॥ వేల్పులయానవాల పడి వెన్నెల కోరు కొటారు మంచు పూ
రాల్పుల మించులాడు వలరాయని మాయని కీర్తి తమ్మి పూ
చాల్పుల చొక్కుమందు తొగచానకునై దువత్రాడు బేసికన్
దాల్పరి జుట్టు క్రొవ్విరి సుధానిధి గన్గొనవయ్యె నయ్యెడన్ 72

ఉ॥ నైకటికం బలగ్నమని నవ్యవచోవిభవంబు మీఱఁ బ
ద్మాకరమేదినీవిభుని యాప్తులు పైపయిఁ దెల్ప నుజ్జ్వల
శ్రీకుఁడు చారుచంద్రనృపశేఖరుఁ డంబు నాభు నానతిన్
గైకొని భద్రదంతిఁ గుతుకంబున నెక్కె జనుల్ గణింపఁగన్
73

70 వ 1. క ట-మెలగుట. 2 గ-సత్కు. 3 గ-మణి. 4. గ-దేలె
71 వ 1 గ-పొగలంతే

వ॥ ఇట్లు సమున్నిద్రభద్రగజాధిరూఢుండై కెలంకుల బలభద్ర యదూద్వహాదిగురుజనంబులు ప్రద్యుమ్నాది సహోదర నివహంబును రుక్మిణీసత్యభామాది జననీ నికరంబును ననుసూయారుంధతీ [1]శచీముఖ్యపుణ్యపురంధ్రీసందోహంబును శోభనాక్షతంబు లాశీర్వాద పూర్వకంబుగా పైఁజల్లుచు నేతేర భేరీమృదంగ తమ్మటకాహళఝల్లరీపుంఖానుపుంఖ తమట డమామికాడక్కాహుడుక్కాద్యనేక హృద్యాతోద్యవాద్య ధ్వనులు రోదసీకుహరవిదళనారంభంబున విజృంభింపఁ గాలాగురు సాంబ్రాణీధూపవాసనల నజాండమండలంబునకుం బటవాసకరండంబు నాపాదింప డోలాయంత్రచక్రంబుల దిరుగు వారవిలాసినీవారవిలాసంబులు మందాచల మంథాన కమదితతిమిధామజలభ్రమపరిభ్రమణ వేగంబున దిరుగు నచ్చర మెఱుఁగుబోం డ్లొఱపు కు నొఱపులు సంపాదింపఁ గల్లోలినీకాముఁకావర్తశైవాలరేఖావిభిన్నేందుబింబాననబింబంబుల కైవడి వేణీకలాప పరివృత వదనారవిందంబులు చెంగలింపఁ దరువులు దట్టుచు దండలాస్యాదినృత్తావధాన క్రియలు జూపుచు, తదీయాదిదేవత మెచ్చి ముక్తాఫలంబుల నభిషేకంబు గావించెనో యను శంక నంకురింపఁజేయు ఘర్మోదక కణంబులఁ గనుపట్టి కొమెరప్రాయంబు నర్తకీ సమూహంబు లెడనెడఁ బల్లవులఁ జల్లు పటవాసంబున నుల్లసిల్లి మరందబిందుబృందపరాగయోగంబున బొలుపొందు వల్లీమతల్లికల తెఱంగున రంగు మీర సురభూజ సంభూత జాంబూనదాంబరాది విచిత్ర వస్త్రంబులు ఖర్జూర జంబీరరసాలపనసక్రముకాది ఫలంబులును, గంధసార ఘనసార కుంకుమాగురు గోరోచనాది పరిమళద్రవ్యంబులును కుందమందార కేతకీ కంకేళి కంజాత కైరవచంపక ప్రముఖ

ప్రసూన దామంబులును మఱియుఁ బరిణయోచిత వస్తు సంభారంబు నించిన శాతకుంభ మణిమయ భాజనంబులు కరాంభోజంబులఁ బూని నిజస్మితకటాక్షవీక్షణ శోణాధరమణి చ్ఛాయాసముదాయంబు లేకాదికరణ [2]సహానవ స్థాయిత్వంబు నుజ్జగించి కలసి మెలసి వర్తించు చంద్రికాంధకార తపంబులో యన సమగ్రంబుగా నగ్రభాగంబున సువాసినీ జనమ్ములు నడువ సునాసీరుండు సునాసీర మహోదార విహారుండై శతాంగమాతంగ తురంగ పదాతి సంఘంబుల సంకీర్ణంబులుగా నడిపింపఁ గర్పూర గంధ తైలబంధురా సంఖ్య కరదీపికానికరాదివత్యంబు గైకొని నిమేష సైంధవుఁ డరుదేరఁ జంద్రసూర్య చామర చంపక ప్రసవాకారంబులుగా ననేకప్రకారంబులు విశ్వకర్మ నిర్మించిన యగ్ని యంత్రంబులు (బోని) ప్రకాశింపఁ గోటీర విద్యోతమానుండును, శతకోటి మదనలావణ్య విరాజమానుండును, సత్కళానిస్తంద్రుఁడును సకలవైభవ సాధ్యుండును నగు చారు చంద్రనరేంద్రుఁడు రాజమార్గంబునఁ గదలి వచ్చు సమయంబున 74

మ॥ చమరీ[1]జాచ్ఛమరీచికాంచితకచల్ సౌధాళిపై నెక్కి త
త్ప్రమదాళీప్రమదావహుండుయదుమూర్ధన్యున్ నిరీక్షించుచో
భ్రమరీవిభ్రమరీతులం దెగడు శుంభద్వీక్షణ వ్రాతముల్
కమలేందీవరతోరణప్రతతులై కన్పట్టె నప్పట్టునన్ 75

సీ॥ జడమీఁదఁ జుట్టిన నిడుద క్రొవ్విరిదండ
దండ నున్న విటాళిఁ దలఁకఁజేయ

---

74 వ 1 గ-సతి, 2 గ-వహ

75ప 1 గ-కాచ్ఛ

రవికలోపలి గుబ్బకవ నిగ్గు లెగనుబ్బి
గబ్బి వేడుకకాంద్ర యుబ్బడింపఁ
గమ్మపంజుల సాన గడితేరు చూపుఁ[1] దూ
పులు పల్లవుల యుల్లములు గలంపఁ
కెంపురా[2]నవకంపుఁ గెంపుసొంపుల మోవి
యువకోటి సారె నోరూరఁజేయ

తే॥ వరలు కమనీయనవరత్నవారఖచిత
కాంచికాదామఘంటికల్ ఘల్లురనఁగఁ
[3]బంచసాయకసామ్రాజ్యపద్మలీల
వచ్చి విభుఁ జూచె నపుడొక మచ్చెకంటి 76

సీ॥ గమనవేగప్రస్తకబరీభరచ్ఛాయ
ఘనఘనాఘనపంక్తి ననుపఁజేయ
గనకవల్లిమతల్లి గతిమీరు నెమ్మేను
చంచలానీకంబు [1]సంతరింప
మరకతమాణిక్యకురువిందవలయాంశు
పటలంబు రోహితప్రతతి నీనఁ
దారకానీకాశతారహారచయంబు
కరకానికాయవిస్ఫురణఁ జూప

తే॥ నల. సితాపాంగనటనలు చెలువ గులక
సరవి నానందబాష్పవర్షంబు మీఱఁ

---

76వ 1 గ-కో, త-రూ, 2 క, ట-నణకింపు, చ-నెణకింపు, త-ననకెంపు, గ-ణపుకింపు, 3 గ-పద్మసా

దన ఘనాగమఖిన్స్ఫూర్తి జనులు పొగడ
వచ్చి వీక్షించె నపుడొక్క వచ్చెకంటి 77

శా॥ వ్యాకీర్ణాలకజాలకై తనయనొద్యత్కజ్జలాశ్వాసను
శ్రీకల్పానటనల్ గనరబడ ధరిత్రీపాలుఁ జూచెన్ నవ
వ్యాకోచాంబుజనేత్ర యొక్కతె తదీయంబైన ధైర్యంబుఁ దా
నాకర్షింపుచునున్నదో యనఁగ డాయన్ వచ్చి
మోదంబునన్ 78

సీ॥ లాక్షారసాకల్పలలితపాదచ్ఛాయ
శ్రీకరపల్లవశ్రేణి నింప
గురుశాతకుంభోచ్చకుచకుంభరోచులు
మంజరీమంజుసంపద ఘటింప
మేచకాంభోజాతలోచనద్వయకాంతి
బంభరీడింభజృంభణము నింప
నిర్వేలసౌరభ్యనిశ్వాసపవనంబు
మలయభూదరమరుత్కలనఁ జూప

తే॥ [1]మీనచిహ్నలక్షణకము లమ్లానవిటప
తరుల లోగాని యామోదగరిమ పెనుప
సరసిజానన యొకతె వసంతలక్ష్మి
సరణి నేతెంచి [2]కాంచె శ్రీహరితనూజు 79

సీ॥ మించు వెన్గొని వచ్చు మేచకాభ్రములీల
వదలి వేసలిగుంపు [1]చెదరి [2]జార

77వ. 1 గ-సంచలించ
78వ 1 ం. చ-స్ఫార
79వ 1 గ-లీల, 2 గ-శ్రీహరి తనయజూడ

గురుకుచభరమున విరుగు కౌనును [3]బీతి
    నొడ్డియాణపు నిగ్గు లొడ్డికొనఁగఁ
జిగురాకుటడుగుల జిగి మీఱి పుడమికి
    రత్నాభిషేకవిభ్రమ మొసంగఁ
గాంచనకాంచికాఘంటికారవములు
    తుంటవిల్తుని వెనువెంటఁ బిలువ
తే॥ దమ్మి క్రొత్తావి యూరుపుల్ [4]గ్రుమ్మరింప
వాలుఁజూపులు చిత్తజు వాలు జూప
పుష్పసాయకు నవరంజి బొమ్మ లీల
వచ్చి విభుఁ జూచె నప్పు డొక మచ్చెకంటి 80

మ॥ ఎలనాఁగల్ నయనోత్సవం బెసఁగ రాజేంద్రున్ నిరీక్షించి పు
ష్కలసంతోషతరంగిణీవిమలరంగద్వీచికాశ్రేణి తె
ప్పలఁ బల్మాఱును దేలి తేలి విధళద్భృఙ్గాబ్జపత్రంబు లు
త్పలమందారతరుప్రసూనములు మీఁదన్ జల్లి రుద్యద్గతిన్ 81

మ॥ హితభూపాలపురోహితప్రతతితో హేలావతీరాజితో
న్నతిగంభీరమృదంగముఖ్యఘనవాద్యశ్రేణితోఁ [1]బాఠక
[2]స్తుతితో మామ యెదుర్కొనన్ హరితసూర్యం డమ్మహారాజరా
జితగేహాంగణసీమ నేనుఁగుడిగెన్ జెల్వొందఁబతో నత్తతిన్ 82

కం॥ సారె తమ వీక్షణములు మ
హా[1]రయమునఁ బెనఁగి పొంగి యంబుజవదనల్

---

80వ 1 క, ట–వదలి, 2 గ–యాడ, 3 గ–రితి 4 క–గ్రమ్మరించు,
చ, ట, త–గ్రుమ్మరించు

82వ 1 గ–బాదవ, 2 గ–శ్రుతితో

హారివలయాంశు లెగయఁగ
[2]హారతు లెత్తిరి నృపాల హర్యక్షునకున్ 83

సీ॥ అంభోజరాగంబు లరుణపాదంబులై
చిగురాకు మోవియై సొగసుఁ జూపఁ
దళుకు వజ్రపునిగ్గు [1]తెలనవ్వు మొలకలై
ముత్యాలసరములై మురువు నింప
నీలాల చకచకల్ నిడువాలుఁ జూపులై
పెన్నెఱీ జొంపమై చెన్ను [2]మీఱ
నెలరార [3]మినమినల్ కలికి చెక్కుల మిస్కు
[4]లై చెల్వదువ్వల్వలై రహింప

తే॥ నపుడు సాక్షాత్కరించిన యనుపమాన
శోభనాంభోజగేహిణివై భవమున
ప్రకటరుచి మించు నవరత్నరాజమాన
శుభవితర్దిక యదురాజసుతుఁడు వచ్చె 84

మ॥ సమయజ్ఞుండగు గర్గసంయమి యనుజ్ఞన్ జారుచంద్రక్షమా
రమణాగ్రేసరు రత్నపీఠి నిడి తద్రాజత్పదాంభోజయు
గ్మము గంగాసలిలంబులం గడిగి రంగద్దివ్యమహోదధి
ప్రమిళత్కల్పకసన్మరందమధుపర్కం బిచ్చె రాజయ్యెడన్ 85

క॥ పద్మాస్యలు దోడ్తెచ్చిరి
పద్మాకరవిబు ననుజ్ఞఁ బద్మాకృతి సం

---

83వ 1 క, చ, ట, త-రతులబెనంగ, 2 క, చ, ట, త-నారతు.
84వ గ-తెలి, 2 గ-జూప, 3 గ-మిసమిసల్, 4 గ-లయ్యె

[1]పద్మాన్యకుముద్వతి ఘన
పద్మాకరశుభవితర్దిభాగంబునకున్ 86

కం॥ సురలోకసార్వభౌముని
వరతనయుఁడు యాదవేంద్రువరతనయుండున్
దరుణీవరమద్యంబునఁ
దెర యెత్తిరి వేడ్క కడలితెర యెత్తంగన్ 87

మ॥ సుదతిన్ మన్మథనందనందనతనూజున్ విష్ణురూపంబుగా
మది భావింపుచు ధారఁ బోసె నెలమిన్ బద్మాకరక్షోణిభ
ర్త దిశావర్ణితసద్గుణాంబునిధి పద్మాకాంతతో రూపసం
పదనీడైన మనోహరాంగి తనయన్ భాస్వద్వయశ్శ్రీనిధిన్ 88

కం॥ ఇతరేతరముఖదర్శన
కుతుకంబు వధూవరులకుఁ గొమరు వహింపన్
వితతాగమ[1]నిధి గర్గుఁడు
చతురుత సుముహూర్త మనుచుఁ జయ్యనఁ బలికెన్ 89

చ॥ వనరుహలోచనల్ నగవు వాలిక చూపులలో బెడంక చ
య్యనఁ దెరఁదీసి రయ్యెడ మనోజ్ఞ[1]ముఖుల్ ప్రమదంబు మీఱఁగాఁ
గనుఁగొని యొండొరున్ బతియుఁ గంజదళాక్షియు దీర్ఘదీర్ఘలో
చనరుచు లెంతయున్ గదిసి సారెకు సారెకు సాము సేయఁగన్ 90

ఉ॥ అంగనఁ గూర్చి దన్మనమునందు [1]వసించిన సూనధన్వికిన్
బంగరు మేలి[2]ఖేటకము బాగుగఁ గాన్క యొసంగెనో యనన్

---

86ప 1 గ-పద్మాకర్య
89ప 1 గ-విధి
90ప 1 క, చ, ట, త-ములన్

మంగళసూత్ర మా హరికుమారుఁడు గట్టె ననంగశంఖరే
ఖం గడుగెల్చి వే బిరుదుఁ గట్టఁగఁ జాలిన యింతి కంధరన్ 91

చ॥ పిడికిటి కౌ నొగిన్ దొడికి ప్రేమ నొకర్తు తటాన నెత్తఁగా
వెడవెడ కొప్పుజార నరవిందవిభానన సిగ్గు పెంపుఁ జొ
ప్పడ నెఱియించె ముత్తెయపుఁ బ్రాలు నృపాలమౌళి మౌళిపై
జడిగొను లోచనద్యుతులు పారెకు నిన్మ[1]డిగా నొనర్పఁగన్ 92

మ॥ హరినీలంబులఁ జామరంబుల మిళిందానీకముల్ గెల్చి వి
స్ఫురితానూన[1]వినీలకాంతి నిది యంచున్ మెచ్చి ముక్తాభిశే
ఖరమున్ గూర్చిన నా నృపాలతనయా కైశ్యాగ్ర భాగంబుపై
హరిసూనుండునుమించెము త్తెయపుఁ బ్రా లత్యంత
హర్షంబునన్ 93

చ॥ కటకమణిప్రభాపటలిఁ గ్రమ్ముక యారతి సంతరింప ను
త్కటకుచగౌరవంబునకుఁ గౌ నసియాడఁ గపోలపాళి చెం
గట మణికుండలద్యుతులుఁ గ్రందుకొనన్ లలితాంగి లాజలం
బటుతరవహ్నికీలల శుభంబుగ వేలిచె నానతాస్యయై 94

తే॥ [1]రుచిరరుచులఁ బ్రదక్షిణార్చులు వెలుంగ
నమరు శిఖికి ప్రదక్షిణ మాచరించి
దంపతులు గాంచి [2]రల యరుంధతిని ధ్రువుని
శ్రీ మెఱయు గర్గవరాని దర్శింపఁజేయ 95

కం॥ పరువడి నారతు లెత్తిరి
పరగఁగ నవదంపతులకుఁ బల్లవపాణుల్

91ప 1. క. చ. త-నశించి, 2. గ-బెట్టకిమ.
92ప. 1 క, ట, త-ది
93ప 1 గ-విలాస
95ప 1 గ-రుచుల, 2 గ-రట

[1]నిరుపమమణిగణకీలిత
కరపంకజకంకణములు ఘలుఘులురనఁగన్ 96

వ॥ స్థిరభక్తిన్ [1]భజియించి వేల్పుల ద్విజాశీర్వాద పూతాక్షతో
త్కరముల్ దాల్చి కులాదిదేవతనమస్కారంబుఁగావించియొం
డొరు నామంబులు కన్య లెల్ల మదిలో నుప్పొంగఁగాఁ బల్కి మొ
క్కిరి సద్భక్తి [2]దలిర్ప రుక్మిణికి లక్ష్మీభర్తకున్ దంపతుల్ 97

సీ॥ శ్రీమహితారుంధతీముఖ్యసాధ్వీమ
ణులు దీవన లొసంగి రలములీల
వేదశాస్త్రపురాణవిఖ్యాతభూసురో
త్తములు గావించి రభిష్టితంబు లెలమి
శోభనాగతదిశా[1]క్షోణీపతులునెల్ల
విం దారగించిరి వేడ్క [2]తోడ
యదురాజపద్మాకరాదీశబాంధవా
వళి పీడుఁ జదివించె వరుసతోడ
సరససాహిత్య[3]సంగీతనిరుపమాన
సత్కవినికాయగాయకసార్వభౌమ
నటనటీముఖ్యు లిష్టార్థపటలిఁ గనిరి
యొనర శ్రీకృష్ణుఁ డొనరించు మత్సవమున 98

కం॥ ఈ రీతిఁ జతురహంబు లు
దారమహత్త్వాభిగతులఁ దనరిన పిదపన్

---

96వ గ-నిరుతర

97వ 1 గ-వరియించి, 2 గ-మెలర్ప

98వ 1 క,చ,ట,త-క్షోణినాయకులెల్ల, 2 క,ట గ-మీర, త-లీర, 3 క చ,
ట,త-సందీప

శౌరి యనుప [1]నిఖిలసుధా
హారక్ష్మాపాలవర్యు లరిగిరి [2]సరవిన్ 99

సీ॥ శుంభన్మదాఖర్వజంభారిగజగర్వ
[1]భంజనోద్ధతి మించు [2]భద్రగజము
కందిరాజోద్భూతగంధర్వగందని
ర్గంధనస్థితిఁ బొల్చు సైంధవములు
చండాశుమండలస్మయఖండనోద్దండ
పాండితి మెఱయు నఖండమణులు
కంతు కాంతామణి కాంతిరేఖాస్ఫూర్తి
నెంతయుఁ దనరు నెలంతగములు

తే॥ భవ్యనవరత్నకీలితాభరణనవ్య
చిత్రపటముఖ్యసమదికాశేషవస్తు
లరణముఁగ నల్లున కొసంగె నపుడు సద్గు
ణైకరత్నాకరుండు పద్మాకరుండు 100

కం॥ ఈ రీతి నెసఁగి యెంతటి
కూరిమి మీఱంగఁ దనదు కూఁతు గుణవతిన్
జేరంగఁ బిలిచి పలికెన్
భూరమణుఁడు బుజ్జగించి పొలుపు దలిర్పన్ 101

ఆ॥ • భోజకన్య యత్త పురుషోత్తముఁడు మామ
మధురధర్మశాలి మరుఁడు బావ.

---

99ప 1 గ–నఖిల 2 త–వెంటన్

100ప 1 గ–జృంభ, 2 చ.ట.గ–కుంభిరతులు, త–కుంభిరతులు

చారుచంద్రరాజచంద్రుండు పెనిమిటి
యింతి నీదు [1]భాగ్య[2]మెన్నఁ [3]దరమె 102

సీ॥ * అత్తమామల చిత్త మామోదము వహింప
పని[1]పాటు లొనరించి పరగుమమ్మ
సకలబంధుజనంబు సమ్మానమొనరింప
[2]విలసద్గుణంబుల వెలయుమమ్మ
భువిఁ బతివ్రతలెల్లఁ బొగడంగఁ బతిభక్తి
మదిలోన నెపుడు నేమఱకుమమ్మ
అభ్యాగతశ్రేణి కభ్యవహారముల్
సేకూర్చి కరుణ రక్షింపుమమ్మ

తే॥ కులమునకు నెల్ల వన్నె రా మెలఁగవమ్మ
వాసిఁ దేవమ్మ మాయమ్మ వంశమునకు
రహిని బిలిపింతు మఱిఁబోయి రాఁగదమ్మ
భవ్యవిస్ఫూర్తి మాయమ్మ ప్రబలుమమ్మ 103

వ॥ అని పలికి కుమారికామణి ననిపినఁ బద్మాకరు యద్రాక్రియ బహూకరించి పురంబున నుండ నియమించి యదువల్లభుండు కుముద్వతీచారుచంద్రులఁ దోడ్కొని చని సకల[1]భ్రమంబున బ్రకటితాలంకారభరితంబుగ ద్వారావతీనగరంబు ప్రవేశించి

---

* 102 వ పద్యముతో త ప్రతి సమాప్తము మిగిలిన పద్యములు ఈ ప్రతి యందు లోపించినవి

102వ 1 చ గ-సుకృత 2 గ-మెంచ, 3 క,చ ట,గ-వశమె

* 103 వ పద్యమునుండి 115 ఎ పద్యమువరకు 'చ" "గ" ప్రతులలో మాత్రము గలవు "క", 'ట"—ప్రతులయందు ఈ పద్యములు లోపించినవి, "చ" ప్రతియందు కూడ చాలవరకు పదములు లోపించినవి

103వ 1 క,చ,ట-బాట 2 గ-విపుల

[2]వధూవరుల గృహప్రవేశమహోత్సవమున నుత్సాహంబు నొందించె. వారును గురుదేవతాభమస్కారంబు గావించి తదీయాశీర్వాదంబులుఁ గాపించి ప్రమోదము వహించి యుండి రంత నొక శుభముహూర్తంబున 104

చ॥ తళుకుఁ బసిండి షోదియలఁ దార్కొన నీలిన కల్వరాచరా బలితపుఁ గంబములఁ జికిలి పచ్చని దూలములుం గటాణి దం తెలు [1]నిరతంపుఁగెంప విడి నీలపుఁ గప్పులుఁ గల్గి మిక్కిలిం బొలుపు వహించి మించుగతి మోహన [2]సన్మణిసౌదపాళికన్ 105

ఉ॥ నీలపుఁ గెంపు రా పలుకు నిగ్గుల సీసపుఁ గుంకుమంపు [1]మై డాలుఁ దురంగిపట్టుఁ, దశల్ కొనఁ జేసిన యట్టు చందువా గిలుకొనంగఁ జేయ నల్ల క్రేవలఁ గల్వల రాచరాతి కం బాల నిగన్నిగల్ తెరలు పన్ని [2]కుచాళము[3]సంఘటింపఁగన్ 106

మ॥ నవసౌగంధికకాంతిబంధురవితానం బజ్జరాగంపుఁగో ళ్లు విడూర్యోద్భవపట్టికల్ చికిలి తళ్కుంబట్టు క్రొంబట్టు చెం దొవనిగ్గుల్ గల కుంకుమంపుఁబఱవుం దోరంపు నుంగెంపుసొం పు పైదల్ చట్టు దురంగి పట్టు [1]బలుపుల్ బొల్పొందు మంచంబునన్ 107

కం॥ జలజాతాననయొక్క తె
తెలనాకులుఁ జుట్టి నెలవతీ లొగి నొసఁగన్

104వ 1 సంభ్రమంబుల, 2 గ-యకించిదానందంబున తత్పురుషభూసుర గురు వృద్ధ జనంబులకు నమస్కరించి తదీయాశీర్వాదంబులుగాంచి.

105వ. 1 గ-నిగరంపు: 2 ఛ-సన్మణి

106వ 1. ద-పై. 2 చ-ఈ పదములేదు. 3 గ-సంఘటిల్లగన్
పై కంద పద్యమునకు బదులు "గ" ప్రతిలో ఈ పద్యము కలదు

107వ 1 గ-బటువుల్

వలరాజు దేవి నల క
ల్వలరాయని [ ] దరణీవల్లభుఁ డుండెన్. 108

వ॥ అప్పుడు 109

సీ॥ నెమ్మోని తళుకులు నిగరంపు జాళువా
[1]రవణాల కొక వింత [2]రహి యొసంగఁ
జిన్నారి నవ్వులు చికిలి ప ంగర గొప్ప
[3]ముత్యాల కొక వింత మురు వొసంగఁ
గలికి చూడ్కుల డాలు కమ్మ పంజుల మేలి
మగరాల కొక వింత జిగి యొసంగఁ
దనుగంద పుతినూత్న దర్పసారపుఁ బూత
తావికి నొక వింత ఠీవి యొసఁగఁ

తే॥ గాంచికాదామఘంటికాక్వణన మొసఁగ
మంజుమంజీరకురువిందమహితరుచులుఁ
ద్రోవఁ జూపఁ గుముద్వతీతోయజాక్షి
ప్రియసఖీయుత్నమున వచ్చెఁ బ్రియుని కడకు 110

కం॥ మదవతులు బలిమి నీ గతి
మదకలభసమానయానమణిమయకేళీ
సదనంబుఁ జేర్ప నిలిచెన్
గదలక రతనంపు మేలి కంబము చెంతన్ 111

---

108ప * గ-ప్రతిలో పై కందపద్యముకు బదులు ఈ పద్యము కలదు,
కం॥ గ-తలిరాకు జోదు గల దొర
చలమున తమి రేచ చారుచంద్రుఁడుండె
తలపున కుముద్వతీపతీ
చలనయనగామకాంక్ష సందడిగోషగన్

110ప 1 రవణి. 2 చ-జిగి. 3 చ-ముత్యాన

కం॥ కలకలని నెమ్మొగంబునఁ
గిలకిలనగు [1]వగపు బిగువుఁ గీలుకొనంగా
నిలువక నొక్కొ-క [2]నెపమునఁ
గలకంఠీమణులుఁ జనిరి కడు రయ మెసఁగన్ 112

చ॥ నిలువునఁ గౌఁగిలించి ధరణీపతి యొయ్యన బాలికామణిన్
దలిమముఁజేర్చి యంకమునఁదార్చి [1]రయంబున బుజ్జగించి వే
నలిఁ బలుమాఱు దువ్వి మది నాటిన ప్రేమఁ దదీయ వక్త్రని
ర్మలినబిసప్రసూనజనిరంతరవాసనఁ గ్రోలి సోలుచున్ 113

ఉ॥ మేని మెఱుంగు కన్నుఁగవ మించుల పయ్యెదలోన నీ నెడిం
గానుక నిమ్మ పంటి కెనఁగాఁ దగుఁ దాపఁగ నేల మాకుఁ గై
కానుకగా నొసంగుము నఖక్షతనూతనపద్మరాగసం
తానమహాభిషేకకలనన్ లలనా॰ వెల యెంతు నెంతయున్ 114

సీ॥ బంధుజీవంబు నీ పవడంబు జిగి మోవి
నెఱయ మా కనురక్తి నించు టరుదె
గోత్రాధిపతులు నీ గురుపయోధరములు
కూటముల్ మాకుఁ జేకూర్చు టరుదె
కమలాంచితములు నీ కలికి లేఁజూపులు
పొసగంగ సిరులు మా కొసఁగు టరుదె
సహకారలత నీదు రహి మెఱుంగుల మేను
కలయంగ నలఁదిన నలము టరుదె

తే॥ పడతి నీ కౌను హరిపదభ్రాజితంబు
నిరతమున్ నాదు [1]నెమ్మది నిలుచు టరుదె

---

112ప 1 చ-నగవు, 2 చ-నేవమున

113ప 1 చ-నయంబున

యనుచుఁ జతురోక్తికలన నజ్జనవిభుండు
కామినీమణి నెంతయు గారవించి 115

సీ॥ కుచము లంటఁగఁ బోయి గొబ్బున భ్రమియించి
గేలిమై నీవికిఁ గేలు సాచు
కురులు[1] తీర్పఁగ బోయి [2]సరుగున భ్రమియించి
పూని వాతెఱ కమ్మఁదేనె కొడియు
వేణిఁ బట్టఁగఁ బోయి వేగంబె భ్రమియించి
ఘనజఘనంబుపై కరము నిలుపు
నడుగు లంటఁగఁ బోయి [3]తడబడ భ్రమియించి
తోడనే మెఱఁగుఁబెందొడలు నిమురు

తే॥ హారములు చూడఁబోయి నీహారకిరణ
తులితముఖిచారుచుబుకంబుఁ దొడరి పట్టి
మనుజపతి బాలికామణి మదనకదన
సాహసక్రీడ నలయించ నూహ సేసి 116

సీ॥ బంధురనీవికాబంధంబు వదలింప
నదలింపఁగాఁ జూచు కొదలుఁజూపు
కమ్మవాతెఱ నాన గమకించు తొడిబాటు
కొడబాటు లేని నిట్టూర్పు చాలు
చికిలి గుబ్బల మీఁదఁ జెలరేఁగు కెంగేలు
ముంగేలఁ దలగించు మోహనతయు

---

115ప 1 గ-నెమ్మేన
116ప 1 గ-దేయ్య 2 గ-గొబ్బున. 3 గ-తుదిబడ
క,ట-ప్రతులయందు లోపించినది, చ- డిబడ

వంచించి జిగికెంపు వాతెఱ యంటఁగా
గెంటఁగాఁ దిరిగెడు దంటతనము

తే॥ మాటి మాటికి తనకు [1]సమ్మదమొనర్ప
డెందమునఁ జాలఁ దమకంబు సందడింప
బహువినోదకళారూఢి ప్రౌఢి మెఱసి
చారుచంద్రధవసుంధరాజాని యపుడు 118

కం॥ పయ్యెదఁ దియ్యఁగ [1]సిగ్గునఁ
దొయ్యలి కరపల్లవములఁ దోరపుఁజన్నుల్
చయ్యనఁ బొదిగెన్ ఘుడనుని
కయ్యమునకు మల్లు చఱుచు కైవడి దోఁపన్ 119

తే॥ విభుని కెంగేలు చెలి నిల్పి విడువఁబోయి
చాపలంబునఁ బలుమాఱు ద్రోపుఁబడియె
పోఁక ముడి మాత్రమున కింత పోరలనేల
కొండ లంతేసి పనులు పై [1]నుండు టరుదె 120

కం॥ నీవియుఁ గుచదుర్గంబులు
గావఁగ లే కలరుబోడి కరపల్లవముల్
లావరి యుండఁగఁ గైకొనెఁ
గేవల మవ్విభుఁ డురోజగరిదుర్గంబుల్ 121

కం॥ ఘనజఘనధవళవస్త్రము
తనుదానయ్యె వదలి జాఱెఁ దరుణికి నపుడ

---

118ప 1 గ–సంపద

119ప 1 గ–గదిసిన

120ప 1. క,చ,ట–నడ్డుపెరిగి

త్యనఘగుణాశ్రయు లెయ్యెడఁ
జనకుందురె యతనుకలహసంభ్రమవేళన్ 122

ఉ॥ గ్రక్కున గౌఁగిలించి తమకంబున వాతెఱ తేనె లాని లేఁ
జెక్కిలి ముద్దుఁ బెట్టుకొని చిక్కని చక్కని గుబ్బ లంటుచున్
మక్కువ బుజ్జగించి పలుమాఱు మదిన్ గరగించి భూవిభుం
డ క్కువలాయతాక్షి మకరాంకసుఖాంబుధిఁ దేల్చె
నెంతయున్ 123

సీ॥ ఒక కొన్ని నాళ్ళకు నొయ్యనొయ్యనఁ జేరి
యెలమితో మడుపు లందీయ నేర్చె
నొక కొన్ని నాళ్ళకు చకచకల్ వెదఁజల్లు
సొలపుఁజూపుల సారెఁ జూడ నేర్చె
నొక కొన్ని నాళ్ళకు చికిలి ముద్దుల మొగం
బరవాంచి మఱుమాటలాడ నేర్చె
నొక కొన్ని నాళ్ళకు నుదుట పెన్గుబ్బల
గొబ్బున నెదఁ బొమ్మఁ గుమ్మ నేర్చె

తే॥ * మోవితేనియ లానుచో సోవ సోవ
వాడి మొనబంటి సోకు లవ్వారి గాఁగ
మించనేర్చెను విభుని పొమ్మంచు మోవి
బాలికామణి [1]యొక కొంత ప్రౌఢి [2]మించి 124

కం॥ కళ లంటి యల కుముద్వతి
కెలమిన్ గల్పించి వలపు వెచ్చఁగ నిచ్చల్

---

124ప 1 క చ–నంతంత, ట–యొకయింతి 2 కి చ ట–యగుచు

* "గ" ప్రతి యింతటితో సంపూర్ణము

15

వలరాచ కేళి ప్రౌఢిమ
వెలయించెన్ హరిసుతుండు వేడుక లెసఁగన్ 125

కం॥ ఈ లీల కుముద్వతితో
కేళీవనపాళికృతకగిరిరత్నమహా
నాళీకాకరసైకత
శాలివిహారములఁ జారుచంద్రుం డలరన్ 126

ఆ॥ హరియు బోజతనయ యాత్మతనూజుని
శౌర్యధైర్యముఖ్యసద్గుణముల
ముదముఁ జెంది రమరమునిరాజు లెంచిరి
తండ్రి వలెనె దనుజదండి యనుచు 127

కం॥ అని సూతుఁడు వినిపించిన
వినుతంబగు చారుచంద్రవిలసితచర్యన్
విని కాంచిరి నెమ్మనముల
ననుపమ హర్షంబు శౌనకాదిమునీంద్రుల్ 128

శా॥ సారంగాదిపరక్షణాదర దరాంచచ్చక్రకౌమోదకీ
సారేష్వాసనఖడ్గధారణ రణక్ష్మానిర్జితా వధ్యరా
జారాతిధ్వజనీపరంపర పరాత్యాభశ్చరాకారగం
భీరాంభోధివిహార హారధరణీభృజ్జైత్రకీర్తిధ్వజా 129

ద్వివిధ కం॥ వారాశికన్యకామణీ
ధారా శాతాసిదాతదానవజాతా

సారాన్వవాయజాతా
హారావాతాశిరాజతల్పఖ్యాతా * 130

మాలిని॥ కరివరభయనాశా కందరాట్ప్రకాశా
సురుచిజితదినేశా సూరిచేతోనివేశా
శరనిధితనయేశా సైంధవత్పన్నగాశా
పరిహృతభయపాశా పాలితాకాశకేశా 131

గద్య॥ ఇది శ్రీ తాడిపర్తి గోపాలకృష్ణకృపాకటాక్షవీక్షాసమాసాదిత
కవితానూతనభోజ సంస్కృతాంధ్రభాషావిశేషసారసారస్య
పరిజ్ఞానచాతురీధురీణమానసాంభోజ. చెన్నమరాజకులాంభోధి
రాజసంపూర్ణపూర్ణిమారాజ శేషయామాత్యతనూజ చెన్నమ
రాజ ప్రణీతంబైన చారుచంద్రోదయంబను మహాప్రబంధంబు
నందు పంచమాశ్వాసము 132

సమాప్తము

---

* ఈ కంద పద్యములో రెండవచరణములో రెండవ గణమునుండి చదివి, మొదలు విడిచిపెట్టిన నాలుగు గణములు కూడ చదివినచో "త"కారప్రాసతో మరొక పద్యమగును ఇది "ద్వివిధ కంద"ము లేదా కందగర్భితకందము

# ఉపయుక్త గ్రంథ సూచిక

## సంస్కృత గ్రంథములు


అలంకారశేఖరము – కేశవమిశ్రుడు (అనంతరామశాస్త్రి. కాశీ సంస్కృత సిరీస్, పండిత శివదత్త, కావ్యమాల)

కావ్యప్రకాశము – మమ్మటుడు

కావ్యాదర్శము – దండి

కావ్యాలంకారము – భామహుడు

కావ్యాలంకార సూత్రవృత్తి – వామనుడు

చమత్కార చంద్రిక – విశ్వేశ్వరకవి

దశరూపకము – ధనంజయుడు

ధ్వన్యాలోకము – ఆనందవర్ధనుడు

నాట్యశాస్త్రము – భరతుడు

ప్రతాపరుద్రీయము – విద్యానాథుడు

మత్స్యపురాణము

రసార్ణవ సుధాకరము – సింగభూపాలుడు

వక్రోక్తి జీవితము – రాజానక కుంతకుడు

వాయుపురాణము

శృంగార ప్రకాశము – భోజుడు

శ్రీమద్భాగవతము

సరస్వతీకంఠాభరణము – భోజుడు

| | |
|---|---|
| సాహిత్యదర్పణము | విశ్వనాధుడు |
| సాహిత్యరత్నాకరము | వారణాసి ధర్మసూరి |
| హరివంశము | వ్యాసుడు |

## తెలుగు గ్రంథములు

| | |
|---|---|
| అథర్వణ కారికావళి | అథర్వణాచార్యుడు |
| అనిరుద్ధచరిత్ర | కనుపర్తి అబ్బయామాత్యుడు |
| అప్పకవీయము | కాకునూరి అప్పకవి |
| అహల్యా సంక్రందనము | వేంకట కృష్ణప్పనాయకుడు |
| ఆంధ్రకవితరంగిణి (మూడవ, అయిదవ, పదునొకండవ సంపుటములు) | చాగంటి శేషయ్య |
| ఆంధ్రకవుల చరిత (ద్వి సం.) | కందుకూరి వీరేశలింగంపంతులు |
| ఆంధ్ర ప్రతాపరుద్రయశోభూషణము | చెలమచర్ల రంగాచార్యులు |
| ఆంధ్రమహాభారతము | కవిత్రయము |
| ఆముక్తమాల్యద | శ్రీకృష్ణదేవరాయలు |
| ఇందుమతీ పరిణయము | తెనాలి రామభద్రకవి |
| ఉత్తరరామాయణము | కంకంటి పాపరాజు |
| కమ్మవారి చరిత్ర | కొత్త భావయ్యచౌదరి |
| కవిజనాశ్రయము | భీమకవి |
| కవిలోకచింతామణి | వెల్లంకి తాతంభట్టు |
| కళాపూర్ణోదయము | పింగళి సూరన |
| కావ్యపరిమళము | విశ్వనాధ సత్యనారాయణ |
| కావ్యాలంకారచూడామణి | విన్నకోటపెద్దన |

| | |
|---|---|
| కావ్యాలంకార సంగ్రహము (నరసభూపాలీయము) | రామరాజభూషణుడు |
| కాశీఖండము | శ్రీనాథుడు |
| చంద్రభాను చరిత్ర | తరిగొప్పుల మల్లన |
| చంద్రికాపరిణయము | సురభి మాధవరాయలు |
| ఛందోదర్పణము | అనంతామాత్యుడు |
| తపతీ సంవరణోపాఖ్యానము | అద్దంకి గంగాధరకవి |
| తెలుఁగు భాషలో ఛందోరీతులు | రావూరిదొరసామిశర్మ |
| తెలుఁగు విజ్ఞానసర్వస్వము | |
| ద్విపద భాగవతము | మడికి సింగనార్యుడు |
| నాగ్నజితీ పరిణయము (అముద్రితము) | వల్లూరి నృసింహకవి |
| నృసింహపురాణము | ఎఱ్ఱన |
| పంచతంత్రము | బైచరాజు వెంకటనాథుడు |
| పల్నాటి వీరచరిత్ర | శ్రీనాథుడు |
| పారిజాతాపహరణము | నందితిమ్మన |
| పారిజాతాపహరణము పర్యాలోచనము | పి. యశోదారెడ్డి |
| పాల్కురికి సోమనాథుడు | శ్రీ గడియారం రామకృష్ణశర్మ. చైతన్యలహరి, 1972 |
| పూర్వగాథాలహరి | వేమూరి శ్రీనివాసరావు |
| ప్రభావతీ ప్రద్యుమ్నము | పింగళి సూరన |
| ప్రౌఢవ్యాకరణము | బహుజనపల్లి సీతారామాచార్యులు |
| బాలవ్యాకరణము | చిన్నయసూరి |
| భోజరాజీయము | అనంతామాత్యుడు |

